# సృజన ప్రచురణలు

1. వినదారికో కథ – కథలు – పింగళి రంగారావు 1969
2 అంపశయ్య – నవల – నవీన్ 1969
3. మాదీ మీ వీధే – కవితలు – సి.వి. కృష్ణారావు 1969
4. సాహిత్యంలో విప్లవోద్యమం – వ్యాసాలు
కొడవటిగంటి కుటుంబరావు 1971
5 జీవితం–రచన – వ్యాసాలు – గోర్కీ, టింగ్‌లి గ్, సార్త్రె 1972
6. భావ విప్లవం – వ్యాసాలు – కె.వి. రమణారెడ్డి 1972
7. భారతీయ తత్వశాస్త్రం – ఒక పరిశీలన
నిమ్మగడ్డ వెంకటేశ్వరరావు 1972
8. గెరిల్లా – విప్లవ గీతాలు 1972
9. నా కుటుంబం – నవల – మూలం: టావ్‌సెంగ్ 1972
10 నవసమాజంలో విద్య – కన్సర్న్‌డ్ ఏషియన్
స్కాలర్స్ కథనం – అను: సి. రాంప్రసాద్ 1973
11. వి.బి. గద్దర్ పాటలు 1973
12 ఉప్పెన – నవల మొదటి భాగం – చౌలిపో
అను: ఎన్. ఎస్. ప్రకాశరావు, సవిత 1974
13. జనం ఊపిరితో – ఖైదీ గీతం 1974
14. రైతు కూలీ విజయం – బుర్రకథ – వి.బి. గద్దర్ 1974
15. చెల్లీ చంద్రమ్మ – ఒగ్గుకథ – ఎ.ఎల్. చిత్రలేఖ 1975
*16. సాంస్కృతిక దళాల నిర్మాణం – ప్రచార కార్యక్రమం – వర్గీస్ 1974 – 0.15
17. ప్రపంచ చరిత్ర ఎందుకు చదవాలి? – చరిత్ర పాఠాలు 1978
*18. భూమి భాగోతం – నృత్యనాటిక – వంగపండు ప్రసాదరావు 1978 – 1.00
19. అదిలాబాద్ కరీంనగర్ రైతాంగ పోరాట పాటలు – 1 1978
20. ,, ,, ,, ,, – 2 1979
*21. మార్క్సిజం – సాహిత్యం – త్రిపురనేని మధుసూదనరావు 1979 – 1.25
*22. కొలిమంటుకున్నది – నవల – అల్లం రాజయ్య 1979 – 5.00

* ఈ గుర్తుగల పుస్తకాలు మాత్రమే ఇప్పుడు అమ్మకానికి వున్నవి.

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాస పత్రిక

**100**

నూరు పూలు వికసించనీ
వేయి ఆలోచనలు సంఘర్షించనీ

నిర్వహణ

'సాహితీ మిత్రులు'

పేజీలు 254+xxvi

ఈ సంచిక 4 రూపాయలు

ఈ సంచికలో............



1980 జనవరి సంచిక రెండు సంచికలకు సరితూగేట్లుగా, ఫిబ్రవరి 100వ సంచిక మూడు సంచికలకు సరిపోయేట్లుగా వెలువడి నందున మార్చి, ఏప్రిల్, మే సంచికలు వుండవు. జూన్‌లో 104వ సంచికగా సృజన వెలువడుతుంది.


SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Warangal Printing Press, J.P.N. Road, Warangal - 506 002
for Venkataramana Mudranalayam, Warangal
Working Editor: Varavararao

1966 లో
ప్రారంభమైన
ఆధునిక సాహిత్య వేదిక
విప్లవ ఆలోచనా వీచిక

# సృజన

ను
పద్నాలుగు గ్రీష్మాలపాటు పోషించిన
మరి నాలుగు కాలాలపాటు మారాకు వేసి
రాబోవుయుగం సాహిత్యాన్ని 'సృజన' చేయాలని
కోరుకుంటున్న

## మా ప్రియమైన పాఠకులకు

ఈ నూరో సంచిక
మా కానుక

— 'సాహితీ మిత్రులు'

ఏ పారితోషికమూ లేకుండా
మాకోసం రచనలు చేస్తున్న
మా అసంఖ్యాక రచయితలకు,

ముఖచిత్రాలు వేసిన మా చిత్రకారులు

- బాపు
- శీలావీర్రాజు
- ఎస్ వి రామారావు
- హనుమాన్ సూరి
- దొరైస్వామి
- మనోహన్ దత్
- చంద్ర
- సూర్య లకు,

శిల్పి • బాబు కు

ప్రతినెలా తన అక్షరాలతో సృజన ముఖపత్రాన్నలంకరించే

- 'శక్తి' కి,

మా ఫోటోగ్రాఫర్లు

- వజీర్ రహ్మాన్
- చలసాని ప్రసాదరావు
- శ్రీనివాసరావు
- భరత్ భూషణ్
- జోనేపల్లి మురళి లకు.

వంద సృజనలను ముద్రించి ఇచ్చిన

- వేంకటరమణ ముద్రణాలయం, వరంగల్
- పార్వతీ ప్రింటింగ్ ప్రెస్, జడ్చెర్ల
- నాగార్జున ప్రింటర్స్, హైదరాబాదు
- కపల్ ప్రింటర్స్, హైదరాబాదు
- లక్ష్మి ప్రింటింగ్ ప్రెస్, హనుమకొండ
- రమేశ్ ప్రింటర్స్, హైదరాబాదు
- ఉషశ్రీ ప్రింటర్స్, విజయవాడ
- శ్రీ వరలక్ష్మి ప్రెస్, హైదరాబాదు
- వరంగల్ ప్రింటింగ్ ప్రెస్, వరంగల్
- విస్టాస్, హైదరాబాదు
- ఎమెస్కో, మద్రాసు

కార్మికులకూ, యజమానులకూ

## మా కృతజ్ఞతలు

— 'సాహితీ మిత్రులు'

పత్రికగా డిక్లరేషన్ లేనందువల్లనే కాకుండా నిర్వహించగలమా అన్న సందేహంవల్ల కూడ ఇది వేదిక (Forum) కాని పత్రిక కాదు అని వినయం చాటున భయాన్ని దాచుకున్నాం మొదటి సంచికలో. మలి సంచిక వచ్చినందుకు మమ్మల్ని మేము అభినందించుకున్నాం. త్రైమాసికగా నడిచినంత కాలం ప్రతి సంవత్సరమూ మా సాహసం మారాకువేస్తూ మనగలగడం రచయితలకు పాఠకులకు ఎలా వుండేదోగాని మాకు మాత్రం స్వాభినందనగానే వుండేది. అయితే ఆరంభం నుంచే మా ప్రయత్నానికి ముచ్చటపడి ప్రోత్సహించిన వాళ్ళు ఎందరెందరో వున్నారు. మేం ఊహించిన వాళ్ళ నుంచే కాదు, మేం ఎన్నడూ ఎదురుచూడని చోట్ల నుంచి కూడ స్నేహహస్తం, సహకారం అందింది.

సృజన సాహిత్యంతోనూ, ప్రాపంచిక దృక్పథంతోనూ అంగీకరించేవాళ్ళు, ఇదేదో అంటుపట్టని వాళ్ళు, వ్యక్తిగత స్నేహాన్ని, అభిమానాన్ని పురస్కరించుకొని కూడ తమవల్ల ఏ సాయం కాగలిగితే ఆ సాయం చేసారు. రాను రాను సృజనతో పరిచయమున్న అభిమానులందరూ గుర్తించింది సృజన నిర్వహణలోవున్న కష్టనష్టాలనే కాదు పట్టుదల, నిజాయితీలను. అందుకే పత్రికతో ప్రారంభమైన సాహిత్యకృషి పుస్తక ప్రచురణలకు దారితీసింది. ఆనాడు నిర్వచించుకున్న కర్తవ్యం లోపం చేయకుండా కనీసం సంవత్సరానికి రెండు ప్రచురణలు వెలువడుతున్నాయి. కథలు, నవలలు, కవిత్వం, సాహిత్య విమర్శ, తాత్విక వివేచన, జానపద సాహిత్యరూపాలు-అన్నీ ఉన్నత ప్రమాణాలు గలవే సృజన ప్రచురించింది.

సృజన డిస్ట్రిబ్యూటర్స్ కూడ ప్రారంభమైంది. విప్లవ రచయితల సంఘం ఏర్పడి, సృజన మాసపత్రికగా మారిన తర్వాత సృజన డిస్ట్రిబ్యూటర్స్ ఎంత విస్తృతమైన, కీలకమైన సేవకు వినియోగింపబడ్డదంటే విప్లవ సాహిత్యం కావాలంటే సృజనకు రాయాలని తెలుగు దేశంలోని, కాదు దేశంలోని తెలుగు తెలిసిన విప్లవాభిమానులంతా ఈనాటికీ భావిస్తున్నారు.

సృజన ప్రారంభమైన నాటికి తెలుగులో ఆధునిక సాహిత్యానికి పత్రిక లేదు. కవిత్వానికి సంబంధించినంతవరకు 'నవత' తొక్కిన కొత్తదారి వుంది. కాని ఆదారికి కూడ రూపం, ప్రయోగం విషయంలోవున్న ఆసక్తి వస్తువు విషయంలో లేదు. సృజన మొదటి నుంచీ ఆధునిక సాహిత్యమంటే ప్రయోగశీలత్వం మాత్రమే కాదు శాస్త్రీయ దృక్పథమూ, సామాజిక స్పృహ కూడ కలిగివుండడమని అర్థంచెప్పుకున్నది. కనీసం ఒకటి రెండు సోదర పత్రికలు ప్రారంభం కావడానికి, సోదర ప్రచురణలు ప్రారంభం కావడానికి సృజన మార్గం సుగమం చేసింది.

అయితే ఇవ్వాళ వెనక్కి తిరిగి చూస్తే అర్థంఅవుతున్న దేమంటే స్పష్టాస్పష్టంగా, వ్యక్తావ్యక్తంగా, చేతనాచేతనంగా సృజన పుట్టుకలోనే తొమ్మిది రాష్ట్రాల్లో కాంగ్రెస్ కుటుంబపాలన నిరాకరణ భావన వున్నది. ప్రపంచవ్యాప్తంగా అసంతృప్త క్రోధోద్రేక యువతరం నిరసన, తిరుగుబాటు వుంది. నక్సల్బరీ పురిటినొప్పుల చప్పుడు, నెత్తుటిగుడ్డు సృజనలో అప్పుడు సాహితీ మిత్రులు, పాఠకులు పోల్చుకున్నా పోల్చుకోకున్నా ఇవ్వాళ సృజన నక్సల్బరీ సృజన అని మెప్పుకైనా, నిరాకరణకైనా అందరూ అంగీకరిస్తారు. చాలమంది కివ్వాళ నక్సల్బరీ 'బరీ' (అవాసం) అయినందుకే సృజన ఇష్టమైతే, అట్లా అవడం దురదృష్టకరం, ఇది నిష్పాక్షికమైన, శుద్ధమయిన ఆధునిక సాహిత్య పదార్థంగా తన ప్రత్యేకతను నిలుపుకుంటే బాగుండునన్న ఆవేదన, విచారమూ కొందరికి మిగిలాయి.

ప్రజాసాహిత్య, సాంస్కృతిక రంగాల్లో ప్రజలకు అర్థమయ్యే భాషలో రీతిలో ప్రజాపోరాట భావాలను వివరించే విశాల విప్లవ వేదికగా కాగలిగితేగాని సృజనకు తృప్తి లేదు. విప్లవోద్యమానికి విరసంగానీ, సృజనగానీ, చివరకు జననాట్యమండలి, అరుణోదయ మొదలైన సాంస్కృతిక సంస్థలు గానీ ఈనాటికీ ఉద్యమం డిమాండు చేస్తున్నంతగా నాటకాలను, నాటికలను అందించలేకపోతున్నాయి. తొలిదశలో 'పిలుపు' వంటి గేయ రూపకాన్ని, 'టెంపరరీ లేబర్' వంటి నాటికను ప్రచురించి ప్రదర్శనలకు కూడా ఒకమేరకు దోహదం చేసిన సృజన రానురాను నాటక, నాటికా రచనను గానీ, ప్రచురణనుగానీ ప్రోత్సహించడానికి ఏ కృషీ, చొరవా చేయలేదు- ఈ లోటును సృజన పూరించుకోవాలి.

తనదంటూ ఒక ప్రాపంచిక దృక్పథాన్ని ప్రకటించుకున్న సృజన ఆ ప్రాపంచిక దృక్పథానికి సంబంధించిన మౌలికాంశాలను తన పాఠకులకు ఒక క్రమపద్ధతిలో సులభంగా వివరించే ప్రయత్నం చేయలేదు. పాఠకులకు చాల విషయాలు తెలుసుననుకునే పద్ధతిలో పెద్దపెద్ద మాటలు, పరిభాష ఎక్కువ వాడింది.

సాహిత్య సృజనకోసమైనా సృజన ప్రపంచం నలుమూలలకూ, జీవితంలోని అట్టడుగు లోతుల్లోకి, పోరాట సీమల్లోకి అవిరామ ప్రయాణాలు చేసి వుండాల్సింది. 'సాహితీ మిత్రుల'ందరికీ సాహిత్యం వ్యావృత్తియే గానీ వృత్తిగాదు. బిచ్చగాళ్ళను, ఓడ కళాసీలను, వెట్టి వాళ్ళను, జీతగాళ్ళను, నిరక్షరాస్యులను కవులుగా, కథకులుగా తీర్చిదిద్దిన విప్లవం అవగాహనాచేతనకే పరిమిత మయినందు వల్లనేమో 'సాహితీ మిత్రుల'లోని కవులను కనీసం కథకులుగా కూడ మార్చలేదు. అందుకే పోరాట వాస్తవ గాథలన్నీ నాగేటి నెత్తుటి చాళ్ళలో అజ్ఞాతంగానే వుంటున్నాయి.

# మే-డే

కార్మిక కామ్రేడ్స్ : మేడే వస్తోంది. తమలో వర్గ చైతన్యయుత జీవితానికి మేలుకొల్పు పాడిన దినంగా, మానవునిపై మానవుడు సాగించే సకల విధాల పీడనకూ నిర్బంధానికీ వ్యతిరేకంగా జరిగే పోరాటం ఎడలా కోట్లాది శ్రమ జీవులను ఆకలి, పేదరికం, దైన్యావస్థల నుండి విముక్తి చేసేందుకు జరిగే పోరాటం యెడలా తమ సంఘీభావాన్ని ప్రదర్శించే దినంగా, ఆరోజున సమస్త దేశాల కార్మికులూ ఉత్సవాలు జరుపుకుంటారు. ఈ మహాసమరంలో రెండు ప్రపంచాలు ఒక దానికొకటి ముఖాముఖి నిలిచి వున్నాయి. పెట్టుబడిదారీ ప్రపంచమూ - శ్రామిక ప్రపంచమూ, దోపిడీ బానిసత్వాల ప్రపంచమూ - స్వేచ్ఛా సౌభ్రాతృత్వాల ప్రపంచమూ.

ఒకవైపున వేళ్ళమీద లెక్కబెట్ట గలిగిన రక్తపిపాసులైన ధనికులు మోహరించి ఉన్నారు. వీరు ఫ్యాక్టరీలను, మిల్లులను, యంత్రాలను, పరికరాలను స్వాధీనంచేసుకు కూర్చున్నారు. కోట్లాది ఎకరాల భూమిని, కుప్పలు తెప్పలుగా డబ్బును తమ సొంత ఆస్తిగా మార్చి వేశారు. ప్రభుత్వాన్ని, సైన్యాన్ని తమ సేవకులుగా, తాము కూడబెట్టిన సంపదకు విశ్వాసపాత్రమైన కావలి కుక్కలుగా తయారుచేసుకున్నారు.

రెండవవైపున ఎట్టి ఆస్తికీ వారసత్వం లేని కోట్లకొలది సామాన్య ప్రజలు మోహరించియున్నారు. వీరు ధనిక స్వాముల దగ్గర చాకిరీ చేసేందుకు అనుమతి

---

పది మంది నెలనెలా పది రూపాయలు వేసుకొని నిర్వహించే త్రైమాసికగా ప్రారంభమై మాసపత్రికగా, పబ్లిషర్‌గా, డిస్ట్రిబ్యూటర్‌గా పెరిగిన సృజన రచయితలకు ఏనాడూ పారితోషికం ఇవ్వకపోయినా కనీసం ఒకరి జీవికకు పేన్నిళ్ళకు చన్నీళ్ళ చందంగా వుండి స్వయంపోషకంగా నిర్వహించబడిన రోజులున్నాయి. ఈనాడు సృజన ఆర్థికంగా, నిర్వహణరీత్యా చాల అవ్యవస్థ నెదుర్కొంటున్నది. విప్లవోద్యమంలోని అన్ని రంగాల్లో వలెనే (?) సృజనకు కూడ సృజనకే అంకితమై పనిచేసే కార్యకర్తల కొరత వున్నది. సృజనకున్న పలుకుబడి, ప్రతిష్ఠలతో పోల్చిచూస్తే నిర్వహణ రంగం చాల బలహీనంగానూ నిర్మాణరహితంగానూ వున్నది. అయితే సృజన ఏనాడూ వ్యక్తులు నిర్వహించేది కాకూడదు. ప్రజల సమష్టి కృషికి, చైతన్యానికి, ఆకాంక్షకు, అవసరానికి ప్రతిస్పందన కావాలి- కాబట్టే ఈ తాత్కాలికమైన నిర్మాణ బలహీనతలను, లోపాలను అధిగమించి ప్రజా సాహిత్య సాంస్కృతిక అవసరాలను తీర్చగల వేదికగా సృజనను నిర్వహించగల కార్యకర్తలుగా 'సాహితీ మిత్రులు' రూపొందుతారని ఆశించే-

22-4-1980 (లెనిన్ జయంతి) — 'సాహితీ మిత్రులు'

అర్థించే దుస్థితిలోనికి నెట్టబడ్డారు. వీరు తమ శ్రమద్వారా సమస్త సంపదను సృష్టిస్తారు. కాని తాము బ్రతికి ఉన్నంతకాలం పిడికెడు మెతుకులకోసం పోరాడాలి. దయాభిక్షగా పని యిమ్మని అడుక్కోవాలి, నడుములు విరిగేటట్లు శ్రమచేసి తమ బలాన్ని, ఆరోగ్యాన్ని బలిపెట్టాలి. పల్లెటూళ్ళలో నివాసయోగ్యంగాని గుడిసెల్లోనూ, పెద్దపెద్ద పట్టణాలలో, నేల మాళిగల్లో, అటకలపైనా, ఆకలితో అలమటిస్తూ, బ్రతుకు వెళ్ళబుచ్చాలి.

అయితే ఈనాడు ఎట్టి ఆస్తి లేని యీ శ్రమజీవులు ధనిక స్వాములపైనా దోపిడీ దారులపైనా యుద్ధాన్ని ప్రకటించారు. శ్రమను, వేతనాల బానిసత్వం నుండీ, పేదరికంనుండీ విముక్తి చేసేందుకు సకల దేశాల కార్మికులు పోరాడుతున్నారు. సమష్టి ద్వారా సృష్టించబడిన సంపద కొద్దిమంది ధనికులకు గాక శ్రమించే వారందరికీ ఉపయోగపడగల సామాజిక వ్యవస్థకోసం వీరు పోరాడుతున్నారు. భూములు, ఫ్యాక్టరీలు, మిల్లులు, యంత్రాలు అన్నింటినీ మొత్తం శ్రమజీవుల సమష్టిఆస్తిగా తయారుచేయాలని వీరు కోరుతున్నారు. ధనికులు, పేదలు అనే విభజనకు స్వస్తి చెప్పాలని, శ్రమఫలితం శ్రమజీవులకే దక్కాలని, మానవ మేధస్సుసాధించిన విజయాలన్నీ, పనిపద్ధతులలో కొనిరాబడిన అభివృద్ధి యావత్తూ పనిచేసేవానిని పీడించేందుకుగాక అతని జీవితాన్ని మెరుగు పరచేందుకే వినియోగ పడాలనీ వీరు వాంఛిస్తున్నారు.

పెట్టుబడిపైన శ్రమ సాగిస్తున్న మహాసమరంలో సకల దేశాల కార్మికులూ అనంతమైన త్యాగాలను చేయవలసివచ్చింది. సుఖతర జీవితాన్ని, నిజమైన స్వేచ్ఛను పొందగల హక్కును సాధించడానికై వారి రక్తం ఏరులై పారింది. కార్మికుల శ్రేయస్సుకోసం పోరాడే వారిని ప్రభుత్వాలు చెప్పనలవిగాని దమనకాండకు గురిచేశాయి. కాని ఎంతటి దమనకాండనైనా లెక్కచేయకుండా ప్రపంచ కార్మికుల సంఘీభావం నానాట పెరుగుతూంది, బలపడుతూంది. కార్మికులు రానురాను ఎక్కువ సన్నిహితంగా ఐక్యమవుతున్నారు. ఈ పార్టీలను బలపరిచే వారి సంఖ్య లక్షలాదిగా పెరుగుతూంది. వీరంతా పెట్టుబడిదారీ దోపిడీవర్గంపైన సంపూర్ణవిజయం సాధించే దిశలో ఒక్కొక్క అడుగే వేసుకుంటూ స్థిరంగా ముందుకు సాగిపోతున్నారు.

కార్మిక కామ్రేడ్స్! ఇట్టి పరిస్థితులలో సమీపిస్తున్న నిర్ణయాత్మక పోరాటానికి ద్విగుణీకృత శక్తితో సన్నద్ధమవుదాం! కార్మిక ప్రజానీకం మరింత సంఘటిత మగుగాక! వారి సందేశం మూలమూలలకూ వ్యాపించుగాక! కార్మికుల కోర్కెలపైన ఆందోళన మరింత సాహసోపేతంగా సాగించబడుగాక! మేడే ఉత్సవం వేలాది సమరయోధులను మనవైపుకు ఆకర్షించి సమస్త ప్రజల స్వేచ్ఛకోసం పెట్టుబడి దాస్యం నుండి సకల శ్రమ జీవుల విముక్తి కోసం జరిగే మహాసమరంలో మన శక్తులను సంఘటితంగా పెంపొందించుగాక!

— లెనిన్

# నిషేధాలు - నిర్బంధాలు

నిషేధించబడిన సంచికలు :

| | | | |
|---|---|---|---|
| 1. | మార్చి | 1972 | సంచిక 30 |
| 2. | మే | 1972 | సంచిక 32 |
| 3. | జూన్ | 1972 | సంచిక 33 |
| 4. | ఫిబ్రవరి | 1974 | సంచిక 53 |
| 5. | మే | 1974 | సంచిక 56 |

సోదా :

* 1974 జులై 29న ఎడిటర్, ప్రింటర్, పబ్లిషర్ ఇంటిపై పోలీసులు దాడి జరిపి 6 గంటలపాటు సోదా చేశారు.

కేసులు :

* రాజద్రోహనేరం కింద వరంగల్ రెండవ అదిషనల్ మున్సిఫ్ మెజిస్ట్రేట్ కోర్టులో సృజన మే 1974, సంచిక 56 గురించి ఎడిటర్, ప్రింటర్, పబ్లిషర్‌పై కేసు. ఈ కేసు 23-10-76న అసిస్టెంట్ సెషన్స్ జడ్జిచే కేసుకు ప్రభుత్వ అనుమతి లేని కారణంగా కొట్టివేయబడింది.

* మే 1974 సంచిక నిషేధాన్ని సవాల్‌చేస్తూ హైకోర్టులో 26-12-74న ఎడిటర్, ప్రింటర్, పబ్లిషర్ రిట్ పిటిషన్. ఈ రిట్ పిటిషన్‌ను త్రోసిపుచ్చుతూ, నిషేధాన్ని ధృవపరుస్తూ 23-4-1976న హైకోర్టు తీర్పు.

* ప్రభుత్వ అనుమతితో తిరిగి 27-1-1977న వరంగల్ సెషన్స్ కోర్టులో 1974 మే సంచిక గురించి ఎడిటర్, ప్రింటర్, పబ్లిషర్‌పై రాజద్రోహ నేరానికి విచారణ ప్రారంభం.

నిర్బంధాలు :

* ఎడిటర్‌ను 1973 అక్టోబరు 10న ఆంతరంగిక భద్రతా చట్టం కింద అరెస్టు చేశారు. అక్కడక్కడా ఆయన బహిరంగసభలలో చేసిన ఉపన్యాసాలతో పాటు అప్పటి వరకు నిషేధించబడిన సృజన సంచికలు కూడ నేరారోపణకు కారణాలుగా చూపారు. హైకోర్టు నవంబరు 16న విడుదల చేసింది.

* ఎడిటర్‌ను 1974 మే 18న 'సికిందరాబాదు కుట్రకేసు'లో ముద్దాయిగా అరెస్టు చేశారు. తిరిగి అవే నేరారోపణలు. ఏప్రిల్ 25, 1975న బెయిలుపై విడుదలయినా హైదరాబాదులో వుండాలని కండిషన్ పెట్టారు. ఆ కండిషన్‌ను వరంగల్‌కు కూడ వెళ్ళ వచ్చునని మే 20, 1975న హైకోర్టు సడలించింది.

* తిరిగి ఎడిటర్‌ను ఎమర్జెన్సీ ప్రకటించిన 1975 జూన్ 26న అంతరంగిక భద్రతా చట్టం కింద అరెస్ట్‌చేసి ఎమర్జెన్సీ ఎత్తివేసిన రోజున జైలు ఆవరణలోనే తిరిగి అరెస్టు చేయదానికి మాత్రమే విడుదల చేసారు.

* ఈసారి మళ్ళా అంతరంగిక భద్రతా చట్టం కింద అరెస్టు చేయడానికి కారణాలు చూపారు– అవే నేరారోపణలు. మార్చ్ 31, 1977న విడుదల చేసారు.

* వరంగల్ సెషన్స్ కోర్టు ఎడిటరు, ప్రింటరు, పబ్లిషరు హేమలతకు 1977 జులై 13న బెయిలు రద్దుచేసి జెయిలుకు పంపించింది. జులై 16న రాజద్రోహ నేరం కింద (రైల్వే సమ్మెను బలపరిచిన సృజన, సంచిక 56, మే 1974) రెండు సంవత్సరాలు జైలు శిక్ష విధించింది. హైకోర్టుకు అపీల్ చేసుకోవడానికి అనుమతించింది గానీ బెయిలు నిరాకరించింది.

* 1977 జులై 19న హైకోర్టు బెయిల్ ఇచ్చింది.

* ఆ తర్వాత ఆంధ్రప్రదేశ్ హైకోర్టు సెషన్స్‌కోర్టు విధించిన శిక్షను రద్దుచేస్తూ ఎడిటరు, ప్రింటరు, పబ్లిషరును నిర్దోషిగా తీర్పు ఇచ్చింది.

* విప్లవ గీతాలు రాసినందుకూ అవి సృజనలో ప్రచురించినందుకూ లోచన్ వేతనంలో ఒక ఇంక్రిమెంట్ ప్రభుత్వం తగ్గించింది. ఎమర్జెన్సీలో మూడు వారాలు అక్రమ నిర్బంధంలో, దాదాపు ఒక సంవత్సరం డిటెన్షన్‌లో ఉంచింది. ఎమర్జెన్సీ ఎత్తివేసిన తర్వాత కూడా మళ్ళీ అరెస్ట్‌చేసి పదిరోజుల పాటు డిటెన్షన్‌లో ఉంచింది. అప్పుడుకూడా ప్రభుత్వం నిర్బంధానికి పై కారణాలే చూపింది. 1980 మార్చి 18వ తేదీన కారణం చూపనక్కరలేని, కోర్టుకు పోవడానికి వీల్లేని, రాజ్యాంగంలో 311 (2)సి క్లాజు కింద ఉద్యోగం నుంచి తొలగించింది. ప్రస్తుతం దీనిపై ఆంధ్రప్రదేశ్ హైకోర్టు స్టే అమల్లో ఉన్నది.

# సాహితీ మిత్రులు ....

సృజన వ్యవస్థాపక 'సాహితీ మిత్రులు' వే. నరసింహారెడ్డి, నవీన్, రామన్న, వరవరరావు 1966 మే నెలలో వే. నరసింహారెడ్డి ఇంట్లో సమావేశమై ఆధునిక సాహిత్య వేదిక నొకదానిని ప్రారంభించాలని, దానికి శాస్త్రీయ దృక్పథం, ప్రయోగ దృష్టి, సమకాలీన సామాజిక స్పృహ పునాదులుగా వుండాలని నిర్వచించుకున్నారు. ఆధునిక కవిత్వ పత్రికగా నాలుగయిదు సంచికలైనా నడచి 'నిలిచిన' 'నవత' లేని లోటును తీర్చడమే కాకుండా సాహిత్య కార్యరంగాన్ని విస్తృత పరచి సాహిత్య విమర్శ, కథ, సమీక్షలకు సముచితమైన స్థానం కల్పించాలన్నది కూడ ప్రేరణ. అప్పటికి అయిదోసాక్షి లోచన్. అండగా నిలచిన పెద్దమనిషి కాళోజీ. తిలక్ సంస్మరణ సంచికగా వెలువడిన తొలిసంచికకు (1966 నవంబర్) ఎడిటర్, ప్రింటర్, పబ్లిషర్ కాళోజీ నారాయణరావు గారేనని జ్ఞాపకం చేసుకొని, నీ విశ్వాసాల కోసం నువు చిత్తశుద్ధితో కృషి చేసినపుడు తన విశ్వాసాలు ఏవైనా వెన్నుతట్టే ప్రజాస్వామ్యవాదిగా ఆయనకు కృతజ్ఞతలు చెప్పుకుందాం.

ఆర్థికంగానూ, హార్దికంగానూ సాహిత్య, సాంస్కృతిక, కళారంగాల్లోనూ ఆదినుంచీ ప్రోత్సహించిన మరో పదిమంది ప్రారంభక 'సాహితీ మిత్రులు' వున్నారు. వారిలో పి.సి. నరసింహారెడ్డి, రవిబాబు నూరో సంచికకు తమ సందేశాలు పంపించారు.

16వ సంచిక దాకా కూడ కథ, నవల- వానికి సంబంధించిన సాహిత్యవిమర్శ, సమీక్షలకు సంపాదక బాధ్యత నవీన్ వహించారు. 1967 నవంబర్‌లో వెలువడిన బుచ్చిబాబు స్మృతి సంచిక (5) నవీన్ పర్యవేక్షణలోనే వెలువడింది. 1969 నవంబర్‌లో వెలువడిన కథల సంచిక (13)కు ఆక్టింగ్ ఎడిటర్ నవీన్. చలం (మే 68, సంచిక 5, పునర్ముద్రణ జూన్ 79, సంచిక 92) కొడవటిగంటి కుటుంబరావులతో (నవంబర్ 69, సంచిక 13) చేసిన ఇంటర్వ్యూలు, శ్రీపతి, వరవరరావులతో కలిసి శ్రీశ్రీతో (ఫిబ్రవరి 70, సంచిక 14) చేసిన ఇంటర్వ్యూ నవీన్‌కూ సృజనకూ స్థాయినిచ్చినవి.

సృజన పరిచయంచేసి, తర్వాత పుస్తకరూపంలో ప్రచురించిన 'అంపశయ్య' నవీన్ తొలిప్రయోగాత్మక నవల. సృజనకు తొలిదశలో ఒక ఆకృతియిచ్చిన వాళ్ళలో నవీన్ ఒకడైతే నవీన్‌ను తెలుగు దేశానికి రచయితగా పరిచయం చేసిన తొలిసాహిత్య వేదిక సృజన.

వ్యవస్థాపక 'సాహితీ మిత్రులు'లో రామన్న (ఎదిరించక తప్పదు- కవిత, మే 1970, సంచిక 15, 'వెలుగు' పత్రిక సమీక్ష డిసెంబర్ 70, సంచిక 27) మౌనదరహాస ప్రోత్సాహి, కాలంతో ఎదిగిన భావుకుడు.



ప్రారంభించిన నాటికే వేనరెడ్డి సాహిత్యదృక్పథం 'సాహితీమిత్రులు'లో తక్కిన ముగ్గురికీ భిన్నమయింది. ఆధునిక సాహిత్యానికి వేదిక వుండాలన్న నిజమైన ఆకాంక్ష వల్లనే పాలసీ నిర్ణయంలో వేనరె ఎన్నడూ జోక్యం చేసుకో లేదు. 1973 జనవరి 27న హృద్రోగంవల్ల తన 33వ ఏట మరణించిన ఈ 'చేతనావర్తం' కవి గురించి సృజన మరొక అప్పుడు, తర్వాతకాలంలో తానుకూడ యవ్వనప్రాయంలోనే అకాల మరణం చెందిన వి.సి. మౌళి సరియైన అంచనా వేసాడు. "....భావనలోనూ ప్రకటనలోనూ కవితాత్మ కొంచెమెక్కువగా కలవాడు శ్రీ వే. నరసింహారెడ్డి. 'ఉహనా సంస్కారాల నుండి, కృత్రిమత నుండి' బయటపడి 'విశ్వశ్రేయం కోనం' సమతా సౌందర్యం కోనం సాగించిన రచన అతనిది...."

సృజనలో ప్రచురించబడిన వేనరె కవితలు 'ఈ తమస్సు చీల్చబడుతుంది' (ఆగస్ట్ 1967, సంచిక 4), 'ఎట్లా చెప్పాలి మీకు ?' (సెప్టెంబర్ 1971, సంచిక 24) సమీక్షలు చలం యశోదాగీతాలు (మే 1968, సంచిక 7) బాపురెడ్డి గేయాలు (ఫిబ్రవరి 1969, సంచిక 10) కొత్తగొంతులు (మే 1969, సంచిక 11)

ఆయాకాలాల్లో, దశల్లో సృజన నిర్వహణలో పాల్గొని నూరుపూలు వికసించ డానికి దోహదం చేసిన సాహితీమిత్రులు ఎంద రెందరో. అందరికీ తమపేర్లు ప్రస్తా వించడం కూడ ఇష్టంవుండదు. వాళ్ళందరికీ సృజన వందనాలు.

ఎడిటర్, ప్రింటర్, పబ్లిషర్‌లో మార్పు నవంబర్ 73 (సంచిక 50)లో వచ్చింది. అయితే 'డిఫ్యాక్టో' వర్కింగ్ ఎడిటర్‌లో మార్పులేదు.

ఇటువంటి డిఫ్యాక్టో వర్కింగ్ ఎడిటర్ కూడ లేనిదశలో సృజన (నవంబర్ 73, జూన్ 74 - మే 75) నిర్విఘ్నంగా నిర్వహించబడడమే 'సాహితీ మిత్రులు' ఒక సైన్‌బోర్డు, లేబుల్, ముసుగు, అలంకారం వగయిరా కాదు అది నిజమైన ఒక సశిష్ట కృషి, చైతన్యం, చర్చ, నిర్ణయం, రూపం అనడానికి నిదర్శనం. వ్యక్తులుగా కాకుండా వ్యక్తంగా చైతన్యం పనిచేయాలని విశ్వసించే 'సాహితీ మిత్రులు' విలువ లనూ, కృషినీ వాని వ్యక్తరూపమైన సృజనలో చూసి పోల్చుకోవల్సిందే.

ప్రత్యక్షంగా కలిసి, ఉత్తరాలద్వారా, చర్చలద్వారా పాఠకులు, రచయితలు, సృజనను తీర్చిదిద్దడంలో క్రియాశీలంగా పాల్గొంటూవుంటారు కనుక అంతిమ పరిశీల నలో సృజనను నిర్వహించే 'సాహితీ మిత్రులు' పాఠకులే.

## ప్రయోగం

ఆధునిక సాహిత్యానికి ఒక పత్రిక లేదనే ఆరాటం చాలా రోజులుగా చాలా మందిని బాధిస్తూనే ఉన్నది.

ఆధునిక సాహిత్యమంటే - శాస్త్రీయ దృక్పథం, హేతువాదం, సమకాలీన సమాజం - వీని ప్రభావం వ్యక్తి జీవితంలోని అన్ని అంశాల మీద కొద్దో గొప్పో ఉన్నదని గుర్తించడం. ఈ గుర్తింపు ఉన్న రచనని ఆధునిక సాహిత్యంగా నిర్వచించ వచ్చు: ఇతరమైన విలువల్ని విస్మరించకుండా.

ఇది ఒక సాహస ప్రయోగం. ఇది పత్రికా ? కాదు; 'మారుతున్న కాలాన్ని, విస్తృతమౌతున్న జాగృతినీ, ప్రతిబింబించే అనువదించే ఒక Forum'. దీనికి సంపాదకుడూ లేడు, సాధకులే తప్ప. ప్రయోగశీలత్వం, సృజనాత్మక శక్తి, ఆధునిక దృక్పథం ఈ Forum పునాదులు.

'సృజన' తొలి సంచికను కవి తిలక్‌కి అంకితం చేస్తున్నాము. ఏడాది క్రితం ఇట్లా ఆధునిక సాహిత్యం కొరకు ఒక పత్రిక స్థాపించాలనుకొంటున్నాము అని రాసినపుడు తిలక్ ఇట్లా రాసారు. "ఒక Broad based Standard of Literatureకు మనం ఒక Incentive నీ, ఒక Forum నీ కల్పించాలి" అని. ఆ ప్రయత్నంలో మేముండగానే ఆయన కన్నుమూయడం మాకొక సవాల్‌గా మిగిలిపోయింది. మా ప్రయత్నానికి కాలం గీటురాయి.

ఈ Forumని సాహిత్యమిత్రుల సంఘం ఆరంభిస్తున్నది; నెలనెలా పది రూపాయల చొప్పున జూన్ 1966 నుండి చెల్లించేవారూ, ఇకముందు చెల్లించబోయే వారు మాత్రమేకాదు, ఏరూపాన ఏ సాయంచేసే వారైనా ఈ సంఘ సభ్యులే, దీనికి ఎలాంటి నియమాలు లేవు. ఒకటే షరతు- సహకార భావం ఉండాలి.

'సృజన' మలి సంచిక వస్తుందా అన్నది తెలుగు వాళ్ళ సాహిత్యాభిరుచి మా కృషిని ఆదరించి ప్రోత్సహించడం మీద ఆధారపడి ఉంటుంది.

మాకేమి గొప్పకలలు లేవు. కాని మూడు నెలలకొక సంచిక తేవాలన్న సంకల్పం మాత్రం ఉన్నది. ఆ సంకల్పం నెరవేర్చే బాధ్యతను మాతోపాటు పాఠకులూ పంచుకొంటారని ఆశిస్తున్నాం.

ముఖపత్రి చిత్రం వ్రాసి యిచ్చిన శ్రీ 'బాపు'గారికీ రచయితలందరికీ మా హార్దిక కృతజ్ఞతలు.

(నవంబర్ 1966, సంచిక 1)

## మలి పలుకు

ఎందుకంటే తొలి సంచికలో అనుకున్నవీ, అన్నవీ కొన్ని జరిగినందుకూ, కొన్ని జరగనందుకూ. తెలుగువాళ్ళ సాహిత్యాభిరుచి మా ప్రయోగాన్ని (ప్రయోగ శీలత్వం, సృజనాత్మక శక్తి, ఆధునిక దృక్పథం పునాదులుగా లేచిన సాహిత్యవేదికను) ఎంతగా ఆదరించి ప్రోత్సహించారో ఈ సంచికే నిదర్శనం. ఆ బలంతోనే ఈ ప్రయోగం ఇంక పత్రికగా బయటికి వస్తున్నది. సాహిత్యాభిమానులకు జవాబుదారీగా సాధకులైన 'సాహితీ మిత్రుల' పక్షాన సంపాదకుడూ నిలుస్తున్నాడు.

.... .... .... .... .... ....

(ఫిబ్రవరి 1967, సంచిక 2)

సృజనకు ఏడాది నిండింది. ఈ సందర్భంలో మమ్మల్ని మేం అభినందించు కోవడానికి కాదు తెలుగు వాళ్ళ సాహిత్యాభిరుచిని అభినందించడానికి ఈ అవకాశం తీసుకుంటున్నాం.

ప్రయోగశీలత్వం, సృజనాత్మకశక్తి, ఆధునిక దృక్పథం పునాదులుగానిల పాలనుకొన్న ఈ వేదిక నిర్వహించడం అపూర్వమే కాదు, సాహసమని కూడ చాల మంది హెచ్చరించారు. ఆ హెచ్చరికనే ప్రోత్సాహంగా, అభిమానమే పెట్టుబడిగా నాలుగు సంచికలు వెలువరించాము. నాలుగు సంచికల్లోనూ మేం ఆశించిన విలువల నెంతవరకు సాధించ గలిగామనడానికి సృజన ఎప్పటికప్పుడు పుంజుకొని పురోగమించ డమే నిదర్శనం.

.... .... .... .... .... ....

వ్యాపారమూ, ఆడంబరమూ, డాంబికత తప్ప నిజమైన విలువలు, చిత్తశుద్ధీ లోపిస్తున్న ఈ రోజుల్లో ఒక వినూత్నమైన ఆధునిక దృక్పథాన్ని కలిగించడానికి విశ్వాద్ధ విప్లవాన్ని రచించడానికి ఎంతో నిష్ఠురమైన, కఠోరమైన దీక్ష, సంకల్పమూ కావాలి. మాలో ఆ సంకల్పం ఉదయ సూర్య కాంతివలె పరుచుకొని వున్నది. ఆ కాంతిని కాపాడుకోవడం మనవంతు.

మా ఈ ఆదర్శాలు నచ్చితే, మేం నిజంగానే కొన్ని విలువల కోసం ప్రయ త్నిస్తున్నామనే విశ్వాసం మీకు ఏర్పడితే హార్దికంగా, ఆర్థికంగా మాకు తోడ్పడండి. మమ్మల్ని దారి తప్పకుండా మాత్రమేకాదు, కుంటుపడకుండా, అలసిపోకుండా కాపాడాల్సిన బాధ్యత కూడా తెలుగు సాహిత్యాభిమానులదే.

(నవంబర్ 1967, సంచిక 5)

సృజన ఆధునిక సాహిత్య వేదికగా ఆరంభించాలని అనుకున్ననాడే తెలుగు రచయితలలో ఆ వేదికకు పునాదులు వేసిన ఆయా రచయితల సమగ్రసాహిత్య పరిశీలన చేయాలని తలపెట్టాం. యాదృచ్ఛికంగా తిలక్, బుచ్చిబాబుల మరణాలే వారి సాహిత్య పరిశీలనకు కారణమైనవి. మన సాహిత్యానికీ, మన జీవితాలకూ వెలుగునిచ్చి మన మధ్య బతికి వున్న రచయితలకు కృతజ్ఞత చెప్పుకోవడం మన కనీస ధర్మం. ఆ ప్రయత్నంలోనే చలం సాహిత్య తాత్త్విక సమాలోచన....

.... .... .... .... .... ....

తాజా చందా కలం :

సామాన్యుడి మీద పడుతున్న ప్రతి భారమూ, సృజన మీద పరోక్షంగా పడు తూనే వుంటుంది. ఈ నెల 15 నుంచి దారుణంగా పెరిగిన పోస్టల్ రేట్ల కారణంగా, సృజన రెండవ సంవత్సరంలో ఇప్పటికే మూడింట్లో రెండు ప్రత్యేక సంచికలు రావడం కారణంగా అనివార్యంగా సృజన సంవత్సర చందా మూడు రూపాయల నుంచి నాలుగు రూపాయలకు పెంచబడుతున్నదని చందాదారులు గమనించవలసిందిగా మనవి.

(మే 1968, సంచిక 7)

## మూడు పువ్వులు....

సృజన నాలుగవ జన్మదినం నుంచి ఐనా ద్వైమాస పత్రికగా మారాలన్న ఆకాంక్షతో మూడవ జన్మదిన సంచిక వెలువడుతున్నది.

ఈ సంచికలో తన సత్తాను మించిన సీమల్లోకి సృజన తొంగిచూసే ప్రయత్నం చేసింది. ఆధునిక సాహిత్య వేదికగా మాత్రమే అవతరించిన పత్రిక ఆధునిక అరూప కళాప్రపంచంలోని కుంచెతో కొంచెం పరిచయం చేసుకోవాలనే ప్రయత్నం. ఆధునిక తెలుగు సాహిత్యానికే అంకితమైన పత్రిక అన్ని భారతీయ భాషల్లోని సాహిత్య ధోరణులను కనిపెట్టాలనే ప్రయత్నం, ప్రయత్నం మాత్రమే ! – ఇందులో కనిపిస్తుంది.

(నవంబర్–1968, సంచిక 9)

## సృజన నిర్ణయాలు

చాలా మంది అభిమానులు సృజనను ద్వైమాసికగా మార్చడంకన్న ప్రచు రణలు చేపట్టడం మంచిదని సూచించారు. ఆ సూచన మేరకు సృజన ప్రచురణలు ప్రారంభించి, ద్వైమాసిక ఆలోచనను కొంతకాలం పాటు వాయిదా వేస్తున్నాం.

సృజన ప్రచురణ కింద ఏడాదికి కనీసం రెండు పుస్తకాలయినా వెలువరించాలన్నది మా ఆశయం........

(ఆగస్ట్ 1969, సంచిక 12)

# నాలుగేళ్ళ సృజన

సృజన నాలుగో జన్మదినం జరుపుకుంటున్నది.

ఈ నాలుగేళ్ళలోనూ సృజన బలం పుంజుకొని పురోగమించింది.

ప్రయోగశీలత్వం, సృజనాత్మకత, ఆధునిక దృక్పథం పునాదులుగా సృజన ఈ నాలుగేళ్ళలోనూ పదమూడు సంచికలుగా వెలువడింది.

ఈ నాలుగో జన్మదిన సంచికను పూర్తిగా కథల సంచికగా వెలువరిస్తున్నాం.

ఆధునిక సాహిత్యంలో కథకున్న ప్రాముఖ్యాన్ని గూర్చి మేమిక్కడ విడమర్చి చెప్పాల్సిన పనిలేదు. కాని నేటి వ్యాపార పత్రికలు కథానిక స్థాయిని చాల దిగజార్చి వేశాయి. కథంటే కేవలం కాలక్షేపం కోసం ఒకసారి చదివి అవల పారేసేదనో లేక రచయిత తన పగటికలల్ని కథలుగా రాసి తీర్చుకోవడానికనో లేక పాఠకుడి పగటి కలల్ని సంతృప్తి పరచడానికోనన్న దృక్పథంతో ఈనాడు వ్యాపార పత్రికలు కథల్ని ప్రచురిస్తున్నాయి. కాని సమాజంలోని ఆర్థిక, రాజకీయ, సాంఘిక, మానసిక సమస్యల్ని వాస్తవికంగా చిత్రించే కథల్ని అవి తగినంతగా ప్రోత్సహించడంలేదు.

ఈ సంచికలో ఓ పన్నెండు కథల్ని అందిస్తున్నాం.

ఈ పన్నెండు కథల్లో ప్రతి కథలోనూ ఏదో ఒక నిజమైన సమస్య వుంది. జీవితం వుంది. జీవితంలోని చేదునిజాలున్నాయి. జీవితాన్ని వివిధ కోణాల్నుంచి చిత్రించాలన్న తపన వుంది. పాఠకుణ్ణి జోకొట్టడం కాకుండా అతని మేధస్సుకు కొంచెం పదును పెట్టి పనికల్పించాలన్న ప్రయత్నంవుంది.

ఈ సంచిక ముఖచిత్రం గురించి రెండు మాటలు:- కథల సంచిక కావడంవల్ల తెలుగు కథానికా రంగంలో నిజమైన గొప్పదనాన్ని సాధించిన ఇద్దరు కథకుల చిత్రాలుండడం సముచితమని మేం భావించాం. లోపల ఈ ఇద్దరు కథకుల కథలు లేకున్నా కనీసం వాళ్ళ చిత్రాల్ని చూసైనా మా పాఠకులు సంతృప్తి పడతారని మా నమ్మకం. (కుటుంబరావుగారి కథలేకున్నా వారితో ఇంటర్వ్యూ వేయగలిగి నందుకైనా ఎంతో సంతోషిస్తున్నాం)

సృజనకు పాఠకుల అభిమానమనే పెట్టుబడి తప్ప వేరే పెట్టుబడిలేదు. ఉడతా భక్తిగా ఎంతోకొంత సాహిత్యసేవ చేద్దామన్న ఆకాంక్ష తప్ప లాభాపేక్ష అసలులేదు. మొదట్లో మా ఈ ప్రయత్నాన్ని చాలా మంది అతిసాహసమనీ తొలిసంచిక వచ్చాక మలిసంచిక వస్తుందా అనీ హెచ్చరించారు. కాని సృజన నిలిచింది. ఇందుకు కారణం మీరు – మాపాఠకులు.

(నవంబర్ 1969, సంచిక 13)

## మాసపత్రికగా సృజన

సృజన మూడవ జన్మదిన సంచిక నుంచే ద్వైమాసికగా మార్చాలని ఆలోచిస్తున్నాం. పాఠకులు కూడ తొందర పరిచారు. కాని నాల్గవ జన్మదిన సంచికలో ఆ ఆలోచనను వాయిదా వేసి సృజన ప్రచురణలు చేపట్టాం. నాలుగేళ్ళు నిరాటంకంగా పదహారు సంచికలు వెలువడ్డాయి.

ఇంతలో తెలుగు దేశంలో ఒక మహాప్రభంజనం వీచింది. జూలై నెలలో హైదరాబాద్‌లో విప్లవ రచయితల సంఘం ఏర్పడింది. పత్రికలు యీ సంచలనాన్ని పతాక శీర్షికలతో వేయక తప్పలేదు. సృజన – 16 కూడ యీ పరిణామాన్ని తన పరిధిలో ప్రజల ముందుంచింది. మళ్ళీ అక్టోబర్‌లో ఖమ్మంలో విప్లవ రచయితల సంఘం ప్రథమ మహాసభలు చారిత్రాత్మకంగా జరిగాయి. ఆ ముందు త్రైమాసికగా నడుస్తున్న సృజనకు మాసపత్రికగా పరుగెత్తే జీవ మిచ్చింది. ఈనాడు దేశంలో తల యెత్తుతున్న భావ విప్లవ ఉద్యమాలే సృజనకు ఊపిరి.

మధ్యలో ఒక్క నవంబర్ – జనవరి సంచిక మాత్రం మా పాఠకులకు యివ్వ లేకపోయాం. ఎందరో అభిమానులు సృజన ఆగిపోయిందన్న వేదనతో రాసారు. వాళ్ళందరికీ ఒక్కొక్కరికీ విడిగా జవాబు కూడ యివ్వలేకపోయాం. ఈ అవకాశాన్ని తీసుకొని ఈ ఆలస్యానికి మన్నించ వలసిందిగా కోరుతున్నాం. ఇన్నాళ్ళూ సృజనను త్రైమాసికగా నడిపిన సామూహిక బలమే మాసపత్రికగా కూడా నడుపుతుందని మాకు తెలుసు. ఈ కర్తవ్యాన్ని నిర్వహించే బాధ్యతలో ఎప్పటికప్పుడు చైతన్య మార్గంలో కలిసివస్తున్న పాఠకుల సహకారానికి అభినందనలు అందిస్తున్నాం.

(ఫిబ్రవరి 1971, సంచిక 17)

## చేదు నిజాలు

సృజన ఆర్థికంగా కష్టాల్లోపడ్డదని జూన్, జూలై సంచికలు ఒకటిగా ఎక్కువ పేజీలు కూడ లేకుండా, మామూలుగా ఎప్పటివలెనే రావడాన్నిబట్టి పాఠకులే గ్రహిస్తారు. అది మాకుకూడ ఏమీ సంతోషంగాలేదు. కాని మేం అసహాయులమై పోయాం. సృజన త్రైమాసికగా వున్నపుడు ఆర్థిక, సాహిత్య సమస్యలను సర్దుబాటు చేసుకోవడానికి కొంత తెరపి వుండేది. కాని యువతరంలో లావా వలె పొంగుతున్న సాహిత్య తృష్ణను తీర్చడానికి పత్రికను మాసపత్రికగా మార్చాల్సిన బాధ్యతను స్వీకరించక తప్పలేదు. ఫలితంగా, మీరిదివరకిచ్చే దానికన్నా (ఐదురూపాయలు) రెట్టింపు మాత్రమే చందా ఇస్తున్నారు. మేం మాత్రం మూడురెట్లు సాహిత్యాన్నివ్వవలసి వస్తున్నది. కాగితం దొరకడం కష్టమైపోయింది. దొరికినా ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. ప్రింటింగ్ రేట్లు పెరిగిపోయాయి. మునుపటి వలెనడిపినా ఎంతో వ్యత్యాసంపడే ఈ తరుణంలో మాసపత్రికను ఎనభై పేజీలతో పదిరూపాయలకు పన్నెండు సంచికలు ఇవ్వడం ఎంత సాహసమో (ప్రకటనలు కూడా దొరకని) సాహిత్య పత్రికల సంగతి తెలిసిన ఎవరైనా అర్థం చేసుకోగలరు.

మరోవంపున రచయితల నుంచి కూడా సృజనకు ఆశించినంత సహాయ సహకారాలు లభించడంలేదు. సృజన ఎంత గొప్ప రచయితకైనా ఎంత గొప్ప రచనకైనా ఏమీ పారితోషికం ఇవ్వనిమాట నిజమే. కాని సృజనకు రాసే ఏ రచయితా అలాంటి పారితోషికాన్ని ఆశించి రాయరని, సృజనలాంటి సాహిత్య పత్రికలకు రాయడం తమ విధిగా, కర్తవ్యంగా భావించి రాస్తారని మాకు తెలుసు. మరి ఎందువల్లనో ఒకవిధమైన నిర్లిప్తత, నిరాసక్తి రచయితల నావరించాయని మాకన్పిస్తున్నది. ఇది మొదటి దానికన్నా అవాంఛనీయ పరిణామం.

సృజన అభిమానులు ఈ రెండు రంగాల్లోనూ రెట్టింపు పూనిక వహించి సృజనను కాపాడుకుంటారని ఆశిస్తున్నాం.

(జూన్/జూలై 1971, సంచిక 21/22)

## స్వ(?) విషయం

........ కొన్నాళ్ళుగా సృజన ప్రచారం నెలనెలకూ క్రమంగా పెరుగుతున్నది, కాని డిసెంబర్ నెల మొదలుకొని ఆంధ్ర ఉద్యమ ఫలితంగా బంద్, ఆందోళనల వలన, తపాలా అసౌకర్యాల వలన పత్రికలు మిగిలిపోవడమూ, విపిపిలు తిరిగి రావడమూ జరిగింది. ఆందోళనా కరువూ సాకుగా పెట్టుకుని కాగితం మున్నగు అన్ని పత్రికావసరాల ధరలూ విపరీతంగా పెంచారు. సృజన పాఠకులు పేదవాళ్ళు. కరువు

కాలంలో పత్రిక కొనలేనివాళ్ళు. ఈ కారణాలన్నిటి వలన పత్రిక ఆర్థికంగా చాలా నష్టపడ్డది. ఇవన్నీ అనివార్యమైన (కనీసం ఈ వ్యవస్థలో) ఇబ్బందులు.

కాని సృజనపట్ల, విప్లవ సాహిత్యంపట్ల అభిమానంతో ఏజెన్సీ తీసుకొని, విడిగా తెప్పించుకొని పత్రికలు విరివిగా అమ్మి కూడా డబ్బు పంపించని ఏజెంట్లు, అభిమానుల విషయమే ఆశ్చర్యంగానూ విచారంగానూ వున్నది. బకాయలున్న వారంతా వెంటనే చెల్లిస్తారని ఆశిస్తున్నాం.

సృజనలో లోపాలుఉంటే చూపి, సరిదిద్ది సృజననొక విప్లవ సాహిత్య వేదికగా నిలబెట్టుకునే బాధ్యతను స్వీకరించవలసిందిగా పాఠకులను కోరుతున్నాం.

(మార్చి / ఏప్రిల్ 1973, సంచిక 42 / 43)

## పబ్లిషర్స్ నోట్

సృజన ఏడు సంవత్సరాలుగా క్రమం తప్పకుండా తెస్తున్నా, మూడు సంవత్సరాలుగా మాసపత్రికగా వస్తున్నా, ఒక న్యూస్ పేపర్‌గా రిజిస్ట్రార్ ఆఫ్ న్యూస్ పేపర్స్ ఆఫ్ ఇండియా, పోస్టల్ డిపార్ట్‌మెంట్, డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ లైబ్రరీస్ ఏనాడో గుర్తించినా యీనాటికి న్యూస్ ప్రింట్ కోటా యివ్వలేదు ప్రభుత్వం; చిన్న పత్రికలకు ప్రోత్సాహం నినాదాలిచ్చే ఇందిరా గుజ్రాల్ ప్రభుత్వం. కోటా మాట అలావుంచి మార్కెట్‌లో కూడా న్యూస్ ప్రింట్ కరువు దినదినమూ అధికమవుతున్నది. వ్యవసాయానికి ఎరువులు, రచనా వ్యవసాయానికి కాగితం కటకట.

73 జులైలో 32, 33 రూపాయలున్న 1 రీము (డెమీసైజ్) న్యూస్‌ప్రింట్‌కు.. ఆగస్ట్ 33. సెప్టెంబర్ 40, అక్టోబర్ 45, నవంబర్ 53 రూపాయలుగా పెరిగింది,

ఇక తప్పని సరియై ఇతర పత్రికలవలె రేటు పెంచడం కాకుండా పేజీలు తగ్గించాలని నిర్ణయించాం. ఆగస్టులోనే న్యూస్ ప్రింట్ కొరత గురించి ఫ్రాంటియర్ పత్రిక ఇలారాసింది. "....ఎంత తక్కువ చదివితే అంత మంచిదనేమో. దిగుమతి కుంభకోణంలో ఒక కుట్ర వుండి వుంటుంది; ఈ దేశంలో చాలమంది ప్రజలు చదువలేరు గనుక టెలివిజన్ ఏర్పాటు చేసుకోవడం మంచిది."

పెట్టుబడిదారీ సమాజంచేసే కుట్రలు మార్క్సిస్టు - లెనినిస్ట్ అవగాహనతో పసిగడితే తప్ప ఒక మానాన అర్థంకావు. డచ్ విప్లవరచయిత ముల్తతులి రచనలు హక్కులతోపాటు కొని ప్రచురణకర్తలు వాటన్నిటినీ కాల్చేసారు. ఆ రకంగా

ప్రజాశత్రులను క్రూరమైన కుట్ర చాటున దెబ్బతీసే ప్రయత్నంచేసారు. న్యూస్ ప్రింట్ కొరతవల్ల నిజంగా నష్టపడేది ప్రజలే. వ్యాపార పత్రికలన్నీ వ్యాపార ప్రకటనలు ఎప్పటివలెనే వేసి వార్తలను మాత్రమే తగ్గిస్తున్నాయి. న్యూస్‌ప్రింట్ కరువు పేర రేట్లు పెంచుతున్నారు. పండుగలకు ప్రత్యేక సంచిక వేయడం ఒక వ్యాపార పండుగ నిండా వ్యాపార ప్రకటనలే వేయొచ్చు. ఎటొచ్చీ విప్లవ ప్రచారానికి ఉద్దేశించిన ప్రజల పత్రికలకే ఇబ్బంది. ప్రజల కొనుగోలు శక్తిని దృష్టిలో పెట్టుకొని వెలపెంచడానికి మనస్కరించదు. పత్రిక వెల ప్రారంభమయినచోట నిలవాలి. కాగితం వెల చుక్కలదాక ఎగిరిపోయింది. ఈ రెంటి మధ్య వంతెన–పేజీలు తగ్గించడం తప్ప గత్యంతరం లేదు. అయినా కొన్ని ప్రత్యేక సంచికలు తప్పవు. సృజనకు రెండు పుట్టిన రోజులు. నవంబర్ కాక ఫిబ్రవరి మాసపత్రికగా సృజన పుట్టిన రోజు. మేడే కార్మికుల ప్రపంచ పండుగ. అక్టోబర్ విప్లవం, విరసం సభలు– ఇవన్నీ ఎక్కువ పేజీలతో సృజన వస్తూనే వున్నది. న్యూస్‌ప్రింట్ రేట్లు విపరీతంగా పెరిగిన యీ 5 నెలల కాలంలో కూడ సృజన చాల ఎక్కువ పేజీలతో వెలువడింది. నిజానికి 64 పేజీలకన్నా ఎక్కువ పేజీలువేస్తే అన్నికాపీలు అమ్మినా పెట్టిన డబ్బురాదు. పైగా కొంత కాలంగా తప్పని సరిగా కవర్ చిత్రాలు వేస్తున్నాం. ఇవన్నీ గణనలోకి తీసుకొని ఇకనుంచి సృజన 64 పేజీలతోనే వెలువడాల్సిన అత్యవసర పరిస్థితిని పాఠకులు సానుభూతితో అర్థంచేసుకుంటావని ఆశిస్తాం.

(డిసెంబర్ 1973, సంచిక 51)

## సృజన సహాయనిధి

ప్రజలు విప్లవాలు కోరే ఈ యుగంలో విప్లవ పత్రికలు నిర్వర్తించవలసిన బాధ్యత గురుతరమైనది– ఐతే నేటి వ్యవస్థలో ప్రజా పత్రికలను ఆర్థిక ఇబ్బందుల నుంచి అనేక ఆటుపోటులనుంచి కాపాడుకునే బాధ్యత ప్రజలదే. కాగితం ధర, ముద్రణా వ్యయం విపరీతంగా పెరిగిపోయిన యీ సమయంలో సృజన కొనసాగడం కష్టమైపోయి "సృజన సహాయనిధి" ప్రారంభిస్తున్నాం. పాఠకుల, రచయితల, అభిమానుల అండదండలే బలంగా విప్లవ సాహిత్యవేదికగా యింత కాలం తన విప్లవ కర్తవ్యాన్ని నెరవేరుస్తున్న 'సృజన'కు ఇక ముందు కూడా ఆ ఆదరణ సహకారం నిరాఘాటంగా లభిస్తాయనే విశ్వాసం మాకున్నది. పాఠకులూ, రచయితలూ, అభిమానులూ సృజన సహాయనిధికి విస్తృతంగా విరాళాలందజేసి విప్లవ మార్గంలో సృజన నిర్విఘ్నంగా సాగేట్లు చేయగలరని విజ్ఞప్తి చేస్తున్నాం.

(జూలై 1974, సంచిక 58)

## ప్రియమైన 'సృజన' పాఠకులకు

ఎనిమిది మాసాలక్రితం మేము "పబ్లిషర్స్ నోట్"లో పెరుగుతున్న న్యూస్ ప్రింట్ ధరలు పాఠకుల ముందుంచి "సృజన" ధర పెంచకుండా పేజీలు మాత్రం తగ్గించినాం- కాని ఇటీవలి నెలల్లో రోజురోజు విపరీతంగా పెరిగిపోతున్న కాగితపు ధర, ప్రింటింగ్ చార్జీల కారణంగా పేజీలు మరింత తగ్గించినా ధర పెంచక తప్పడం లేదు. గత సంవత్సర కాలంలో ముఖ్యంగా కాగితం ధర యెలా పెరిగిందో మళ్ళీ పాఠకుల ముందుంచుతున్నాం,

1973 డిసెంబర్‌లో 60/- రూ. ఉన్న 1 రీము (డెమ్మీ సైజు) కాగితం 74 జనవరిలో 75/- రూ.లు ఫిబ్రవరిలో 80/- మేలో 85/- ఇప్పుడు సెప్టెంబర్ నుండి 95/- రూ.లకు పెరిగింది- ఇక ప్రింటింగ్ చార్జీలు 1973 డిసెంబర్‌లో పేజీ 1కి రూ. 4.50లు '74 జనవరిలో రూ. 5-25లు. సెప్టెంబర్ నుండి ఇక్కడ వరంగల్‌లో ఒకే సారి రూ. 9/-కి అంటే సుమారు రెండింతలు పెరిగిపోయినవి. 1 సంవత్సర కాలం లోనే ధరలు ఎలా పెరిగిపోయినవో చూడండి.

| 1973 సెప్టెంబర్ | 1974 సెప్టెంబర్ |
|---|---|
| రూ. 40.00 | రూ. 95/- (1 రీ॥ న్యూస్‌ప్రింట్ ధర) |
| రూ. 4.50 | రూ. 9/- (1 పేజీ ప్రింటింగ్ ధర) |

"సృజన" 8 సం॥ల నుండి వరుసగా వస్తున్నా, ఎన్ని మారులు న్యూస్ ప్రింట్ కోటాకోసం దరఖాస్తులు పెట్టుకొన్నా లాభంలేక పోయింది. చిన్న పత్రికలగూర్చి, "బలహీనవర్గాల" గూర్చి పెద్ద పెద్ద కబుర్లుచెప్పే ఇందిరమ్మ ప్రభుత్వ వర్గస్వభావం మనకు తెలియంది కాదు- అందుకే 'సృజన'కు న్యూస్ ప్రింట్ కోటా యీనాటి వరకూ రాలేదు- ముందు వస్తుందనే నమ్మకమూలేదు.

బూర్జువా పత్రికలకు యిటు ప్రభుత్వమూ, అటు ప్రైవేటు సంస్థలూ అనేక విధాల ఆర్థిక వనరులు చేకూర్చి పెడతాయి- ఎటొచ్చీ ప్రజల పక్షాన నిలబడ్డ విప్లవ పత్రికలనూ, సాహిత్యాన్నీ, ప్రజలకు అందుబాటులో లేకుండా చేస్తున్నదీ ప్రభుత్వం- యీ వ్యవస్థ.

ఇప్పుడున్న పేపర్, ప్రింటింగ్ ఇతర ఖర్చుల దృష్ట్యా "సృజన" 1 రూ. వెల తో 48 పేజీలు వేసినా నష్టమే వస్తుంది. పైగా అక్టోబర్ విప్లవ విజయం, మేడే, జన్మదిన సందర్భాల్లో ప్రత్యేక సంచికలు, వీలైనప్పుడల్లా కవర్ చిత్రాలు వేస్తూనే

ఉన్నాం-వీటన్నింటికీ అదనంగా ఖర్చులు తప్పవు-కాబట్టి నవంబర్ 74 సంచికనుండి "సృజన" రేట్లు యీ దిగువ విధంగా పెంచ వలసి వస్తున్నది.

విడిప్రతి వెల రూ. 1-50 పైసలు
సంవత్సర చందా రూ. 15-00.

ప్రజల కొనుగోలు శక్తిని తలచుకొంటే యిది బాధాకరమే అయినా తప్పడం లేదు- పాఠకులు యీ పరిస్థితిని సానుభూతితో అర్థం చేసుకొని మాతో ఎప్పటివలె సహకరిస్తారని ఆశిస్తున్నాం.

(సెప్టెంబర్ 1974, సంచిక - 60)

## కృతజ్ఞతలు

కోరిందే తడవుగా ఎందరో రచయితలు, పాఠకులు, అభిమానులు "సృజన సహాయనిధి"కి ఎంతో ఆప్యాయతతో తమ విరాళాలు అందజేశారు. వారందరికి 'సృజన' తన 9వ జన్మదిన సందర్భంగా కృతజ్ఞతాభివందనలు తెలుపుకొంటున్నది- ముందు కూడా వీరందరి ఆదరాభిమానాలే వేలాది కార్మిక, కర్షక, కష్టజీవుల అండదండలే పెన్నిధిగా విప్లవపు బాటలో తన కర్తవ్యాన్ని మరింత దృఢదీక్షతో కొనసాగించగలదని హామీ యిస్తోంది- విప్లవానికి పునరంకితమవుతోంది- విప్లవం వర్ధిల్లాలి!

(నవంబర్ 1974, సంచిక 62)

## స్వవిషయం

ప్రజా సాహిత్యానికీ, సంస్కృతికీ, కళలకూ పునరంకితమవుతూ సృజన 25 నెలల తర్వాత మళ్ళీ మీ ముందుకొస్తున్నది. 21 నెలల ఎమర్జెన్సీ కాలంలో సృజన జెయిల్లో వున్నట్టే లెక్క. ఎందుకంటే సృజన ప్రాణమైన విరసం రచయితలు, నిర్వహించే 'సాహితీమిత్రులు' దాదాపుగా అందరూ బందీలయ్యారు: సృజన సంపాదకులు. ప్రచురణకర్త ఎమర్జెన్సీ కాలమంతా 'రాజద్రోహ' నేరానికి బోనెక్కి ఎమర్జెన్సీ ఎత్తేసిన ఇంతకాలానికి రెండేళ్ళ జెయిలు శిక్షకు గురయి బెయిలుపై విడుదల అయింది. ఈ పరిస్థితుల్లో మీ చేతుల్లో పెడుతున్న పత్రికను ఆర్థికంగా హార్దికంగా ఆదుకోవల్సిన బాధ్యతను మీ మీదే వుంచుతున్నాం.

ఇరవై అయిదు నెలల తర్వాత పదేళ్ళు నడిచి ఆగిన సృజన మళ్ళీ మీ చేతుల్లో వున్నది. ఇందుకు మీ ఆదరణ. అభిమానాలే కారణం కాని తెలుగుదేశంలో విప్లవ పత్రికలు వెలువడే మామూలు పరిస్థితులు వెలువడినయ్ అని అర్థం గాదు. ప్రెస్ సెన్సార్‌షిప్ పోయింది. అభ్యంతరకర రచనల ప్రచురణ నిషేధ చట్టం పోయింది. ఇవాళకాదు యిది పోయి నాలుగు నెలలయింది. ఎందుకు మరి ఎమర్జెన్సీకన్నా ముందు ఆగిపోయిన ప్రజల పత్రికలు తిరిగి వెలువడడంలేదు? స్వానుభవంతోనే చెప్పాలంటే ఎమర్జెన్సీ ఎత్తివేయగానే ప్రారంభించాలని ప్రయత్నం చేసిన సృజనకు అధికారులు అడుగడుగునా అవరోధాలు కల్పించారు. సృజనమీద కోర్టులో కేసుందని ఎమర్జెన్సీలో ప్రెస్ సెన్సార్‌షిప్ కత్తెరకు గురైందని రకరకాల సాకులతో అడ్డుపుల్లలు వేశారు. ఇటువంటి అవరోధాలే యిప్పటికీ సోదర పత్రిక 'విమోచన'కు కల్పిస్తున్నారు. నిజానికివన్నీ చట్టరీత్యా కూడా చెల్లనేరనివి.

పులిమీద పుట్రలా రెండు సంవత్సరాలుగా సాగుతున్న సృజనమీది 'రాజద్రోహ నేరం'పై తీర్పు వరంగల్ సెషన్స్ కోర్టులో జులై 16న వచ్చింది. తీర్పు చెప్పడానికన్నా మూడు రోజుల ముందుగానే 13వ తేదీన ఎడిటర్, పబ్లిషర్ హేమలతను సెషన్స్‌జడ్జ్ జైలుకు పంపించాడు. ఆ పని కనుగుణంగానే రెండు సంవత్సరాల శిక్ష విధిస్తూ తీర్పు చెప్పాడు. ముగ్గురు పిల్లల తల్లి అయినందుకు దయచూపాలని అన్పించినా విచారణ కొనసాగిన కాలమంతా ఆమెలో పశ్చాత్తాపం కనిపించకపోవడంవల్ల 'న్యాయ ప్రయోజనాల రీత్యా' యీ శిక్ష విధించక తప్పలేదన్నది తీర్పు. హైకోర్టులో అప్పీలుచేసేదాకా యీ శిక్ష అమలుచేయకుండా నిలుపడానికికూడా జడ్జ్ నిరాకరించాడు. ఏమైతేనేం జూలై 19న హైకోర్టులో అపీల్‌ను అనుమతిస్తూ బెయిల్ యిచ్చారు. హేమలత 20వ తేదీన బెయిల్‌పై జైలునుంచి విడుదలయింది. నేరం 1974 మే రైల్వే సమ్మెను బలపరుస్తూ కవితలు ప్రచురించిన మే 74 సృజన. వివేచన పాఠకులకే వదులుతున్నాం. హైకోర్టు తీర్పుదాకా బెయిల్‌పైవున్నా రెండేళ్ళ శిక్ష వున్నట్టే అని గుర్తుచేస్తున్నాం.

(జూలై 1977, సంచిక 70)

# రచనల కోసం విజ్ఞప్తి

ఆర్థిక ఇబ్బందులు, నిర్వహణా సమస్యలతోపాటు సృజన రచనల విషయంలో కూడ తీవ్రమైన కొరతను ఎదుర్కొంటున్నది. కళా విలువలు లేని నినాద ప్రాయమైన పాటలు, కవితలు, మూసలోపోసిన ఫార్ములాపద్ధతి కథలు, ఇతర భాషల్లోని మంచి రచనలకు (చెడ్డ) అనువాదాలు తప్ప మౌలికమైన, ఉత్తేజకరమైన కనీసం తృప్తికర మైన రచనలు రావడం లేదు. ముఖ్యంగా సాహిత్య విమర్శ, సమీక్షలు, మౌలిక మైన సృజనాత్మక రచనలు కరువయినాయి. ఉత్తమమైన రచనలు పంపించి ప్రజా సాహిత్య ప్రమాణాలు ఉన్నతంగా కాపాడడంలో సృజనకు ఇతోధికంగా సహకరించ వలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

(జూన్ 1978, సంచిక 80)

విపరీతంగా పెరిగిన కాగితం ఖర్చు, పోస్టల్ ఖర్చులు తదితర నిర్వహణ వ్యయ భారం వల్ల సృజన సాధారణ సంచికల ధర రెండు రూపాయలకు పెంచుతున్నాం. సంవత్సర చందా ఇరవై రూపాయలు. ప్రత్యేక సంచికల వెల ఆయా సంచికల ఖర్చును బట్టి నిర్ణయించబడుతుంది. చందాదారులకు మాత్రం సంవత్సర చందా ఇరవై రూపాయల్లోనే ప్రత్యేక సంచికలు కూడా వస్తాయి.

అయితే మామూలు సంచికలు యికనుంచి 64-70 పేజీల మధ్యన కాకుండా 80 పేజీలుంటాయి. పాత చందాదారుల చందారేట్లు 1980 జనవరి నుంచి యీ మేరకు సవరించ బడుతాయి. అనివార్యమైన యీ నిర్ణయాన్ని చందాదార్లు, పాఠకులు సహృ దయంతో అర్థం చేసుకొని ఎప్పటి వలెనే సహకరిస్తారని ఆశిస్తున్నాం.

(1980 జనవరి, సంచిక 99)

# సంపాదకీయాలు

సృజన 18వ సంచిక నుంచిగానీ ప్రతినెలా సంపాదకీయం రాసే సంప్రదాయం ప్రారంభంకాలేదు. కళాతపస్వి (బుచ్చిబాబు స్మృతికి, నవంబర్ 67, సంచిక 5) ఇది సంపాదకీయంకాదు (చలం సాహిత్య సమాలోచన మే 68 సంచిక 7) 'నిన్న విడిచిన పోరాటం నేడు అందుకొనక తప్పదు' (శ్రీశ్రీ సాహిత్య సమాలోచన, ఫిబ్రవరి 70, సంచిక 14) మాత్రమే ఇందుకు మినహాయింపు.

సంపాదకీయాలన్నీ విధిగా సంపాదకుడు రాసినవి కూడకాదు. ఆయా అంశాలలో ప్రవేశాన్ని, అభినివేశాన్ని బట్టి, 'సాహితీమిత్రులు'లో ఇతరులు కూడ రాసినవి వున్నవి. 'కళాతపస్వి' సంతకంచేయని నవీన్ రచన. బుచ్చిబాబు స్మృతికి అంకితమైన మొదటి జన్మదిన సంచికకు అప్రకటిత సంపాదక బాధ్యత నిర్వహించింది నవీన్ 1974 జూన్ నుంచి 75 మే దాకా సృజన నిర్వహణతోపాటు సంపాదకీయ రచన బాధ్యత కూడ 'సాహితీమిత్రులు' చేపట్టారు. కొడవటిగంటి కుటుంబరావు (సాహిత్యం మీద దాడి- ఏప్రిల్ 71, సంచిక 19) తో గెస్ట్ ఎడిటోరియల్ సంప్రదాయం ప్రారంభమైంది. రాచకొండ విశ్వనాథశాస్త్రి (జ్వాలారమణ రాజేశ్వరులు- సెప్టెంబరు 71, సంచిక 24) సురా (కృష్ణన్‌చెట్టి 'ఉరితీయబడ్డ శిరస్సు చెప్పిన రహస్యం' సెప్టెంబరు 78, సంచిక 83) రాసినవి యిప్పటికి మరో రెండు గెస్ట్ ఎడిటోరియల్‌లు.

సృజన సంపాదకీయాలకు ఎప్పుడూవుండే పరిమితి స్థల, కాలాలు. 5వ పేజీతో ప్రారంభించి సంచిక అచ్చంతా పూర్తయ్యాక ముందు అచ్చు కావలసిన 3 పేజీల్లో ఇన్నరుటైటిల్, ఒక్కొసారి విషయసూచిక, ఏదైనా ఆలస్యంగా అందిన అదే సంచికలో వేయవలసిన అవసరమున్న కవితలకు జాగాపోగా పత్రిక వెలువడవలసిన అప్పటికే అయిన ఆలస్యం ఒత్తిడి చేయగా ఆలోచనల, పనుల మెస్‌లోనో, ప్రింటింగ్ ప్రెస్‌లోనో గిలికే పెన్ పేరే సంపాదకీయం. మచ్చుకు కొన్ని–

## కలాలకు సంకెళ్ళు లేవు

రచయిత ప్రజలకు సంబంధించిన ప్రతి సమస్యపైన తన అభిప్రాయం చెప్పాలి. అది మనకు సంబంధించింది కాదు మనకెందుకులే అనుకోవడం పిరికితనం. దేశం గడ్డు సమస్యల కత్తెర్లకు లోనయినపుడు రచయిత మౌనంగాని, ఉదాసీనతగాని ప్రజా ద్రోహంకన్నా తక్కువేమీ కాదు. కుటుంబ నియంత్రణం, పొదుపు, గాంధి, సమైక్య ఆంధ్రప్రదేశ్‌పై రచయితలతో రాయించి మేధావులతో ప్రచారంచేయిస్తున్న ప్రభుత్వం అలాంటి విషయాలపైనే దాని పాలసీలకు వ్యతిరేకంగా రాసిన వారికి, చెప్పిన వారికి రాజకీయ సంబంధాలు ఆరోపించి అనుమానిస్తున్నది. గట్టిగా చెబితే హింసిస్తున్నది. గాంధీని పొగిడితే రాజకీయం కాంది గాంధీని సహేతుకంగా తిడితే రాజకీయం ఎట్లా అవుతుందో, సుత్తె పెట్టుబడిదారులు పోషలిజం సాధిస్తారని రాసిన కవి మహాకవియై శ్రామిక శ్రేయో ప్రజాస్వామ్యం ఏర్పడాలని రాసిన కవి దేశద్రోహి ఎట్లా అవుతాడో అడిగినందుకు కలాలకు సంకెళ్ళు వేసే దేశంలో స్వతంత్రానికి అర్థం ఏమిటి?

ఈవిధంగా కలాలమీద కత్తులు నూరే అవమానకరమైన స్థితికి మన ప్రభుత్వం దిగజారింది. శావ సాయుధుడైన ప్రతి రచయితా నిజంగా సాయుధుడన్నంతగా భయపడి కటకటాల వెనక్కి తోసి వెల్లువలా పీళ్ళు ప్రజల్లోతెస్తున్న విప్లవ చైతన్యాన్ని అరెస్టు చేయాలని చూస్తున్నదీ ప్రభుత్వం. దీనికి నీతి నిజాయితీ లేవు. నువు సత్యం చెప్పావు కనుక నీమీద పగ అనగల గుండెధైర్యం దీనికిలేదు.

.... .... .... .... .... ....

చేతులకు సంకెళ్ళు వేస్తారు- చాలకపోతే కలాలకు సంకెళ్ళు వేస్తారు. కుటుంబ నియంత్రణం పేరుతో మనిషి పుట్టకుండా కూడా ఆపేస్తారు. కాని పుట్టినవాణ్ని ఆలోచించకుండా చేయడం సాధ్యమయే పని కాదు. బుద్ధీ, హృదయమూ వున్న మనుషుల నోళ్ళు హృదయమైనా లేని జైళ్ళు మూయించలేవు.

(మార్చి 1971, సంచిక 18)

## విప్లవ సాహిత్యం - వీరయ్యలు

అతడు మధు సాహిత్యాన్ని అమ్మలేదు. టీ దుకాణం పేరుమీద సారా బుడ్డీలు అమ్మలేదు. అమ్మాయిల వ్యాపారం చేయలేదు. పత్రికలు పుస్తకాలచాటున సట్టాబజార్ నడుపలేదు. చల్ల నీళ్ళకు వేడినీళ్ళు తోడుగా చాయ్‌తో పాటు విప్లవ సాహిత్యాన్ని అమ్ముతున్నాడు. ఆ అమ్ముకోవడం కేవలం వ్యాపారదృష్టితో కాక

ఒక కమిట్ మెంట్‌తో ఒక కర్తవ్యంగా చేస్తున్నాడు. విప్లవ సాహిత్యానికి అది కోరుతున్న ప్రజలకు మధ్యన వంతెనగా పని చేస్తున్నాడే కాని మరే రకమైన దోపిడీ వ్యవస్థకు దళారీగా మాత్రం పనిచేయడంలేదు.

—నేషన్ పత్రికలు తాటికాయంత అక్షరాలతో రావులకు, బాబులకు- శ్రీలకు, కుమారీలకు మధ్యన నడిచాయని చెప్పే కామక్రీడలను ఆయన దుకాణానికి తోరణంగా కట్టక పోవడమే ఆయన చేసిన నేరం. పైన చెప్పిన యీ వ్యవహారాలన్ని పోలీసుల కలవాటు. (పైగా కొన్ని మామూళ్ళను ఆనవాయితీగా తెచ్చిపెట్టే లాభసాటి బేరాలు) ఆ అలవాట్లకు సంప్రదాయాలకు భిన్నంగా ఎన్నికలను బహిష్కరించండి అని విప్లవ రచయితలు చెప్పిన మాటలు బోర్డుమీద రాసిపెట్టిన నేరానికి అతణ్ణి ........ఖమ్మంలో టీకో పాటు విప్లవ సాహిత్యాన్ని అమ్ముతున్న బి. వీరయ్యగారిని పోలీసులు అమానుషంగా హింసించారు.

వీరయ్యను విప్లవకవులు వచ్చి రక్షించుకోవచ్చు రక్షించుకో లేకపోవచ్చు; (ఇప్పటికి ఎంత మంది వీరయ్యలను నిష్కారణంగా, దారుణంగా అడవుల్లో కాల్చి చంపలేదని!) కాని వీరయ్యలను విప్లవ కవులను అడవుల్లో (ఊళ్ళల్లో, నగరాల్లో కూడా) అన్యాయంగా కాల్చి చంపబడుతున్న అజ్ఞాతయోధులను అందరినీ విప్లవ చైతన్యం వికసించే ప్రజలే కాపాడుకుంటారు. అప్పుడు ఆ విశ్వవ్యాపిత శ్రామిక విప్లవ సంగ్రామంలో ఖమ్మం పోలీసు బలంగాని జులుంగాని ఏం లెక్క!

ఆ రోజులు వీరయ్యలే తెస్తారు.

('72 ఏప్రిల్, సంచిక 31)

## 'రైళ్ళను జైళ్ళు నడిపించగలవా?'

రైలు మార్గం పడడమే ఒక విప్లవమన్నాడు లెనిన్. పనిగంటలు సాధించుకోవడానికి దాదాపు తొంభై సంవత్సరాల క్రితం చికాగో నగర కార్మికులు చిందించిన రక్తం అంతర్జాతీయ కార్మిక ఐక్యతా అరుణపతాకమై పోరాటాలకు సంకేతంగా ఎగురుతున్నది. పనిగంటలు సాధించు కోవడానికి, పబ్లిక్ రంగంలో వున్న తనుతోటి ఉద్యోగస్తుల పాటి జీతమైనా పొందడానికి, 'చట్టబద్ధంగా' రావలసినబోనస్ కోరడానికి దేశమంతటా రైల్వే ఉద్యోగులు యీ నెలలో సమ్మెకు పూనుకుంటున్నారు. ఈ సమ్మె దేశద్రోహకరమని, ఈ సమ్మెను సమర్థించినా, ప్రోత్సహించినా, సమ్మెలో పాల్గొన్నా దేశద్రోహ నేరమవుతుందనీ బెదిరిస్తున్నది ప్రభుత్వం. Railway men

if you win, you will loose (రైల్వే ఉద్యోగులారా మీరు సమ్మెను గెల్చుకోవడ మంటే నష్టపడడమన్న మాట) అని కుటిలమైన విషప్రచారం చేస్తున్నది. సమ్మె గెలిచి బోనసులు ఎక్కువజీతాలు సాధించుకుంటే ధరలు పెరుగుతాయని బెదిరిస్తున్నది! (జీతాలు పెంచడానికి బోనసులు యివ్వడానికి ప్రభుత్వం దగ్గర నిధులులేవు. ధరలు అరికట్టడానికి దమ్ములులేవు. ప్రజల కష్టం తినడానికి మాత్రం పాలక వర్గాలకు బానల లాంటి కడుపులున్నాయి)

ఒకవైపు సంభాషణలు సాగిస్తూనే నాయకత్వాన్నంతా జైళ్ళలో కుక్కి చర్చలకు రైల్వే ఉద్యోగుల నాయకులు రాలేదని ఫిర్యాదుచేస్తున్నది. చర్చలు సాగుతుండగా సమ్మె కోసం ఉద్యోగులను నాయకత్వం రెచ్చగొడుతున్నదని అంటూనే సమ్మెలో పాల్గొనే సంఘాలను చీల్చడానికి చేయగలిగినన్ని చెడుగు చేష్టలు చేస్తున్నది ప్రభుత్వం. సమ్మె జరుగబోదు అన్న విశ్వాసాన్ని కూడా తన శకుని రాజకీయాలమీద భరోసాతో ప్రకటిస్తున్నాడు రైల్వే మంత్రి

కాని రైల్వే మంత్రిగాని, పాలకవర్గంగాని గుర్తించవలసిన సత్యం మాత్రం ఒకటున్నది. రైళ్ళను జైళ్ళు నడుపలేవు. రైల్వే మంత్రి నడుపలేడు. ఇందిరమ్మ నడుపలేదు. ఆపని రైల్వే కార్మికులు మాత్రమే చేయగలరు. వాళ్ళ జీవితాలతో చెలగాటాలాడుకుంటే మాత్రం రైల్వేసమ్మె యీ దేశంలో విప్లవానికి బాటలు వేసి తీరుతుంది.

6-5-74 (మే 74, సంచిక 56)

## కుట్ర

మళ్ళీ పోలీసు ప్రభుత్వం తన పుచ్చిపోయిన పంజా విప్పింది. మళ్ళీ విప్లవ రచయితల్ని అరెస్టు చేసింది. ఈ అరెస్టులు ప్రజల్లో వారికి లభిస్తున్న ఆదరాన్ని, విప్లవం ఎడల ప్రజల సుముఖత్వాన్ని తెలుపుతున్నాయి. అలాగే పాలకవర్గ దివాళా కోరుతనాన్ని కంగారును పిరికితనాన్ని తెలుపుతున్నాయి. దోపిడీవర్గం తన ప్రయోజనాన్ని కాపాడుకోవడానికి ప్రజాచైతన్యాన్ని అరికట్టడానికి ఎలాంటి కుట్ర పన్నుతుందో కూడా ఈ అరెస్టులు తెలుపుతాయి. ఈసారి ఫాసిస్టు ప్రభుత్వం విప్లవ కవులను బనాయింపు కుట్రకేసులో యిరికించింది. నిజానికి ఎవరు ఎవరిపై కుట్ర పన్నుతున్నారు?

ప్రజాస్వామ్యం ముసుగులో ధనస్వామ్యం దోపిడీని రక్షించి పోషించే ఈ దేశపు రాజ్యాంగమే ఒక పెద్ద కుట్ర. మాస్కో, వాషింగ్టన్, టోక్యో, బాన్

ఇంకెక్కడెక్కడో తాకట్టుపడ్డ ఢిల్లీ సింహాసనం కుట్ర. సింహాసనం మీది ఇందిరా మందహాసం ప్రతి పలుకూ శ్వాసా కుట్ర. ఈ సింహాసనం పాదాలు కడిగే మంత్రులూ ముఖ్యమంత్రులూ కుట్ర. అంతరంగిక భద్రతా చట్టం కుట్ర. దేశభద్రతా చట్టం కుట్ర. రకరకాల పీడన చట్టాలు కుట్ర. తారు పులుముకున్న ఇక్కడి బజార్లు కుట్ర. బజారు ధరలు కుట్ర. బ్యాంకులు కుట్ర. బ్యాంకుల జాతీయం కుట్ర. గరీబీ హటావో కుట్ర. ఆకాశవాణి కుట్ర. ఆకాశానికి పడగలెత్తిన మేడలు కుట్ర. ఆఫీసులు కుట్ర. ఎన్నికలు కుట్ర. ప్రణాళికలు కుట్ర. నిన్నగాక మొన్న పేలిన అణుబాంబు కుట్ర. ఈ ప్రభుత్వమే పెద్ద కుట్ర. ఈ వ్యవస్థే కుట్ర.

ఈ 'కుట్ర'కు బలై పోయిన ఈ దేశంలోని తొంభై శాతం జనం కార్మిక కర్షక కష్టజీవులు బానిసలై బిచ్చగాళ్ళైపోయారు. నెత్తురు మడుగులైన తమ జీవితాల బాధ భరించలేక 1967లో నక్సల్బరీ పేదరైతాంగం సాయుధంగా దోచుకుంటున్న వాడి మీదికి సాయుధంగానే తిరుగబడ్డది. ఆ సాయుధ విప్లవాగ్ని యివ్వాళ దేశం నలు మూలలా వ్యాపించింది. హింసకు ప్రతిహింస అనివార్యం. అనివార్యమైన ఈ రక్తపాతం మానవతా దృక్పథము యొక్క అత్యున్నతరూపం.

విప్లవ రచయితలు దీన్ని గానం చేయడం ప్రజల్లోకి తీసుకపోవడం కుట్రకాదు.

విప్లవ కారులను విప్లవ రచయితలను జైల్లో పెట్టి వారిని ప్రజల్నుంచి దూరం చేయాలనుకోవడం వెర్రి. గాలిని, సముద్రాలను ఎవరూ గోడల్లో బంధించలేరు. ప్రజలు పాలకవర్గపు ఈ నిర్బంధాల కుట్రను తెలుసుకోలేరను కోవడం అవివేకం. ప్రజలే వీరిని విడిపించుకుంటారు.

తన చుట్టూ నిలబెట్టుకున్న పోలీసు మిల్ట్రీ ముళ్ళకంచె ఆకాశవాణి వంది మాగధ కవులూ పత్రికలూ జ్ఞానపీఠాలూ రకరకాల దేవుళ్ళు, విదేశీ ఒప్పందాలూ యివేవీ ఈ ప్రభుత్వాన్ని రక్షించలేవు. ఏ పోలీసులు తమకు యీనాడు రక్షణగా వున్నారో ఆ పోలీసులే యీ పాలకులకు ఎదురుతిరిగే రోజులు ఎంతో దూరంలో లేవు.

ఇవాళ జైళ్ళు మండుతున్నాయి. ప్రజల కనుల్లో ఎరుపు మెరుస్తున్నది. ఈ వ్యవస్థ పునాదులు కదులుతున్నవి.

(జూన్ 74, సంచిక 57)

# శ్రీకాకుళ జాతర
# X
# ప్రపంచ తెలుగు మేళా

పోదాం పదే జాతర - శ్రీకాకుళ యాతర
అదేం జాతరమ్మో - పేదోల్ల జాతరమ్మో

పేదోళ్ళంతా కర్రా, కత్తీ, తట్టా, బుట్టా, సుత్తీ, కొడవలి పట్టుకొని శ్రీకాకుళ మార్గం పడితే, పెద్దోళ్ళంతా ఏంకావాలి? బెగ్గంపాడై భాగ్యనగరం చేరుకోవాలి. తమ ఆస్తుల్ని కాపాడుకోడానికి పోలీసు, మిలిటరీ క్యాంపులను పెట్టి తమ అధికారాన్ని అసెంబ్లీలో చట్టబద్ధం చేసుకోవాలి. భూమినంతా హిరణ్యాక్షులై చాపచుట్టగా చుట్టుకొని చంకలో పెట్టుకొని ప్రజలకు సంస్కరణలు పంచుతామని ఇక్కడి నుండి ప్రకటించాలి. ఈ పెద్దోళ్ళ కోసం వీళ్ళ ముద్దుబిడ్డ వెంగళ్రావు యీ 'రాజ'ధానిలో ఒక జాతర ఏర్పాటు చేస్తున్నాడు- అదే ప్రపంచ తెలుగు మహాసభ. ఇది అలగాజనం కోసం, జానపదులకోసం కాదు గనక దీన్ని జాతర అనరు. "తెలుగు జాతి భావ సమైక్యతా మహోత్సవం".

శ్రీకాకుళం జాతర....... "పేదోళ్ళనే కాదు మేధావులను పీడితులనే కాదు పీడితవర్గ పక్షపాతం కలవాళ్లను, ఈ దేశంలో ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక దోపిడీకి గురియవుతున్న అన్ని వర్గాలనూ ఆకర్షించింది. శ్రీకాకుళం ప్రజల పోరాటాన్నే కాదు, ప్రజల పోరాట సంస్కృతిని రచించింది. శ్రామికవర్గ పోరాటం తన చరిత్రను, భాషను, సంస్కృతిని, సాహిత్యాన్ని, కళలను తాను సృష్టించుకుంటుంది. గతంలోని పోరాట సాంప్రదాయాల్ని జీర్ణించుకొని, వర్తమాన పోరాట చరిత్రను రచిస్తూ, భవిష్యత్తులో తన వికాసమే జాతుల వికాసంగా పురోగమిస్తుంది.

ఎవరు తెలుగు ప్రజలు? పల్లకి ఎక్కిన ప్రభువులా? అది మోసిన బోయీలా? ఎక్కడుంది తెలుగు సంస్కృతి? రవీంద్ర భారతిలోనా? రవీంద్ర భారతి నిర్మాణంలో రాళ్లెత్తిన కూలీల చెమటలో కరిగిపోయిన నెత్తుటి ఆకాంక్షల్లోనా? తెలుగు చరిత్ర విభాత సంధ్యల్లో సామాన్యుని జీవన మెట్టిది? శ్రీకాకుళంలో విల్లు సారించిన గిరిజన సత్యం నిర్మించింది చరిత్ర? వందలాది పోరాట యోధుల్ని పొట్టనపెట్టుకున్న వెంగళ్రావు చట్టబద్ధ దుర్మార్గం చరిత్ర?

"నైజాం సర్కారోడికి గోరీకట్టి". "రంగు రంగులమారి నెహ్రూనయ్యా రంగు బహిరంగం చేసిన" వేలాది తెలంగాణా మృతవీరుల రక్తంలో ప్రభవించిన అసంఖ్యాక అజ్ఞాత కవుల పోరాట గీతాల్ని, కళారూపాల్ని ప్రజలు స్వీకరిస్తారా? విద్రోహ

రివిజనిస్టు నాయకత్వ శాంతియుత పరివర్తనా లేఖ్యం కళల్ని స్వీకరిస్తారా? నిర్మలను చంపి స్త్రీల హక్కుల గురించి మాట్లాడేవాడు, పాణిగ్రాహిని, చినబాబును చంపి కవులను, కళాకారులను సన్మానించేవాడు, పంచాదిని, బత్తులను చంపి మేధావులకు ఆ నెత్తుటి చేతులతోనే నమస్కరించేవాడు, ప్రజల పోరాట చరిత్రకడ్డంగా దోపిడీ బలగాలను సమీకరిస్తున్నవాడు, భూస్వాముల, పెట్టుబడిదారుల బంటు- ఏర్పాటు చేసే ఉత్సవాలు ఎవరికోసం? తెలుగు ప్రజల చెంబూ, తపాల అమ్మించి ముక్కుపిండి వసూలుచేసిన లక్షలాది రూపాయలతో దోపిడీవర్గాల సమైక్యతా ఉత్సవాలు చేస్తున్నాడు. ఆ వర్గం కొమ్ముకాసే వాళ్లు, ఆ మోచేతి గంజినీళ్లు తాగేవాళ్లు, అది వేసే ఎంగిలి బొక్కం కెగబడేవాళ్ళు అటు పోనీ గాక? తెలుగు జాతి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కోరేవాళ్లు మాత్రం నూతన ప్రజాతంత్ర విప్లవ జెండా కింద సమైక్యమై తీరుతారు.

(ఏప్రిల్ 1975, సంచిక 67)

## 'పసివాడు'

చార్లీచాప్లిన్ చనిపోయాడు. మూకీల నుండి టాకీలదాకా మూగ భావాలకు సంచలనం నేర్పిన చార్లీ. కన్నీళ్ళకు గలగల నవ్వడం నేర్పిన చాప్లిన్ - కడుపులో విషాద సముద్రాల బడబాగ్నులు దాచుకొని నడకలో నవ్వుల కెరటాలను సృష్టించిన- 'సినీరంగంలోని జీనియస్' చనిపోయాడు. జీవితానికి కరుణా హాస్యమూ బొమ్మా బొరుసని- ఏడుపూ నవ్వూ చీకటి వెలుగులని బొమ్మకట్టి చూపిన తాత్వికుడు. గొంతు దాకా నీళ్ళలో మునిగిన తామర తనపై నీటిచుక్కను ముత్యంలా మెరపించినట్లుగా కంట్లో కన్నీరు దాచుకుని హాస్యాన్ని కురిపించి కష్టాలను మరిపించిన మానవతావాది మరణించాడు. తన జీవితంలోని చేదు అనుభవాలు, ద్వేషం. అనాదరణ, క్రౌర్యం. దారిద్ర్యం- వీటితో పెనుగులాడి, పోరాడి ఏడవలేక నవ్విననవ్వడు అతనిలో పుట్టిన కళాకారుడు ఈ అన్నింటినీ జయించాడు. అందుకే దారిద్ర్యం, అసమానత, పీడన, క్రౌర్యం లేని సమాజంకోసం కలలుకని కళలుకని దేశం నుంచి దేశానికి తరుమబడి దేశదేశాల్లో స్వేచ్ఛకోరే జనం హృదయాల్లో స్థిరపడ్డాడు చిరస్థాయిగా.

అవును నిజం- యుద్ధాలు లేకుండా చేయడానికి యుద్ధంలోకి దిగింది అమెరికా; రూజ్వెల్టు మాటలు కాసేపటికి రుజువయినవే ననుకుందే. హిట్లర్ ఫాసిజాన్ని భంగపరచిన కమ్యూనిజంతో కాసేపటికి చేతులు కలిపింది. (గుండెల్లో 'కమ్యూనిస్టు భూతం' అప్పటికే గుబులుకొలుపుతూనే వున్నది) అక్కడ తీసాడు చాప్లిన్ 'గ్రేట్

డిక్టేటర్'- హిట్లర్‌ను వెక్కిరిస్తూ నాజీజాన్ని నిరసిస్తూ. ఆ 'స్వేచ్ఛాప్రియ' అమెరికా ఖండం 'కమ్యూనిస్టు గత్తర' తగిలిన కళాకారుణ్ణి దేశం నుంచి బహిష్కరించింది.

చాప్లిన్ కళాకారుడు- అక్షరాలా. 'దికిడ్' అనే చిత్రంలో ఒక అనాథబాలుణ్ణి పెంచుకుంటాడు. తనకే ఒక ఆశ్రయంలేదు. ఆధారం లేదు. ఆ బిడ్డనెట్లా పోషిస్తాడు: పడరానిపాట్లు పడతాడు. ఒక ఆలోచన తడుతుంది- తాను అద్దాలు పగిలిపోయిన కిటికీలను బాగుచేసే వృత్తి స్వీకరిస్తాడు. అద్దాలు ఎవరు పగలగొట్టాలి- ఆ పిల్లవాడు. ముందువాడు సందు తిరిగితే తాను. ఇద్దరినీ పసిగట్టి పోలీసువాడు. చాప్లిన్ అవస్థచూసి తీరవలసిందే.

మన ఆలోచనల కిటికీలను బాగుచేయాలని ప్రయత్నిస్తున్న కళాకారులను ఈ పోలీసు వ్యవస్థ ఒక కంటకాదు వెయ్యికళ్ళతో కనిపెడుతున్నది.

ఆకలి క్రూరమైంది. ఆకలిని జయించడానికి ఆదిమ మానవునినుంచి అణుమానవునిదాకా సాగివచ్చిన పోరాటప్రయాణాన్ని నాగరికత అని పిలుస్తున్నాం. ఈ నాగరికత పరిణామంలో దోపిడీ స్వభావం ఒక్కటే అనాగరిక అవశేషం. నిత్యమూ జీవించడానికి మనిషిచేసే పోరాటం నిజంగా ఎంత సజీవమైన కళ. చచ్చిన చాప్లిన్‌కు 'సర్' బిరుద మొక్కటే మచ్చ. మన మధ్యకళాకారుడుగా బతుకుతున్న చాప్లిన్‌కు బిరుదులూలేవు. చావూ లేదు.

(జనవరి '78, సంచిక 75)

## 'డిస్టర్బ్‌డ్ !'

ఏలినవారు ఎందుకు డిస్టర్బ్‌డ్‌గా వున్నారు?

ఏలినవారికి ఏడుగడగావున్న దొరలదోపిడీ ప్రశాంతత భగ్నమయిందట. తట్టలుమోసిన, కట్టెలుకొట్టిన, బట్టలుఉతికిన, బాసన్‌లు కడిగిన, బంగ్లాలుఊడ్చిన దున్నిన, నాటిన, కోసిన, నూరిన జీతగాడు బతుకుకు సరిపోయే మెతుకుపెట్టమన్నాడట. బరువుబతుకు, బాన్చెనుబతుకు కాకుండా మంచిబతుకుకోసం బరితెగించి నిలిచాడట. ఎన్నాళ్ళుగానో వంగిపోయిన వెన్నుసవరించుకొని వెట్టివాడు నిటారుగా నిలుచున్నాడట. ఇంకెంతోకాలం తమమానాలు 'పత్తి బంగారం'లా దొరలకు, దొరలగుండాలకు అర్పణం చేయడానికి అంగీకరించేది లేదని కనకవ్వలు, బానవ్వలు, రాజవ్వలు కంఠంలో కొనఊపిరిదాకా పోరాడడానికి, కళ్ళల్లో కొసవెలుగులదాకా పెనుగులాడడానికి కాసెబిగించారట. దొర చెప్పుకింద ముల్లు, గడీ గోడనీడన గుడిసె, కాళ్ళకింద ఇసుకను తొలిచే నీళ్ళలా, తరుముకొనివచ్చే మంటలా ప్రశ్నించాయట.

'కాళ్ళకింది దుమ్ము కళ్ళల్లో పడ్డట్లయింది'ట.

దొరల దోపిడీ ప్రశాంతత భగ్నమయిందట. దొరల ఎన్నికైన బంటు ఏలిన వారు ఏకాఏకిన 'కల్లోలిత ప్రాంతాలు'గా జగిత్యాల, సిరిసిల్లాలను ప్రకటించారట.

చినమెట్‌పల్లిలో మాదిగగూడెంలో జనం 'ఏంబతుకులు మనయిరో యములా రాజ్యమ్ములో' అని పాడితే యమధర్మరాజు తుపాకికాల్చక ఏంచేస్తాడు! లొత్తునూరులో రావనికి పోవనికి నుంకరోడు రాక, ఎంగిలి విస్తరి ఎత్తేయడానికి చాకలోడు రాక సాంఘిక బహిష్కరణచేస్తే, నీరేటికాడు తనచేతిలోని కట్టె తన వెన్నుమీదనే విరగడానికి అంగీకరించక పెనుగులాడితే అమీన్‌సాబ్ 'ఫైర్' అనక మరేంచేయగలడు! ఇతరుల ఎంగిలివిస్తళ్ళు తీసేవృత్తి చాకలివాళ్ళదని, తీయకపోతే తుపాకితోకాల్చేవృత్తి పోలీసులదని మనుధర్మశాస్త్రం, మనధర్మశాస్త్రం చెప్పడంలేదా? కుదురుపాకలో ఏడుగురు అక్కచెల్లెళ్లు 'మానసంరక్షక' సంఘం పెట్టుకుంటే ఏడుగురు దొరగుండాలు ఎత్తుక పోయైనా ఒకఅక్కను రాజక్కను చెరచక ఏంచేస్తారు! గుమ్మలాపురంలో గుమ్మలు తమమగవాళ్ళను ఎందుకు అరెస్టుచేస్తారని అడిగితే తలలుబాదుతూ లాఠీచార్జ్ చేయక పోలీసులు చెప్పగల జవాబేమున్నది! అణచివేత అతిసహజమైన ధర్మంగా హక్కుగాకాక అసహజమైన అధర్మంగా గుర్తించే చైతన్యం జనంపొందడమంటే అది కల్లోలంకాక మరేమిటి! న్యాయమైన హక్కులకోసం తిరుగుబాటు చేయడం తమ జన్మహక్కని జనం గుర్తించడం కల్లోలంకాక మరేమిటి! ధిక్కారాన్ని సహించడమే దొరపని అయితే ఇంక దొరయేంది, దొరపెత్తనమేంది!

(డిసెంబర్ '78, సంచిక 86)

గెస్ట్ ఎడిటోరియల్ :

# సాహిత్యం మీద ప్రభుత్వం దాడి

కొడవటిగంటి కుటుంబరావు

ప్రజాతంత్రంలో భావ ప్రకటనా స్వాతంత్ర్యం విధిగా ఉంటుందని సిద్ధాంతం. కమ్యూనిస్టు దేశాలలో భావ స్వాతంత్ర్యం ఉండదనీ, అందుచేత కమ్యూనిజంకన్న ప్రజాతంత్రం గొప్పదనీ వాదం. ఈ సిద్ధాంతాన్నీ, వాదాన్నీ పదేపదే స్మరణ చేసే వాళ్లు ఒకటి గమనించరు. అల్పసంఖ్యాక వర్గం అధిక సంఖ్యాకులను పాలించేటప్పుడు భావ ప్రకటనా స్వాతంత్ర్యం లేకపోతే సాంఘిక పరిణామం స్తంభించి పోతుంది. కమ్యూనిజం అవలంబించిన దేశాలలో ప్రజలే పాలకవర్గం అయినప్పుడు భావ ప్రకటనా స్వాతంత్ర్యం పేరిట అల్పసంఖ్యగల వాళ్ళు సమాజ వికాసానికి అడ్డుపుల్లలు వేస్తారు.

ఇంతకన్న ముఖ్యమైనదేమంటే అసమ సమాజంలో ప్రజాతంత్రం ఉండదు. అది బూటకపు మాట. ప్రజాతంత్రం అమలు జరిగినట్టయితే మనదేశంలో ప్రజలు ఇంత అధోగతిలో ఉండరు. వారిపైన పోలీసులు ఇంతగా విలయతాండవం చెయ్యరు. "మేము మీకు సోషలిజం తెచ్చిఇస్తాము" అని ఎలక్షన్ల సంరంభంలో పాలకవర్గీయులు ప్రజలకు చెప్పరు. సోషలిజం, విప్లవంలాగే, ఎక్కడినుంచో దిగుమతిచేసేదీ, ఒకరు ఇచ్చేదీకాదు; ప్రజలే దాన్ని పోరాడి తెచ్చుకుంటారు. ప్రజలలో చైతన్యాన్ని పెంపొందించే వారే సోషలిజంకు దోహదం చెయ్యగలరు. విప్లవం లేకుండా సోషలిస్టు వ్యవస్థ ఏర్పడదు, ఎక్కడా ఏర్పడలేదు- కొంతమంది కుత్సితపు బుర్రల్లో తప్ప, ప్రజల ప్రమేయం లేకుండానూ, శాంతియుతంగానూ సోషలిస్టు వ్యవస్థ ఏర్పరుస్తామని వాగ్దానాలు చెయ్యటంకన్న ప్రజాద్రోహం మరొకటిలేదు,

ఈ సంగతి సామాన్య ప్రజలందరికీ తెలుసునా ? తెలుసునని నాకు అనుకోవాలనే ఉంది. కాని అది ఆత్మవంచన అవుతుందని భయపడుతున్నాను. ఇందిరా కాంగ్రెసు అబద్ధాలాడిందని తెలిస్తే అంత భారీగా ఆ కాంగ్రెసుకు వోట్లు పడవు, అయినా ఎన్నికలలో వోటువెయ్యని సుమారు 46 శాతం వోటర్లకు రాజకీయ పరిజ్ఞానం ఉండవచ్చునని ఆశిస్తున్నాను.

విద్యార్థులలోనూ, యువకులలోనూ కూడా నాకు విశ్వాసం ఉన్నది. దానికి కారణం చెబుతాను, చాలా చోట్ల సాహిత్యసభలలో కవితాపఠనమూ, ఉపన్యాసాలూ జరిగినప్పుడు ప్రేక్షకశ్రోతలు విప్లవ కవిత్వాన్ని విప్లవభావాలనూ, హర్షించినట్టుగా వెనకపీకుడు కవిత్వాలను హర్షించలేదు. గాంధీతత్వం బోధించజూచిన కవులను "పాడు" నివ్వకుండా దింపెయ్యటం జరిగింది. ఇది ఒకచోటకాదు వందచోట్ల జరిగింది. జరుగుతున్నది.

ఇందుకేమిటి కారణం? ఈ విప్లవ సాహిత్యాన్నీ, విప్లవ భావాలనూ హర్షించే లక్షలాది యువకులూ, యువకులు కాని వాళ్ళూ, విద్యార్థులూ రాజకీయంగా మార్క్సిస్టు-లెనినిస్టులు కాకపోవచ్చు. కాని వాళ్ళు మానసికంగా విప్లవ సాహిత్యాన్నీ విప్లవ భావాలనూ స్వీకరించి, వాటిద్వారా చైతన్యం పొందటానికి సిద్ధంగా ఉన్నారు. అంతే కాదు, పాండురోగపు సాహిత్యం అవసరం లేరు. వ్యష్టిగా వాళ్ళు చెత్త సాహిత్యమే చదివినా, సమిష్టి మీద వాళ్ళకు కావలసినది విప్లవ సాహిత్యం. విప్లవ సాహిత్యాన్ని ప్రతిఘటించే వాళ్ళు అల్పసంఖ్యాకులు అత్యల్ప సంఖ్యాకులని కూడా చెప్పగలను. వారిలో పలాయన తత్వమో, స్వార్థమో, అసూయో, పచ్చి అజ్ఞానమో ఉన్నట్టు రుజువు చెయ్యటం కాదు. విప్లవ సాహిత్యం సృష్టించే వారికీ, ప్రచారం చేసేవారికీ ఇలాటి మానసిక వ్యాధులులేవు. ఉండే అవకాశం కూడా లేదు, నక్సలైట్లకు స్వార్థం అంట గట్టడం ఎంత అసమంజసమో, విప్లవ సాహితీపరులకు ulterior motives అంట గట్టటం కూడా అంత అసమంజసమే. అమాయిక మనస్తత్వంగల వాళ్ళు స్వార్థాన్ని సహించి అర్థం చేసుకున్నట్టుగా నిస్వార్థాన్ని అర్థం చేసుకోలేరు. ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వాలను ప్రతిపక్షాలు కూలదొయ్యటానికి అవాచ్యపు పనులెన్ని చేసినా అదంతా సబబుగానే కనపడుతుంది, బూర్జువా పరిపాలన అంతం కావాలనటం మటుకు రాజద్రోహం! ప్రజలే పాలకులు కావాలన్నది దేశద్రోహం.

ఇలాటి ఆరోపణలతో ఆంధ్రప్రభుత్వం విప్లవ సాహిత్యం మీద దాడి ప్రారంభించింది. దేశానికి సోషలిజం తెచ్చి, నిరుద్యోగాన్నీ, దారిద్ర్యాన్నీ, అసమానతలనూ తొలగిస్తామని వాగ్దానాలు చేసే పార్టీ పరిపాలించే చోట సోషలిజం కావాలనీ, దారిద్ర్యాన్నీ, జీవితం కుళ్ళునూ ప్రజలే తొలగించుకోవాలని హెచ్చరించే సాహిత్యం మీద ఏమొహం పెట్టుకుని దాడి సాగించింది? ఈ సాహిత్యాన్ని చూసి దేనికి గుండెదడ? విప్లవ రచయితల ఇళ్ళమీద అర్ధరాత్రి దాడులూ, సోదాలూ దేనికి? ఇటువంటి పనులు బ్రిటిషు పరిపాలనలో కొంత అర్థంఉన్నది. బ్రిటిషువాళ్ళు మనకు భావ స్వాతంత్ర్యమూ, సోషలిజమూ ఇస్తామని వాగ్దానాలు చెయ్యలేదు; మన ప్రజా తంత్రానికి కూడా పనికిరామని సర్టిఫికేటిచ్చారు!

విప్లవ సాహితీపరులను "నక్సలైట్లు" అని ఆంధ్ర ప్రభుత్వం అంటున్నది. సాహిత్యోద్యమానికీ రాజకీయోద్యమానికీ చుట్టరికం ఉంటుంది, కాని రెండూ ఒకటి కాదు. ఆంధ్ర ప్రభుత్వానికి రాజకీయోద్యమాలను గురించీ, సాహిత్యోద్యమాలను గురించీ కూడా తెలియదు లాగుంది. విప్లవ రచయితలు ఇతర సాహిత్యోద్యమాలకు

రాజకీయ విరుపులు ఎన్నడూ సహించరు, విరసం పుట్టే సమయంలోనే అభ్యుదయ సాహిత్యోద్యమం కొత్త మేకప్ చేసుకుని ముందుకు వచ్చింది. కాంగ్రెసు మంత్రులు దాన్ని ఆశీర్వదించారు గదా అని దాన్ని ఎవరూ కాంగ్రెసు సాహిత్యోద్యమం అనలేదు. అతకని పేర్లుపెట్టేవారు మూఢులను మోసపుచ్చవచ్చు. కాని తమ కుళ్ళుకంపు మాత్రమే బయటపెట్టుకుంటారు.

"ఝంఝ"లో సైన్యంలో చేరవద్దని హెచ్చరిక ఉన్నదని ఒక ఆక్షేపణ. రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతుండగా చార్లీచాప్లిన్ "గ్రేట్ డిక్టేటర్"లో సైనికులను యుద్ధం చెయ్యవద్దని హెచ్చరిస్తాడు. తీవ్రంగా యుద్ధం జరుగుతుండగా కూడా ఆ చిత్రం నడిచింది. దాన్ని ఎవరూ నిషేధించలేదు! సైన్యంలో చేరేవారిని వద్దని చెబుతూ కవిత్వంరాస్తే కూలిపోయే విషమ దశలో ఉన్నదా ఆంధ్ర ప్రభుత్వం. ఇలాటి చర్యలు చూస్తే ఈ దేశాన్ని ఏమతిమాలిన వాళ్ళు పరిపాలిస్తున్నారో అర్థంకాదు.

రచయితలూ, కవులూ అన్న తరవాత వాళ్ళు అంతో ఇంతో మేధావులుగానే ఉంటారు. ఎలెక్షను ప్రచారాల మీటింగుల్లో మాట్లాడేటప్పుడు రాజకీయ నాయకులు భాగవతార్ల శైలి అవలంబించటమే ప్రమాదకరంగా ఉన్న ఈ కాలంలో రచయితల పట్ల కాస్త గౌరవం ఉంచటం శ్రేయస్కరం. ప్రజాస్వామ్య రాజకీయ ఆదర్శాలను తోసిపుచ్చి, తమకు నచ్చని రచనలుచేసే మేధావులను దొంగల్లాగానూ, కేడీలలాగానూ చూడదలుచుకున్నప్పుడు ఈ రచయితల వెనక ప్రజలున్నారనీ. పాలకులకూ పాలితులకూ మధ్య ఉండే బంధంకన్నా చాలా దృఢమైన బంధం ప్రజా కవులకూ ప్రజలకూ మధ్య ఉన్నదనీ, తమ గుండెదడకు మూలకారణం ప్రధానంగా అదేననీ, ప్రజల మేలు తప్ప రచయితకు మరొక ఆశయం ఏమీలేదనీ గుర్తుంచుకోవటం మంచిది

ఫాసిస్టు పద్ధతులు అవలంబించదలచిన పాలకులు చరిత్రను సంహావలోకనం చేసుకోవటం మేలు. నిజాన్ని ఏనాడూ ఎవరూ అణచలేకపోయారు. సూర్యుడిచుట్టు భూమి తిరుగుతున్న దన్నందుకు ఆ మాట అన్నవాళ్ళను సజీవంగా తగల బెట్టిన వాళ్ళను చరిత్ర గాడిదలను చేసింది. జర్మను, ఇటలీ ఫాసిస్టులు సోదిలోకి లేకుండా పోయారు. అమెరికను ఫాసిస్టులు ఇండో చీనాలో ఉడ్డుగుడుచు కుంటున్నారు; అమెరికను మేధావుల చేతనే తిట్లుతింటున్నారు. ఫాసిస్టుతత్వంలో అంధత్వం ఉన్నది. అందుచేతనే ఫ్రెంచి వాళ్ళను చూసి అమెరికనులు గుణపాఠం నేర్చుకోలేకపోయారు. గాంధీ వారసులమని చెప్పుకునే వాళ్ళు ఫాసిస్టులకు వారసులు కావటానికి ఉబలాట పడటం చిత్రం!

ఈ దేశంలోని పాలకవర్గాల క్షేమంకోరవలసిన అవసరం లేకపోయినా వారిక్షేమం అవ్యాజంగా కోరి చెబుతున్నాను. మీరు నిత్యమూ వల్లించే ప్రజాస్వామ్యాన్ని చేత

లలో గౌరవించండి. తిరుగుబాటు చేస్తున్నవారు చావుకూ, బతుకుకూ మధ్య సరిహద్దు చెరిగిన వాళ్ళనీ, వాళ్ళు అవలంబించేది ప్రతిహింసేగాని హింసకాదనీ గుర్తించండి. మీకు నిజంగా అహింసలో విశ్వాసం ఉన్నట్టయితే జీవితంలో ఉన్నదారుణ హింసను గుర్తించి, దాన్ని తుపాకులతో కాపాడటం మానండి. విప్లవం అనే మాటను తేలు మంత్రంలాగా వాడకండి, మీరు నిజంగా విప్లవ పరిణామాలు తెచ్చే సద్బుద్ధి గల వారైతే విప్లవం కోసం సకల కష్టాలను ఎదుర్కొనే వారిమీద దాడులు మానండి. ప్రజాజీవితంలో విప్లవ చైతన్యం మందకొడిగా ఉండటాన్నీ, వారిలో రాజకీయ పరిజ్ఞానం హీనదశలో ఉండటాన్ని మీ స్వార్థానికి వినియోగించుకుని, ప్రజలను మభ్యపెట్టకండి.

ఇవేవీ మీరుచేయరు, మీకసలు విప్లవకరమైన కార్యక్రమం లేదు. ఆర్థికంగానూ, సామాజికంగానూ మనదేశం అపహాస్యం పాలుఅవుతుంటే మీకు పట్టలేదు. ఆసియా వాసులను ఆసియా వాసులచేత చంపించి డివిడెండ్లు సంపాదించే అమెరికా ఆశయానికి మీరు ఆలోచించిన విరుగుడు ఏమిటి? ఉన్న అక్షరాస్యులకే ఉద్యోగాలు లేకుండా ఉంటే, చదువుకునే వాళ్ళకు విద్యాసంస్థలలో సీట్లు లేకుండా ఉంటే, మీరు దేశంలో నిరక్షరత లేకుండా ఏం చెయ్యగలరు? మనదేశపు ఆస్పత్రిలలో చికిత్స కోసం చేరేవారిని అధికారులు అధమ తరగతి పౌరులకింద చూడకుండా మీరేం చెయ్యబోతున్నారు? (డబ్బున్న వాళ్ళు ప్రైవేటు నర్సింగ్ హోములకు పోయి వేలకు వేలు చెల్లిస్తారు.) రోజుకు రూపాయి సంపాదించలేని కోట్లాది జనం సమస్య మీరు ఏ విధంగా తీర్చబోతున్నారు? మీకు పనికి వచ్చే కార్యక్రమం ఏదీలేదు. మా విరసం రచయితలు ప్రజల తిరుగుబాటు మీద నమ్మకం పెట్టుకున్నారు. చాతనయితే దాన్ని అబద్ధం చెయ్యండి. దేశంలో విప్లవ పరిణామాలు రావటం మాకు ప్రధానం. అవి ఎవరు తెచ్చినా మేము ఆహ్వానిస్తాం. వాటిని ప్రజలే సాధించగలరని మా దృఢ విశ్వాసం. మీకు లేకపోవచ్చు, మాకు ప్రజలలో విశ్వాసం ఉన్నది. మీకు వాళ్ళ వోటులోనే విశ్వాసం ఉండిన పక్షంలో ఎప్పటికైనా దెబ్బతింటారు. మీ రాజకీయాలు ప్రస్తుతం ఫార్సు తప్ప మరేమీకాదు. రాజభరణాలు రద్దు చెయ్యటానికి మీకు ఒక్క వోటు తక్కువయింది? ఎవరికీ మెజారిటీ లేనిచోట నాలుగు సీట్లున్నవాళ్ళు గూడు పుఠాణీలో విజయం సాధించి ప్రభుత్వం ఏర్పాటు చేస్తున్నారు! ఇటువంటి రాజకీయాలను మేము ఆదరించలేం. ప్రజలను ఆదరించవద్దని హెచ్చరించే నైతికహక్కు మాకున్నది. మా అభిప్రాయాలు మీకు చేదుగా ఉంటే మమ్మల్ని "బయటి ప్రతిపక్షం"గా తీసుకోండి. ఏ ప్రతిపక్షం మీద దాడి చేసీ మీరు మీ రాజకీయ ఆదర్శాలను నిలబెట్టుకోలేరు. ఇది ముమ్మాటికి నిజం.

(ఏప్రిల్ 1971, సంచిక 19)

# జ్వాలారమణ రాజేశ్వరులు

రాచకొండ విశ్వనాధశాస్త్రి

.... .... .... ....

ఇతర దేశాల్లో ఏం చేస్తారో తెలియదు; కాని మన దేశంలో మాత్రం గోవుల్తో పాటు పాముల్ని కూడా పూజిస్తారు. వాటికీ వీటికీ ఓముఖ్యమైన తేడావుంది. వాటిని పూజించినా పూజించకపోయినా గోవులు పాలుఇస్తాయి; పూజించినా పూజించకపోయినా పాములు కాటు వేస్తాయి.

మనల్ని ప్రస్తుతం పాములే పరిపాలిస్తున్నాయని నేను తప్పక తెలుసుకున్నాను కాబట్టే స్పష్టంగా చెప్పగలుగుతున్నాను. అయితే తెలుసుకోవడం వేరు, చెప్పగలగడం వేరు. తెలిసినప్పటికీ కొందరు చెప్పరు. వాళ్ళు దొంగలు. తెలిసినప్పటికీ కొందరు చెప్పజాలరు. వాళ్ళు పిల్లిముందు ఎలుకలు, పాముముందు కప్పలు. జ్వాలారమణ రాజేశ్వరులు ఈ కోవలకి చెందినవాళ్ళు కారు.

గోవులకీ జ్వాలారమణ రాజేశ్వరులకీ పోలికలున్నాయి.

భగవంతుడు గోవులకు కొమ్ములిచ్చినట్టే రచయితలకి కలాలిచ్చేడు. పాలే కాకుండా పచ్చినెత్తురు కూడా పిండేసే రాక్షసుల మీదికి ఆవు తన కొమ్ములు విసిరితే, తాదుల్లాంటి వాళ్ళుతప్ప మరెవరూ తప్పుపట్టరు. అదే పరిస్థితుల్లో నిజమైన నిజాయితీ గల రచయితలు తమ కలాల్ని సూదిశూలాల్లా, వాడికత్తుల్లా బలంగా విసురుతారు. ఆవు కొమ్ము విసిరితే ఆక్షేపించే వాళ్ళే అప్పుడు ఆ రచయితల్ని జెయిళ్ళకి నెడతారు.

అయితే- నువ్వు నాలుగ్గోవుల్ని కొట్టగలవు. నలుగురు రచయితల్ని నెట్టగలవు కాకపోతే ఓ వందమందిని, ఓ వెయ్యిమందిని, లేపోతే, ఇంకా చాలా మందిని. కాని, నువ్వేం చేసినప్పటికీ, ఎంత చేసినప్పటికీ నీకోటగోడల్నీ, నీధ్వజ స్తంభాలనీ ఎంతోకాలం కాయలేవు. ఆగోడలు కూలకాపోవు. ఆస్తంభాలు పగలకా తప్పవు.

ఆరంభం అయినది ఆఖరవక తప్పదంటారు. ఎవరో ఎక్కడో ఏహింసో ఆరంభించేరని నువ్వెంతసాకు చెప్పినప్పటికీ, ఈ గోవుల్ని మాత్రం జెయిలు హింసలకి నువ్వే నెట్టేవన్నది మా అందరికీ చాలా స్పష్టమయింది. హింస నీదయినప్పుడు ప్రతిహింస వుండక తప్పదని నీకు తెలిసేవుంటుంది. అందుచేత- నువ్వారంభించిన హింస నీ హింసతోనే ఆఖరవాలి తప్పమరోలా అవదని అందరికీ ఎంతో స్పష్టమయింది.

మరేంభయంలేదు.

.... .... .... ....

(సెప్టెంబర్ 1971, సంచిక 24)

అలలు ....

కవిత్వం పత్రిక అనుకునేంత విరివిగా సృజనలో కవితలు ప్రచురించబడ్డాయి. దాదాపు మూడువందల మంది కవులు ఏడు వందల కవితలదాకా యిప్పటికి రాశారు.

సృజన కవిత్వంలో ఓ కుదుపు తన మొట్టమొదటి కవితతో జి. యం. చంద్రం. అప్పటి కింకా పదహారు సంవత్సరాల కుర్రవాడు యిచ్చాడు. సృజన అప్పుడప్పుడూ కొనసాగించిన కవర్ కవిత సంప్రదాయం కూడా దానితోనే మొదలయింది. అప్పటి నుంచీ సృజన కవితలది 'రక్తచలన సంగీత శ్రుతి'యే. దానినే మరింత స్పష్టంగా బలంగా వర్గ చైతన్యంతో వర్గ పోరాట నేపథ్యంతో 'ట్రిగర్ మీద వేళ్ళతో' వినిపించిన అగ్నినేత్రం లోచన్.

తిరుగబడు, మార్చ్‌లు తెచ్చిన కవితా సంచలనానికి కారకులైన కవులలో చాలా మంది సృజన వేదిక నుంచి వచ్చిన వారే.

విప్లవ రచయితల సంఘ మేర్పడి, ఏర్పడిన అక్టోబర్ '70లోనే వెలువడిన 'ఝంఝ' కవితా సంకలనంలో శివుడు రాసిన 'నరుదోభాస్కరుడా' పాట జానపద బాణీలను విప్లవ సాంస్కృతిక అవసరాలకు వినియోగ పెట్టుకున్న తెలంగాణ రైతాంగ పోరాట వారసత్వాన్ని సాహిత్యాని కందించింది.

'జానపద సాహిత్యాన్ని వర్గ దృక్పథంతో సరికొత్తరీతుల్లో రూపొందించడం జానపద కళా రీతులైన బుర్ర కథలు, జముకుల కథలు, గొల్ల సుద్దులు మున్నగు వాటిని ప్రోత్సహించడం' విరసం తన కార్యక్షేత్రంలో భాగంగా ఏర్పడిన 1970లోనే నిర్వచించుకున్నది.

ఆ చారిత్రక దశలో మాసపత్రికగా మారిన సృజన తొలి సంచిక లోనే, తొలి సంచికతోనే ఆధునిక సాహిత్య వేదిక మీదికి 'కొక్కొరోకో' (రెంజిమ్) అని పాట మెడ రిక్కించి గొంతు విచ్చి వచ్చేసింది; 'కొలిమంటుకున్నాది.'

సృజనలో అత్యధిక సంఖ్యలో కవితలు రాసిన కవి చెరబండరాజు. అప్పటికే దిగంబర కవిగా ప్రముఖుడైన చెరబండరాజును సృజన తెలుగు కవితా పాఠకులకు మరింత దగ్గరకు తెచ్చింది. సృజనలో ప్రచురితమైన చెరబండరాజు కవితల సంఖ్య 28.

నోటి పాటల మేటి గద్దర్‌ను యిటీవల 'జననాట్యమండలి పాటలు' వెలువడే దాక అచ్చులో అశేష జనాని కందించింది సృజన, సృజన ప్రచురణలే.

అశోక్, అల్లం వీరయ్య, అల్లం నారాయణ, అజ్ఞాత సూరీడు, ఎన్.కె. ఎక్స్‌రే, ఐ (తిరుగబడు- నవంబర్ 68, సృజన 9) జనసేన (మనోశ్చే- డిసెంబర్

'71 - సంచిక 27) కిషన్, నారా, రుద్రజ్వాల వంటి కవులను పరిచయం చేసింది సృజనయే.

'జనం ఊపిరితో' విప్లవ గీతాలాపన చేసిన 'గెరిల్లా' కవి శివసాగర్ విప్లవ సాంస్కృతికోద్యమానికి సృజన కానుక.

వేగుంట మోహన్ ప్రసాద్‌ను తెలుగు కవితా పాఠకులకు పరిచయం చేసింది సృజనయే.

కళాశాల విద్యార్థులకు స్వచ్ఛంద కవితా పోటీ నిర్వహించి సృజన ఎన్నిక చేసిన కవుల్లో ప్రథమ ద్వితీయులుగా నిలిచిన అమ్మంగి వేణుగోపాల్, ఎన్. గోపి (ఫిబ్రవరి '68 - సంచిక 6) తర్వాత కాలంలో లబ్ధ ప్రతిష్ఠులైనారు.

సృజన నవంబర్ 68 (సంచిక 9)తో ప్రారంభించిన సమకాలీన భారతీయ సాహిత్యాల్లోని యువతరం వాణిని పరిచయం చేయాలన్న ప్రయత్నం కూడ మాస పత్రికగా మారిన తర్వాతనే వేగం పుంజుకున్నది. (ఈనాడు హిందీలో విప్లవకవిత నిఖిలేశ్వర్, ఫిబ్రవరి 71, సంచిక 17) హిందీ, పంజాబీ (అమరజిత్ చందన్), బెంగాలీ (సరోజ్‌దత్తా) విప్లవకవులను తెలుగు పాఠకులకు పరిచయం చేయగలిగాం. అంతర్జాతీయ విప్లవోద్యమంలోని కవిత్వాన్ని, ముఖ్యంగా చైనానూతన ప్రజాస్వామిక విప్లవ కాలంనాటి కవిత్వాన్ని సృజన పరిచయం చేసింది. (విప్లవకవిగా మావో - చార్వాక, సెప్టెంబర్ 72 సంచిక 36, కె.వి. రమణారెడ్డి ఫిబ్రవరి 74, సంచిక 53)

సృజన ప్రారంభించిననాటి నుంచీ, మరీ ముఖ్యంగా మాసపత్రికగా మారి పాటలకు చోటు ఏర్పడిన కాలంనుంచీ దామాషా మీద రోజుకొక్క కవిత అయినా టపాలోరాని రోజు లేదు. ఈ లెక్కన వేనవేల కవితలు వచ్చాయి. ఈ అన్నింటినీ 'సాహితీమిత్రులు' చదివి చర్చించిఎన్నిక చేయడమో, నిరాకరించడమో జరుగుతుంది. తిప్పిపంపడానికి, ఫలితం తెలుసుకోవడానికి కవరో, కార్డో పెట్టినవాళ్ళు ఆలస్యంగా నయినాసరే 'సాహితీమిత్రుల' నుంచి నిర్మాణాత్మకమైన సూచనలే పొందుతున్నారని మాతోపాటు ఆయాకవులుకూడ అంగీకరిస్తారని అనుకుంటున్నాం.

సృజనలో కవిత్వం పేరుతో కొంత నినాదాలు వచ్చిన మాట నిజమేకావచ్చు కాని కవిత్వంగా రసాయనికంగా రూపాంతరం చెందిన (transform అయిన) (ని)నాదమయ కవిత్వమే ఎక్కువ.

సృజన కవిత్వాన్ని పడికట్టు ప్రమాణాలతో కాకుండా రక్తచలన ప్రేరణతో కొలిస్తే అది శ్రుతిచేస్తున్న సంగీతం చిరుగాలి సితారా సందేశం అనీ, అలలుగనే కలలని అర్థమవుతుంది.

# రక్తచలన సంగీత శ్రుతి

జి. ఎమ్. చంద్రం

నా నెత్తురు వాడికత్తి
నా బ్రతుకు కన్నీటి వొత్తి.

ఇన్నాళ్ళూ
కరువులోని అధిక మాసం
నా నివాసం.

ఇప్పటికీ
దుమ్ముకొట్టి, బూజుపట్టి
నెత్తురు గడ్డ కట్టిన లోకంలో
నా ప్రయాణం.

నిన్న
నా గౌరవం నలిగి
ఎద పలిగి
రక్తం!రక్తం! ముక్కలై పోయింది.

ఇవ్వాళ
సంధి వచనాలతో
శాంతి పచనాలతో
దొంగ ముసుగు కప్పుకొని
సంఘం నీడ
నామీద పరచుకొన్నది.

తిండీ, గుడ్డా, గూడూ
ఏది, ఎప్పుడు, ఎక్కడ?

సామ్యవాదం ఎన్నికల
పాసంగం కట్టిన తక్కెడ!
అడుగులో అట్టడుగులో
రుధిరపు మడుగులో
సామాన్యుని నినాదం.

నీతి ధర్మాల ప్రాణాలపై
దోమలు ముసిరి
విసురుకోలేనంత
అసహాయమై మూల్గుతోంది
సంఘం.

నాలోని వెలుగుతో
ఈ నీడ చెరపి
నా నెత్తుటి వాడితో
ఈ వ్రణము చీల్చి
రక్తచలన సంగీత శ్రుతి
రేపు వినిపిస్తాను.
నేను భవిష్యత్తు మనిషిని
రేపు కనిపిస్తాను.

(మే 1967, 3వ సంచిక)

# రైటర్ టు ఓటర్ కాదు

లోచన్

కోట్ల అస్థిపంజరాలమీద మస్తీగా కొందరు
రక్తపు గిలాస లెగరేస్తూ
ఆకలి సముద్రంలో మమ్మల్ని తన్నేస్తూ-
ఆకాశానికెత్తిన పెట్టుబడి- వేయి పడగలు
మా బతుకుల్లో విషం కక్కుతూంటే
మూడు కోతులూ బోడినప్పలూ జాతిని నిర్వీర్యంచేసేస్తే
ఇంకా వ్యక్తి స్వేచ్ఛ అనే వెర్రి భ్రమలో
వర్గ సామరస్యం పన్నిన వలలో
గిలగిలా తన్నుకోలేను
భాక్రానంగల్లూ నాగార్జున సాగర్‌లూ
'గాహ్పోళ్ల' షవర్ బాత్‌రూముల్లో ఊడిగాలు చేస్తోంటే
ఈ జాతీయ వంచకుల బద్మాష్ డ్రామాలో
ఫూల్‌గా నటించలేను
ఈ కొండమంగలి వెధవలచేతుల్లో నిస్సహాయంగా
తల ఉంచలేను
ఇరవై మూడేళ్ల భయానక చరిత్ర రాష్‌డ్రైవింగ్‌లో
జాతి మెదడుకి
ఎన్నెన్ని లోతైన సెప్టిక్ గాయాలు
దారిపొడుగునా ఎన్నెన్ని దారుణ దృశ్యాలు
నా చెల్లెళ్ళ దేహాలనిండా పిచ్చికుక్కల కాట్లు
నా పిల్లల అమాయకపు చూపుల్లో కత్తిపోట్లు
ఉఫ్‌! భరించలేను
గుండెలో మంట
నరాల తెగింపు

ఇవాళ నాకసి వెలిగించిన నెత్తురుమంటల్లో నిలబడి
చెపుతున్నా
మెలితిరిగే కడుపులో ఆకలిమాట అంటున్నా
రైట్ టు ఓట్ కాదు
ఈ దోపిడీ రేచుకుక్కల్ని తరిమి తరిమి
ఫైట్ టు ది లాస్ట్

(ఆగస్ట్ 1970, 16వ సంచిక)

## కొలిమంటుకున్నాది

చెరబండరాజు

కొలిమంటు కున్నాది
తిత్తి నిండా గాలి
పొత్తంగ ఉన్నాది
నిప్పారి పోనీకు- రామన్నా
పొద్దెక్కి- పోనీకు- లేవన్నా

నీపక్క- పొలమోడు
దుక్కి- సాగిండన్న
కాళ్లాపి కూకోకు- రామన్నా
కార్తె పోతేరాదు- యినుమన్నా

ఎరువు కావాలింక
గుడిసేసు కోవాలి
నీబండి పట్టాలు- రామన్నా
కొత్తయే కావాలి- యినుమన్నా

ఉత్తరానురిమింది
రోజు మొగులవుతూంది
ఎఱ్ఱి మెరుపూసూడు- రామన్నా
కరుఱ్ఱి పారాసాన- పెట్టన్నా

కంచాన గంజికీ
గద్దలూ కాకులూ
వడిసేల పేనుకో- రామన్నా
వడి వడిగ రాళ్లేసి- కొట్టన్నా

ఇనుప ముక్కలు కొడుకు
ఉండి ఫలమేముంది
పగటి నిదర్లుమాని- రామన్నా
పనిముట్లు చేసుకో- వేలన్నా

ఓటు కెదిగిన బిడ్డ
పెళ్ళి లేకున్నాది
కూలా నాలొచేసి- రామన్నా
కూడబెట్టిందేమి- లేదన్నా

చట్టాలు అన్నారు
పట్టాలు అన్నారు
పొలములో కాలెడితె- రామన్నా
పోలీసు లొచ్చేరు - ఏలన్నా

కౌలుకిచ్చీనోడు
కన్నెర్రి సేసేడు
అప్పులిచ్చీనోడు
అలిసే సూసేడు

దయగల్ల సర్కారు
దాదాలె అయ్యేరు
నీదారి గోదారి- రామన్నా
కానీక కదనాన - నిలువన్నా

కొలిమంటు కున్నాది
తిత్తి నిండా గాలి
పొత్తంగ ఉన్నాది
నిప్పారి పోనీకు- రామన్నా
సందాల కానీకు- లేవన్నా
కర్రు పారా సాన- బెట్టన్నా
బతుకు యుద్ధములోన- నిలవన్నా

(ఏప్రిల్ 1971 19వ సంచిక)

## వివాలా! శాంటియాగొ! (Vivala! Santiago)

శివసాగర్

శాంటియాగొ! శాంటియాగొ!
నీ గుండెలపై షెర్మన్ టాంకులు
నలుదిక్కుల నుండి నిన్ను గురిచూసి
కాలుస్తోన్న మెషీన్‌గన్లు, బజూకాలు
నీ శిరస్సుపై హాకర్, హంటర్ జెట్ విమానాలు
నీ అణువణువు నుండి రక్తప్రవాహాలు!
నీ విశాల నేత్రాల నుండి జాలువారే కన్నీటి ధారలు!
నీ సరిహద్దుకు సీళ్ళు
రాత్రింబవళ్ళు కర్ఫ్యూలు, కాల్పులు
స్టీమ్‌షిప్ లిబూలో చిత్రహింసలు

హార్బర్ లో ఆరిపోయిన దీపాలు
ఖనానాలు, కళేబరాలు, కారాగారాలు
శవపేటికలు, "ఊచకోత ఉత్సవాలు"!
ఉరికంబాలకు వేలాడుతోన్న
శిరస్సుల తోరణాలు!
నీ దేహమంతా పాముల్లా పాకుతున్న
షాక్ టూర్పర్లు!
గుండెలవిసిపోయే కొన్నెత్తుటి దృశ్యాలు!
కనుమూసిన కాగడాల కన్నీటి భాష్యాలు!

2

శాంటియాగో! శాంటియాగో!
ఏ విద్రోహం నిన్ను వెన్నుపోటు పొడిచింది?
ఏ విద్రోహం నిన్ను శత్రువుముందు నిరాయుధంగా నిలిపింది?
ఏ విద్రోహం నీకు ప్రజాసైన్యం లేకుండా చేసింది?
ఏ విద్రోహం తుపాకి గొట్టంద్వారానే రాజ్యాధికారం
సిద్ధిస్తుందనే సత్యాన్ని నీ నుండి దాచింది?
బాలెట్ బాక్స్‌పై మమకారాన్ని రేపింది?
ఏ విద్రోహం నీ నుదుటిపై 'జకార్తా! జకార్తా!' అని
క్రూరంగా రాసింది?

3

శాంటియాగో! శాంటియాగో!
చూశావా?
నీ చుట్టూ మండుతోన్న చీకటి మంటల నాల్కలకోసం
జ్వలిస్తోన్న పారిస్ కమ్యూన్ అనుభవాలు!
విన్నావా?
లామొనిడా ప్రాసాద ధ్వంసంలో

వినిపిస్తోన్న కామ్రేడ్ లెనిన్ హెచ్చరికలు!
హెలికాప్టర్ల ఫైరింగ్‌లో, జెట్ విమానాల జామ్మింగ్‌లో
ధ్వనిస్తోన్న మార్క్సిస్ట్ చారిత్రక సూత్రం
తుపాకి గొట్టం ద్వారానే రాజ్యాధికారం సిద్ధిస్తుందని
నీవు చిందిస్తోన్న ప్రతి రక్తపుబొట్టు పలుకుతున్న సత్యం!

**4**

శాంటియాగో! శాంటియాగో!
నిన్ను అలెండిజం
నిరాయుధం చేసింది
నిన్ను అలెండిజం
నిస్సహాయను చేసింది
నిన్ను అలెండిజం
వివస్త్రను చేసి ముష్కరుల ముందు నిలిపింది.
నిన్ను అలెండిజం
శతృవు ముందు బలిపశువుగా విసిరింది.

**5**

విలపించకు! శాంటియాగో!
విలపించకు!
నీ విశాల వినీల నేత్రాల నుండి
ఉప్పొంగే అశ్రువుల్ని చూడలేను
విలపించకు! శాంటియాగో!
విలపించకు!
నీ పెదాలపై నిశ్శబ్దంగా కదిలే
జకార్తా విలాపగీతాన్ని వినలేను
బాధా సముద్ర తరంగాల్లోని
నీ విషాదమూర్తిని ఊహించ సాహసించలేను.

## 6

శాంటియాగొ! శాంటియాగొ!
అలెండిజం హత్య చేయబడింది
అలెండిజం ఆత్మహత్య చేసుకుంది
మిత్రుడు ఫైడల్ కాస్ట్రో కానుకగా ఇచ్చిన
సబ్ మెషిన్‌గన్‌తో ఆత్మహత్య చేసుకొంటేనేం?
శత్రువు మెషిన్ పిస్టల్ కాల్పులకు...ఒకటి...
రెండు... మూడు... పదమూడు గాయాలతో
ఈడిగిల బడితేనేం!
నేడు అలెండిజం వినాదెల్‌మార్‌లో భూస్థాపితమయింది.
బూర్జువా ప్రజాస్వామ్య జాజ్ మ్యూజిక్‌కు
వూగివూగి నేడు అలెండిజం హీనంగా నేల కూలింది.
బ్యూనోస్ ఎయిర్స్ టాంగో క్లబ్బుల్లో
తాగితాగి అలెండిజం నేడు హీనంగా కుక్కచావు చచ్చింది.

## 7

శాంటియ గొ! శాంటియాగొ!
విలపించకు!
అలెండిజం మరణించింది
చిలీ ప్రజ బతికే వున్నారు
ఫ్యాక్టరీలు బతికున్నాయి
ఫ్యాక్టరీల్లో కార్మికులు బతికేవున్నారు
పంపాలు బతికున్నాయి
పంపాల్లో రైతులు బతికే వున్నారు
పసిఫిక్ మహాసముద్రం బతికుంది
మహా సముద్రంపై జాలర్లు బతికేవున్నారు
సూర్యుడూ, చంద్రుడూ బతికున్నారు

విప్లవకారులు బతికే వున్నారు.
అందరి గుండెల్లోనూ నీ రక్తంతో
మరింతగా ఎరుపెక్కిన ఎర్రజెండా
ఎగురుతోంది
అందరి గుండెల్లోనూ
ప్రతీకార క్రోధాగ్ని రగులుతోంది

8

శాంటియాగో! నీవు వొంటరిగా లేవు
నీవు దిక్కుమాలిన పక్షివి కావు
నీవు ప్రపంచ విప్లవ ప్రాంగణంలో వున్నావు
సోషలిజం తుది విజయం సాధించే శకంలో
నీవూనేనూకలిసి కష్టాలు కలబోసుకొంటున్నాం
అనుభవాలు వడపోసు కొంటున్నాం
మనందరం ఒకే స్వప్నం కంటున్నాం
మనందరం ఒకే పోరాటం చేస్తున్నాం.

9

శాంటియాగో! శాంటియాగో!
సజల నేత్రాలతోనైనా
నీ చుట్టూ వొక్కసారి చూడు
అనుభవాల కొలిమిలో రాటుదేలిన వీరులు
నీకోసం లోడెడ్ రైఫిళ్ళతో తిరగబడుతున్నారు
తిరగబడుతున్నారు పంపాల్లో రైతులు కొడవళ్ళతో
అనాకోవ్డా, కిన్నికోట్ రాగిగనుల్లో
కార్మికులు సమ్మెటలతో సంకెళ్ళు బద్దలుకొడుతున్నారు.
లాన్‌క్విమొలొ, సాన్ గ్రిగోరియోలో
రాంక్విల్‌లొ, అరికాలో, కొబిజాలో

పార్కుల్లో, మార్కెట్ స్థలాల్లో
పసిఫిక్ సముద్రతీరంలో, ఎడారి సరిహద్దుల్లో
ఆర్కిపిలాగోలో నీ పుత్రులు
బజూకాలు చేతపట్టి పోరాడుతున్నారు.
ఉప్పెనలా లేస్తున్నారు
"చరిత్ర పుటల్లో త్యాగం చేవ్రాళ్ళు పెడుతున్నారు."

## 10

శాంటియాగో ! విలపించకు !
చనిపోయిన వాళ్ళను నీకోసం మేల్కొలిపి
ఆయుధాలు చేతికిస్తున్నాను
నీకోసం సమరోత్సాహ జలప్రళయ గీతాన్ని
నా రైఫిల్‌తో రాస్తున్నాను.
ఒకనాడు పాబ్లోనేరూడా పలికించిన
ప్రభంజనానికి విప్లవ వారసునిగా
ప్రపంచ ప్రజాకోర్టులో నీ పేరిట డిమాండ్ చేస్తున్నాను :
"నేను ప్రతీకారం కోరుతున్నాను
నేను రక్తానికి రక్తం కోరుతున్నాను
నేను పంటికి పన్ను కంటికి కన్ను కోరుతున్నాను
శిక్షించండి! మిలిటరీ జంటా విషకోరలు పదును
పెడుతోన్న కోకాకోలా సామ్రాజ్యవాదుల్ని శిక్షించండి!
శిక్షించండి! రివిజనిజం మత్తుమందు టన్నులకొద్దీ
అన్ని తీరాలకు దిగుమతి చేస్తోన్న
వోడ్కా సామ్రాజ్యవాదుల్ని శిక్షించండి !
శిక్షించండి! లాటి ఫూండియాలను, దళారీలను
మిలిటరీ జంటాను శిక్షించండి !

# 11

శిక్షించండి: "బూర్జువా మార్క్సిస్టు"లను శిక్షించండి !"
ప్రపంచ ప్రజలారా! శాంటియాగో నెత్తురునేర్పిన
పాఠాలను ఎలుగెత్తి చాటండి!
ఆలెండిజం మరణించిందని, మార్క్సిజం జీవించిందని
ప్రపంచ ప్రజలారా! యుగధర్మాన్ని గొంతెత్తి నినదించండి!
దేశాలు స్వాతంత్ర్యం కోరుతున్నాయని
జాతులు విముక్తి కోరుతున్నాయని
ప్రజలు సాయుధ విప్లవం కోరుతున్నారని
నా దేశ ప్రజలారా! విప్లవ గీతాలాపన చేయండి!
చిలీ మార్గం ఓడిందని
నగ్జల్‌బరి మార్గం నిలిచిందని
సకల దేశ శ్రామికులారా!
క్షతగాత్రి శాంటియాగోకు జేజేలు పలకండి
సకల దేశ శ్రామికులారా!
సజలనేత్రి శాంటియాగోకు జేజేలు పలకండి
సకల దేశ శ్రామికులారా!
సమరశీలి శాంటియాగోకు జేజేలు పలకండి
వివాలా! శాంటియాగో! వివాలా! శాంటియాగో!
రేక్‌ఛియా! శాంటియాగో! రేక్‌ఛియా! శాంటియాగో!
లాంగ్‌లివ్! శాంటియాగో! లాంగ్‌లివ్!

(డిసెంబర్ 1973, 51వ సంచిక)

## ఎర్రజెండా

ఎస్.కె.

ఎర్రజెండేరోరన్నా ఎర్రజెండేరో
మన బతుకుబాటకు వెలుగుదారి ఎర్రజెండేరో
మన సమతకోసం పోరుబాట ఎర్రజెండేరో
ఎర్రజెండేరోరన్నా ఎర్రజెండేరో...

చిక్కులూ చీకాకులాతో చిక్కిపోకండి
చీకట్లను చీల్చు వెలుగుతొ పిడికిలెత్తండి
సమసమాజం వచ్చువరకు సమరమేనండి
బతుకుపోరున బంధాలు తెంచిపోరండి ... ॥ఎర్ర॥

రక్తంలో తడిసిన ఎర్రజెండే ఎర్రజెండగును
వర్గకసితో పోరుమనిషే ప్రజల మనిషగును
బతుకు తీపిని వొదిలి కదిలినవాడె భాస్కరుడు
త్యాగాలకు వెనుదీయనోడీతరం నాయకుడు ... ॥ఎర్ర॥

తుపాకి గొట్టంద్వారె మనకు రాజ్యమొచ్చండి
బందూకుపట్టి బంధనాలను తెంచుదామండి
తుపాకి దించినోడి మాటను తిప్పికొట్టండి
లాంగ్‌మార్చ్‌ను చేయువాడికె లాల్‌సలామండి

ఎర్రజెండేరోరన్నా ఎర్రజెండేరో
మన బతుకుబాటకు వెలుగుదారి ఎర్రజెండేరో
మన సమతకోసం పోరుబాట ఎర్రజెండేరో
ఎర్రజెండేరోరన్నా ఎర్రజెండేరో ... ॥ఎర్ర॥

(ఫిబ్రవరి 1974, 53 సంచిక)

# ఏటికి ఎదురీదు వాళ్ళమురా!

రెంజిమ్

మేరిమి కొండల్లో మెరిసింది మేఘము
ఉద్దమాల కొండల్లో ఉరిమింది మేఘము
కురువము కొండల్లో కురిసింది వర్షము
సంగమొలసా కొండల్లో సాగింది వర్షము
ఏరుమీద ఏరొచ్చెరా! ఓ! జాలరన్నా!
ఏరు ఎచ్చుగా పారెరా! ఓ జాలరన్నా!
మెండు చీకటి కమ్మెరా!

తెరకొయ్య విరిగింది, తెరచాప చిరిగింది
పడవ కడుపులోన కలకలము రేగింది
మొనగాడు తమ్ముణ్ణి మొసలి మింగేసింది
ఎదిగిన తమ్ముణ్ణి ఏరు కాటేసింది
గుండె జారినదండు గంగాకు మొక్కింది
చేతిలో తెడ్లను ఏటిలో విసిరింది
నీ కండె సినవాళ్ళమురా! ఓ! జాలరన్నా
నీతి తప్పని వాళ్ళమురా! ఓ జాలరన్నా!
నీతోనే వుంటామురా!

తెరకొయ్య విరిగినా, తెరచాప చిరిగినా
కోటిపడగలు విప్పి ఏరు బుసకొట్టినా
మొనగాడు తమ్ముణ్ణి మొసలి మింగేసినా
ఎదిగిన తమ్ముణ్ణి ఏరు కాటేసినా
గుండె జారిన దండు గంగాకు మొక్కినా
పల్లెకారుల్లోనా కల్లోలం పుట్టినా

గుండెలోని ఆశ - ఎర్ర - జెండాగా ఎగరాలి!
కళ్ళలోని కాంతి బాట వెలిగించాలి!
చీకటిలో మిణుగురులు చూడటం తెలవాలి!
పట్టుదల ప్రాణంగా నావ నడిపించాలి!
చుక్కాని చేపట్టరా! ఓ జాలరన్నా!
ఏటికి ఎదురీదువాళ్ళమురా! ఓ! జాలరన్నా?
నూటికి ఒకడున్నా చాలునురా! ఓ! జాలరన్నా!
కోట్ల జనులను కూడ గడుదుమురా!
చుక్కాని చేపట్టరా ఓ! జాలరన్నా!
నిక్కముగ దరిజేర్చరా! ఓ! జాలరన్నా!
తూరుపు-దిక్కుగా నడిపించరా!
ఏలేసా ఏలేసా

హైలేసా హైలేసా

జోర్ సెయ్ బార్ సెయ్

బార్ సెయ్ జోర్ సెయ్

ఇంతే ఇంతే నాయనా

ఇంతే ఇంతే నయ్న

ఎంత కాలం చీకటి

కొంత కాలమె నయ్న

చందమామలాటి

అందమైన దీవి

జోర్ సెయ్ బార్ సెయ్

బార్ సెయ్ జోర్ సెయ్

హైలేసా హైలేసా

ఏలేసా ఏలేసా ............

(శ్రీకాకుళం జిల్లాలో వినిపించే జాలరన్నపాటకు కృతజ్ఞత) (జూన్ 1974
58వ సంచిక

## అపస్వరాలు

వారా

ఆకలేస్తోందా నీకు?
ఆంధ్రసంస్కృతి మహోజ్వలమైనది
తినడానికి తిండిలేదా నీకు?
తెలుగుభాష 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్'
పోలీసులు నిన్ను చితగ్గొడుతున్నారా?
మనకి అంతర్జాతీయ ఖ్యాతి అవసరం

నన్నయ్య గొప్పవాడు
నాకు ఆకలేస్తోంది
కృష్ణదేవరాయల రోజుల్లో.........
ఒరేయ్! నాకు ఆకలేస్తోంది
ఏదేశమేగినా ఎందుకాలిడినా.........
నీయమ్మ! నాకాకలేస్తోందిరా!

(ఫిబ్రవరి 1975 65వ సంచిక)

## సిరిమల్లె

వి. బి. గద్దర్

సిరిమల్లె సెట్టుకింద లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ
సినబోయి కూర్చున్నవెందుకమ్మో-
ఎందుకమ్మ

నాట్లేసి నాట్లేసి లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ
నడుములే ఇరిగెనా లచ్చుమమ్మో-
లచ్చుమమో ॥సిరి॥

మోకాల్లమట్టుకు
బుర్దలో దిగబడి
ఎద్దోలె ఎనుకకు
ఒక్కొక్క అడుగేసి

కాల్లుగడ్పులు మొక్క
దొరకు కాయ్యబోతె
వారిమోపు ఎత్తుకొని
బిర, బిర నడువంగ

కాళ్లారి పడ్డావ లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ
కాల్‌చెయ్యి ఇరిగింద లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ ॥సిరి॥

నెత్తంత మాసింది
రైకంత చినిగింది
కొత్తది కొననీకి
కైకిలే దొరకది
కుంచి పీల్కలుగట్టి లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ
కూలికే బోయినావ లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ ॥సిరి॥

పాసిపోయిన బువ్వ
మాడిపోయిన గట్క
చలిగంజి బోసుకొని
సప్పదే మింగుతే
కక్కదేర్గుడు బెట్టి లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ
దొక్కంత గుంజింద లచ్చుమమ్మో
లచ్చుమమ్మ ॥సిరి॥

గాడ్పొచ్చి గుడిసంత
గాలికెగిరిపాయె
చలికాలమొచ్చింది
చాపచింపులులేవు
బొంత గుడుదామన్న
పాతపేల్కలులేవు
చలికి వొనుకూబట్టి లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ
సంటోడు చచ్చిండ లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ ॥సిరి॥

ఆకలితొ పొలగాల్లు
ఇల్లాడిపోవంగ
అన్నారెడ్డికి నీవు
జొన్నవర్కబోతె
కందికొయ్యదిగి లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ
కాలంతవాసింద లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ ॥సిరి॥

ఏనెగుండ్లకింద
షావుకారి గుడ్డంల
ఎరువుజల్లబోతె
ఎర్ర తేలుకరిసి
పోట్లు మంటాలెత్తి లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ
పొలమంత బొర్లావ లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ ॥సిరి॥

దసరపండుగవొచ్చె
దమ్డిచేతులలేదు

దీపావళీవొచ్చె
దీపంతలేదాయె
శివరాత్రి వొచ్చింది
ఉపవాసముండాలె
నీబతుకంత శివరాత్రె లచ్చుమమ్మో
లచ్చుమమ్మ
నీబతుకంత అమవాసె లచ్చుమమ్మో
లచ్చుమమ్మ ॥సిరి॥

ఏ కర్మమనుకోని
ఏడుపాయలెల్లంగ
గాచారమనుకొని
నాచారమెల్లంగ
తొవ్వలో దొంగలు లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ
బువ్వ గుంజుకుంద్రు లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ ॥సిరి॥

పక్కింటి పోచమ్మ
ఎనుకింటి ఎల్లమ్మ
ముందింటి ముత్తమ్మ
ఇరుగింటి ఈరమ్మ
కూలోల్లకందరికి
కూడు దొరకాలని
కొమరెల్లి కొండల్లో లచ్చుమమ్మో
లచ్చుమమ్మ
కొలిమిరాజేసింద్రు లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ ॥సిరి॥

ఎన్నాండ్లు ఏడ్చేవు
ఎంతని ఏడ్చేవు
ఏడ్చిన తూడ్చిన
ఏమి సాధించేవు
నీతోటి చెల్లెండ్లు
నీ సాటి తమ్ములు
ఎర్రదండులచేరి
ఎత్తింద్రు కొడవండ్లు
కొడవండ్లునూరుకొనిలచ్చుమమ్మో-
లచ్చుమమ్మ
కూలిదండులచేరు లచ్చుమమ్మో-
లచ్చుమమ్మ ॥సిరి॥

(మార్చి 1975, 66వ సంచిక)

నిశ్శబ్ద వర్షాలు
అమరజిత్ చందన్
1968

వాళ్ళు
ఫ్యూజిక్[1] దేశానికి
రష్యానుంచి ప్రేమతో వచ్చారు-
తమ యింటికి తాము
ఎంతోకాలం ఎదురుచూచినాక వచ్చినట్లుగా
వాళ్ళు భూమిమీంచి
మృత్యుఛాయల్ని తుడిచేయడానికి వచ్చారు
వాళ్ళకివ్వడానికి ప్రజలదగ్గర ఏ కానుకలూ లేవు
కన్నీళ్ళూ కౌగిళ్ళూ ముద్దులూ తప్ప.
కన్నులపూలు కాళ్ళక్రింద నలిగినవారికోసం
వాళ్ళు వికసించారు
నయన నక్షత్రాలు ఆరిపోయినవాళ్ళకోసం
వాళ్ళు ప్రకాశించారు.
వాళ్ళు 007 నుంచి ప్రేమతో
మళ్ళావచ్చారు
ఫ్యూజిక్ దేశానికి
వాళ్ళ ఆలోచనలూ, అనుభూతులూ
క్రెమ్లిన్ గోడకింద రాజలాంఛనాలతో
పాతేయబడ్డాయి.
ఇపుడు కాలం ఒక రథచక్రంకాదు
ట్యాంక్ గొలుసు
తనకింది మార్గాన్ని నలిచి నమిలేసింది.

---

1. జూలియస్ ఫ్యూజిక్ జెకొస్లవేకియా రచయిత. జెకొస్లవేకియా కమ్యూనిస్టు పార్టీ నాయకుడు. కమ్యూనిస్టుపార్టీ రాజకీయ-సాంస్కృతిక దినపత్రికకు ప్రధాన సంపాదకుడు. 1942లో ఏప్రిల్ 24న జెక్ రాజధాని ప్రాగ్‌లో గెస్టపో(నాజీహిట్లర్ గూఢచారిశాఖ) యితణ్ణి అరెస్టుచేసి పాంక్రాట్స్ జైలులో ఒక చిన్నసెల్‌లో ఏడాదిపాటు చిత్రహింసలుపెట్టి జర్మనీకి తరలించి బెర్లిన్‌లోని ఒక నాజీకోర్టులో విచారించి మరణశిక్ష విధించారు. 1943 సెప్టెంబర్ 8వ తేదీ ఉదయం బెర్లిన్ జైల్లో ఫ్యూజిక్‌ను ఉరితీసారు. ఇది జరిగిన దాదాపు రెండు సంవత్సరాలకు ఎర్రసైన్యాలు 'ఫ్యూజిక్' దేశానికి రష్యానుంచి ప్రేమతో వచ్చాయి జెకొస్లవేకియా విముక్తమయింది.

బెదరిన పక్షుల అరపులు
కాలుతున్న మానవ కాగడాలు
పడిపోతున్న చెట్లు అడిగాయి :
మిమ్మల్నిక్కడికి ఎవరు ఆహ్వానించారు ?
ఏం పనిమీద వచ్చారు మీరు !

ఒక నవ్వు ప్రతిధ్వనించింది
జెకొస్లవేకియా జనులు మాత్రమే అలా నవ్వగలరు
తర్వాత విషాదంలో
రానున్న ఎన్నో సంవత్సరాలకోసం
నిశ్శబ్దాన్ని పాటించారు.

నవంబర్ 77, 73 వ సంచిక

---

నాజీనియంత హిట్లర్ సైన్యాలు తూర్పుయూరపును దురాక్రమణచేసి సోవియెట్ రష్యామీదికి దండయాత్ర చేసినపుడు సోవియెట్ సైన్యాలు వీరోచితంగా నాజీ సైన్యాలను తిప్పికొట్టి సోవియెట్ రష్యాప్రజలు నెత్తురు చెల్లించి సాధించుకున్న స్వాతంత్ర్య ఫలాలనేకాకుండా తూర్పు యూరపుదేశాల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను కూడ కాపాడినవి. బెర్లిన్‌దాకా సోవియెట్ ఎర్రసైన్యం తూర్పు యూరప్ ప్రజల హృదయాకాంక్షలే పలచిన ఎర్రతివాచీగా కదలివచ్చింది.

**The Soviet Air Force has gone into action-** జూన్ 41 అనే వార్తచదివి శ్రీశ్రీ రాసిన 'గర్జించు రష్యా' (రచనాకాలం 41) కవిత 'నిశ్శబ్ద సంవత్సరాలు'లో అమరజిత్ చందన్ ప్రస్తావించిన "వాళ్లు భూమిమీంచి మృత్యుఛాయల్ని తుడిచేయడానికి వచ్చారు" అన్న చరణాలు ఫాసిజంపై సోవియెట్ సైన్యాల విజయాల గానాలే, స్మృతులే.

మళ్ళీ 1967లో కూడా జెకొస్లవేకియాకు రష్యన్ ట్యాంకులు వచ్చాయి. ఈసారి జెకొస్లవేకియా ప్రజల ఆహ్వానంపై కాదు; నాజీలనుంచి విముక్తి కలిగించడానికికాదు. సోషల్ సామ్రాజ్యవాద విస్తరణకాంక్షలో భాగంగా, దురాక్రమణ నీతితో, అమరజిత్ చందన్ కవితలోని 'వాళ్ల 007 నుంచి ప్రేమతో మళ్ళీవచ్చారు' అనే చరణాలలోని ప్రస్తావన ఆ దురాక్రమణగురించే. 007 అనే మాట పెట్టుబడిదారీ విధానము పునరుద్ధరింపబడిన ఈనాటి రష్యా, రష్యన్ సంస్కృతినీ ఉద్దేశించింది.

# సరోజ్ దత్తా

సరోజ్‌దత్తా సుప్రసిద్ధ బెంగాలీ పత్రికా రచయిత– కవి. అవిభక్త కమ్యూనిస్టు పార్టీ బెంగాలీ దినపత్రిక "స్వాధీనత" లో అతడు పనిచేసాడు.

1969లో భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు-లెనినిస్టు) ఏర్పడ్డ తరువాత అందులో అతడు ప్రముఖ స్థానాన్నిపొంది కేంద్రకమిటీ సభ్యుడయ్యాడు. తరువాత పశ్చిమ బెంగాల్ కమిటీ కార్యదర్శి అయ్యాడు. సి.పి.ఐ, యం.యల్ బెంగాలీ వార పత్రిక "దేశబ్రతి"లో శశాంక అనే పేరుతో పాలకవర్గాలకు వ్యతిరేకంగా నిప్పుల కలంతో రాసేవాడు. బెంగాల్ యువజనోద్యమంలోకూడా సరోజ్‌దత్తా ప్రముఖ పాత్ర నిర్వహించాడు. 1970–71 లో కలకత్తాలో, ఇతర పరిసర పట్టణాల్లో కాంగ్రెసు నాయకుల, సంఘ సంస్కర్తల విగ్రహాల విధ్వంసన కార్యక్రమానికి సైద్ధాంతిక సమర్థన ఇచ్చాడు.

1971 ఆగస్టు 4/5 అర్ధరాత్రి కలకత్తాలోని ఒక రహస్య నివాసంలో సరోజ్ దత్తాఅరెస్టు అయ్యాడు. ఆగస్టు5 వేకువజామున పోలీసులు అతన్ని కలకత్తా మైదానం లోని ఒక నిర్మానుష్యమైన మూలకు తీసుకొనిపోయి కాల్చివేశారు– కాని ఇవ్వాటికీ పోలీసులు సరోజ్‌దత్తా దొరకలేదని అంటున్నారు.

77 జూన్ సంచికలో ప్రచురించిన సరోజ్‌దత్తా కవితలు, ఈ కింది కవిత ఇటీవల కలకత్తాలో ప్రచురించబడిన ఆయన కవితా సంకలనం "ఘృణ-వా-క్రొధేర్ కవిత" (ద్వేష క్రోధ కవితలు) నుంచి తీసుకోబడినవి.

## శకుంతల

గుర్తుగా యిచ్చిన ఉంగరము, దుర్వాసుని శాపము
స్వర్గంలో కలయిక
అన్నీ అబద్ధాలు– వంచనకు ముసుగులు
ఒక రాజు కామానికి ఎరగా
ఒక స్త్రీ బలియైన విషయాన్ని కప్పిపుచ్చడానికి
కాళిదాస కవీంద్రుడు కథనిండా
విధి అనే తెర కట్టాడు–
పట్టణాల్లోని వినోద యాత్రలతో విసిగిపోయి
రాజు మాంసం అన్వేషణలో బయల్దేరాడు

ఇంకా పెద్ద వ్యసనంకోసం వేట మాని
రక్షణలేని ఒక పేద ఇంటికి వచ్చాడు
ఇంటి యజమాని యింట్లోలేడు

ఆ అడవిపిల్ల అయన మాటల వలలో పడిపోయింది–

ఇవ్వాళ నాటకశాల చకితయై నిలిచింది
భూతాలు భయంతో నిశ్శబ్దమై పోయాయి
కవిత్వపు మబ్బుల్ని చీల్చుకొని
సత్య సూర్యుడు ఆకాశంలోకి ఉదయిస్తున్నాడు
నాటకంలో దాగిన అర్థాన్ని చూచి
ప్రేక్షకులు చలించిపోయారు

ఒక జలగ
తప్పుడు మార్దవాన్ని ఒలకబోస్తే
ఆ యువతి గర్భవతి అయింది–

ఆ రాజు పారేసిన ఎంగిలి పెరుగన్నం మెక్కి–
ఆస్థానకవి నాటకం రాసాడు:
చీకటి నాటకరంగంపై నేలమీద
శకుంతల శోకిస్తున్నది.

(డిసెంబర్ 77, 74 వ సంచిక) (బెంగాలీ నుంచి అనువాదం ; సుమంతా బెనర్జీ)

ఆలోచించండి : మహాభారతంలోని శకుంతలోపాఖ్యానంలో అభిజ్ఞానం (గుర్తు)గా దుష్యంతుడు శకుంతలకు ఉంగరం యిచ్చాడనిగానీ, దుర్వాసుని శాపంవల్ల రాజు శకుంతలను మరచిపోయాడనిగానీ లేదు. భారతంలో సర్వదమనుడు కణ్వాశ్రమం లోనే పుట్టిపెరిగి యువరాజ్యాభిషేకానికి అర్హమైన వయస్సు వచ్చినప్పుడు ఆయనను చక్రవర్తిని చేస్తానని దుష్యంతుడు మాట యిచ్చి వున్నందున శకుంతలను, అతణ్ణి రాజు దగ్గరికి పంపిస్తాడు కణ్వుడు. రాజు శకుంతలను మరచిపోతాడు– కాముకు లయిన మొగాళ్ళందరిలాగే. ఆ మరపును భారతంలో కవి ఖండించకున్నా సమర్థిం చడు. ఒక జరిగిన విషయంగా మాత్రం చెప్తాడు. కాని కాళిదాసు నాటికి 'రాజు పారేసిన ఎంగిలి పెరుగన్నంమెక్కిన' మేధావులకు 'రాజు రక్తం తప్పుచేయదన్న' సిద్ధాంతాన్ని బలపర్చాల్సిన 'బాధ్యత' వచ్చిపడింది– ?

## ఎర్ర జెండెర్ర జెండెన్నియ్యాలో...

అల్లం నారాయణ

ఎర్ర జెండెర్ర జెండెన్నియ్యాలో
ఎర్ర ర్రనిదీ జెండెన్నియ్యాలో
పేదల పాలీ జెన్నియ్యాలో
మరి పెన్నిది ఈజెండెన్నియ్యాలో ॥ఎర్ర॥

అన్నలు అన్నా లెన్నియ్యాలో
మరి ఎన్నెల కోనాలెన్నియ్యాలో
ఎన్నెల కోనాలెన్నియ్యాలో
మరి ఎలుగూ రవ్వాలెన్నియ్యాలో ॥ఎర్ర॥

తూరుపు దిక్కూ నెన్నియ్యాలో
మరి సూర్యుడు పొడిసిందెన్నియలో
ప్రజలా కొరకూ ఎన్నియలో
మన అన్నలు నిలిచారెన్నియలో
పడమటి దిక్కూ నెన్నియలో
సూరుడు గుంకిందెన్నియలో
ప్రజలా మధ్యా నెన్నియలో
మన అన్నలు ఒరిగా రెన్నియలో
ఒరిగిన అన్నల కెన్నియలో
మన ఎర్రని దండాలెన్నియలో ॥ఎర్ర॥

సీకటి కొండ ల్లెన్నియలో
మరి సివరీ మూల లెన్నియలో
నక్సల్ బరి నుండెన్నియలో
మరి నాలుగు దిక్కూ లెన్నియలో
పోరు సాగం గెన్నియలో
మరి పోరూ మార్గం లెన్నియలో
ఒరిగిన అన్నల కెన్నియలో
మన ఎర్రని దండా లెన్నియలో ॥ఎర్ర॥

ఆగదు ఆగా దెన్నియలో
పోరాటా మాగా దెన్నియలో
పోరూ మార్గం లెన్నియలో
మరి నువ్వూ నేనూ ఎన్నియలో
నువ్వూ నేనూ ఎన్నియలో
మరి కలిసే పోదా మెన్నియలో
కలిసే పోదా మెన్నియలో
మరి నడిచే పోదా మెన్నియలో ॥కలిసే॥

ఎర్ర జెండెర్ర జెండెన్నియ్యాలో
ఎర్రెర్రనిదీ జెండెన్నియ్యాలో ॥ఎర్ర॥

(డిసెంబర్ 1978, 86వ సంచిక)

## గోదావరి నా స్వరం

మంగ

చాలా రోజుల తరువాత
ఇవ్వాళ గోదావరిని చూస్తున్నాను
కొత్తగా కనిపించింది
ఏవో గీతాలు వినిపిస్తూ—

ఇదివరకు గోదావరిలో స్నానం
చేసినప్పుడు
అలనాటి తెలంగాణ ముచ్చట్లు వినిపించి
ఆలోచనల అలలు రేపేదినాలో
నేను ఒళ్లు విదిలించుకుని వచ్చేవాణ్ని

కాని ఇవ్వాళ ఆలోచనల అలలుకాదు
ఒకటి వెనుక ఒకటిగా
లెక్కపెట్టలేనన్ని అలలు కళ్ళముందు తిరగబడుతూ
తమతో చేతులు కలుప మంటున్నాయి

తనకు అడ్డునిలిచిన నల్లని రాతిని
కొని ఆర్తనాదం చేసుకుంటూ
వైదొలగి పోయిన గోదావరిని
నిన్న చూసాను

ప్రవాహపు ఉరవడిలో
గులకరాళ్లుగా మారుతున్న నల్లనిరాళ్లను
అవి చావుకేకలు వేస్తుంటే
గోదావరి తన ప్రవాహంతో
వాటి పునాదులను పెకలించి

తన పాదాలకింద నలిపివేయడం
ఇవ్వాళ చూస్తున్నాను

అవును
గులకరాళ్లుగా మారిన నల్లనిరాళ్లకు
నిలకడ ఎక్కణ్నుంచి వస్తుంది?

ఇవ్వాళ కష్టజీవుల కన్నీళ్ళు
నిలువ నీటి గుంటలు కావు
పోరాటపు బ్రతుకుబాటలో
దూకుతున్న జలపాతాలు
రాళ్లను అరగదీసే శక్తి
ఈ నీళ్లకు వుంది

నిన్నటి వరకు ఆగిఆగి
నేరుగా నడిచిన గోదావరి
ఇవ్వాళ నాతో అంటున్నది
జీవితంలో మలుపు రావాలని
మలుపు కోసం ఎరుపు కావాలని
ఎరుపు కోసం మలుచుకోవాలని

గోదావరిలో ప్రతిఫలిస్తున్న ఎర్రని కిరణాలు
నాకు బాట చూపుతున్నాయి
నేను గోదావరివెంట నడుస్తున్నాను
గోదావరి అలల హోరుతో
నా కంఠాన్ని శ్రుతిచేస్తున్నాను

(ఏప్రిల్ 1979, సంచిక 90)

# ఇంతకూ నువ్వెవరివి?

ఎ. ఎస్.

## 1

నగరంలో,
నియాన్‌లైట్ల వెల్తురులో
మేజువాణిగా అలంకరించిన స్టేజీమీద
ఖరీదైన బట్టల ఆమె—
"మహిళా దశాబ్దం" గురించి
ఏదో చెప్తూ గొంతు చించుకుంటుంది
నువ్వు నిశ్శబ్దంగా, ఆశ్చర్యంగా
నోరుతెరిచి చూస్తుంటావు—
ఆమె ఖరీదైన జరీచీర కేసి
మెరుస్నుస్తు దుద్దుల కేసి
మైకు తోక తెగ్గోసిన మేకలా
అరుస్తుంటుంది.
కాసేపటికి నీకంతా అవగతమౌతుంది
చిరాకుగా తుపుక్కున ఉమిసి
ఒంటరిగా నువ్వు రోడ్డుమీద నడుస్తుంటే
పండితాపురం మురికి వీధులు
ఆ వీధుల్లో పగిలిన పాదాలతో,
ఆకలితో, గుక్కెడు నీళ్లకోసం
చెరువులోతట్టు షికంకోసం
చంటిపిల్లలకు పాలుకుడుపుతూ
నడిమివయసు స్త్రీలు
చిరిగిన గుడ్డల వృద్ధ స్త్రీలు
జీరబోయిన గొంతులతో అరుస్తూ,
ఊరేగింపులోకదలడమేనీకు కనిపిస్తుంది
"శాంతి భద్రతల పరిరక్షకులు"
నిరాయుధులైన స్త్రీలమీద కాల్పులు
జరుపడమే వినిపిస్తుంది.

దొడ్డాసుశీల, సీత
గుర్తుకొస్తారు.
కుదురుపాక రాజవ్వ,
బెల్లంపల్లి రాజేశ్వరి,
ఇంకా చెరచబడ్డ రైతాంగనలు—
ఈ సందర్భంలోనే నిన్ను ప్రశ్నిస్తారు.
నాజూకు మెరుపుతీగ
నీ కసహ్యంగా రూపుకడుతుంది
నగరం సాధువులా నటించే పులిలా
అర్థమవుతుంది—
నీ పిడికిళ్ళు బిగుసుకుంటాయి.

## 2

రేడియోలో పిల్లల సంవత్సరం కోసం
ప్రధాని చిలుక పలుకుల ప్రసంగాన్ని
అన్ని భాషల్లోకి అనువదించినప్పుడు
వద్దనుకున్నా నీ చెవుల్లో పడుతుంది
జంషెడ్‌పూర్ ఉక్కు ఫ్యాక్టరీ ముందు
ఇనుపతుక్కు కోసం తచ్చాడుతున్న
పిల్లలను
సేట్ల గుండాలు తరిమికొట్టి—
పొంగే సువర్ణరేఖ నదిలోకి విసిరి
వేయడమే కనిపిస్తుంది—
మళ్ళీ పండితాపురమే నీ మనసులో
మెదులుతుంది.
లంబాడిపిల్లల ఎర్రటి లేత శరీరాలమీద
లాఠీల దెబ్బలు, గాయాలు,
"రోలింగ్ ట్రీట్‌మెంటు."

తుపాకి దెబ్బతిన్న నేరానికి ఇంకో
బాలుణ్ణి నిర్బంధించడం-
నీ మనసులో మెదులుతుంటాయి.
"ఉత్ప్రేరకం" ఎంత చిన్నదైనా
శత్రువు కొలరాచివేయాలనుకుంటాడని
ఎరుపు మొగ్గ ఎంత చిన్నదైనా
కరుకు బూట్లతో తొక్కేస్తాడని
నీకు అర్థమై కళ్ళు ఎరుపెక్కుతాయి
వాళ్ళు చెలిమల కంటిన నెత్తురు
తుడిచే కొని
నీతి సూత్రాలు వల్లిస్తారు.
వాళ్ళ పత్రికలు యాపిల్‌పండ్ల బుగ్గల
పిల్లలను,
అర్థనగ్న స్త్రీలను ప్రచురించి
బుకాయిస్తాయి
నీ కోపం బద్దలవుతుంది.
నువ్వు ప్రశ్నిస్తావు,
అన్నీ మీ కొరకేనా?
ఇంకా కోపంగా అరుస్తావు
"ఒరే! సమస్తం మీ కొరకేనా?"
సమాధానం నీకేబోధపడి
"వాళ్ళు-వాళ్ళ రాక్షసత్వానికి
అన్ని స్వేచ్ఛలు ఉంచుకున్నారు.
మాకు వాళ్ళిచ్చే బహుమానాలు
లాఠీలు, జైళ్లు, తుపాకులు,
నీలో నీవే, గొణుక్కుంటావు.
నువ్వు తెగించడమే ఏకైక మార్గంగా
లాఠీలను, జైళ్ళను,
బద్దలు కొట్టడం గురించి
తుపాకులను ప్రజాచైతన్యంతో
పడగొట్టడం గురించి
పునరాలోచిస్తావు
పోరాటమే నీకన్నీ నేర్పుతుంది-
ఆయుధాలు తయారుచేయడం
ఆత్మరక్షణకోసం ఆయుధాలు ధరించడం
ముఖ్యంగా గురిచూడడం.
ఇంతకూ! నువ్వెవరివి?
మహిళా దశాబ్దంలో చెరచబడ్డ స్త్రీవా?
బాలల సంవత్సరంలో
పొంగే నదిలోకి విసిరేయబడిన
పసిబాలుడవా?

(జూన్ 1979, సంచిక 92)

[డిసెంబర్ 1978, సంచిక 86 లో ప్రచురించబడి ఈ సంచిక కవితల శీర్షిక 21వ పేజీలో పునర్ముద్రించబడిన "ఎర్ర జెండెర్ర జెండెన్నియ్యలో..." పాట రాసింది అల్లం నారాయణకాదు అల్లం వీరయ్యగా చదువుకోవాలి- సం॥]

# రోడ్డు మీద సూర్యుడు

కె. రాంమోహన్‌రాజు

రోడ్డంతా కదిలి కదంతొక్కుతున్న సైన్య సంగీతం
ఊరిమీద అలవోకగా వాలిన మబ్బు తునక
బెదిరి పారిపోయింది
పర్వతాలు పట్టుకుని పాకుతూ వస్తున్న
బాలసూర్యుడు స్వర్ణకేశాలింకా సవరించుకోకముందే
రోడ్డు మీద నిలువెత్తు మంటలు
అగ్ని తూలికల ఉష్ణీషాలు ధరించి
ఖడ్గ సంగీతాలు పాడుతూ పొరలుతూ, కెరలుతూ
అలలు అలలుగా, పొరలు పొరలుగా
సూర్య సంతానం సాగుతోంది రోడ్డుమీద
గాలికి మతిభ్రమించి వెర్రిగా పరుగెత్తింది
ఆకాశాన్ని కప్పేసిన జెండాలు దాటి
నినాదాలింకా పైకి అటునుంచి లోకంలోకి
ప్రవహిస్తున్నాయి
సృష్టిలో పరమాణువులన్నీ
విస్ఫోటనకుసిద్ధంగా వున్నాయి
పలుచగా పైకిలేస్తున్న ఊపిర్లు వెచ్చగా
ఆకాశానికి ఎర్రపూత పూశాయి
పాదాల తాకిడికి రేగిన నేలతల్లి నిట్టూర్పుల ధూళి
ఊరిమీద సింగిణీ చిత్రాన్ని గీసింది-
ద్వారాలు తెరుచుకొని. గవాక్షాలు విచ్చుకొని
సుత్తెలూ, కొడవళ్లూ, నాగళ్లూ, కలాలూ, పుస్తకాలూ
మగ్గాలూ, తలలూ, కళ్లూ మనస్సూ అన్నీ
సైన్య సంగీతానికి లయగా అడుగేస్తున్నాయి–
అపరిష్కృత సమస్యా వలయాలు,
అంతులేని జీవనదుర్గ విశీర్ణ శిథిలాలు
అన్నీ కళ్లలో రవ్వలు పొదుగుకుని
స్వేచ్ఛవల్ల సహజంగా ఉద్భవించే వికాసంతో

ఉత్సాహంతో, బలంతో, శక్తితో నడుస్తున్నాయి
అరికాళ్ల కింద బొబ్బలు పగిలి రోడ్డంతా నెత్తురు
ఆకాశంలో సూర్యుడు రోడ్డుమీద రక్తంలో ఫలిస్తున్నాడు
నెమ్మదైన అలవాట్లు వద్దు వద్దు
నిర్జీవ క్రమపద్ధతులు వద్దువద్దు
మరణానంతర ప్రశాంతికోసం స్వేచ్ఛను త్యాగం చేయొద్దు
ఆడంబర సంస్కృతీ ప్రహసనాలు వద్దు
ఇతర్లకోసం మా నెత్తురు ధారపోతలు వద్దు
పాలిష్డ్ స్టోన్లు పరిచిన బాత్‌రూంలో
షవర్ మంద్రంగా మోగుతుంది
కుషన్‌బెడ్‌లు సాంద్ర స్వప్నాల్లో విహరిస్తున్నాయి
రక్తపు బిందువులతో బంతులాడుకునే
నాజూకుతనాల వాళ్ల జీవన రహస్యాలు తెరిచే
తాళంచెవి ఏదో సూర్యకిరణ పుంజాల్లో
పునీతమయ్యే నగ్న మలిన దేహాలకు దొరికింది
రేపటి నుంచి వాళ్లే సూత్రధారులు
ఇంతవరకూ ప్రపంచమంతా ఆభాస నాటకం
ఇంక నాటకం రక్తికడుతుంది

(జూలై 1979. సంచిక 93)

---

## రెడ్ శాల్యూట్స్ డియర్ చైర్మన్

( ప్రక్కపేజీ తరువాయి )

ఫార్ములా కరక్టే అయినా ఫలితం రాదు వాళ్లకు—
నా వూపిరిని మైక్రోస్కోప్ క్రింద పరీక్షిస్తారు చివరికి—
నా అణువణువూ నిండివున్న నిన్నుచూసి గుండెలాగి ఛస్తారు వాళ్లు—!

---

9-9-79న చైర్మన్ మావో యొక్క మూడవ వర్ధంతి. అందుకోసం ఈ చిన్న సంస్మరణ.

(అక్టోబర్ 1979. సంచిక 96)

# రెడ్ శాల్యూట్స్ డియర్ చైర్మన్

అజ్ఞాత సూరీడు

కొండమీద—

రాళ్లకూ, చిరుగుల పొరలకూ మధ్య
నా కామ్రేడ్సందరూ సుఖమెరగని నిద్రలో—
నేను మాత్రం మేల్కొనే వుంటాను సెంట్రీచేస్తూ—
ఆ చీకటి దీర్ఘరాత్రి అంతంచూసే వరకూ—
శీతాకాలపు చలికి నాభుజానికి వేళ్లాడే తుపాకీ
ఇనప బ్యారక్ మరింత వణవణ లాడిస్తుంటే—
హఠాత్తుగా గుర్తొస్తావు నువ్వు.
అప్పుడునాలో ఎంత గొప్ప వేడి ప్రవేశిస్తుంది !!
—విలాసవంతమైన విప్లవకర జీవితంలో
తరచుగా దొరకనిది అన్నం మాత్రమే—
కాలే కడుపుకు వత్తాసుగా నడక సృష్టించే
నీరసంతో ససేమిరా కదల నంటుంది శరీరం—
అప్పుడు నీ "దీర్ఘ యాత్ర" గుర్తొచ్చి
పారే ఏటి నీరే పరమాన్నంలా తాగుతాను—
నాకెంత అద్భుతమైన బలం అప్పుడు !!!
ఈ యుద్ధం నా సహచరులెందరొన్నో బలి తీసుకుంటుంది—
ఎటు చూసినా నిర్బంధం, నిరాశా, నిస్పృహలు—
ఒక్కోసారి ఒంటరిగా మిగిలిపోతాను.
కర్తవ్యం - వెనకడుగుల మధ్య ఊగిసలాడుతూ—
అప్పుడు గుర్తొస్తాడు నీ "పర్వతాల్ని తొలిచిన ముసలివాడు"
అహో ! ఎంతగొప్ప ఆత్మవిశ్వాసం కలుగుతుంది !!
అప్పుడు నాధాటికి శతృవు చావక ఛస్తాడా ?
ఆఖరికి ఓ నాటికి—
నాచిన్న ఓ నిర్లక్ష్యానికో, ఓ మిత్రద్రోహానికో—
శతృ నిర్బంధంలో నేను పడితే—

నాచుట్టూ లాఠీలు, సన్నీలూ,
చిత్రహింసల అత్యున్నత రూపాన్ని అధిగమిస్తారు వాళ్ళు—

# గర్జించు రష్యా గాండ్రించు రష్యా
# దేశాలనన్నీ కబళించు రష్యా

టంకశాల అశోక్

అంగోలా నుండి అఫ్ఘనిస్తాన్ వరకు
రష్యన్ మర తుపాకుల వర్షంలో
కుప్పకుప్పలుగా కుప్పకుప్పలుగా
ఎవరి శవాలివి
ఎవరి శవాలివి

టాంకులూ, గన్‌కాప్టర్లు
నాపామ్‌లు, డిఫోలియెంట్లు
మిస్సైల్సు, విషపు గ్యాసులూ
ఎవరి కోసమివి
ఎవరి కోసమివి

ప్రజలంతా రియాక్షనరీలు
ఏజెంట్లే ప్రగతివాదులా
సిద్ధాంతపు జరీముసుగులు
ఎందుకోసమిది
ఎందుకోసమిది

ముడిసరుకులు, వ్యాపారాలు
పెట్టుబడులు, దోపిడిదారీ
రాజకీయ పెత్తందారీ
నాజీలను చంపిన దేశం
నాజీలను మించిందా

జెక్ నుండి కంపూచియా వరకు
రష్యన్ మర తుపాకుల వర్షంలో
ఎవరి శవాలివి
ఎందుకోసమిది

కథలు ....

అగ్ని సరస్సున వికసించిన వజ్రం వంటి అనువాదకథలు, అల్లం రాజయ్య వంటి కథకుల పరిచయం తప్ప సృజన ఆధునిక కథాసాహిత్యంలో ఆశించినంత ఫలితాన్ని సాధించలేదు. అయితే అది సృజనకు మాత్రమే సంబంధించిన బలహీనత కాదు. విప్లవ సాహిత్యోద్యమంలోనే కథ జీవితంలోని వేగాన్ని, విస్తృతిని, వైవిధ్యాన్ని, వైరుధ్యాలను- అన్నిటినీ మించి జరిగినవి జరిగినట్లుగా చెప్తేనే అద్భుతమైన కథలు కాగల ప్రజల పోరాటాలకు కళారూపంగా ఇముడ్చుకోవలసినంతగా ఇముడ్చుకోలేకపోయింది. నక్సల్బరీ శ్రీకాకుళ రైతాంగ పోరాటాలతో ఒక్కసారిగా జీవితాలపై, సాహిత్య కళారంగాలపై ప్రభావాలు మారినవి. రచయిత ప్రేక్షకుడుగా రాస్తే పేలవంగానూ తనకు కొత్తదైన అనుభవాన్ని రాస్తే ఫార్ములా కథలవలె కృత్రిమంగానూ వుండే పరిస్థితి ఏర్పడింది. అయినా శ్రీకాకుళ జీవితాన్ని చిత్రించే మంచికథలు కొన్ని సృజనలో వెలువడినయి. కాళీపట్నం రామారావుగారి కథల్లో కూడ పేర్కొనదగ్గ కథ 'చావు' (మార్చ్ 1971, సంచిక 18) మొదట సృజనలోనే వెలువడింది. శ్రీపతి ('నర్తోడు' జనవరి 1971, సంచిక 28, 'జనం', ఫిబ్రవరి 1972, సంచిక 29) ఎన్. ఎస్. ప్రకాశరావు ('ఏకరువు' - మార్చ్ 71, సంచిక 18, 'మంచి' జులై 1971, సంచిక 23) బి.టి. రామానుజం ('మర బ్రతుకులు'- ఏప్రిల్ 1971, సంచిక 19) విప్లవ కథాసాధన సృజనలోనే చేసారు. మరువాడ రాజేశ్వరరావు సృజనకు ఎక్కువ కథలు రాయడమే కాదు విప్లవకథ, నవలల గురించి ఏంచేయాలి అని కొంత ఆలోచన, చర్చ చేసాడు. విశేషమేమంటే వీళ్ళంతా విశాఖ కథకులే. గురజాడ, శ్రీశ్రీ, రావిశాస్త్రి, కాళీపట్నం మొదలుకొని ఈనాటి వరకు తెలుగు కథా నాటకరంగాల్లో మన్నెపోరాటం మొదలుకొని మొన్నటి శ్రీకాకుళం వరకు రాజకీయ రంగంలో విశాఖ, శ్రీకాకుళాలు చూపిన విలక్షణత్వానికి వెనుకబడిన (గిరిజన) ఆర్థిక విధానానికి ఏమైనా అనుబంధం వుందా అని ఆలోచించవచ్చా? అలాగే ఆదిలాబాదు, కరీంనగర్ రైతాంగ పోరాటాలకూ అల్లం రాజయ్య, చుక్క ('ఎత్తునిపిడికిళ్ళు') లొక్కసారిగా సాహిత్యరంగంలోకి దూసుక రావడమూ విడిగా చూడలేం గదా! సృజనలో ఇప్పటికి ప్రచురింపబడిన 100 కథల్లో 8 కథలు అల్లం రాజయ్యవి.

అనువాద కథ విషయంలో మాత్రం సృజన - అనువాద సృజన అని పాఠకులు అనేంత విరివిగా ప్రచురించింది. దేశదేశాంతరాల కథల కన్న రైతాంగపోరాట సారూప్యం వల్ల జనచైనా కథలే ఎక్కువ వచ్చాయి. ఇంగ్లీషు చదువగల విద్యావంతులు తప్ప గ్రామీణ ప్రజలందరూ అనువాదమనే విముఖత చూపకుండా ఈ కథలను బాగా

ఆదరించారు. చలసాని ప్రసాదరావు, రహి ('బుగతగాడి మాంసం', జూన్ 1974, సంచిక 57, 'మావో మందహాసం', సెప్టెంబర్ 1979, సంచిక 83), అరుణ ('పొలిటికల్ కమిస్సార్' సెప్టెంబర్ 1974, సంచిక 60), నెమలూరి భాస్కరరావు ('ఖరీదు కట్టే షరాబులేదోయ్', నవంబర్ 1974, సంచిక 62), సి. పైడయ్య ('నిజమైన ఉక్కుకోట ఏది?' మార్చ్ 1975, సంచిక 66), లోచన్ ('నాపాతయిల్లు', సెప్టెంబర్ 1979, సంచిక 83) చేసిన అనువాదాలు మూల కథలంత సాఫీగా పాఠకులను చదివించగలిగాయి.

సృజనలో ఇప్పటికి ప్రచురింపబడిన 30 అనువాద కథల్లో ఆరోవంతు చలసాని ప్రసాదరావు అనువాదం చేసినవే. జనతా ప్రచురణలు 'మార్పు', క్రాంతి ప్రచురణలు 'లాంగ్ మార్చ్' వంటి చైనాకథల అత్యుత్తమ అనువాద సంకలనాలకు సృజన పాతర (సోర్స్) కాగలగడం మాకు గర్వకారణం. 'అగ్నిసరస్సున వికసించిన వజ్రం' (అను- శ్రీకాకుళరావు) పునర్ముద్రించమని ఎందరో పాఠకులు కోరడమే అందుకు నిదర్శనం. పాఠకులెందరో కోరినా ఈ కథా, 'చావు' - స్థల దృష్టితోనే వేయలేకపోయాం.

జంపన పెద్దిరాజు కథ 'ఫౌల్ ఫౌల్' (ఫిబ్రవరి 1971, సంచిక 17) పునర్ముద్రించవలసిందిగా కొందరు పాఠకులుకోరారు. కాని అది సృజనలోనే మొదటిసారి వచ్చిన కథకాదు. జంపన పెద్దిరాజు ఆకస్మిక మరణం సందర్భంగా ఆయన సంస్మరణగా విద్యార్థి సాహితి కథాసంకలనం నుండి అప్పటికే అది పునర్ముద్రణ.

కథల కొరత తీర్చడానికి సృజన ఇప్పటికి రెండుసార్లు కథల కొరకు ప్రత్యేక సంచికలు వెలువరించింది. 1969 నవంబర్‌లో కళాశాల విద్యార్థులకొరకు కథలపోటీ కూడ నిర్వహించింది. అత్తలూరి నరసింహారావు 'పీడోగ్రులు' (నవంబర్ 1969, సంచిక 13) అపోటీలో ఉత్తమ కథగా ఎన్నికయింది. సృజన ప్రచురణలు చేపట్టిన తర్వాత కథాసంకలనమే (పింగళి రంగారావు 'వినడానికో కథ') తొలి ప్రచురణ. అయినా ఇవేవీ కథ వ్యాపార సరుకుగా మారుతున్న ఈ రోజుల్లో మాప్రయత్నాలు ఇమ్మడి ప్రోత్సాహాన్ని పొందడానికి దోహదం చేయడం లేదు.

# చైతన్యం

ఆర్.వి. ఆనంద్

'వొణ్ణానికి లెగు' అంది దుర్గమ్మ.

గుడిసె ముందు కూర్చున్న సుందర్రావుకి భార్య మాట వినపడలేదు. గుడిసెకు పది బారల దూరంలో వున్న పిల్లకాలవవైపు చూస్తూ అతను ఏమో ఆలోచిస్తున్నాడు. రాత్రి ఏడు గంటలు కావస్తోంది. కాలవ వొడ్డున కీచురాళ్ళు ఎడతెరిపిలేకుండా రొద పెడుతున్నాయి. దూరంగా పొలాల్లోంచి గొడ్లకాడ కుర్రాడెవడో పాడే 'చెల్లియో చెల్లకో' గాలిని చీల్చుకుంటూ వచ్చి మధురంగా వినబడుతోంది.

'ఏంటల్లాకూకున్నావు కూడుదింటానికి లెగమంటే' అని రెట్టించింది దుర్గమ్మ. ఉలిక్కిపడి లేచాడు సుందర్రావు. కాళ్ళమీద ముంతతో కాసిని నీళ్ళు గుమ్మరించుకుని గుడిసెలోకి వచ్చి కూర్చున్నాడు. దుర్గమ్మ అల్యూమినియం గిన్నె అతని ముందు పెట్టింది. ఆ గిన్నెలో మూడు గుప్పిళ్ళ అన్నం మెతుకులతోపాటు వేయించిన వుప్పు చేప ముక్కా, నాలుగు మెత్తళ్ళూ వున్నాయి.

'ఏంట్రా అబ్బాయా, సందకాడనగా వొచ్చి మూగ దేవుడిలాగ కూకుండి పోయేవు?' అని అడిగింది అతని తల్లి సరసమ్మ.

'నాకేవీ పాలుపోవడం లేదమ్మా' అన్నాడు సుందర్రావు గిన్నెలో వున్న మెతుకులు కలుపుతూ.

'యేం? పెసిరెంటుగారు కూల్డబ్బు లియ్యలేదా? అరికుప్ప నూర్పిళ్ళయ్యాలతో ఐపోతయ్యనుకున్నారు గందా?'

'నూర్పిళ్ళయిపోయినయ్. పదేను బళ్ళలో దాన్నెత్తి పెసిరెంటు సావిట్లో పోసేం. కూల్డబ్బు రెల్లుండిత్తాడంట' అని ఉప్పుచేప ముక్క కొరికి, 'ఛఛ, ఇదేంటే ఈ యెండు చేపముక్క రుసీపసీలేదు' అన్నాడు కాస్త విసుగ్గా.

'ఇంట్లో నూనె లేదు మరి. ఏదో అడుగూబొడుగూ వుండే దాంతో యేసేను' అంది దుర్గమ్మ.

దుర్గమ్మ యిచ్చిన జవాబుతో అతని విసుగు మాయమైపోయింది. వెంటనే అతని దృష్టి గుడిసెలో మూలగా ముడుచుకు పడుకునివున్న తన యిద్దరు పిల్లల మీదికి మళ్ళింది. 'సత్తెమ్మా, సిన్నిగాడూ తిన్నారా?' అన్నాడు.

'తిన్నార్రా బాబా.... ఏం తిళ్ళో. ఉన్నకాడికి ఏ గెంజో తాగుదారనుకుంటే ఆ గెంజే కరువైపోయింది. ఏవి రోజులొచ్చినియ్యిరా బగమంతుడా. మీ మొగుడూ

పెల్లం రెక్కలు ముక్కలు జేసుకొని కష్టపడుతన్నారు. ఏఁవి లాబం? పప్పుంటే వుప్పుండదు. ఉప్పుంటే పప్పుండదు. పోనీ నేనుగూడా ఆ కూలిపనికెల్లి ఏదో కొంత సాయంగా వుందాఁవంటే నాకేమో సత్తువలేదు. ఈ దగ్గూ ఒగురుపూ ఒకటొచ్చి పడింది నా పేణానికి' అంటూ నరసమ్మ ఆయాసపడుతోంది.

'ఇదుగో మాకే పన్లు సరింగా దొరక్క సత్తావుంటే నిన్ను పన్లోకెల్లమని యెవరన్నారు? అసలిప్పుడెందుకీ సోదీ' అని కోడలు విసుక్కొంది కాస్త బిగ్గరగా.

'నువ్వుండెహె' అని భార్యను గదమాయించి, 'అమ్మా, నువు పెద్దదానిపై పోయేవుగందా, మాకోసఁవింకేం దేవుళ్ళాడతావు జెప్పు. ఏ దోల పిల్లల్నిద్దర్నీ సూసుకుంటా వుంటే అంతేకాన. ఒచ్చేయేటిగ్గాకపోతే అప్పై యేటికల్లా మన సత్తెమ్మ పనుల్లోకెల్తది. అప్పుడు మనకేవాదా వుండదు' అని తల్లిని సముదాయించాడు సుందర్రావు. తన చిన్నతనంలో తండ్రి చనిపోయిన పుటి నుంచి తల్లి ఎన్ని కష్టాలు పడి తనను పెంచిందో అతనికి బాగా గుర్తు.

'ఏం బతుకులో' అని నిట్టూర్చి, 'ఐతే పెసిరెంటు డబ్బులియ్యలేదన్న మాట?' అంది నరసమ్మ.

'ఇయ్యలేదు. ఒకేళ యిచ్చినా ఈ నాలుగు రోజుల కూలీ పన్నెండు రూపాలు ఏ మూలకి సరిపోతై? కోవటి సేనయ్య కొట్లో తొమ్మిది రూపాలు బాకే వున్నాం'

'ఇంకేం మిగల్తాయి? ఇయ్యాల దురగమ్మ తెచ్చిన కూల్డబ్బులో బియ్యానికీ, ఎండు పరిగిలకీ పోతే పావలా మిగిలింది'

సుందర్రావు మూడు గుప్పిళ్ల అన్నమూ తినేశాడు. కడుపు నిండలేదు. దుర్గమ్మ మూలకున్న గెంజి దాక కోసం వెళ్ళింది. 'కడుపు నిండా గెంజి తాగితే కొంత దిటవుగా వుంటది' అనుకున్నాడు ఆకలితీరని సుందర్రావు.

ఇంతలోనే పక్కింటి మునెయ్య కూతురు చెంద్రిమ్మ చేత్తో ముంతపట్టుకుని అక్కడికొచ్చి నిల్చుంది. 'ఏఁవే పిల్లా. ఇల్లా గొచ్చేవ్?' అని అడిగింది దుర్గమ్మ. ఆమె చేతిలో గెంజి దాక వుంది.

'ఇదిగోనే.... మాయమ్మ.... కొంత గెంజుందేమో.... అడిగిరమ్మంది' అని భయపడుతూ చెప్పిందా పిల్ల.

దుర్గమ్మ దాకలోని గెంజివైపూ, భర్త ముందున్న గిన్నెవైపూ మార్చి మార్చి చూసింది. 'ఈ గెంజి ఒక లోటా గలాసుడు కూడాలేదు. దీన్ని ఈ పిల్లకిచ్చేత్తే యింకేఁ వుంటది?' అనుకుంది మనసులో.

'ఆ గెంజి చెందర్రిమ్మ కిచ్చెయ్యి' అన్నాడు సుందర్రావు. జీవకళలేని ఆ ఎనిమిదేళ్ల పిల్ల మొహాన్ని చూడగానే అతనా నిర్ణయం చేసుకున్నాడు.

'మరి నీ కొద్దేంటాబ్బ బాబా! నువ్వుదిన్న వొణ్ణం రెండు ముద్దలైనాలేదు' అని అడిగింది తల్లి ఆదుర్దాగా.

'ఒద్దే ఈ పూట నాకాకల్లేదు' అన్నాడు సుందర్రావు. దుర్గమ్మ దాకలో వున్న గెంజిని చెందర్రిమ్మ చేతిలోవున్న ముంతలో పోసింది. చెందర్రిమ్మ వెళ్ళి పోయింది.

'ఈ మాత్తరం గెంజికీ నీళ్లుగలిపి ఐదుగురు తాగుతారు. అంటే ఆళ్ళకీ పూట అన్నం'వే లేదన్నమాట' అనుకున్నాడు సుందర్రావు లేస్తూ. చెయ్యి కడుక్కున్నాడు. 'ఒకేల ఆపిల్లోచ్చీటప్పుడికి గెంజిలేకపోతే ఆళ్ళంతా యీ పూట కడుపులో కాళ్ళెట్టుకుని పడుకునీవోళ్ళన్నమాట' అని కూడా అనుకున్నాడు. ఈ ఆలోచన్లతో అతని మనసు మరింత చికాకుతో నిండిపోయింది.

'ఇయ్యేల్టి కెల్లాగో సదురుకున్నాం. తెల్లారితే ఏందినాలో తెలవటం లేదు. కొంపలో ఒక్క బియ్యపగింజలేదు. కోమటి సేసయ్య అరువిత్తాడో ఇయ్యడో. ఇవ్వకపోతే ఏందింటాం?'

తల్లికి కలిగిన సందేహాలే అతనికీ కలిగాయి. ఒళ్ళెరుగకుండా నిద్రపోతున్న పిల్లలవైపు చూశాడు. ఏం చెయ్యాలో అతనికి తోచలేదు. మాలపల్లిలో అందరి పరిస్థితీ దాదాపు ఒకేలాగా వుందని అతనికి తెలుసు. ఎవరికి వారే తమ ఆకలి తీర్చు కోవడానికి తంటాలు పడుతున్నారు.

గుడిసెదాటి వచ్చాడు. నల్లని ఆకాశంలో మెరుస్తోన్న నక్షత్రాలు పిల్లకాలవలో ప్రతిఫలిస్తున్నాయి. కాలవ కవతల పొలాల్లో నక్కలు అరుస్తున్నాయి. దూరాన ట్రింకురోడ్డు మీద ఏదో లారీ పోతున్న శబ్దం లీలగా వినబడుతోంది.

సహదేవుడి గుడిసె దగ్గిరకొచ్చి 'సాదేవా, ఒరే సాదేవా' అని పిలిచేడు సుందర్రావు.

'లేడు మావయ్యా, రామాలయం కాడికెల్లేడు' అని చెప్పింది సహదేవుడి భార్య ముత్యాలు.

రామాలయం ఒకటి అసలు గ్రామంలో వుంది. అది కాకుండా మాలపల్లిలో మరొక 'రామాలయా'న్ని గ్రామ పెద్దల అండదండలతో 'హరిజనులు' కట్టుకోవలసి వచ్చింది. గ్రామంలోని రామాలయంలోకి ఈ మాలపల్లి వాళ్ళెవ్వరూ వెళ్ళరు.

రామాలయం వైపు నడిచేడు సుందర్రావు.

* * * *

'ఈ లెక్కనయితే ఈ యేడు గొంతేలమ్మ పండుగేం జేసుకుంటాం?' అంటున్నాడు సుబ్బన్నతాత సుందర్రావు అక్కడికి చేరేసరికి.

సుబ్బన్నతాత రామాలయం ఎదురుగావున్న రావిచెట్టు కింద కొలువు దీర్చేడు. అతని చుట్టూ పది పదిహేను మంది కూర్చునివున్నారు. వాళ్ళలో సహదేవుడు కూడా వున్నాడు. రాత్రి పొద్దుపోయేదాకా అక్కడ కాలక్షేపం చేయడం వాళ్ళ కలవాటు.

'ఈడెక్కడ దొరికాడ్రా మనకి? కొంపలంటుకుంటుంటే బీడీ ఎలిగించుకొనీ వోడిలాగా ఓ పక్కని తింటాకి తిండిలేక ఏడుత్తావుంటే గొంతేలం పొండుగంటా లంకించుకున్నాడేంటి' అన్నాడు పిల్లెంకడు.

'ఓరి సన్నాసెదవా, ఏటి కోతూరైనా పండగ పప్పల్దినొద్దేంటి? నాకు 'ఉక' దెలిసి నప్పుణ్ణించి యిప్పుడుదాకా ఏయేడైనా పండుగ మానేసేంవా? ఈ యేడు మన కరమం యిలాగేడిసిందిగాని' అన్నాడు సుబ్బన్నతాత.

'ముసల్లమ్డీకొడకా, నీ కిప్పుడు పప్పులే తక్కువైనయ్' అన్నాడు పెంటయ్య వేళాకోళంగా.

దాంతో సుబ్బన్నతాతకి కాస్త కోపం వచ్చింది. 'ఓరి కుర్ర తొత్తుకొడకా. పెద్దంతరం సిన్నంతరం లేకుండా పేలతన్నావు యెదవ పేలాపన' అంటూ లేచి పెంటయ్యమీది కెళ్ళబోయాడు. 'ఆగరా పెద్దోడా ఏదో కుర్ర యెదవ తెలవకన్నాడు ఊరుకో' అంటూ కిష్టిగాడు అడ్డుతగిలాడు. సుబ్బన్నతాత గొణుక్కుంటూ కూర్చున్నాడు.

కిష్టిగాడు 'దత్తుడురాజు' దగ్గిర పెద్ద పాలేరు. దత్తుడురాజు ఆ వూళ్ళోకల్లా పెద్ద భూస్వామి. కిష్టిగాడు పేద కుటుంబం నుంచి వచ్చినప్పటికీ 'రాజుగారి కమతగాడు' అని పిలుచుకుంటూ కాస్త హోదా వెలగబెడుతున్నాడు. రోజా కూలీల కెళ్ళేవాళ్ళూ, చిన్న రైతుల దగ్గర పాలేరుతనం చేసేవాళ్ళు వాడికి సాటి వాళ్ళలాగా కనిపించరు.

'కూకోరా సుందర్రావా వొణ్ణం దిన్నావా?' అంటూ పలకరించేడు సహదేవుడు సుందర్రావుని.

'వొణ్ణంవంటే గేపక వొచ్చింది, ఒరే సాదేవా, సేసయ్య సావకారు అరువు శిత్తం లేదంట....?' అన్నాడు ఏసుపాదం.

'ఇవ్వడంట పొద్దున్న నేనెల్లొచ్చేను.... లచ్చ రూపాలు వూరిమీద వొడ్డీకి దిప్పుతాడు గాని మన కరువిత్తాని కేడుత్తాడు' అన్నాడు నారాయుడు.

'ఊరొదిలి పారిపోతాఁవనుకున్నాడేంటి?' అన్నాడు గంగడు.

'పాపం ఆ కోవటాయన మాత్తరం ఏం జేస్తాడు? అడ్డమైనోళ్ళందరికీ అరువు లిచ్చేత్తే నాలుగోనాడు నెత్తిని సెంగేసుకుపోవాలి' అన్నాడు కిష్టిగాడు.

'పాపం. కిట్టయ్యమావకి సావకారంటే ఎంతజాలి' అన్నాడు నర్సిమ్మూర్తి.

'జమీందారుల్దగ్గిర కమతగాడుకదా, సావకార్లంటే ఆ మాత్తరం ఇదుంటాది మరి' అన్నాడు సామియేలు.

కిష్టిగాడికి కోపం వచ్చింది. 'ఓరెదవన్నర యెదవల్లారా, ఎప్పుడు జూసినా నాకు బడి ఏడుత్తారు గాని మీ బతుకులిలా గున్నందుకేదవరేఁవిరా?' అన్నాడు వుక్రోషంగా.

గంగడు వుండబట్టలేకపోయాడు. 'మా బతుకులకేఁవిరా మేవు ఎవడి దగ్గిరా యెంగిలి నీళ్లతాగి బతకడంలేదు. మా రెక్కల కస్టం....'

మాట పూర్తయేలోగానే కిష్టిగాడు గంగణ్ణి సమీపించి, 'ఏంట్రా లంజాకొడకా, ఏవన్నావు? మళ్లీఅను. మీసఁవున్న మొగోడివైతే మళ్ళీఅను–' అని సవాల్ చేశాడు.

'ఒక్కసారేంటెహె? లచ్చ సార్లంటాను' అని గంగడు చెబుతూండగానే సుందర్రావూ, సహదేవుడూ, ఏసుపాదం కలగజేసుకున్నారు. కిష్టిగాడికి నచ్చజెప్పి యింటికి పంపేశారు.

కిష్టిగాడు వెళ్ళిపోయింతర్వాత అంతా వాణ్ణి తలోమాట అన్నారు.

'నాలుగేళ్ళూ నోట్లోకెళ్తన్నాయి మరి. ఆ మాత్రిం గీరుండదా ఆడికి?' అన్నాడు సుందర్రావు.

'ఒల్లొంచి పన్జేసి ఎరగడు. పెద్ద పాలేర్నిగదా అని ఆళ్ళ మీదా ఈళ్ళ మీదా అవులుజేత్తావుంటాడు ఎదవ' అన్నాడు పెంటయ్య.

'జనార్దనార్రావుగారి గేగి దత్తుడి సేనుకడ్డఁవడితే ఆళ్ళ పాలేర్ని బట్టుకుని దత్తుడు సావగొట్టేడు గేపక వుందా? అప్పుడీడు దత్తుడు చేసిందాంట్లో తప్పేవీలేదన్జెప్పి నాతో దెబ్బలాడేడు' అన్నాడు ధర్మయ్య.

'దత్తుడాడికి దేవుడు' అన్నాడు సుబ్బన్నతాత.

'ఒరే ముసలోడా, నాకు తెలవకడుగుతానూ మనఁవే లేకపోతే ఈ దత్తు డెవడ్రా?' అన్నాడు గంగడు.

'కుర్రోడివైనా మా బాగా జెప్పేవ్, నిజవే మరి. మనంలేపోతే ఈ దత్తు దెవడు?' అన్నాడు సుబ్బన్నతాత గంగడిని సమర్థిస్తూ.

'ఒరే పెద్దోడా. మన కళ్ళముందు శానా యిడ్డూరాలు జరిగిపోతున్నాయి. ఆటిని మనం సూశ్నేకపోతన్నాం. ఇన్నేళ్ళనించి యెగసాయప్పనుల్లో కెల్తన్నాం, మనూరి రాజులూ, కమ్మోళ్ళూ మనకేవిన్చేరూ? నెత్తికి సేతులిచ్చేరు. ఆళ్ళేమో యింకా యింకా గడిపించుకుంటన్నారు. దత్తుడి రాజుకెక్కడెక్కడా బూవులున్నాయో ఆయనకే గేపకంవుండదు పాపం. సూరపరాజుగారికి పంచదార మిల్లులో వాటా వుంది. సత్తిన్నారాయణగారు మెడ్రాసెల్లి లచ్చలు పెట్టుబడెట్టి సినేంవా దీత్తన్నాడు. అసలీళ్ళకీ డబ్బెక్కడదంటా? మన రెక్కల కష్టం కాదా?' అన్నాడు సుందర్రావు.

'అంతేమరి' సాలోచనగా అన్నాడు సుబ్బన్నతాత.

'మన రెక్కల కష్టంగాపోతే యీ సూరపరాజుగాని దత్తుడురాజుగాని సత్తిన్నారాయణగాని ఎప్పుడన్నా దుక్కిదున్నేరా? ఊడుపూడ్చేరా?' అన్నాడు నారాయుడు.

'మన పెసిరెంటు యిసినాదం మాత్తరం తక్కువ సంపాయించేడా? కాకినాట్లో మేడ గట్టేడు. రాజమంద్రింలో పెద్ద దుకాణపెట్టించేడు తమ్ముడి సేత.' అన్నాడు సహదేవుడు.

'ఒరేయ్, ఆళ్ళని లచ్చాదికారుల్ని జేసి మనం వొణ్ణం మెతుకులికి మొకంవాసి పోతన్నాం. ఆళ్ళేమో మన గాలి తగిల్తేనే పాపాలంటుకున్నట్టు నానా గొడవా జేత్తారు. కానీ మనవసరం లేకండా ఒక్కరోజు గడవదీ మోతుబర్లుకి' అన్నాడు సుందర్రావు.

'అంతేమరి, తొలకరి నుంచి మసూళ్లు దాకా చేసేది మనంవూ - అనబగించేది ఆళ్ళూనూ. ఏంజేత్తా? బొమ్మదేవుడు రాసిన రాత తప్పదు. మన కరమంరా బాబా' అన్నాడు సుబ్బన్నతాత.

'కరమంలేదు గిరమంలేదు. నువ్వు నోరుముయ్యరా ముసలోడా' అన్నాడు పెంటయ్య.

'అది సరేగాని, ఒరేయ్, నాకిది జెప్పండ్రా. మన్లో యెవడికైనా రెండు సొక్కాయిలున్నయా?' అని అడిగాడు సుందర్రావు.

'రెండు సొక్కాల మాటకేంగాని ఒక్క సొక్కా గూడా లేని నాబోటోళ్ళు శానా మందున్నారు' అన్నాడు ఏసుపాదం.

'సొక్కాల దాకా ఎందుకురా? సలికాలంవొచ్చింది. పిల్లలు కప్పుకుంటాకి సరైన దుప్పటిగుడ్డ ఎంత మందికుందిరా?.... ఎప్పుడు జూసినా బేడ మంచినూనీ, బేడ వుల్లిపాయలూ, బేడ కిర్సనాలూ తప్పితే జల్మలో ఎప్పుడైనా ఒక్కసేరు మంచి నూనె, ఈసెడుల్లిపాయలు, సేరు కిర్సనాలు కొన్న మొకాలేనా మనయ్యి? సెప్పండ్రా?' సుందర్రావు కాస్త ఉద్రేకంగా అన్నాడు.

అందరూ మౌనంగా వుండిపోయారు.

'ఒరే బాబా మనం మాలోల్లం. రాజుల్లాగా, కమ్మోర్లాగా మన ఆడోళ్ళు యిళ్ళల్లో గూకుంటే మనకి జరుగదురా. అంతుకనే పనిదొరికిందంటే మనం మొగుడూ పెళ్లాం పనుల్లోకెల్లాలి.... ఏరా పెద్దోడా! ఇంతజేస్తున్నా మనల్ని నమ్ముకున్న పిల్లలకి కడుపునిండా గెంజిపొయ్యలేకపోతన్నాం. ఇది యెందుసేతంటావు?'

'పెద్దోడు' ఏమీ చెప్పలేకపోయాడు.

'అదిపోనీగాని నాకీ సంగతి చెప్పండొరే. మన్లో ఎవడింటోనైనా ఇప్పుడు అడ్డిడంటే అడ్డెడు బియ్యపగింజలు దొరికితయ్యా?.... సెప్పండ్రి' అన్నాడు.

'బియ్యానిక్కరువొచ్చేసిందిరా నారాయణ. ఈ ఏడు పంట బాగా తగ్గిపోయిందంట. బియ్యం ధర పెరిగిపోయిందంట - కరణంవంటన్నాడు మొన్న' అన్నాడు సుబ్బన్నతాత.

'పంట తగ్గిపోబట్టేనేంటి లారీల మీద లారీలెల్తన్నాయి బియ్యం? తెలవకపోతే టంకురోడ్డు మీదికెల్లి జూడవయ్యో' అన్నాడు ధర్మయ్య.

'మన్లో ఎవడి కొంపలోనూ అడ్డెడు బియ్యం లేవుగాని బియ్యం లారీలు మాత్తరం మా జోరుగా ఎల్తన్నాయి' అన్నాడు గంగడు.

'అడ్డం గొడదాం రండెహె లారీల్ని. ఎవడడ్డంవొత్తాడో సూద్దారి' అన్నాడు నర్సిమ్మూర్తి ఉప్పొంగే ఆవేశంతో.

అంతకు ముందు రామాలయం వైపు నడిచివస్తోండగా సుందర్రావుకి కూడా ఇదే ఆలోచన తట్టింది. తనకు కలిగిన ఆలోచనే నర్సిమ్మూర్తికి కూడా కలిగినందుకతను ఆశ్చర్యపడ్డాడు.

'సెయ్యాలంటే సెయ్యొచ్చుగానీ తర్వాత సిక్కుల్లో పడతామేమోనని కొంత యిదిగా వుందిరా' అన్నాడు నారాయుడు.

'ఏ సిక్కులూ రాకండా అందరం ఆలోసించే సేద్దారి' అన్నాడు సామియేలు.

'అవును మరి, కంగారుపడితే లాబంలేదు' అన్నాడు సహదేవుడు.

'ఏంటాత్రి? నిజంగా లారీలడ్డం గొడదాఁవనే?' అని అడిగాడు సుబ్బన్నతాత ఆదుర్దాగా.

'లేపోతే యాలాకోలఁ ఏడతన్నాఁ వనుకున్నావా?' అన్నాడు పిల్లెంకడు.

'ఏడ్సినట్టుంది. రాఁవాయణఁవంత యిని రావుడికి సీతేఁ వవుద్దని అడిగినట్టు యించేపూ మనం మాట్టాడు కున్నదేంటి? నువు అరదం జేసుకున్నదేంటి" అన్నాడు గంగడు.

'అరవై యేళ్ళొచ్చినా నీకు బుర్రలేదురా ముసలోడా, మనం పెద్ద పెద్ద గరానా దొంగల్దగ్గర్నుంది మన కూలోల్లక్కాఁవల్సిన బియ్యం దెచ్చుకుంటాఁవంతే. ఇది దొంగతనఁ ఎలాగవుద్ది?' అన్నాడు ఏసుపాదం.

'ఏమో మీ యిస్టం. కాని జాగత్తాగా వుండాలాత్రి బాబా'

'నిజవేఁ, జాగత్తాగా వుండాలి. మనం పరాయోళ్ళెవరికీ యీ యెవారం తెలవనివ్వకూడదు. కిట్టిగాడిలాఁటోళ్ళ కసలే తెలవకూడదు. అన్ని యివరాలూ బాగా మాటాడుకుని, యీలు కుదిరితే రేపు మాపటికే జేశేద్దారి' అన్నాడు సుందర్రావు.

ఆ తర్వాత వాళ్ళంతా తమ పథకాన్ని గురించి చర్చించుకున్నారు.

* * * *

ఆ మర్నాడు రాత్రి పదిగంటల వేళ.

మాలపల్లికి దూరంగా వున్న వూరు మాటు మణిగింది. పిల్లకాలవ అవతలి గట్టున నేరేడు చెట్టుకింద, దట్టమైన చీకట్లో సుందర్రావుతో పాటు దాదాపు ఏభైమంది కూర్చునివున్నారు. అంతకు ముందు రోజు రాత్రి రామాలయం దగ్గిర కల్సుకున్న వాళ్ళు అతి రహస్యంగా మాలపల్లిలోని ముఖ్యమైన వాళ్ళందర్నీ కలుసుకుని, ఈనాటి సాహసానికి ఒప్పించారు.

ఇంతలోనే సుబ్బన్నతాత, మునయ్య, అతని భార్యనాగమ్మ, సామియేలు, అతని భార్య వజ్రావతి కూతురు సంతోషం వచ్చి వాళ్ళను కలుసుకున్నారు.

'ఆదోళ్ళెంతు కొచ్చేరు? బత్తాలు మొయ్యాఁగల్దురేంటి? ఈ ముసలోడెంతుకూ' అన్నాడు సహదేవుడు.

'వొద్దంటే యినకుండా ఎమ్మటబడ్డారు' అన్నాడు మునయ్య.

'ఏం ? మేఁవు రాకూడదా ?' అనడిగింది నాగమ్మ.

'వొద్దు. ఎలిపోండి. ఏని శానా కష్టం. ఇల్లదగ్గిరుండండి. పనైతే రెండు గంటల్లో వొచ్చేత్తాం' అన్నాడు సుందర్రావు.

'జాగత్తాగా ఎల్లిరండా్రి బాబా' అని వాళ్ళతో చెప్పాడు సుబ్బన్నతాత.

'ఎల్లండొలే' అన్నాడు సామియేలు. సుబ్బన్నతాత, ఆడవాళ్ళు 'పబ్టై' మీదుగా కాలవదాటి మాలపల్లి వైపు వెళ్ళిపోయారు.

'అనుకున్నోళ్ళంతా వొచ్చేసారుగందా ? .... జాగత్తాగా వుండాలి. ఏది ఏఁవైనా సరే మనగుట్టు మాత్రం బయట పెట్టగూడదు. మీ బిడ్డల మీదొట్టు' అన్నాడు సుందర్రావు.

'అలాగే' అని భరోసా యిచ్చేరు వాళ్ళు.

'ఇంకా ఎందుకీక్షడ ? బయలెల్దాం నడవండా్రి' అంటూ కదిలాడు మునలయ్య.

'ఒరేయ్, ఒరేయ్, అందరంగల్సి వాడపిల్లి తీర్తానికెల్లినట్టు 'పోలో' మని పోవటం కాదు. పదేసి పదేసి మందిని నేను, సాదేవ, గంగడు, పిల్లెంకడు, దరమయ్య తీసికెల్తాం. ఇదుగో ! మనఁవెల్లవొలిసిన పోటు కెల్లీదాక ఒక్కడు గూడా కిక్కురు మనకూడదు. తెలిసిందా ?' అన్నాడు సుందర్రావు.

పిల్లెంకడు పది మందిని తీసుకుని కాలవగట్టు విడిచి మునసబు పొలానికడ్డంపడి ట్రింకురోడ్డు వైపు నడక సాగించేడు. అక్కడికి ట్రింకురోడ్డు రెండు ఫర్లాంగుల దూరం వుంటుంది.

మొదటి జట్టునలా బయల్దేరనిచ్చి, సహదేవుడు మరో పది మందితో కాలవ గట్టు మీద ఒక ఫర్లాంగు దూరం వెళ్ళి, సీతయ్యగారి మామిడితోటలోకి మళ్ళి ట్రింకు రోడ్డు వైపు నడక సాగించేడు.

మిగతా మూడుజట్లు వేరువేరు దారుల్లో బయల్దేరారు. మొత్తం మీద అందరూ ట్రింకురోడ్డు మీదున్న వంతెన దగ్గిర కల్సుకున్నారు. ట్రంకురోడ్డుకి అవతలి వైపు, ఆ వంతెనకి ఒక ఫర్లాంగు దూరంలో ఆ వూరి మాదిగపల్లి వుంది.

సుందర్రావూ, సహదేవుడూ, గంగడూ, ధర్మయ్యా, పిల్లెంకడూ వంతెన పక్కగా నిలబడ్డారు. మిగతా జనమంతా పరికాస్త వెనక్కివెళ్ళి జనపచేను గట్లమీద కూర్చున్నారు. ఆ చీకట్లో వాళ్ళనెవరూ గమనించలేరు.

అందరూ మంత్రించినట్టు నిశ్శబ్దంగా వున్నారు. ఆ నిశ్శబ్ద వాతావరణంలో ఏభైమంది చైతన్యవంతులైన పేదలు ఒకచిన్న అవకాశంకోసం ఎదురు చూస్తున్నారు.

అరగంట గడిచింది. దూరంగా హెడ్‌లైట్లు కనిపించాయి. 'చిన్నకారు' అన్నాడు ధర్మయ్య లైట్లకీ, భూమికీ మధ్యవున్న దూరాన్ని బట్టి.

'అవును' అన్నాడు సుందర్రావు. ఐదుగురూ వంతెనవెనక నక్కారు. చిన్న కారు వెళ్ళిపోయింది.

మరో పావుగంటకి ఒక గవర్నమెంటు బస్సు వెళ్ళింది.

బస్సువెళ్ళిన పదినిముషాల్లో దూరంగా లారీ హెడ్‌లైట్లు కనిపించాయి. శబ్దాన్ని బట్టి అది లారీయేనని వాళ్ళు సులువుగా పోల్చారు. వెంటనే భుజంమీది కండువాలు తీసి ముఖం సరిగా కనిపించకుండా చెవులమీదుగా తలపాగాలు చుట్టుకున్నారు. ఐదుగురు రోడ్డు కడ్డంగా నిలబడ్డారు.

చేనిగట్ల మీదవున్న జనం జరగబోయేదానికోసం ఆతృతగా ఎదురు చూస్తున్నారు.

లారీ దగ్గరయింది. సుందర్రావు చెయ్యి అడ్డం పెట్టాడు. లారీ వాళ్ళని సమీపించి ఆగింది. 'ఏంటి?' అని అడిగేడు డ్రైవరు విసుగ్గా.

'బాబ్బాబు' మా యిద్దర్నీ తీసికెళ్ళి రాపులపాలెంలో దింపెయ్యి బాబు. అక్కడ మాయప్పకి పేణం మీదికొచ్చింది. డబ్బులిత్తాం బాబు' అని ప్రాధేయపడుతున్నాడు సహదేవుడు. ఈ లోపుగానే గంగడు లారీని చుట్టివచ్చి అది బియ్యం లారీయేనని నిర్ధారణ చేసుకొని సన్నగా యీల వేశాడు. చేనిగట్ల మీదున్న జనం మాటా పలుకు లేకుండా బయల్దేరి రోడ్డెక్కారు.

'కోల్లేదు' అని నిర్లక్ష్యంగా చెప్పబోతున్న డ్రైవరు సుందర్రావు చేతిలో కత్తి చూసి బెదిరిపోయాడు. ఇంతలోనే అతని ఎదురుగా జనాన్ని చూశాడు. భయంతో వణికిపోయాడు.

'నిన్నేంవీ జెయ్యం. బయపడకు' అన్నాడు సుందర్రావు.

డ్రైవరు భయం కొంత తగ్గింది. 'లారీని రోడ్డు పక్కగా నిలబెట్టు' అన్నాడు సుందర్రావు ఆజ్ఞాపూర్వకంగా.

ఆజ్ఞపాలించేడు డ్రైవరు.

'ఇంజినాపై, లయిట్లారిపై'

అలాగే చేశాడు డ్రైవరు.

'దిగిరా'

డ్రైవరు దిగాడు 'క్లీనూ, నువ్వుగూడా దిగు'

'ఏంటీ దవుర్జన్యం?' అన్నాడు క్లీనరు.

'మాటాడొద్దు. నోరిప్పితే దెబ్బదింటావు'

నర్సిమ్మూర్తీ, గంగడూ, పెంటయ్యా, ఏసుపాదం- డ్రైవర్నీ, క్లీనర్నీ జనపచేను మధ్యకంటా నడిపించుకువెళ్ళి అక్కడ కూర్చోబెట్టారు.

'ఒక పదినిమిసాలు గూకోండి. తరవాతెలిపోవచ్చు.' అని వాళ్ళతో అన్నాడు పెంటయ్య స్నేహపూర్వకంగా.

నారాయుడూ, సుందర్రావూ, సామియేలూ, మునెయ్యా లారీ పైకెక్కి కిందున్న వాళ్ళకి బస్తాలెత్తడం మొదలెట్టారు. వీపున బస్తా మోస్తూ ఒక్కొక్కడూ చేలకడ్డంపడి మాలపల్లి వైపు నడకసాగించారు.

లారీ సగం ఖాళీ అయేటప్పటికి యెదురుగా ఒక చిన్నకారు వస్తొన్న సూచనలు కనిపించాయి. వెంటనే జనం చేలోకి తప్పుకున్నారు. ఒక్క సుందర్రావు మాత్రం లారీ డోరు తెరిచివుంచి నిద్రపోతున్నట్టు నటించేడు. కారు వెళ్ళిపోయింది. వెంటనే జనం రంగంలోకి సిద్ధమయారు. ఇళ్ళకి చేరవేసిన వాళ్ళలో పదిమంది అలసటను కూడా లెక్క చెయ్యకుండా తిరిగి వచ్చారు. వాళ్ళంతా మూగగా గొప్ప ఆనందం పొందుతున్నారు.

అర్ధరాత్రి దాటేసరికి వాళ్ళ కార్యక్రమం దాదాపు ముగిసింది. డ్రైవరుకీ, క్లీనరుకీ కాపలాగా వున్నవాళ్ళు తిరిగి వచ్చారు. వాళ్లూ, సుందర్రావూ తలకొక బస్తానూ ఎత్తుకుని బయల్దేరారు, తీసుకెళ్ళే వీలులేక వాళ్ళు పదిబస్తాల్ని లారీలోనే వదిలివేశారు.

డ్రైవరూ, క్లీనరూ మతిలేని వాళ్ళలాగ లారీ దగ్గిరికి నడుచుకుంటూ వచ్చారు.

* * * *

ఆ రాత్రి వాళ్ళెవరూ నిద్రపోలేదు. తెచ్చుకున్న బియ్యాన్ని దాచుకోవడంతోనే ఆ రాత్రంతా గడిచిపోయింది.

ఆడవాళ్ళు కూడా మగవాళ్ళతో పాటు శ్రమపడ్డారు. గునపాలకీ, పార్లకీ పని తగిలింది. ఇంత జరుగుతున్నప్పటికీ కిష్టిగాడి లాంటి దళారీలకి ఏ మాత్రం తెలియకుండా జాగ్రత్తపడ్డారు.

గంగడు తన వాటా కొచ్చిన బస్తాబియ్యం తనకున్న కాస్త పెరట్లోనూ గొయ్యి తీసి అందులో పాతిపెట్టాడు. గోతిపైన తుక్కూ దూగరా పోసి అసలక్కడ తవ్విన గుర్తులే లేకుండా చేశాడు. ఈ పద్ధతి చాలా మంది అవలంబించేరు.

ఏసుపాదం భార్య రూతమ్మ బియ్యం బస్తాను పంచ పాకీలో పెట్టి చుట్టూ పిడకల గూడు కట్టింది.

అటకలున్న వాళ్ళు అటకపైనవేసి, బస్తా కనబడకుండా తాళ్ళూ పేళ్ళూ అడ్డదిడ్డంగా పారేశారు.

సామియేలూ, నారాయుడూ, మరికొందరు తమ బస్తాలు తీసుకెళ్ళి మాలపల్లి పక్కనే వున్న పోరంబోకు భూమిలో పాతిపెట్టారు.

ఎవరికి వాళ్ళు తీసుకోగా చివరికి పదకొండు బస్తాలు మిగిలిపోయాయి. ముఖ్యమైన వాళ్ళు పదిమందీ ఆలోచించారు.

'పాపం నూసీవోళ్ళూ సేసీవోళ్ళూ లేక సుబ్బన్నాత గిజగిజలాడి పోతున్నాడు. ఆడికి మనం వాటా యివ్వాలి' అన్నాడు నర్సిమ్మూర్తి.

'మరి మన మేస్టరమ్మ సాౖరతమ్మకి, పాపం, మూడు మాసాల్నించి జీతాల్లేవు. ఆ తల్లి సంగతి గూడా మనం వాలోచించాలి' అన్నాడు పిల్లెంకడు.

వాళ్ళిద్దరికీ చెరో బస్తా కేటాయించాలని నిర్ణయించారు.

'ఈ మిగిలిపోయిన బత్తాలు దరమయ్య సేలోదాయాలి' అన్నాడు సుందౖరావు, ధర్మయ్యకి పూర్వీకులిచ్చిన అరెకరం భూమి వుంది, అతనొక పేదరైతు.

'ఎంతుకని' అని అడిగాడు గంగడు.

'ఎందుకంటే.... ఒకేళ రేపు పోలీసోళ్ళొచ్చి మన గుట్టు కనిపెట్టి బియ్యంవన్నీ పట్టికెళ్ళిపోతారనుకో. అప్పుడింక మనోళ్ళేం దింటాౖరా? అంతుకే ఈ బత్తాలు మన వుమ్మడి సొమ్మనుకుని దాసుకోవాలి. రేపు ఎటుదిరిగి ఎటొచ్చినా ఈ బత్తాలైనా మిగుల్తాయి ఏవంటా?' అన్నాడు సుందౖరావు.

అతను చెప్పిందాని కందరూ అంగీకరించారు. గునపాలూ, పారలూ తీసుకుని ఆ బత్తాలతో పొలం బయల్దేరారు. వాళ్ళు పొలం నుంచి తిరిగి వచ్చేటప్పటికి తొలికోడి కూసింది.

* * * *

తెల్లవారుతోండగా పోలీసు జీపు వంతెన దగ్గిర ఆగింది. సబిన్స్పెక్టరూ, హెడ్డూ, ఇద్దరు పోలీసులూ, లారీ డ్రైవరూ, క్లీనరూ దిగేరు.

'ఇక్కడేనండి' అంటూ ఘటన జరిగిన స్థలాన్ని చూపించాడు డ్రైవరు.

నేలమీద రాలిన బియ్యం గింజలు జరిగినదానికి సాక్ష్యంగా వున్నాయి. ఏదో వస్తువు పారేసుకున్న వాళ్ళలాగా యిద్దరు పోలీసులు ఆ చోటంతా వెదకడం మొదలు పెట్టారు.

'బస్తాలు తీసుకుని వాళ్ళెటెళ్ళారు?' అని అడిగాడు ఇనస్పెక్టరు.

'మమ్మల్నిద్దర్నీ ఆ జనపసేలో కూకోబెట్టి, నలుగురు కాపలావున్నారు గదాండి. అంతుకని సీకట్లో ఆళ్ళెటెళ్ళేరో కనబళ్లేదండి' అన్నాడు డ్రైవరు.

'లారీ ఆపినవాళ్ళుగాని మీకు కాపలావున్నవాళ్ళుగాని కనిపిస్తే గుర్తుపట్టగలరా?'

'కష్టవండీ' అని ఇద్దరూ ఒప్పేసుకున్నారు.

'ఏడిసినట్టుంది. పోనీ వాళ్ళలో ఎవడిపేరైనా మీకు తెలుసా?'

'మా దగ్గిర కాపలావున్నవాళ్ళలో ఒకడి పేరు మాత్రిం గంగడని ఆళ్ళ మాటల్లో తెలిసిందండి.'

'ఫరవాలేదు. ఆమాత్రివైనా జ్ఞాపకం వుండేడిసింది' అంటూ పరిశీలనగా చుట్టూ చూశాడు ఇనస్పెక్టరు. కనుచూపు మేరలో మాదిగపల్లి కనిపించింది.

జీపు మాదిగపల్లి శివార్లో ఆగింది. జీపును చూడగానే ఖంగారుపడుతూ నరిసిగాడు జీపు దగ్గిరికొచ్చి, అల్లంత దూరంలో చేతులుకట్టుకు నిలబడ్డాడు.

'నీ పేరేంట్రా' ఇనస్పెక్టరు ప్రశ్న.

'నరిసిగోణ్నండె బాబయ్యా, ఈవూరికి తలారోణ్నండె'

'గంగడు ఇంటో వున్నాడా?'

'సిత్తం.... ఏ గంగడండి బాబయ్య?'

'ఎంతమందున్నా రేవిటి ఆ పేరుతో?'

'ఇద్దరున్నారండె. ఒకడేమో పుల్లిగాడి కొడుకండె. ఆడు సిన్నోడు. ఇంకొక దేమో కొంత పెద్దోడండె'

'ఇద్దర్నీ తీసుకురా'

'సిత్తం సిత్తం' తలారి వెళ్ళాడు.

ఇంతలోనే లారీకి,* అందులోని సరుక్కీ యజమాని ఐన సుబ్బరాజుగారి కొడుకు క్రిష్ణంరాజు మోటారుసైకిలు మీద అక్కడికి కొచ్చేడు. 'ఏం తిడతాడో' అని డ్రైవరూ, క్లీనరూ భయం భయంగా నిలబడ్డారు. కాని అతను వాళ్ళవంక చూడనేలేదు.

'నాన్నగారు లేరాండి' అని సాదరంగా అడిగేడు ఇనస్పెక్టరు.

'లేరండీ, లాస్ట్‌నైట్ హైడ్రాబాదెళ్ళేరు' అన్నాడు క్రిష్ణంరాజు. 'మీ కబురు నాకిప్పుడే అందింది. ఇన్వెస్టిగేషన్ ఎందాకా ?'

'దొరికి పోతార్లెండి వెధవలు' అని నవ్వేడు ఇనస్పెక్టరు.

'గంగడు' పేరుతో వున్న యిద్దరూ వచ్చారు. ఒకడికి ఏభై ఏళ్ళుంటాయి. రెండో వాడికి పద్దెనిమిదేళ్ళుంటాయి. ఇద్దరికీ ఒంటిమీద గోచీ మాసిపోయిన చిరుగుల కండువా తప్ప మరేమీ లేదు. భయం భయంగా దూరం దూరంగా నిలబడ్డారు చేతులు కట్టుకుని.

'వీళ్ళలో ఎవడు' అని అడిగేడు ఇనస్పెక్టరు.

'సీకటి కదాండి, ఆనమాలు దొరకడం లేదండి' అన్నారు డ్రైవరూ క్లీనరూను. ఆ యిద్దరూ కాదేమోనని వాళ్ళు మనసులో అనుకున్నారు. కాని పైకి చెప్పేధైర్యం లేకపోయింది.

'ఏరా గంగా ? ఏ మాత్రిం బియ్యం దొరికాయిరా ?' అని అడిగేడు ఇనస్పెక్టరు. ఇద్దర్నీ మార్చి మార్చి చూస్తూ. తన తెలివిమీద అతనికి గొప్ప నమ్మకం వుంది. అందరు పోలీసువాళ్ళలాగే అతనికి కూడా అంతులేని దురహంకారం వుంది.

వాళ్ళిద్దరూ అయోమయంలో పడ్డారు. 'త.... తంవురునన్నే అడుగుతున్నారాండి ?' అంటూ తడబడ్డాడు ముసలి గంగడు.

'నిన్నేరా' అంటూ మళ్ళీ యిద్దరివంకా జూశాడు ఇనస్పెక్టరు.

'ఏ బియ్యంవండె ?' అని అడిగేడు పడుచు గంగడు అమాయకంగా.

'నాటకాలాడక నిజం జెప్పెయ్యండ్రా' లేపోతే తోళ్ళూడిపోతై' అని హెడ్డు హెచ్చరించేడు.

'మ....! మాకేంవీ తెలువదండె. నా బిడ్డల మీద పెమాణకంజేసి చెపుతున్నాను. సిన్నప్పట్నుంచీ ఈ వూరు రైతులికి సెప్పులు గుడతన్నాను. గంగడెలాంటోడని ఏ రైతునైనా అడగండయ్యగారూ' అన్నాడు ముసలి గంగడు వణికిపోతూ.

'ఊఁ. సరే.... ఒరేయ్. మీరిద్దరూ వీళ్ళ కొంపలూ, వీళ్ళ చుట్టాల కొంపలూ తనిఖీ చెయ్యండి' అంటూ పోలీసులిద్దరికీ ఆర్డరు జారీ చేశాడు ఇనస్పెక్టరు 'ఒరే తలారీ. వీళ్ళిద్దర్నీ గ్రామ చావడికి తీసుకురా' అని, 'పదండి సాబ్' అని కిష్టం రాజుతో చెప్పి జీపు స్టార్ట్ చేశాడు.

*  *  *  *

ఆ యిద్దరు పోలీసులు మాదిగవాళ్ళ గుడిసెల్లోని కుండా ముండా పగలగొట్టి, ఏమీ ఆచూకీ చిక్కక గ్రామ చావడికి తిరిగొచ్చారు. ఏ గుడిసెలోనూ తవ్వెడు బియ్యంకన్నా ఎక్కువ కనిపించలేదని చెప్పేరు. అయితేనేం? వాళ్ళు తిరిగొచ్చే టప్పటికే హెడ్డు ఆ యిద్దరి మాదిగల ఒళ్లు హూనం చేశాడు. ఆ దెబ్బల ధాటి నుంచి కోలుకోవడానికి వాళ్ళకి కనీసం వారం రోజులు పడుతుంది. బాధతో మూలుగుతూ, భయంతో వణికిపోతూ నిలబడ్డారు వాళ్ళిద్దరూ. వాళ్ళని మధ్యాన్నానికి విడిచిపెట్టారు.

ఇదంతా ప్రెసిడెంటు, కరణం, మునసబుల సమక్షంలో జరిగింది.

ఆ పూట పోలీసు బృందానికి మునసబు భోజనాలు ఏర్పాటు చేశాడు.

విచారించగా మాలపల్లిలో మరొక గంగడున్నాడని తెలిసింది ఇనస్పెక్టరుకి. వెంటనే కబురు పంపించేడు.

'ఆడు పోకిరి యెదవేనండి. ఆడిమీద నాకెప్పుడూ అనుమానంవేనండి' అన్నాడు కిష్టిగాడు ఒక పోలీసువాడితో.

గంగణ్ణి తీసుకొచ్చేరు. వాడు ధైర్యంగానే వున్నాడు.

'ఆరు నూరైనా సరే నూరు ఆరైనా సరే మన గుట్టు మాత్తరం పైవోడికెవడికీ తెలవగూడదు. ఒకవేళ మన్లో ఎవడైనా పోలీసోళ్ళకి దొరికిపోతే ఆ బాదేదో ఆడొక్కడే పడాలిగాని మన గుట్టు మాత్తరం జెప్పకూడదు' సుందర్రావు మాటలు గంగడికి పదేపదే జ్ఞాపకంవొస్తున్నాయి.

ఇనస్పెక్టరుకి నాలుగుబారల దూరంలో చేతులుకట్టుకు నిలబడ్డాడు గంగడు.

'నీ పేరేంట్రా' ఇనస్పెక్టరు అడిగేడు.

'మైనం గంగయ్యండి'

'ఏం చేస్తుంటావు?'

'ఆదినారాయణగారి పాలేర్నండి'

'చాలా ధైర్యవంతుడివని విన్నాను!'

ఏం మాటాడాలో తెలియలేదు గంగడికి.

'దారి దోపిడీకి శిక్ష ఏమిటో తెలుసా ?'

'.............................'

'ఉరిశిక్ష' అని తనే జవాబు చెప్పేడు ఇనస్పెక్టరు. 'అంచేత నిన్నరాత్రి నువ్వు ఏంచేసేవో ఎవరెవరితో వెళ్ళి అలారీ దోచుకున్నావో చెప్పేసెయ్యి. తప్పు ఒప్పుకుంటే యిప్పుడే విడిచిపెట్టేస్తాం'

'నాకేఁవీ తెలవదు మారాజా' చాలా వినయంగా చెప్పేడు గంగడు.

'ఒరేయ్. ఐగారు మంచోరు గనుక ఆమాత్రం అడుగుతున్నారు. అబద్ధఁ వాడితే జాగర్త, హూమాయిఁ వొండేస్తాం' అని గద్దించేడు హెడ్డు.

'చెప్పెయ్యరా అనవసరంగా దెబ్బలుతినకు' అని సలహా యిచ్చేరు ప్రెసిడెంటు, మునసబు, కరణాలు.

'నిజంగా నాకేఁవీ తెలవదండె' చాలా అమాయకంగా చెప్పేడు గంగడు.

లాఠీలకు పని తగిలింది. బూటు కాళ్ళతో పొట్టలో తన్నేరు. చాలా ఓపిగ్గా హింసించారు. మధ్యమధ్యలో బూతులు, ఇప్పటికైనా చెబుతావా ?' అని ఇనస్పెక్టరు ప్రశ్నలు.

'నేనే పాపం ఎరుగను దేవుడో' అని బాధతో గంగడి అరుపులు. హింసల వల్ల కలిగే బాధవాస్తవం. ఆకలి బాధకూడా వాస్తవమే. ఐతే హింసల వల్ల కలిగే బాధ శాశ్వతంకాదు. గంగడు మాత్రం వాళ్ళకి ఏ విధమైన ఆచూకీ యివ్వలేదు.

సాయంత్రం నాలుగ్గంటలైంది. ఇద్దరు పోలీసువాళ్ళు కిష్టిగాడి సహకారంతో గంగడి యింటినీ, సుందర్రావు, సహదేవుడు, పిల్లెంకడు వగైరా అందరి యిళ్ళనూ సోదాచేశారు. ఎక్కడా వాళ్ళకి ఆచూకీ దొరకలేదు.

సొమ్మసిల్లి పడిపోయిన గంగణ్ణి బంధువులకు అప్పగించేరు. ఐదు గంటలకల్లా జిల్లా పోలీసు సూపర్నెంటు వచ్చేడు. సర్కిలినస్పెక్టరు కూడా ఆయనతో వున్నాడు. సూపర్నెంటు కేసు వివరాలు తెలుసుకున్నాడు. ఆయనకి డ్రైవరుమీదా, క్లీనరుమీదా అనుమానం కలిగింది. 'వాళ్ళు నమ్మకస్తులే'నని క్రిష్ణంరాజు చెప్పినమీదట, 'సరే... ఈ వూళ్ళో పనం చెయ్యడానికేఁవుంది. పదండి. చుట్టుపక్కల వూళ్ళలో ఇన్వెస్టిగేషన్ మొదలెట్టండి' అన్నాడు సూపర్నెంటు.

'మా వూరొచ్చి మీరిలా తిరిగెల్లటానికిల్లేదు. మా డిన్నరు తీసుకు మరీ వెళ్ళాలి' అని సూపర్నెంటును బలవంతం చేశాడు ప్రెసిడెంటు. ఒప్పుకోక తప్పలేదు సూపర్నెంటుకి.

ప్రెసిడెంటు కాకినాడలో 'బాంక్' ఒకటి ప్రారంభించే వుద్దేశంతో వున్నాడు. అలాంటి పెద్దమనిషికి సూపర్నెంటు దగ్గిర కాస్త పలుకుబడివుంటే ఎంతైనా మంచిది కదా?

అరడజను కోళ్ళను కోయించి, సూపర్నెంటుకీ, ఇతర పోలీసు బలగానికి ఘనంగా విందు చేశాడు ప్రెసిడెంటు. అందులో కృష్ణంరాజు కూడా పాల్గొనవలసి వచ్చింది.

విందు పూర్తయిన తర్వాత సూపర్నెంటు కార్లో వెళ్ళిపోయాడు, 'రేపు సాయంత్రానికల్లా రిజల్ట్స్ రావాలం'టూ.

'తెల్లారితే ఏ వూరి మీద పడదామా' అని ఆలోచిస్తూ పోలీసు సిబ్బంది జీపెక్కింది.

* * * *

మూడోనాటికి గంగడు కొంచెం కోలుకున్నాడు. ఆ మూడు రోజులూ మాలపల్లి వాళ్ళంతా అతన్ని పరామర్శించారు. అన్ని సపర్యలూ చేశారు. అబాలగోపాలం అతని పట్టుదలను మెచ్చుకున్నారు, పోలీసు మూకను తిట్టిపోశారు. పోలీసువాళ్ళ చేతిలో నిష్కారణంగా దెబ్బలుతిన్న మాదిగపల్లి వాసులిద్దరి విషయంలోనూ వారు జాలిపడ్డారు.

మొత్తం మీద వారి సాహసానికీ, చొరవకూ ఫలితం దొరికింది. వాళ్ళ శ్రమ వృధాపోలేదు. రహస్య పద్ధతిలో, ఐకమత్యంతో చేసిన ఏ పనైనా విజయవంతంగా జరుగుతుందని ఆ నిరుపేదలు అనుభవంలో తెలుసుకున్నారు. చిత్రమేమిటంటే ఈ ఘటనతో ఏళ్ళతరబడి శత్రువులుగా వుంటున్న కుటుంబాలు కూడా ఏకమయ్యాయి. ఈ ఘటన వారందరికీ గొప్ప ఉత్సాహాన్ని కలిగించింది.

ఇంత జరిగినా వాళ్ళ రహస్యం మాలపల్లి దాటిపోలేదు. వాళ్ళు మామూలుగానే పనులు చేసుకుంటున్నారు. 'బియ్యం అరువియ్యమ'ని కోమటి శేషయ్యని బతిమాలుతూనే వున్నారు; తవ్వెడో - శేరో తీసుకెళ్తూనే వున్నారు.

* * * *

ఆ రోజు తెల్లవారుతోందనగానే నారాయుడు వుతికిన చొక్కా వేసుకుని సుందర్రావు కెదురయ్యాడు కాలవగట్టుమీద.

'ఏ వూరెల్తున్నా?' అని అడిగేడు సుందర్రావు.

'ఊబలంక. సందాల కొచ్చేత్తాను. అక్కడ మా బావమ్మరిది కుటుంబం తిండికిలేక నానాబాదలూ పడతన్నారు. ఐదు రూపాయిలంపమని దావులపాడు

సిన్నయ్యసేత కవురంపించేడు. సరే, పట్టుకెళ్లిచ్చినట్టూ వుంటది; ఆళ్ళన్నూసొచ్చినట్టూ వుంటదని మాయాడది జెపితే యెల్తన్నాను' అని, 'అన్నట్టు మనం నడిపిన యెవ్వారం ఆడిక్కూడా సెబుతాను. ఈలు కుదిరితే ఆళ్ళుకూడా మనం జేసినట్టేసేత్తారు. మరెంత కాలఁవని కడుపులు కాలబెట్టుకుంటారాళ్ళు మాత్తరం' అన్నాడు నారాయుడు.

'సెప్పు. నమ్మకఁవైనోళ్ళందరికీ సెప్పాలి మరి. ఒరేయ్, మవఁవంతా కలిసికట్టుగా వుంటే ఈ పెపంచకం మొత్తంమీద వున్నోవడూ ఏఁవీజెయ్యాలేడు' అన్నాడు సుందర్రావు. నారాయుడు వెళ్ళిపోయాడు.

చేసింది చాలదనీ, ఇంకా ఏమేమో చెయ్యాలనీ సుందర్రావుకి అనిపిస్తోంది. అతని బుర్రలో ఎన్నో ఆలోచనలు.... ఎన్నో వూహలు :

'పాలేర్రోడూ, కూలోడూ కడుపునిండాతిని, తలెత్తుకు తిరిగే రోజెప్పుడొత్తదో!'

'అయ్యా బాబూ అని బతిమాలితే నాయం జరిగే రోజులు కావియ్య....'

తూర్పు దిక్కున అరుణభానుడుదయించాడు.

(ఫిబ్రవరి 1972, సంచిక 29.)

పాలస్తీనా కథ :

# తీర్పు

[అమెరికన్ సామ్రాజ్యవాదుల ముద్దుబిడ్డ ఇజ్రాయిల్ సృష్టించబడినప్పటినుండి తమ మాతృభూమి సంరక్షణకై పాలస్తీనా ప్రజానీకం సాయుధులై పోరాడుతూ రెండు అగ్రరాజ్యాల కుతంత్రాలను ఇజ్రాయిల్ దురంహకార విస్తరణవాదాన్ని అరబ్ అభివృద్ధినిరోధక పాలకవర్గాలను ప్రతిఘటిస్తున్నారు. పాలస్తీనా జాతీయ విముక్తి వుద్యమానికి దీటైన ప్రతిఘటనా సాహిత్యం వుంది. అందులో ఒక భాగమే ఈ చిన్న కథ 'తీర్పు'. అరబ్బుల అమాయకతను, అజ్ఞానాన్ని, అసహాయతను యూదులు ఏవిధంగా వినియోగించుకుని వారి ఇండ్లను, పొలాలను, భూములను ఆక్రమించుకున్నదీ ఇందులో ఇతివృత్తంగా తీసుకోబడింది. నిజానికి ఇది కథ కాదు, వాస్తవ గాథ. అయితే దీనికి కథా రూపాన్ని కల్పించి ఒక అరబ్ కమ్యూనిస్టు పత్రిక ప్రచురించింది. 'ఘసన్ కన్ ఫానీ' అనే పాలస్తీనా సాహిత్యయోధుడు 1967లో బీరూట్‌లో జరిగిన మూడవ ఆఫ్రో-ఏషియన్ ప్రజల సంఘీభావ సదస్సులో 'ఆక్రమిత పాలస్తీనాలో ప్రతిఘటనా సాహిత్యం' అన్న పేరుతో సమర్పించిన డాక్యుమెంటులో ఈ గాథ పొందుపరచబడింది. 'కేవలం ఒక కలం, కాగితంతో ఒక గెరిల్లా బృందంకన్నా శత్రువును ఎక్కువగా దెబ్బతీసే ఘసన్ కన్ ఫానీ' పాపులర్

ఫ్రంట్ ఫర్ ది లిబరేషన్ ఆఫ్ పాలస్తీనా (PFLP) అధికార ప్రతినిధి, దాని పత్రిక 'అల్ హదఫ్' సంపాదకుడుగా వుండేవాడు. 1972 జులై 9వ తేదీన ఒక ఇజ్రాయిల్ గూఢచారి ముఠా ఆయనను హత్యచేసింది.]

సర్వే అధికారి వచ్చి తనకున్న కొద్దిపాటి భూమిని కొలిచి తన రిజిష్టరులో వ్రాసుకొని దానికికారణం ప్రభుత్వానికీ, ఇబ్రహామ్ ఎల్ హమీద్‌కు మధ్యగల 'వివాదమే' అని చెప్పినప్పుడు హమీద్ ఏమాత్రం లక్ష్యపెట్టలేదు. ఇంకా పైగా "రిజిష్టరు చేసుకోవయ్యా, రిజిష్టరు చేసుకో !! కలము, కాగితంకన్నా మరేదీ చౌకగా లేదు– నేను మాత్రం నా పొలాన్ని ఇచ్చేది లేదు" అని చెప్పాడు.

దాదాపు 50 ఏళ్ళుగా తను ఆ పొలం ఎరుగును. తను చిన్నపిల్లాడుగా వున్నప్పుడు ఆ పొలంపనులలో తండ్రికి చేదోడువాదోడుగా వుంటుండేవాడు. తండ్రి మరణానంతరం తనే ఆ పొలాన్ని సాగుచేయసాగాడు. అదే విధంగా ఇప్పుడు కూడా పొలాన్ని దున్ని సాగుచేసుకుంటున్నాడు.

రోజులు దొర్లుతున్నాయి దాదాపు ఒక సంవత్సరం గడిచింది. ఆ "వివాదాస్పదమైన" భూమి విషయమై హైఫాలోని కోర్టులో హాజరు కావలసిందిగా తనకు తాఖీదు అందేటంత వరకు ఆ సర్వే ఆఫీసరు రికార్డుచేసిన విషయాన్నే మర్చిపోయాడు హమీద్. విచారణ జరిగే రోజున తన చిన్నకొడుకుని వెంట పెట్టుకుని హైఫాలోని కోర్టుకు హాజరయ్యాడు.

"అబ్దుల్ హమీద్, అబ్దుల్ హమీద్, అబ్దుల్ హమీద్" మూడు సార్లు కోర్టు జవాను గావదలా ఓండ్ర పెట్టాడు.

హమీద్ కోర్టు హాలులో అడుగుపెట్టాడు. విచారణ మొదలయింది.

"ముగ్దెల్‌కురమ్ ప్రాంతంలో గల 48వ నెంబరు భూమికి 1967కి పూర్వం నీవే హక్కుదారువని, యజమానివని రుజువుపరచుకోగలవా ?" జడ్జీ ప్రశ్నించాడు.

అబ్దుల్ హమీద్ ఇలా జవాబిచ్చాడు– "అవునండి అయ్యగారు ! నేను ఆపొలాన్ని మా తండ్రిగారి నుండి వారసత్వంగా పొందాను నా తండ్రిగారి, మీ తండ్రిగారి ఆత్మలకు శాంతి చేకూర్చవలసిందిగా ఆ భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను."

"నీ చెత్తవాగుడు కట్టిపెట్టు. నీ తండ్రి గొడవ ఇక్కడెందుకు ? నీ వాదనను రుజువు పరచుకునేందుకు నీ దగ్గర ఏమయినా దాఖలాలు రుజుపుపత్రాలు వున్నాయా ?" జడ్జీగారు గాండ్రించాడు.

కొంచెంసేపాగి హమీద్ ఇలా అన్నాడు- "అయ్యా, నేను మళ్ళీ చెబుతున్నాను. దాన్ని నేను మా తండ్రిగారి నుండి పొందాను. 15వ ఏట నుండి నా తండ్రితో కలసి ఆ పొలాన్ని సేద్యం చేశాను."

"ఇది రుజువు క్రిందకి రాదు" జడ్జీగారింకా ఇలా అన్నారు- "సరే ఆ పొలంలో 60 శాతం రాళ్ళమయం. కాబట్టి అది ప్రభుత్వ ఆస్తి అవుతుంది"

"ఏంటీ ?- అరవై శాతమా, డెబ్బై శాతమా ? ట్రాక్టరు ఒక్కదెబ్బకు దున్ని అవతలపారేస్తుంది. అయ్యా, ఒకటీ అరా రాళ్ళుపుంటే వుండవచ్చు- కానీ ఒక్కొక్క రాయి నుండి ఒక్కొక్క ద్రాక్ష తోటను పండించవచ్చు. అదేమీ వట్టిపోయిన భూమి గాదు. మా తండ్రిగారు తన జీవితాన్నంతా ఆ ఉన్న నాలుగురాళ్ళు ఏరిపేసేందుకే అంకితం చేశాడు. నేనూ అదే చేస్తున్నాను. అయినా అంతగా ప్రభుత్వం కావాలను కుంటే నా పొలం తప్ప మరేమీ కనబడలేదా ?" దాదాపు అరచినట్లుగా ప్రశ్నించాడు హమీద్.

దానితో జడ్జీగారికోపం తారాస్థాయికి చేరుకుంది. "ఇటువంటి చెత్తవాగుడు కట్టి పెట్టవలసిందిగా మరోసారి హెచ్చరిస్తున్నాను. ఇతరుల ఆస్తిని ప్రభుత్వం అనవస రంగా ఆక్రమించదు. అది దాని హక్కుకూడా" అంటూ తీవ్రంగా హెచ్చరించాడు.

"హక్కా"- వ్యంగ్యంగా అన్నాడు హమీద్ "అయ్యా, ప్రభుత్వం చాలా బలమయినదని నాకు తెలుసు. నాకేమున్నది- నాలుగెముకలు, కాస్త కండ తప్ప. అటువంటి నాపైన ప్రభుత్వం కలియబడటం...."

"ఏయ్ మనిషీ ఇటు చూడు నువ్విప్పుడు కోర్టులో వున్నావు. అర్థంలేని పిచ్చివాగుడు వాగకు" జడ్జీగారు మరోమారు హెచ్చరించి కొంచెం సేపాగి ఇలా అన్నారు- "సరే ప్రభుత్వం సగం పాలు తీసుకుని మిగతా సగం నీకే ఇచ్చేస్తుంది. దీనికేమంటావు ?"

హమీద్ తల అడ్డంగా త్రిప్పుతూ "అయ్యా, నాకు ప్రభుత్వం అనే అన్నయ్య వున్నట్లుగాకాని, వాడితో ఇలా వాటా పంచుకోవాలనిగాని మా నాన్న నాకెప్పుడూ చెప్ప లేదే।" అన్నాడు.

జడ్జీగారు సహనం కోల్పోయారు- "ఇదిగో ముసలాడా ! ఈ నిర్ణయానికి నీవు కట్టుబడి వుండటం సమంజసంగా వుంటుంది. సమాధానం సూటిగా చెప్పు. దీనికి నీవేమంటావు" అంటూ తీక్షణంగా చూశారు హమీద్‌వంక.

# సృష్టికర్తలు

అల్లం రాజయ్య

ఇంకా సూర్యోదయమన్నా కాలేదు. ఆకాశం కడిగిన పళ్ళెం తీరుగున్నది- తూరుపుదిక్కు- ఒకటీ అరా మేఘపు ముక్కలు ముఖం మాడ్చుకొని వేళ్లాడుతున్నాయి- ఉదయించని సూర్యకాంతి ఆకాశానికి ఎర్రిమట్టి పూసినట్టుగున్నది- చెట్ల ఆకులు రాత్రి కురిసిన వర్షానికి పచ్చగా నిగనిగలాడుతూ లోకంలో ఇంకా ఏ అన్యాయం చూడని పసిపిల్లల మొఖాల్లా వెలిగిపోతున్నాయి- గాలి ఉండీ ఉండీ వీస్తోంది. ఆ గాలికి గుట్టబోరు క్రింది భాగంలోని టేకు లేతాకులు "బొంయ్యి" మని శబ్దం చేస్తూ కదులుతున్నాయి- కొండరాళ్ళ మీదినుండి జల జల ఇంకా రాత్రి కురిసిన వర్షపునీళ్లు జారుతూనే ఉన్నాయి- వాగు ఎర్రినీళ్ళతో నిండి అదేదో సందడిగా, అలజడిగా అనేక మంది కలిసి తర్జన భర్జన పడుతున్నట్లుగా పారుతోంది- చెట్లకొసల మీద అప్పుడే స్వేచ్ఛ పొందినట్టు, ప్రపంచంలోని సంతోషమంతా తమదేనన్నట్లు పక్షులు పల్టీలు కొడుతున్నాయి- అడివి అంచుకు పచ్చగా నవనవలాడ్తున్న గడ్డిని విడిచి కొన్ని పశువులు ఒకటి నొకటి గెదుముకుంటూ చెంగలిస్తూ ఆడుకొంటున్నాయి- ముసలి ఎడ్లు సయితం లెంకలేసి పుట్టలు చిమ్ముతూ ఎర్రిపట్టి కొమ్ములకు, ముఖాలకు పూసుకొని వీరోత్సాహంతో ఉన్నాయి- అన్ని కాలాలు తెలిసిన వాటిలాగా, సంతోషం, విషాదం లేనట్టుగా, తమకీ సందడి పట్టనట్టు బర్లు వాగులో అక్కడక్కడ తేలిన తుంగ గడ్డలను బరుకు బరుకున పీక్కుతింటున్నాయి- వాగొడ్డు ఎర్రి సెలుకల నుండి అక్కడక్కడ పురుగులు లేసి తిరుగుతున్నాయి- ఆరుద్రి పురుగులు నేలమీద పాకుతున్నాయి-

అదిగో అలాంటి వాతావరణంలో తూర్పు దిక్కు- సూర్యుడు ఉదయించాడు- సూర్యునితో పాటు కిరణాల్లాగా భుజాలమీద నాగళ్లెత్తుకుని, పలుగు పారా బట్టుకొని నేల ఈనినట్లుగా జనం ఎర్రి సెలుక పేపువచ్చారు-

నాగండ్ల వాళ్లు నాగండ్లు సెలకలో దించి తాళ్లు సరిచేస్తున్నారు- స్త్రీలు కొంగులు నడుములకు చుట్టి రాళ్లురప్పలేరుతున్నారు- పెయిమీద అంగీలు లేనివాళ్లు కొందరు

---

"భగవంతుని సాక్షిగా చెపుతున్నాను. అయ్యా, మీ తీర్పు ఏడ్పినట్లుగా వుంది. చాలా దారుణంగాను. చీకటిలా భయంకరంగానూ వుంది" అంటూ బోమదిగి "అన్యాయమైన తీర్పు ఎంతో కాలం జీవించదు" అని గొణుక్కుంటూ. తన చేతికర్ర పోటేసుకుంటూ వెళ్ళిపోయాడు అబ్దుల్ హమీద్.

(స్వేచ్ఛానువాదం : రవి)

(డిసెంబర్ 1977, సంచిక 74 )

నోట్లె మొక్కుసుట్టలు ఆవలపారేసి పాతగుడ్డపేగులు తలలకు చుట్టి పగ్గాలు విప్పుకొని అడవి అంచు ఎడ్లను పేరుపేరున పిలుస్తూ ఎడ్ల ముక్కుదాళ్ళకు పగ్గాలు కట్టి నాగండ్ల దగ్గరికి తీసుకొచ్చారు. కానికి ముక్కు కొందరు ఎడ్ల మెడల మీద కాని ఆనించారు- నాగండ్లు నిలబడ్డయ్-

ఎర్రితేలులాంటి ఎల్లయ్య ఎక్కన్నో నాలుగు ఈత పెండేలు విరుసుకచ్చాడు- ఎల్లయ్యభార్య ఒళ్ళొ నుంచి నాలుగు ఎర్రిజెండలు తీసింది- ఎల్లయ్య కొయ్యలకు జెండాలు తగిలించి నాలుగుపేపుల నాలుగు పాతచ్చాడు.

బుర్రిమీసాల బుచ్చిలింగం అందరిని ఓసారి తేరిపారచూసిండు- అతని మనసులో వాగులోని ప్రివాహంలాగా మాటలులేని సంతోషం పొంగుతోంది- కుర్చె కట్టె చేతబట్టి కొండ్రిలు గీసిండు- పొట్టిలాలయ్య ఒడిగట్టుకొని గుట్టకు మొక్కి సెలుకకు మొక్కి అటెన్క తూరుపుకు మొక్కి ఇత్తనం జల్లిండు-

ముందటి నాగలి కదిలింది- కర్రి కన్నెన భూమిలోనికి దిగింది- ఎడ్లు తోకలు ఆడించినయ్- ఒకటెన్క ఒకటి- ఒకటా రెండా ముప్పయి నాగండ్లు కదిలినయ్-

బర్ల దగ్గర సంకల కట్టె ఆనించుకొని ఓటుగాలు మీద నిలుచున్న బర్ల ఓదన్నకు గిదంతా చిత్రింగా కనిపిస్తోంది- పూరేడుపిట్ట కళ్లలాంటి కళ్ళు చికిలించి నాగండ్లవేపు చూసిండు. బర్రె పెయ్యలాంటి పెయ్యని గీతలుబడ బరబర గోకిండు- నెత్తి పును కున్నడు- బర్రె పెనిమిల్లాంటి పెదిమలు ఎందుకో వనికినయ్- ఎందుకో పూరేడు పిట్టలాంటి కళ్లల్లో నీళ్లూరినయ్- అతనికి తన చిన్నతనం, వయసు, స్వంతభూమి, భార్య, పిల్లలు యాదికొచ్చారు- ఆవెనువెంటనే తాను నాగలిబట్టి దున్ని దోకిన రోజులు కళ్ల ముందు మెదిలినయ్- అప్పుకింద భూమిపోయిన దినం- బాలెంత రోగమచ్చి భార్య పోయినదినం- పసిపోరగండ్ల ఎంటేసుకొని బతికినదినాలు- పసిపోరగండ్ల తన చేతులతోటే మట్టిల కప్పిన దినాలు- తన చేతికి కట్టె వచ్చిన రోజు- ఊరి బర్ల కాపరిగా మారినదినాలు- అన్ని గుర్తు కొచ్చాయి. అట్లా ఎంత సేపు నిల్చున్నడో ఓదెలుకు గుర్తులేదు-

తూర్పుదిక్కు సూర్యుడు చురచుర మండుతున్నాడు- ఆకాశంలో మబ్బులు కుదురుకుంటున్నాయి- నేలంతా పొగచూరినట్టుగా దువ్వెన పురుగులు లేచాయి- బర్లు నీళ్లల్లో పన్నయ్- ఎక్కడో తీతువ పిట్ట అరుస్తుంది-

పిల్లలు బరిబాత వాగొడ్డుకు ఎండ్రికిచ్చలు, తుమ్మలు పడుతూ, కొందరు ఈదుతూ, కొందరు ఇసుకలో పొర్లుతూ కేరింతలు కొడుతున్నారు-

పిల్లల మీది నుండి దృష్టి మళ్ళీ నాగండ్ల మీదికి మరలిపోయు- కండ్లు నిలబడి పోయాయి- ముఖం మీద ఎవరో ఝాడిచ్చి గుద్దినట్టుగా కమిలిపోయింది- ఆదరాబాదరా గెంటుకుంట గెంటుకుంట అవలి ఒడ్డునుండి ఈవలి ఒడ్డుకు దాటి గెంటుకుంట గెంటు కుంటనే పరిగెత్తాడు- కాళ్లకు రాళ్లు తాకుతున్న లక్ష్యంలేదు-

ఓదెలు నాగండ్ల దగ్గరికి చేరుకునేసరికి నాగండ్లన్ని ఆగిపోయినయ్. ఎడ్లు పిర్పిబుర్రిలాడ్తన్నయ్- పిల్లాజెల్లా, ఆడోల్లు, మొగోళ్లు అంత ఒక్కకాడికి జేరి పోయిండ్లు- ఎవలేం మాట్లాడ్తండ్లో ఎవలికినబడ్తలేదు-

మందిని తొలిగించుకొని మూతి లోపలికిబెట్టి ఓదెలు చూసిండు- మందిల ఏడుగురు పోలీసోల్లు తుపాకులెక్కుబెట్టి పండ్లెల్లబెట్టి మొరిగే కుక్కల్లా మొరుగు తున్నారు- వాళ్ళ మధ్యలో దర్జాగా నిల్చున్న అమీన్‌సాబ్ పిస్తోలు పట్టుకున్నాడు. అతనిపక్క ముత్యంరావు దొర ముఖం మాడ్చుకొని నిల్చున్నడు. అతనిపక్క పట్వారి గోపయ్య సెయ్యెత్తి అంతూపొంతూ లేకుంట తిడ్తండు-

కాసేపు సంగతేందో బోధపల్లే-

అంతలోకే "మాకెలవుడా మార్ సాలెకు మార్-" యస్ ఐ అరిచిండు-

పటేల్- పటేల్- బరిబాత పెయిలమీద లాఠీదెబ్బలు- పిల్లలు ఏడుస్తున్నారు. స్త్రీలు శాపనార్థాలు బెడుతున్నారు- కాని ఎవలు కదలరే- ఓదెలు బుర్రమీద లాఠీదెబ్బ- ఎడంచేత పునికి చూసుకున్నడు. నెత్తురుకూడా కమిలిపోయి పిడుదునెత్తురై పోయింది. కాని అంతరంగంలో కోపంఎర్రగా రవులుకుంటోంది- అదెక్కడికోపమో? ఎన్నేండ్ల కోపమో? ఎవరికెరుక?

"ఆపుండ్లి-"

లాఠీలాగినయ్-

"అరె హరామ్‌కెబచ్చె- గీభూమి మీదిగాదు-

ఉత్తపున్నానికి దెబ్బలెందుకుదింటరు బే- నడువుండ్లి- ఎల్లిపొండ్లి- లేకుంటె మాదెర్‌సోద్ ఒక్కొక్కన్ని పిట్టనుగాల్చినట్టుగాల్చి కాకులకు గద్దలకేత్త-" యస్.ఐ-

"ఒరే లంజకొడుకుల్లాలా- మీయమ్మలకుక్కల్.... నాకుమీకు ఎప్పుడో సెల్లు బాటయ్యింది- ఎండకాలం పనులు బందుజేసి నాయేంబీక్కున్నరు- మీఎనుకున్న పార్టోల్లూ. మీరూ నారోమం బీకలేర్రా- నేనేతలుసుకుంటె మసిరా మసిజేసి పారేత్త" ముత్యంరావుదొర-

"వారీ గిదేంనాయెంరా? మందిభూములు దున్నుకోను పాపమా? పచ్చిభూతక్రా ఇయ్యాల్ల సేండ్లమీసబడి దున్నుకుంటరు- రేపు ఇండ్లమీదబడి దోసుకుంటరు- మనూళ్లె పోలీసోల్లుండంగనే గింతపనికెత్తుకుంటిరి, లాపోతెనా మాయిండ్లకగ్గి తల్గబెట్టి పేలాలేరుక బుక్కుతరు-" గోపయ్య.

"నీబాంచెనాతె నీపేరుదల్సుకుంటె బుక్కెడుబువ్వన్న దొర్కది"- కొండమ్మ చేతులు మెటికలిరిసింది-

ఓదెలు పెదిమలు వనికినయ్- ఏదోచెప్పాల్నని నోరుతెరిసిండు- కని ఏది చెప్పలేక పోయిండు-

"మీ సంఘపెద్దెవరా?" అమీను గర్జించిండు

ఎవలూ మాట్లాడలేదు-

"ఇక్కన్నుంచి కదులుండ్లి- ముదుగాలు గ జెండాలు పీక్కరాండ్లి- నక్సలైటు నాకొడుకుల తానాకు పట్టుకపోత-"

పోలీసులు జెండాదిక్కు కదిలిండ్లు-

ఎల్లయ్య పరుగందుకున్నడు- జెండాకొయ్యదగ్గర నిలుసున్నడు- పోలీసోడు తుపాకిమడమతోటి ఎల్లయ్యను అంచిగుద్దిండు-

జనంలోకదలిక- పోలీసుల సుట్టాగిరేసుకున్నరు-

"ఖబర్దార్ జెండాలు ముట్టుకున్నరో గీడనెత్తురుదొల్లాలె-" ఎవడో ఛాతిబాదుకుంటూ గొంతు తెగిపోయేటట్టు అరిచిండు.

అమీన్ పిస్తోల్ గాలిలోనికి పేల్చిండు- దొరకండ్లల్లో కూసంత బెదురు- గోపయ్య కాల్లు వనుకుతున్నాయి-

జనంలో హాహాకారాలు మిన్నుముట్టాయి- ఒకపోలీసోడు జండా అందుకున్నడు అన్నిజనం చుట్టేసిండ్లు- "ఒకటి- రెండూ- మూడు-" అమీన్ బండగొంతుతో అరుస్తున్నాడు-

తుపాకులు మొరిగినయ్-

ఒకస్త్రీ నాగటిచాల్లల్లోపడి గిలగిల తన్నుకుంటుంది- కడుపులనుంచి కార్తున్న జీవరక్తం ఎర్రగా నాగటిచాల్లో పారుతోంది- ఎవరో యస్.ఐ.మీద దునికిండు. పిస్తోలు పేలింది- ఇంకొకడు ఎర్రిమట్టిలో తన్నుకున్నడు-

ఆకాశంలోకి రాళ్లలేసినయ్- కాని తుపాకులముందు రాళ్లనిలువలేదు- అట్లా మరోపదినిమిషాలు తుపాకులు మొరిగినయ్- అడివి ప్రతిధ్వనించింది- చెట్లు పుట్టలు

బట్టి జనం ఉరికిండ్లు. ఆఖరుకు ఎల్లయ్య ఓదెలుతో సహా పదిమంది పురుషులు, నలుగురు స్త్రీలు, నలుగురు పిల్లలు దొరికారు.

వాళ్ళందరిని తుపాకులు ఎక్కుబెట్టి నడిపిస్తూ వాగుదాటి ఈవలొడ్డు జేరుకున్నరు.

నెత్తిమీదికి పొద్దచ్చేటాల్లకు పోలీసువ్యాన్ బుర్రుమన్నది.

సగందున్నిన ఎర్రసెలుకలో ఇంకా మూడు ఎర్రజండాలు రెపరెపలాడుతూనే ఉన్నాయి.

*　　　　*　　　　*

ఆ రాత్రంతా నిరాయుధులైన బందీలను తాళ్ళతో మట్లకు కట్టేసి కొట్టవలసిన వాళ్ళంతా కొట్టారు. పిల్లల లేతశరీరాలమీద యస్.ఐ. కొట్టాడు, తన్నాడు. స్త్రీలమీద అమానుషకృత్యాలు అన్నీ జరిపారు. పురుషుల శరీరాలు నెత్తురుముద్దలైపోయాయి.

అయినా ముత్యంరావుకు కసితీరలేదు. నిరుపేదజనం సంఘంబెట్టుకున్న నాటి నుండి సంఘం బలపడినదానిగా బలపడిన కసి కోపం చల్లారలేదు. గోపయ్య ఆ రాత్రంతా తాగుతూ ముత్యంరావుకు ఏదో చెప్పుతూనే ఉన్నాడు. అమీన్ పెట్టాల్సిన కేసుల గురించి తలపట్టుకున్నాడు.

బాసిందీసీసాల మధ్య ఆలోచనలు సాగినయ్. క్యాంపు పోలీసులు రాత్రి ఊరు మీద పడ్డారు. ఇల్లిల్లు గాలించారు. గడుక కుండలు పగుల గొట్టారు. నిశిరాత్రి ముసలివాళ్ళు ఏడుస్తుంటే ఊరంతా గస్తీతిరిగారు. ఆ రాత్రి ఎల్లయ్య గుడిశెతో పాటు మరి నాలుగు గుడిశెలు కాలిపోయాయి.

తెల్లారి నెత్తురు ముద్దలై దొరికిన వాళ్ళను వ్యాన్లెక్కిచ్చి సబ్‌జైలుకు పట్టుక పోయారు.

*　　　　*　　　　*

కోర్టు గదిలో ఫ్యాను గద్దలా తిరుగుతోంది.

ఎత్తుగద్దె కుర్చీమీద జడ్జి అసహ్యంగా ముఖంపెట్టి కూర్చున్నాడు. అతను నల్లగా సన్నగాకొరిగిన మీసం గడ్డంతో తాటిపండు తీరుగున్నడు. ఎత్తుపొట్ట. ఎర్రగా ఎద్దుకండ్లలాంటి కళ్ళు.

అతని టేబుల్ ముందు ముసలిగుమస్తా అదేపనిగా రాస్తున్నాడు వంచిన తల ఎత్తకుండా.

జడ్జి నెత్తిమీద గాంధీ ప్రశాంతంగా ప్రపంచంతో తనకేమీ సంబంధంలేనట్లు, అహింస నవ్వులు నవ్వుతున్నాడు.

జడ్జికి కుడివేపు అందంగా బైండుచేసిన పాపాల రికార్డు, లా పుస్తకాలున్నాయి వాటి మీద బంగారు రంగు అక్షరాలు కొట్టొచ్చినట్టు రాసున్నాయి–

జడ్జి టేబుల్‌కు కొంతదూరంలో పెద్ద కర్రటేబుల్– దాని ముందు నల్లగౌన్ల లాయర్లు అసత్యాలఫైళ్ళు అతి జాగ్రత్తగా పట్టుకొని కూర్చుండి అవసరంలేని విషయాలు గుసగుస లాడుతున్నారు.

పక్కగదిలో పి.పి.ఓ. లక్ష్మణ్ రావు, డియస్‌పితో మాట్లాడుతున్నాడు.

జడ్జి బెల్లు మోగించాడు– కోర్టు జవాను బయట ఏదో పేరును బొంగురు గొంతుతో పిలిచాడు–

పి.పి.ఓ. పరుగెత్తుకొచ్చాడు–

ఆ తరువాత అమీన్ ఇద్దరు పోలీసులు వెంటరాగా కొసంత బెదురు ముఖాలతో మాసిన గుడ్డపేగుల రైతులు, రైతుస్త్రీలు, నలుగురు పిల్లలు ప్రవేశించారు– ఎల్లయ్య బోనెక్కాడు– అతనివెనుక ఓదెలు– అందరు వరుసగా నిలుచున్నారు–

లాయర్ల ముఖాలల్లో అసహ్యం రూపు కడుతోంది–

పి.పి.ఓ. గొంతు సరిచేసుకొని ఉత్తిగనే గాలిపంఖా వేపు కాసేపు చూసి అలవోకగా కత్తిరించిన కుడిమీసం మీద గోక్కొని– రైతులను చూడకుండానే జడ్జిని చూశాడు–

జడ్జి రైతులను చూశాడు–

పి.పి.ఓ. కాయిదాలు బల్లమీద పడేసి కొంచెం ముందుకు నడిచి–

"యువరానర్" అని కాసేపు ఏదో గుర్తుకు తెచ్చుకోను ప్రయత్నం చేస్తున్నట్లు నటించి– పక్కగదివేపు– ఓరకంట చూసి అక్కడ గ్లాస్కోధోవతి తచ్చాడడం, కరుకుబూట్లు కదలడం గమనించి సంతృప్తిపడి, కొత్త ఉత్సాహంతో ఈ విధంగా వాదించాడు–

"ముద్దాయిలు చూడడానికి చాలా అమాయకంగా, నిరుపేద వాళ్ళుగా కనిపిస్తున్నారు. యువరానర్ – అదంతా పైపైనటనే– వాళ్ళ గురించి మనం తెలుసుకుంటే లోకంలో ఎంతటి క్రూరత్వం, అన్యాయం తాండవ మాడుతున్నదో మనం అర్థం చేసుకోగలం– ముద్దాయిల గురించి చెప్పేముందు కొంత ఆ గ్రామం గురించి తెలుసుకోవాలి– రాజకీయంగా కూడా ఈ కేసు చాలా ఆసక్తికరమైంది–

నక్కల గూడెం 1976 దాకా ప్రశాంతంగా ఉన్నది– అక్కడ ఎవరి పనులు వాళ్ళు చేసుకుంటూ– అనివార్యంగా తలెత్తిన చిన్నచిన్న తగువులు వాళ్ళలో వాళ్ళ

సర్దుబాటు చేస్తూ– వీళ్ళను కన్నబిడ్డలుగా ముత్యంరావుగారు చూసుకునేవారు. గతంలో ఈ ఊరినుండి ఒక్క కేసుకూడా కోర్టువారి దాకా రాకపోవడం గుర్తించాలి.

అలా ఉండగా ఇదిగో ఈ కేసులో మొదటి ముద్దాయి నక్కల ఎల్లయ్య దేశ విద్రోహి, సంఘవిద్రోహ శక్తులతో చేతులు కలిపాడు– అలాగా బాహాటంగానే కమ్యూనిస్టులు ఊళ్ళోకి రావడం మొదలయ్యింది– మీటింగులు, ఉద్రేక పూరితమైన ఉపన్యాసాలు, రెచ్చగొట్టే పాటలు మామూలైపోయాయి– ముత్యంరావుకు ప్రజలకు మధ్యనున్న సంబంధాన్ని ఆ విధంగా విచ్ఛిన్నంచేసి ముత్యంరావుగారికి వ్యతిరేకంగా జనాన్ని రెచ్చగొట్టారు–

మొదట ఇక్కడున్న వాళ్ళంతా అలా ముత్యంరావుగారికి వ్యతిరేకంగా తయారయ్యారు. ఉద్దేశపూర్వకంగా కూలిరేట్ల గురించి తగాదాపడ్డారు– ముత్యంరావుగారు కూలిపెంచారు– దానితోని ఊర్కోక ఏదో సాకుతోటి ముత్యంరావుగారి ఇంటిమీదికి దాడికి వెళ్ళడం ఆయనను చంపుతామని, కొడుతామని బెదిరించడం– తేది 20 జనవరి 1978లో ఒకమారు కర్రలు, కత్తులు గొడ్డండ్లు ధరించి ముత్యంరావుగారి ఇంటిమీద మొదటి ముద్దాయి ఎల్లయ్య నాయకత్వంలో దాడిచేసి– ఇంట్లో ఫర్నీచర్ విరగ్గొట్టారు. తేది 2-2-78 నాడు అతని మక్కజొన్న పెరడు సర్వనాశనం చేశారు– ఇంకా పశువుల నెత్తుకపోయారు పంటలు నాశనం చేశారు– పడారిగోడ కూలగొట్టారు– గడ్డి, చొప్ప ధాన్యం ఏది దొరికితే అది పట్టుకపోయారు. ఇలాగా యువరానర్ నేను చాలా సంఘటనలు చెప్పగలను. ఇవి మచ్చుకు కొన్ని మాత్రమే–

"అన్నాలెందొరా ! పచ్చులసొంటోల్లందొరా ! మామీన్నేపడి కొట్టిచ్చిండు దొరా–" పుసలివెంకయ్య చేతులు జోడించి పదే పదే మొక్కాడు–

"ఆడర్ - ఆడర్ -" జడ్జి సుత్తె బల్లమీద కొట్టాడు– పి.పి.ఓ. కొనసాగి–

"అలాంటి పరిస్థితిలో తన కుటుంబం ధన, మాన, ప్రాణ రక్షణ కోసం పోలీసులకు, ప్రభుత్వానికి తనగోడు చెప్పుకున్నాడు. ఫలితంగా పోలీసులు ఆ ఊళ్లో క్యాంపుపెట్టారు–

"అవద్దం– మమ్ముల సర్వనాశిడం సెయ్యటానికి తీసుకచ్చిండుదొర–" లక్ష్మి– మళ్లీ జడ్జి మూలిగిండు– కర్ర సుత్తె శబ్దం–

"యువరానర్ ! అన్నిటికి తెగించిన ఈ సంఘవిద్రోహ శక్తులకు పోలీసులన్నా లక్ష్యంలేదు– 1979 జూన్ 21న మొత్తం ఊరు ఊరంతా కలిసి ముత్యంరావుగారి

నూరెకురాల చెలుకలో ఎర్రజెండాలు పాతి అక్రమంగా దున్నుకోవడం సాగించారు– మామూలుగానే ముత్యంరావుగారు, యస్.ఐ. కొండారెడ్డి, మరి ఏడుగురు పోలీసులు చెలుక దగ్గరికి వెళ్ళారు– యస్.ఐ. కొండారెడ్డి నచ్చచెప్పడానికి ఎంతో ప్రయత్నం చేశాడు– కాని జనాన్ని వినినివ్వలే– ఎల్లయ్య తూలనాడుతూ జనాన్ని రెచ్చగొట్టాడు. ఫలితంగా జనం రెచ్చిపోయి పోలీసుల మీద ముత్యంరావుగారి మీద పట్వారి గోపయ్య మీద రాళ్ళతో దాడికి సిద్ధమయ్యారు– పైగా చుట్టూ చక్రబంధంగా నిలబడి ముల్లు కర్రలతో దాడి చేయడానికి సిద్ధపడ్డారు– తప్పని సరైన పరిస్థితిలో లాఠీచార్జి చేయ వలసి వచ్చింది– ఆ తరువాత కొంత ఘర్షణ తరువాత గుంపు చెదిరిపోయింది– పరి స్థితి చక్కబడ్డట్టుగానే కనిపించి పోలీసులు, ముత్యంరావుగారు వెనుకకు తిరిగి వచ్చారు–

కాని ఆ రాత్రి ఎల్లయ్య నాయకత్వంలో మళ్లీ దాదాపు 500 మంది జమై ముత్యంరావుగారి ఇంటి మీదికి దాడి చేశారు– తనకు రక్షణగా ముత్యంరావుగారు ఉంచుకున్న బైరి రాములు, బండెల లింగయ్య ఇండ్లు కాలబెట్టి – ఊరంతా బీభత్సం సృష్టించారు– పోలీసులు జోక్యం చేసుకొని ఈ టోనులో నిలబడ్డ వ్యక్తులను అతి కష్టం మీద కస్టడీలోకి తీసుకోగలిగారు...."

"మోసం– దగా–" వెంకటి అరిచిండు– ఎవరో అతని నోరు మూసిండ్లు–

"ఈ విధంగా మొదటి ముద్దాయి ఎల్లయ్య, రెండవ ముద్దాయి అంకం నాగమల్లు నాయకత్వంలో ముద్దాయిలు మరి నాలుగు వందల మంది కలిసి గృహదహనాలు, దోపిడి, ఆస్తినష్టం, పశువునష్టం– మొదలగు అకృత్యాలే కాక ముత్యంరావుగారిని చంపడానికి ప్రయత్నం కూడా చేశారు–

కావున ముద్దాయిలు 197, 307, 144 ఇండియన్ పీనల్‌కోడు ప్రకారంగా శిక్షార్హులు కోర్టువారు విచారించి న్యాయం చేయగలరని, ముత్యంరావుగారికి ప్రాణ, ధన, ఆస్తి రక్షణ కలిగించగలరని కోరుతున్నాను–"

పి.పి.ఓ. నుదురుకు చెమట పట్టింది– తెల్లటి కర్చీఫ్‌తో నుదురు తుడుచుకొని కుర్చీలో కూలబడి పోయాడు–

కాసేపు గాలి స్తంభించి పోయింది–

ముసలయ్య వనుకుతూ బిగుసుకపోయి నిలుచున్న పొడల్లా పిట్టలా నోరుతెరిచి–

"మా బతుకులు సూసెటోల్లెవలు లేరుదొరా! ఎంటికెలున్న కొప్పు ఎటు ముడిసినా సక్కంగనే ఉంటది బాంచెన్– గరీబోడు ఏదిసేసిన తప్పే– నీ బాంచెన్ దొరా! సానా ఏండ్లనుంచి దుర్జెట్ట బతుకులు బతికినం– పసురాల తీర్గ– కొడితెపడ్డం తిడితె పడ్డం– నోరెత్తలేదు– గుడ్లల్లనీల్లు గుడ్లల్ల గుక్కుకున్నం– మా కడుపు నొప్పేందని ఏ సర్కారు అడుగలేదు. ఓట్లచ్చినయని ఇల్లిల్లు దిర్గినోల్లు మల్లమా మొఖం సూల్లే– మేమెన్ని బాధలు పడ్డమో? గ పరమాత్మని కెరుక–"

"పరమాత్మ దనేటోడే ఉంటె మన బతుకులు గిట్లెందుకు తెల్లారిపోవు" లక్ష్మి గునిసింది–

"సనరాదేపిల్లా! అదున్నడో? ఉంటే ఏడ తాగిపన్నడో మన కెందుకు– గ అకీలుదొర ఎన్నెన్ని పుండకోరు మాటలు మన మీన– పుట్టిచ్చి సెప్పిండు? ఇన్నరు గదా! మనకట్టం సుఖం మనం సెప్పుకుందాం–" ముసలయ్య కసిరి కొంచెం ముంగటికి జరిగిండు–

"నాకా బాంచెన్ కానూన్లెర్కలే– మాటనెనుక మాట ఇలవరసెబెట్టి మాట్లాడ రాదు– పనిసేసి బతికినోన్ని బాంచెన్– మాటలుసేసి బతికినోన్ని గాదు– కాలం సూడవోతె నోడున్నోనిదే ఊరంటంది– తమరు అరన్నం దింటరు బాంచెన్– గ అడ్ల గింజలు బురదలనుంచి తీసెటందుకు మేంపడే కట్టం ఏంజెప్పాలె బాంచెన్– గట్ల కట్టపడ గ అరన్నాలడుగలే బాంచెన్– కాసన్ని గంజినీల్లు దొరికితె గదే పరమాన్న మనుకున్నం– కని మావూరి దొరకు మమ్ముల గట్ల సుత బతకనియ్యటం ఇట్టం లేదు బాంచెన్– కడుపుకు సాలక కములమడిగినం– మేం నెత్తురు దారవోసి బయలు సేసు కున్న సెలుకలు కబ్జాసేసుకోకుండ్లన్నం– మమ్ముల గొడ్లను గొట్టినట్టు కొట్టకన్నం– మాఆడోల్ల మనుషుల తీర్గ సూడుమన్నం– ఏంజెప్పాలె పెద్దొర– మేంసెప్పరాని బాధలు బడ్డం– సెప్పుకుంటె మాసంబొద్ది సెప్పుకోకుంటె పాసంబొద్ది–

మేం ఇగ గట్ల బతుకలేం అనుకున్నది తప్పయింది– మామీద కోపకం బెట్టుకున్నడుదొర–

ఇవ్వాల్దనుక అకీలు దొర మేంసెయ్యని తప్పుల గురించి సానా చెప్పిండు– కోరీసోల్లు, దొర సేసిన తప్పుల గురించి చెప్పలేదు– మా...."

"ఓముసలోడా! గిడ గయ్యన్ని సెప్పేంలాభం– నీ గుడ్డపేగులోని మాట లెవలింటరు?" ఒకపదుసోడు–

వకీల్లు అనాసక్తిగా ముచ్చట్లు బెట్టుకుంటున్నారు-

ముసలోడు అదేపనిగా ఏదో చెప్పుతున్నాడు. జడ్జి మధ్య మధ్య బల్లమీద కొడుతూనే ఉన్నాడు-

చాలాసేపటి నుండి ఇదంతా చూస్తున్న బర్ల ఓదెలుకు ముఖమంతా ఎరుపెక్కింది- పెదిమలు అదురుతున్నాయి- కొంచెం కుడిపక్క నుండి చొల్లుకారుతోంది- అతను గట్టిగా సరాయించి

"దొరా ! గియ్యన్ని సెప్పేంలాభం- నాదొక్క మాటున్నది కూసంత సెవున బెట్టుండ్లి- అయింక తమరు చేసేది చెయ్యండ్లి-"

వకీల్లు ముచ్చెట్లాపిండ్లు-

"అకీలుదొర మాదొర పచ్చాన సౌనా చెప్పిండ్లు- గయ్యన్ని కాదని మావోడు బారతం చెప్పుకొచ్చిండు- అకీలు సెప్పిన సంగతులు కాదని మేమంత మొత్తుకున్నా తమరి ముంగటికి సాచ్చాలుదెత్తరు-

అకీలుదొర మమ్ముల దొంగలన్నడు లంగలన్నడు- లపంగులన్నడు- పాణాలుదీసే కటికోల్లన్నడు- అంతేకాదు అకీలుదొర...."

పి.పి ఓ. కండ్లు పులపొడిసిండు-

"మేం దొంగలమే దొరా ! అకీలు దొరన్నట్టు మేం దొంగలమే అయ్యుంటే మా పెయిమీన అంగిలేకుంట నారపడి దోరపడి నరిగెబడి గిట్ల మీ ముంగట నిల్సొక పోనే పోదుము- గీ దేశంల మనకండ్ల ముంగట దొంగతనం జేసేటోడు ఒకడు- గుప్పు చాపుగ కిందికుంద కిందుండంగనే మీదికుంద మీదుండంగనే నడిమికుంద తప్పదీసెటోడు మరొకడు- అగో గాడు బాగుపడిపోతండు- పదేండ్లకింద నా దగ్గర అయిదెకురాల అవ్వల్దర్జ పెరడుండె- గదేమయిపోయింది- దొర పెరట్ల గల్సిపోయింది- దొర దొరే మల్ల నేను దొంగనయిపోయిన- నా కుటుంబం పోయింది- ఇల్లుబోయింది- పెండ్లాం సచ్చింది- ఆఖరుకు పోరగండ్లసుత బతికిచ్చుకోలేకపోయిన— గీ ఈడుల నేను కట్టెబట్టుకొని బర్లకాసి బతుకుతున్న- దొర నాకండ్ల ముంగట ఏటకేట పెరిగిపోయిండు- ఇరువై ఎకరాలోడు నూర్లెకరాలోడయ్యిండు- ఎకరం అరెకరమోడు మన్నైగల్సిపోయిండు- మన్నైగల్సినోడు దొంగ.... పెరిగిపోయినోడు, మా బతుకుల్ల మన్నుబోసినోడు దొర-

మేము సంఘంబెట్టుకున్నం నిచ్చమే. గిందుల దాపుకంలేదు మాపుకంలేదు– ఆ మాటకత్తె నా తలమీనెంటికలన్ని దొరలకు సంఘాలున్నయి– పారిటీలున్నయి– కడుపుకుజాలవన్నం నిచ్చమే– మరి మాకేమిచ్చిండ్లు– తన్నులు గుద్దులు.

బతుకుదెరువు కోసం పరంపోగుల మావోల్లు నాగండ్లు గట్టిండ్లు– సెయ్యి బొమ్మ బెట్టుకోని మా ఊళ్ళెకొచ్చిన తెల్లబట్టలాయిన బంజెర్లు, పరంపోగులు ఇప్పిత్తనన్నడు దొంగనక్క– మేం దున్నుకుంటె దొంగలం– నచ్చలేట్లం–

అఖర్న మేం ఇండ్లు గాలబెట్టినమన్నడు– పంటలు ఖరాబు చేసినమన్నడు

దొరా! గీ సెత్తసూడుదొరా? మట్టి– మట్టిలబుట్టి మట్టిదిని మట్టిల నుంచి పంటలుదీసేటోల్లం మేము– ఒక్కొక్క గింజకు ఎన్ని నెత్తురు బొట్లు అడుపుతమో లెక్కలేదు. మబ్బు మెత్తబడ్డకాన్నుంచి మామనుసు మెత్తబడ్తది– కర్రివిమకుంటె మాకు పాసంబడ్తది. మారాకేత్తే మాగుండెలు గుబగుబ లాడ్తయి– దాన్నిపానంల పానంగా సాది సవరచ్చనజేసి– కోసి కుప్పేసి ఇత్తులు జేత్తె బత్తాలుకుట్టిచ్చి ఎత్తుక బొయినోడుదొర– ఉత్త సేతులతోని మిగిలిన మేం దొంగలం– గ పంటల సాదేసెనరే లేకుంటె దొరా మేం బండ బారిపోతం– మాకేంరాకున్న మేం పంటల సొత్తనే ఉన్నం– గంత కట్టపడి మేం పంట బండిచ్చెటోల్లం కని నాశిడం చేసెటోల్లంగాదు దొరా! మా నెత్తురంత ధారవోసి పంటల బెంచినట్టుగనే దొరను పెంచినం– పసురాల బెంచినం– మా బతుకులు కట్టుకొని మీ సేవలుసేసినం– మేం ఒక్కొక్క పెల్ల పేర్చి ఇండ్లు గట్టెటోల్లం దొరా! కూలగొట్టెటోల్లం గాదు–

ఇక సంపెటోల్లన్నరు– గ తెగువే మాకుంటె దొర ఒక్కడు గింత మంది మీద ఎక్కిసవారెట్ల జేత్తడుదొరా! నామట్టుకు నేను కోడిపిల్లను గోసెపుగ– నెత్తురు సూత్తె నాకండ్లు సిరుతలు గమ్ముతయ్–!"

ఓదెలు పిచ్చోనితీరు చుట్టూ చూసిండు–

"మనమంతా నిలుసున్న గీ కచ్చేరు ఇల్లే ఉన్నదనుకోండ్లి దొరా: డంగులు గొట్టి, ఇటికలుజేసి మాదెంటికలు ఊసిపోంగ నీల్లు నిప్పులు దాగి దీన్నికట్టినోన్ని కూలగొట్టు మనుండ్లి ఆడెంత ఇదయిపోతడో– ఆనిమనుసెంత సుమ్మర్లు సుట్టుకపోద్దో! గ కట్టందెల్వనోడు మూడు ఘడియల్ల సత్తెనాశిడం చేత్తడు–

మా పానాలు, మానాలు దీసిండ్లు, మా పంటలు ఎత్తుకపోయిండ్లు, మా భూములు గుంజుకున్నరు. ఇండ్లు కాలబెట్టిండ్లు, సంపేసిండ్లు– మేం గ సత్తైనాశిడాన్ని సూడలేక ఒక్కటయినం–

మా నెత్తురును మేం సంపుకోం– కాని ఇంకొకడు సంపుతాంటే ఇగ సూడం– దొరా మేము అన్ని చీజ్‌ల తయారుజేసెటోల్లం– మిమ్ముల, మీ బంగుళాల అన్ని.... అన్ని– అన్ని మేమే తయారుజేసినం– అయ్యన్ని నాశనం చేత్తె మేం ఊకోము మమ్ముల మరేమన్న అనుండ్లి– నచ్చలేటులే అనుండ్లి ఇంకేమన్నా అనుండ్లి– మాకేంపరువలేదు మానెత్తురు మరుగుతాంది దొరా!"

జడ్జి అసహనంగా కుర్చీలో నుండి లేచి ముఖం మూడ్చుకొని గొంతుచించి ఆడర్ ఆడర్ అంటూ అరిచిండు–

కేసు వాయిదా వేసినట్టుగా ప్రకటించి జడ్జి పక్కగదిలోకి వెళ్లిపోయాడు–

పోలీసులు రైతుల చేతులకు సంకెల్లుతగిలించి వ్యానెక్కించారు–

ఎల్లయ్య ముఖం విప్పారింది– సంతోషంతో ఓదెలును కౌగిలించుకున్నాడు–

దూరంగా నిలుచున్న ఐక్షపలుచటి వ్యక్తొకడు పిడికిలెత్తి ఎర్రసలాం చెప్పిండు–

వ్యాను కదిలింది–

చేతుల సంకెల్లు ఒకటికొకటి తాకిస్తూన్నారు– ఆ శబ్దంతో ఎల్లయ్య గొంతెత్తి పాటపాడుతున్నాడు–

"మా రక్తంతో సృష్టిస్తున్నా
తిండిగింజలు కట్టుగుడ్డలు....
పెట్టుబడులతో దోపిడు దాచే....
ద్రోహాల గుండెలో అగ్నికణమువై...."

ఓదెలు ఇంకా పలవరిస్తున్నట్టుగా గొణుగుతూనే ఉన్నాడు.

"మా నెత్తురు– మా మాంసం– మా బొక్కలు– మా మూలుగు– మా బతుకు– మా సుఖం కష్టం– చెమట– కన్నీళ్లు మేం నాశిడంజేసుకుంటామురా ?"

(అక్టోబర్ 1979, సంచిక 96.)

## ఎన్నిక ....

ఉపరితలానికి (Super structure) సంబంధించి సృజన స్పృశించని రంగం లేదు. వ్యాసం అనే రచనా ప్రక్రియను ఎంత విరివిగా ఎంత వైవిధ్యంతో వాడుకోవడానికి వీలుందో అంతగా వినియోగించుకున్నది సృజన. సంస్మరణ, సాహిత్య సమాలోచన, చర్చ, రిపోర్టింగ్, వ్యక్తుల, ఉద్యమాల పరిచయం, సాహిత్య పత్రికల, ఉద్యమాల పరిశీలన అంచనా విమర్శ – వచన రచన రశ్మి ఎంత దూరం ప్రసరించడానికి వీలుందో, జీవితానికి సంబంధించిన- సాహిత్య, తాత్త్విక, సాంఘిక, కళా, రాజకీయరంగాలవంటి అన్ని ఉపరితల అంశాలను సృజన స్పృశించింది.

అంతర్జాతీయ విప్లవ సాహిత్యోద్యమానికి సంబంధించిన రచయితలను, రచనలను తగినంతగా పరిచయం చేసిన సృజన భారతీయ భాషల్లో సాహిత్యాన్ని ప్రయోజనాత్మకమైన ఆయుధంగా వినియోగించుకున్న రచయితలను ఇరుగు పొరుగు వారిని తగినంతగా పరిచయం చేయలేకపోయిందని ఒప్పుకోవాలి. మన విజ్ఞాన వికాసాలకు ఇంకా వలసతెచ్చుకున్న ఇంగ్లీషు గవాక్షమే మార్గం కావడం ఇందుకు ముఖ్యమైన కారణం.

సృజన చరిత్రంతా ఉద్యమాల చరిత్ర. అందుకే దిగంబర కవితా ఉద్యమం, తిరుగబడుకవులు, అరసం నుంచి విరసం దాకా గెంతిన (leap) సాహిత్య ఉద్యమం సృజనలో అవే లోపాలోపాలతో మంద, వేగాలతో ప్రతిఫలిస్తాయి. పది సంవత్సరాల విరసం చరిత్రకు, పౌరహక్కుల ఉద్యమ చరిత్రకు సృజనలో వచ్చిన వ్యాసాలు, రిపోర్టులు, ప్రకటనలు సాక్ష్యం.

విప్లవోద్యమానికి ఉత్తేజాన్ని, వికాసాన్ని ఇవ్వగల మూడు ముఖ్యమయిన నవలలు సృజన ప్రచురించింది. అవి- నా కుటుంబం (టింగ్‌లింగ్ – అనువాదం – లక్ష్మీపతి) ఉప్పెన (చౌలిపో – అనువాదం – ఎన్. ఎస్. ప్రకాశరావు, నళిని) చైనా నవలలు. కొలిమంటుకున్నది – అల్లం రాజయ్య తెలుగు నవల. నా కుటుంబం రచయిత గురించిగానీ, రచన గురించిగానీ మాకు ఏ సమాచారం లేనందున పాఠకులకేమీ తెలపలేకపోయాం. కాని ఉప్పెన, కొలిమంటుకున్నది నవలల రచనలో రచయితల అనుభవాలు పాఠకులు, ముఖ్యంగా ప్రజాసాహిత్యంలో కృషిచేసే రచయితలు పరిశీలించవలసినవని భావించి పునర్ముద్రిస్తున్నాం.

సృజనలో వ్యంగ్య రచనలు చాలా తక్కువే. ఆ లోటును ఏదో ఒక మేరకైనా పూరించిన 'ఎడిటర్ అనేవాడు'ను అందుకే పునర్ముద్రణకు ఎన్నుకున్నాం.

గద్దర్ పాటలు, వర్గీస్ వ్యాసాలు, మరెన్నో ప్రజల పాటలు ప్రజాకళలపై వ్యాసాలు ప్రచురించిన సృజన ప్రజా సాంస్కృతికరంగంలో ఒక సంచలనాన్ని సృష్టించిన 'జననాట్యమండలి'తో చేసిన ఇంటర్వ్యూ సృజనలో వచ్చినపుడు విడిగా పుస్తకంగా వచ్చినపుడు కూడ విశేష ప్రజాదరణను పొందింది. పాఠకులు చాలమంది ఆ ఇంటర్వ్యూను మళ్ళీ ప్రచురించవలసిందిగా కోరారు.

అంతర్జాతీయ విప్లవ సాహిత్యోద్యమానికి గోర్కీ, లూసున్ లు మార్గదర్శకులు. ఈ యిద్దరివీ ఎన్నో రచనలు అందించిన సృజన వాళ్ళ పరిచయమైనా, రచనలైనా మచ్చుకు మాత్రమే అందిస్తున్నది.

ఏ భావమైనా ఏ ఆచరణైనా ప్రజాసేవకు అనుగుణంగా సాగినపుడే అది సార్థకమవుతుంది. రచయితకు రచన ఆచరణ. ఈ ఆచరణ ప్రజాసేవ కనుగుణంగా మల్చుకోవాలని మావో చెప్పిన ఏనాన్ ప్రసంగానికి వివరణ మావోటున్ వ్యాసం,

విప్లవ సాహిత్య, సాంస్కృతికోద్యమాలకు వేగుచుక్క తెలంగాణ రైతాంగ పోరాట ప్రజాకళారూపాలను శ్రీకాకుళంలో పునరుజ్జీవింపచేసిన పెన్నూ గన్నూ పట్టిన కవి సుబ్బారావు పాణిగ్రాహి. సృజన పాణిగ్రాహి పోరాట సాహిత్య వ్యక్తిత్వాన్ని తన పాఠకులకు పరిచయం చేసింది. పాణిగ్రాహి సంస్మరణ విప్లవోద్యమానికి గర్వకారణం.

సజీవమైన జీవితచిత్రణ, పరిశీలన, శిల్పం వల్ల కొందరికి, వర్గదృక్పథం వల్ల కొందరికి, మొత్తం మీద అందరికి అరుదైన కథకుడుగా ఆమోదయోగ్యుడైన కాళీపట్నం రామారావు ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ అవార్డు తిరస్కరించడం ఒక చారిత్రక నిర్ణయం. ఇది సాహిత్య చరిత్రలో ఆయా సాహిత్యవర్గాల స్వభావానికి సాక్ష్యంగా నిల్చిపోతుంది.

సామ్రాజ్యవాద, భూస్వామ్య వ్యతిరేక పోరాటాల్లో ఉరికంబాలెక్కిన భగత్ సింగ్, భూమయ్య, కిష్టాగౌడ్ లు సృజనలో మళ్ళీ మళ్ళీ సంస్మరించుకోబడిన వీరయోధులు. భగత్ సింగ్ చారిత్రక ప్రకటన 'విప్లవమంటే....' వారి వ్యక్త అవ్యక్త విప్లవాకాంక్షకు అజరామర అక్షరరూపం.

సృజనలో వచ్చిన వ్యాసవిస్తృతి, వైవిధ్యం మాకున్న స్థల పరిమితుల వల్ల పునర్ముద్రణకు రచనల నెన్నిక చేయడంలో చాల శ్రమనిచ్చినవి. సమయాన్ని కూడ విపరీతంగా ఈ ఎన్నిక గురించి వినియోగించవలసి వచ్చింది. మా ఎన్నిక మాకు తృప్తికరంగానే వున్నది. పాఠకులు ఎట్లా స్వీకరిస్తారో మరి.

# దిగంబర కవుల పరస్పర విమర్శలు-
# నిజాయిజాల మంచిచెడ్డలు

అట్లూరి రంగారావు

దిగంబర కవులు చీలిపోయారు. జ్వాలాముఖి నాయకత్వాన ఐదుగురు మహా స్వప్నపై చార్జిషీటు అని పెట్టారు. మహాస్వప్న సమాధానం ఇచ్చారు, ఐదుగురిలో కూడా భైరవయ్య స్థానమేమిటో అర్థంకాకుండా వుంది.

ఐదుగురి చార్జిషీట్, మహాస్వప్న సమాధానమూ ఆసక్తిదాయకంగా ఆలోచనా ప్రేరకంగా వున్నయ్. తెలుగు కవిత్వ ధోరణులనూ, సాహిత్య సంబంధంగా వుంటున్న రాజకీయ నూతన ధోరణులనూ అనుసరిస్తున్న వారందరూ తప్పక చద వాల్సిన వ్యాసాలివి.

జ్వాలాముఖి వగైరాలు Commited ideological trend లో వున్నారు. మహా స్వప్న వున్నది un Commited intellectual trend.

ఇలారెండు ధోరణులుగా విడిపోవటం ఆ రెండు ధోరణుల సిద్ధాంత రాజకీయ సాహిత్యచర్చగానే వాగ్వివాదం సాగటమూ అందరికీ ఉపయోగకరమైనదిగా వుంటుంది.

కాని ఈచర్చలో ఆ విధం కన్పిస్తున్నా పూర్తి ఆరోగ్యకరమైన అలాటిచర్చ గానే కాక, వారివారి ప్రస్తుత పొజిషన్స్‌ని వివరించుకొనటమూ ఎదటిపక్షపు భావాలను విమర్శించటమూ గానేకాక యితరమైన తప్పు పద్ధతులు ముఖ్యంగా జ్వాలాముఖి వగైరాల్లో వచ్చినయ్.

అసలు దిగంబర కవులం మేమే, మహాస్వప్న వదిలేశాడు, జారిపోయాడు. పైగా దిగజారిపోయాడు అనే విషయంగానే ఎక్కువ తీసుకొచ్చారు. ఐదుగురు సంఖ్యాబలం మెజారిటీ గావటంవల్ల అలానే అనిపించే అవకాశమూ వున్నది.

మరియిది నిజమా!

దిగంబర కవితగా ఆవిర్భవించింది ఒక సిద్ధాంతానికో ఆశయజాలానికో కట్టుబడింది కాదు. పైగా అన్ని యిజాలమీదికీ ధ్వజమెత్తింది కనుకనే దిగంబరం అన్నారు. అన్ని రాజకీయాలనూ, సిద్ధాంతాలనూ, మతాలను పడదోసి మానవుణ్ని దిగంబరంగా నిలబెట్టడమే దిగంబర కవిత ప్రత్యేకత.

అలాంటి దిగంబర కవుల్లో నలుగురు నేడు స్పష్టంగా సామ్యవాద విప్లవ కవుల యారు. విప్లవ రచయితల సంఘ సంచాలకులయారు. మార్క్సియన్ సామ్యవాదమే

ధ్యేయంగా ప్రకటించుకుని మావోయిజమే నేటి మార్క్సిజంగా విశ్వసిస్తున్నారు. ఆ రకంగా ఒక యిజమూ ఒక విశ్వాసమూ ఒక లక్ష్యమూ ఏర్పరచుకొన్న వారయారు.

ఇది చాలా చెప్పుకోదగ్గ మార్పు. మామూలు Quantitative మార్పు కాదు. Qualitative (గుణాత్మక) మార్పు. ఈ మార్పుకు చాలా ప్రాధాన్యత వుంది. ఒక్కమాటలో చెప్పాలంటే దిగంబర కవులల్లా సాయుధ విప్లవ కవులుగా రూపాంతరం పొందారు. ఈ మార్పుయొక్క గుణాత్మకతనూ నిర్మొహమాటంగా అర్థంచేసికొన్నపుడే ఎవరైనా ఈ చర్చలు సరిగా పాల్గొనగల్గుతారు. పైగా ఈ విషయాన్ని, మార్పును జ్వాలాముఖి వగైరాలు ఆత్మపరిశీలనతో అవగాహన చేసికొని అంగీకరించి తీరాల్సి వుంటుంది.

అందుకొక్కవాల్సిన ఆత్మవిమర్శాదృష్టి, ధైర్యం, వినయం జ్వాలాముఖి వగైరాలకు లోపించటం వల్లనే యీ చర్చ, సంవాదం జరగాల్సినట్లు తేట తెల్లంగా విస్పష్టమై సిద్ధాంత ఆదర్శాల చర్చగా జరక్క అనవసరమైన అభ్యంతరకరమైన గంద్ర గోళపరచే పద్ధతికి వచ్చింది.

Uncommitted, intellectual జుగుప్సాకరమైన rebellious కవిత్వం దిగంబర కవిత్వం. ఇవాళ్టికి మహాస్వప్న అలానే వున్నాడనేది వివాదానికాస్కారం లేకనే అంగీకరించాల్సిన విషయం.

జ్వాలాముఖి వగైరాలు యివాళ Revolutionary ideologyand politics కు commit అయిన కవులు.

ఈ మార్పువల్ల జ్వాలాముఖి వగైరాలు దింగబర నామం వదిలి విరసంలో పూర్తిగా సంలీనం కావటం formal గా కూడా జరగాల్సిన సంగతి. [జ్వాలాముఖి వగైరా నలుగురు కవులు వి.ర.సం.లో తమ విప్లవ కమిట్మెంట్‌తోనే చేరారుగాని దిగంబర కవులుగా చేరలేదు. అయితే విశ్వనాథశాస్త్రి, రమణారెడ్డి వంటి పేర్లకు ఉన్న ప్రయోజనం ఎలాంటిదో యిపుడింత నగ్నముని, నిఖిలేశ్వర్ వంటి పేర్ల ప్రయోజనం కూడ అలాంటిదే. దిగంబర కవులూ తిరుగుబడు కవులూ వి ర.సం లో చేరినవారు. యికనుంచి విప్లవ రచయితలుగా మాత్రమే గుర్తింపబడుతారు. సం॥] అలాజరక్క విరసంలో కూడా దిగంబర గ్రూపును నిలుపుకొనటం పైగా దిగంబర కవులం తామేగాని మహాస్వప్న కాదనటం రెండు వైపులకు హానిచేయటం అవుతుంది. ఒకప్రక్క విరసం యొక్క ఏకీకృత సర్వతోముఖాభివృద్ధికీ, రెండవప్రక్క మహా స్వప్నను పీటీపున్ను చేసి దుర్బలుణ్ని చేయటానికి దోహదకరం అవుతుంది. ఇది అన్యాయం పైగా నీతిబాహ్యము కూడా.

ఇలాటి ఆత్మవిమర్శారహిత ధోరణివల్ల జ్వాలాముఖి వగైరాలు మొదటి నుంచి నేటివరకూ వారి ఆలోచనా ధోరణి, రచనలు అన్నీ విప్లవ రచనలే సరైన మార్క్సిస్టు రచనలే అనే వాదానికి అహంకారానికి దారితీసి, వారి గత రచనల ధోరణుల లోపాలను గురించి, దిగంబర ఉద్యమాన్ని గురించి కరెక్టు మార్క్సిస్టుల లెనినిస్టు అంచనాకు రాలేకపోతారు. అలా ఆత్మవిమర్శతో నిర్ణయానికి రాలేకపోవటం విరసం అభివృద్ధికీ, వారి సిద్ధాంత పురోగమనానికీ నష్టం చేసుకోవటం అవుతుంది. పైగా మహాస్వప్న లాంటి వారిని సరైన తర్కంతో మార్క్సిస్టు హేతువాదంతో విమర్శించి వేరేదారిన వుంటున్న చాలా మంది intellectual young writers ని, మార్క్సిస్టు విప్లవ పథానకు మళ్ళించలేకపోతారు.

అలాటి ఆత్మవిమర్శారహిత, సవినయ సిద్ధాంత అవగాహనా లోపం వల్లనే మహాస్వప్నను ఓడించటం, దిగంబర గ్రూపు నిలుపుకోవటం అనేవే లక్ష్యంగా తయారయి అవకాశవాదానికి దారిదీయటం జరుగుతున్నది. భైరవయ్య వివాహం మొదలైనవి, నగ్నముని తిరుపతిదర్శనం ఈ సందర్భంగా చిన్నవిషయాలుగా అనుకోవడం రాజీపడటం జ్వాలాముఖి వగైరాలు ముందు పడుతున్న ఉద్యమాల కెంతో హానికరం.

తాము ఒకనాడు un Commited అని బాజాలు వాయించుకొన్న వాళ్ళమే అని గుర్తించగలిగినవాడే తమ Point of view కి తామెలా మారిందీ గుర్తించ గలిగితేనే నేడు మహాస్వప్న లాంటి వారినిజాయితీని Sympatheticగా అర్థంచేసుకొని నచ్చచెప్ప ప్రయత్నిస్తారు. ఇందుకోసం జ్వాలాముఖులు చాలా మారాల్సివుంది.

ఒక సిద్ధాంతానికి కట్టుబడిన వాళ్ళలో వుండే బలంవేరు. ఏయిజానికీ కట్టుబడని వారిలో వుండే బలంవేరు. ఈ రెండు బలాలూ ఈ ఉభయుల వ్యాసాల్లోనూ స్పష్టంగా కన్పిస్తుంది.

"మీకో యిజం వుంది, మీదేజయం పురోగమించడి. చరిత్ర నిండా మీలాంటి వాళ్ళ విజయాలే కన్పిస్తాయి" అని మహాస్వప్న అన్నదాన్లో నిజమేవుంది. చరిత్రలో గెలిచిన వాళ్లు అందరూ గొప్పవాళ్ల మంచివాళ్లా అనేదానికిలేదు. మా వైపేసత్యం వుందని మొండిగానమ్మి తెగించినడిచిన వారికి జయం వచ్చింది అనేది అందులో అంశం. ఆ బలం వారికుంది.

కానీ రెండవ ప్రక్కన దిగంబరులందరూ ఏకగ్రీవంగా ఇంత ప్రభావం కల్గజేయటానికి ముఖ్యకారణం ఏయిజానికీ కట్టుబడని వారి నిష్పాక్షిక విశృంఖలతే. ఇదే కట్టుబడని వారిబలం.

అందువల్ల కట్టుబడని వారిబలాన్నీ వారికుండే శక్తినీ తక్కువ అంచనా వేయలేము.

ఇప్పుడు మహాస్వప్న సమాధానంలో మార్క్సిజం వందన్నర సం॥ల నాటిదని పుచ్చి పోయిందని తీసిపారేస్తూ రాశారు. ఇది మహాస్వప్న పునర్విమర్శించుకోవాల్సిన విషయం. స్వవచన వ్యాఘాతం. వారి రెండవ (దిగంబర కవిత) సంచిక ఉపోద్ఘాతంలో 'దారిద్ర్యం, ఆర్థిక అసమానత భూమ్మీద ఉన్నంతకాలం మార్క్సిజానికి ఎదురులేదని' ఘంటా పథంగా రాసిచెప్పారు. ఆ ఉపోద్ఘాతంతో ఆ రెండవ సంచికతో మహాస్వప్న తాదాత్మ్యతలోనే వున్నట్లు ఆయనే అంగీకరించారు. అలా అయినపుడు ఈ పై మాటలు ఆయనవి కూడాకావాలి. మరి యీనాడు మారినట్లా! జ్వాలాముఖి మీద కోపంతో మార్క్సునే కాదనేస్థితిని పోవటం తనమాటలనే తను కించపరచటం శోచనీయము తన్ను తానీచపరుచుకొనటమున్నూ. జిడ్డు కృష్ణమూర్తి 40 ఏళ్ళనాడు చెప్పిందే యివాళ చెబుతున్నారు. అందువల్ల అవి 41 ఏళ్ళనాటి మాటలుగా పనికిరానివి కావు. మార్క్సు 100 సం॥ నాడు చెప్పటం Disqualification కాదు. ఏనాడు పుట్టి ఏశతాబ్దంలో చెప్పిన వాడైనా కావల్సింది ఏమి చెప్పాడు ఎలావర్తిస్తుంది ఎలా నిజమవుతున్నది అనేది. అందరిలాగా Fashionable గా మాటవదిలేయటం తను సమాధానం చెప్పదలుచు కొన్నవారి వలలో పడడమే అవుతుంద. తన్ను తామరిచి పోయే ఆవేశం నష్టం.

అన్వేషణ, చింతన అనుశీలనలను దూరంచేయని Commitments వుండొచ్చు అనేది మహాస్వప్న ఆలోచించవలసిన విషయం. అన్వేషణ, స్పందన, చింతనలకు Commitment లేకపోవటం మార్గం మాత్రంకానీ సిద్ధాంతానికి కట్టుబడకపోవటమే లక్ష్యంకాదు. UnCommited గా వుండాలనేది తాపత్రయంగా తయారైతే అన్వేషణ ముగిసి అనుశీలన అంతరించుతుంది.

not to commit అనేది వ్యసనమై ఆ వ్యసనాన్ని కాపాడుకొనటమే vested interest గా తయారయి నిజమైన నిష్పాక్షికతను objectivity ని సరైన అన్వేషణను లేకుండా చేసుకొనటమే అవుతుంది.

అసమానమైన అన్యాయసామాజిక పరిస్థితుల్లో మౌలికమార్పును total change ని కొనిరా ప్రయత్నం తమ్మెతా ఆత్మార్పణ చేసుకొని పోరాడే వ్యక్తుల్లో, శక్తుల్లో ఏ నిజం వుందో ఏ ఋజం వారనలా చేస్తున్నదో గమనించగల్గి ఆ శక్తులను మనసారా అభినందించి ఆశీర్వదించటం కూడా కట్టుబడిపోవడం అనుకొంటూ అలాంటి కట్టుబడి కూడా అపవిత్రమే అనుకుంటే ఆ Uncommital పద్ధతికి అర్థమే లేదు. అదొక rigid notion తప్ప నిజమైన కట్టుబడని స్థితి సరైన విప్లవ కార్యాచరణకు దారితీసేది అవుతుంది. మహాస్వప్న కట్టుబడనితత్వం Fashion కాకూడదు.

(ఆగస్టు 1970, సంచిక 16)

# అ.ర.సం. నుంచి వి.ర.సం. వరకు

రహి

అఖిల భారత స్థాయిన అభ్యుదయ రచయితల సంఘం (అ.ర.సం) 1936లోనే ఏర్పడినా ఆంధ్రదేశంలో మాత్రం 1943లో మహాసభ జరుపుకుంది. అభ్యుదయ సాహిత్యం సామ్యవాద వ్యవస్థను లక్ష్యంగా పెట్టుకున్న సాహిత్యం. పీడితులతో భుజం కలిపి సాహిత్య సృష్టిచేయడం లక్ష్యంగా గల రచయితలు, కవులు, అ.ర.సంలో సభ్యులుగా ఉండదగ్గవారు. కాని అ.ర.సం తొలినాడే గౌరవ మర్యాదల కోసం, కొందరి మెప్పుకోసం ప్రాకులాడింది. తాతాచార్ల ముద్రకోసం భక్తులుపడిన తాపత్రయం అది. కాకపోతే విశ్వనాథ, చిలుకూరి, పంచాగ్నుల లాంటి కవిపండితులను అ.ర.సం.లోకి ఆహ్వానించడం జరుగుతుందా? అ.ర.సం. లక్ష్యాలకు, ఈ పైన పేర్కొన్న పండితుల లక్ష్యాలకు ఏమైనా సంబంధం వుందా? మద్రాసులో జరిగిన అ.ర.సం. సమావేశానికివచ్చిన కె.ఎ. అబ్బాస్ ఇదే విషయాన్ని సూటిగా ప్రశ్నించాడు. అభ్యుదయ రచనకు మార్క్సిజం ఆయువుపట్టు అని చెప్పాడు. ఆయనవేసిన ప్రశ్న చెప్పిన సమాధానమూ, అ.ర.సం. మొదటిదశకు భరతవాక్యం పలికాయి. రెండవ దశలో స్పష్టమైన లక్ష్యంతో అంతకంటే సూటైన లక్షణాలతో అభ్యుదయ రచనలు వెలువడ్డాయి. ఈ దశలోనే (1946 - 1950) ప్రజల సమస్యలను కావ్యవస్తువులుగా తీసుకుని అనేక సాహిత్య ప్రక్రియలను అభ్యుదయ రచయితలు వెలువరించారు. ఆ దశ అభ్యుదయ సాహిత్యోద్యమ చరిత్రలో ప్రజాశకం - సాంప్రదాయిక భాషలో చెప్పాలంటే స్వర్ణయుగం. అన్ని ప్రజా ఉద్యమాల మీద గూడా ప్రభుత్వం దాడి చేసింది. ప్రజలతో, ప్రజా ఉద్యమాలతో పాటు అభ్యుదయ సాహిత్యం అరణ్యవాసం చేసింది. అడవులు, గుట్టలు ప్రజా గేయాలతో ప్రతిధ్వనించాయి. 1951-52 జనరల్ ఎన్నికల అనంతరం అ.ర.సం. మళ్ళీ ఊపిరిపోసుకోడానికి ప్రయత్నం చేసింది. 1955 ఆంధ్రలో అర్థాంతరపు ఎన్నికలు వచ్చాయి. అదొక తీవ్రమైన రాజకీయ పోరాటం. అభ్యుదయ రచయితలుగా చలామణిలోవున్న చాలా మంది పాలకవర్గ బేహారులుగా అమ్మకాలు సాగించారు. అభ్యుదయ సాహిత్యాన్ని ప్రశ్నించడానికి భయపడే లక్షణాన్నుంచి దాన్ని తీవ్రంగా నిరసించే లక్షణంవరకు సాగింది. ఈ నిరసన, ప్రతిఘటన కొన్ని సంఘటనలకు కొందరు వ్యక్తులకు పరిమితం కాలేదు. తరువాత రోజుల్లో అభ్యుదయ సాహిత్యాన్ని ప్రతిఘటించిన వీరులందరికీ సన్మానాలు, బిరుదులు, ఉద్యోగాలు లభించాయి. 1955 నుంచి 1960 వరకూ ఆంధ్రసాహిత్య సభలన్నీ సన్మాన సభలుగా జరిగాయి. ఆవిష్కరణోత్సవాలకు హడావుడి ఎక్కువైంది.

సాహిత్యసంఘాలు వందిమాగధుల వృత్తిమీద దురాక్రమణచేసాయి. "సాహిత్య ఎకాడమీ" అనే కార్పొరేషన్ ప్రభుత్వయాజమాన్యం కింద ఏర్పడింది. అ.ర.సం మీద ఈ అవ్యవస్థ ప్రభావం బాగాపడింది.

'అభ్యుదయ' పత్రిక అభ్యుదయ సాహిత్యానికి కాక, 'ఆధునిక' సాహిత్యానికి వేదికగా మారింది. మళ్లీ తొలినాటి మెతకదనం అ.ర.సం లో ప్రదర్శితమైంది. అప్పుడోగొంతు, ఇప్పుడోగొంతు ఈ లక్షణాలను నిరసిస్తూ వినబడినా మొత్తంమీద 1950 నుంచీ 1965 అభ్యుదయ సాహిత్యం దిగజారుడు లక్షణాలను సంక్రమింపచేసుకుంది. ఈలోపు ప్రణయానికి అభ్యుదయానికి పరిణయం చేయడానికి కొందరు అభ్యుదయ రచయితలు ప్రయత్నం చేసారు. అయోమయాన్ని ఆరాధించారు మరి కొందరు. "వచన కవిత్వం ఒక ఉద్యమ స్వరూపం దాల్చాలని కృషిచేస్తున్నదీ" అంటున్నారు శ్రీ పమ్మల వెంకటాద్రియ్యగారు (జయశ్రీ 1968 జూన్). "త్వమేవాహం" అని సవాలు చేసిన ఆరుద్ర "అభ్యుదయ కవుల ధర్మమా అని వర్గచైతన్యం గురించి పాడితేనే తప్ప మిగతాది కవిత్వం కాదేమోనన్న అపోహ ఆంధ్రదేశంలో అనవసరంగా ఊపిరిపీలుస్తోంది" అని తిరోగమించాడు. ప్రయోగవాదం అనీ, చేతనా వర్తం అనీ రకరకాల పేర్లతో కవితలూ, వ్యాఖ్యానాలూ వెలువడుతున్నాయి. ఈ సందర్భంలో అ.ర.సం తన అస్తిత్వాన్ని రుజువు చేసుకోలేకపోయింది. ఈ రకరకాల కంగాళీ రచయితలంతా మొన్న జూలై 4, 5 తేదీలలో జరిగిన అభ్యుదయ సాహిత్య సదస్సును పావనం చేసారు. అ.ర.సం అధినేతలు యీ విషయాన్ని తీవ్రంగా తీసుకోలేదు.

ఇది ఇలావుండగా అటు సి. విజయలక్ష్మి ఇటు దిగంబరకవులూ నేటి సమాజంలోని సర్వసామాన్యమైన ఆత్మవంచనని అసహ్యించుకుంటూ కవితలు వెలువరించారు. నేటి రచయితల కర్తవ్యం ఏమిటి అని మళ్లీ ఇన్నేళ్ళకి (1946లో అబ్బాస్ తర్వాత) ప్రశ్నించారు. 'తిరుగబడదాం రమ్మ'ని యువతరానికి పిలుపు యిచ్చారు 'తిరుగబడు కవులు'. 'ప్రజను సాయుధం చేస్తున్న రెవల్యూషనరీ నేడు కవి' అని స్పష్టంగా నిర్వచిస్తూ 'మార్చి' అన్నారు 'విప్లవ కవులు.' ఇటు అ ర సం నీరసత్వం, అటు చెలరేగుతున్న దుర్యోధనుల వికటపు ప్రయోగాలవల్ల ప్రజలకొరకు కలంపట్టే రచయితలు ఒక వేదిక నేర్పాటు చేసుకోవలసిన అవసరం కలిగింది. ఆ అవసరాన్ని పురస్కరించుకుని విప్లవ రచయితల సంఘం (వి.ర.సం) యేర్పడింది. విప్లవ రచయితల సంఘానికి అ.ర.సం అనే పేరుమీద ఏమీ ఎలర్జీలేదు. అ.ర.సం ఇక ఎంతమాత్రం అ.ర.సం కాదుకనుక వి.ర.సం ఆవిర్భవించింది.

అసలు అభ్యుదయ సాహిత్య లక్షణం ఏమిటి? ప్రజాఉద్యమాలను ఆలంబనగా తీసుకుని రచనలు సాగిస్తూ, ప్రజాపోరాటాలను బలపరచడం అభ్యుదయ సాహిత్యోద్యమ ముఖ్య కర్తవ్యం. అభ్యుదయ సాహిత్యం వస్తుప్రాధాన్యం కలది. రీతిది రెండవ స్థానమే. అ.ర.సం. ఈ విషయాన్ని గూర్చి ఆలోచించడం మానేసింది. ఇకవస్తువు: అభ్యుదయ సాహిత్య వస్తువును గురించి రెండు అభిప్రాయాలుండడానికి అవకాశంలేదు. మార్క్సిజం దానికి ఆత్మ. ఈ విషయాన్ని కూడా అ.ర.సం మరిచిపోయింది. కవితరాయగల ప్రతివాడూ అభ్యుదయ రచయితగా పోజుపెట్టడానికి ప్రస్తుతం అవకాశం ఉంది. అందువల్ల మార్క్సిజమే లక్షణశాస్త్రంగా, ప్రజలూ వారి ఉద్యమాలే లక్ష్యంగాకల రచయితల సంఘం కావాలి. అందుకే వి.ర.సం.

అసలు అ.ర.సం.లో అభ్యుదయం ఎంతవరకు మిగిలిందో మొన్న జరిగిన అభ్యుదయ సాహిత్య సదస్సులోని ప్రసంగాలు, వ్యాసాలు పరిశీలించితే తెలుస్తుంది. "కాళిదాసు కంటె అభ్యుదయ కవి ఎవరు?" అని గర్జించాడొకాయన. "వస్తువేదైనా శిల్పం ప్రధానం" అని పునస్సూత్రీకరణ చేసాడో విమర్శకుడు.

అభ్యుదయ సాహిత్య సదస్సులో విశ్వనాథ నవలలను పరిశీలించడం మరో వింత. అభ్యుదయ సాహిత్యానికి మార్క్సిజం వెన్నెముక అని చెప్పిన వక్తల మాటలకు ప్రాముఖ్యం ఇవ్వలేదు. ప్రభుత్వ యంత్రాంగం అభ్యుదయ సాహిత్య సదస్సును నడిపించడానికి ప్రయత్నించడం సదస్సు లక్షణాన్ని చక్కగా వివరిస్తుంది. అ.ర.సం. గూడా అనేక సాహితీ సమితులు, సంస్థల్లాగానే మరో సంస్థ. ప్రజలు, ప్రజా ఉద్యమాలు అ.ర సానికి పట్టవు. ఇది ఇలా ఉండగా భారత అ.ర.సం. కార్యదర్శి వచ్చి అభ్యుదయ రచయితల సంఘం (ఆంధ్రప్రదేశ్ శాఖ) అని మరో దాన్ని ఏర్పాటుచేసి వెళ్ళాడు. అయితే జులై 4, 5 తేదీలలో సంస్థను పునరుద్ధరించాలని తీసుకున్న నిర్ణయాలకు విలువేమిటి? దానినిబట్టి అ.ర.సం. అస్తిత్వం మృగతృష్ణకాదా?

అందువలన రీతిలోను, వస్తువులోనూ, అభ్యుదయ రచనలుచేసే రచయితలంతా ఒక సంఘంగా ఏర్పడాలి.

రాజకీయంగా కూడ ప్రస్తుతం మనదేశం చాల భయంకర పరిస్థితుల్లో వుంది. దానిని గుర్తించ నిరాకరించడం మహాపాపం. పాలకవర్గం ఫాసిస్టు పద్ధతుల్లో వ్యవహరిస్తోంది. స్వేచ్ఛా ప్రియులైన రచయితలు దీనిని పసిగట్టాలి. ప్రజలనుద్బోధించాలి. అ.ర.సం. ఈ పనినెప్పుడో మానివేసింది. ఈ కర్తవ్యం నిర్వహించడం వి.ర.సం. పని. "Poets are the unacknowledged legislators

## రాముడు

రాచకొండ విశ్వనాథశాస్త్రి

"విప్లవం" అనేమాట ఎక్కడ వినిపిస్తే అక్కడ తుపాకీలు పేలడానికి సిద్ధంగా ఉన్నాయని అందరికీ తెలిసిన విషయమే. ఎవరైతే ఎల్లప్పుడూ తుపాకులుపట్టుకు తిరుగుతారో వారు అహింసావాదులు కారనేది స్పష్టమే అయినట్లయితే మన "ప్రభుత్వం వారు" అహింసావాదులు కారనేది స్పష్టమే కదా.

అయితే –

ఏది సాధించాలన్నా అది దండోపాయం వల్లనే సాధించాలని మన ప్రభుత్వం లాంటివారు తప్ప మరెవరూ కోరరని నేననుకుంటాను. (మన ప్రభుత్వం అయినా మన దేశంలోని చిన్నలమీద దండెత్తుతుంది. పైదేశాల పెద్దల దగ్గర ముష్టెత్తుతుంది.) అయితే, ఏ శత్రువుతో ఏ విధంగా పోరాడాలన్నది ఆ శత్రువే నిర్ణయిస్తాడని నేను నా ముందువారి అనుభవం వల్ల తెలుసుకున్నాను.

భారతదేశం బ్రిటిషువారి బంధాల నుండి బైటపడడం, అది న్యాయం అయితే, అది ఏ విధంగా సాధించాలి? సాయుధ పోరాటం ద్వారానా? లేక అహింసా మార్గం ద్వారానా?

అని ప్రశ్నిస్తే,

"అది బ్రిటిషువారే నిర్దేశించవలసి ఉంటుంది కాని మనం కాదు కదా!" అని ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు గాంధీగారితో ఆనాడెప్పుడో అన్నారట. అంతేకాదు –

సబవుకి కట్టుబడే శత్రువుని – బలిచక్రవర్తిని – పోరాటం అవసరం లేకుండానే అధః పాతాళానికి అణిచేసిన మహావిష్ణువు రక్తపాతం లేకుండా హిరణ్యకశిపుణ్ని అణచేయలేకపోయేడుకదా అని కూడా గాంధీగారితో గోపాలకృష్ణయ్యగారు అన్నారుట,

---

of the world" అనేది చాలా రోజులనాటి మాట. ప్రజా ప్రతినిధులనే వారిని "ప్రజలు" ఎన్నుకుంటారు. కవులు "తమ ప్రజల్ని" ఎంచుకుంటారు. ఆ ఎంచుకోవడంలోనే వారు Acknowledged legislators అవుతారు.

విప్లవ రచయితలు పీడితుల్ని, తిరగబడేవార్ని, పోరాడేవార్ని "తమ ప్రజలు"గా ఎన్నుకున్నారు. వారి కోసమే రాస్తారు.

(ఆగస్టు 1970, సంచిక 16)

అలా ఆయన అన్నప్పటి నుంచీ కూడా ఆయనంటే గాంధీగారికి కొంచెం పక్కబెదురుండేదని ఆ కాలపు పెద్దమనిషొకరు నాతో చెప్పేరు.

ఆంధ్రరత్నం చెప్పిన దానికి చరిత్రలో చాలా దాఖలాలు కనిపిస్తాయని నేననుకుంటాను. ఉదాహరణకి, మనం కూడా ఆయనలాగే, భగవంతుణ్నే తీసుకుందాం.

మనిషిగా మారిన భగవంతునికంటే మనుష్యుల్లో మరెవ్వరూ ఎక్కువ్వారుండరు కదా. భగవంతుడు భూమ్మీదికి రాముడిగా దిగకుండానే రావణ బ్రహ్మలో మానసిక పరివర్తన మంచికోసం తెచ్చేస్తే ఎంత బావుండును! కాని అంతటివాడు కూడా ధర్మస్థాపనకోసం రఘు రాముడిగా రంగంలోకి దిగవలసి వచ్చింది. దిగేక, ఆయన ఆ రావణుణ్ని అడిగిందేమిటి? రావణాసురుణ్ని మానం, ప్రాణం ఇచ్చేయమన్నాడా? అతగాడి రాజ్యం అడిగేడా? అతగాడి అంతఃపురంలోని ఆడవార్ని ఇమ్మని అడిగేడా? దేశంలోని ధాన్య రాసులన్నీ ఇచ్చి తీరాలన్నాడా? బొక్కసంలోని బంగారం అంతా ఇచ్చేస్తేకాని వీల్లేదన్నాడా? రాముడవేవీ అడగనే అడగలేదు. "బాబోరే! నాపెళ్ళాన్ని నాకిచ్చెయ్‌రా బాబూ!" అని అంతమాత్రం అడిగేడాయన. అంతే అడిగేడు. అతను దేముడే. యుద్ధం జరిగితేనేకాని దేముడి భార్య దేముడికి దక్కిందికాదు.

అందుచేత –

విప్లవాలూ యుద్ధాలూ లేకుండా లోకంలో న్యాయం జరిగిపోతే దేముడికికాని మనకికాని అంతకంటె కావలసిందేముంది? దేశంలోని రావణ బ్రహ్మలంతా పేదల సీతల్ని పేదలకి అప్పజెప్పేస్తే అంతాబాగానే ఉంటుంది. నా గుండెల మీద కూర్చున్న పెద్దపులి మనసు మార్చుకొని, సన్యాసం పుచ్చుకొని, కమండలం పట్టుకొని, తావళం తిప్పుకొని వాయుభక్షణ చేసుకుంటూ హరినామ సంకీర్తనలో కాలం గడుపుకుంటే దానికీ నాకూ పేచీలేదు. దిక్కబోతేనే పేచీ.

ఇది చదివిన నా స్నేహితులు ఒకాయన చిరునవ్వు నవ్వి "మీ గుండెల మీద కూర్చున్నది పెద్దపులి కాబట్టి మారదు; కాని ఆ కూర్చున్నది మనిషైతే మారొచ్చు కదా" అన్నారు. అప్పుడు నా వంతు ప్రకారం నేను చిరునవ్వు నవ్వి, "వాడే మనిషైతే అలా కూర్చొనే కూర్చోడు కదా?" అన్నాను.

(ఆగస్టు 1970, సంచిక 16)

# విప్లవ కెరటం నన్ను 'ప్రౌడ్' చేసింది

శ్రీశ్రీ

దేశాన్ని ప్రస్తుతం ఒక అధమాధమ ప్రభుత్వం పరిపాలిస్తోంది. ఇది మాట వరుసకి సామ్యవాద మంత్రం జపిస్తుందే తప్ప, నిజమైన సామ్యవాదంలో దీనికి నమ్మకంలేదు. ఇందుకు ఒకేఒక చిన్న నిదర్శనం యిది కూలియిచ్చి పోషిస్తున్న పోలీసు బలగం. ఈ పోలీసు లెందుకున్నట్టు? కేవలం, అత్యల్ప సంఖ్యాకులైన వున్నవాళ్ల ప్రయోజనాలను అత్యధిక సంఖ్యాకులైన లేనివాళ్ల బారినుండి కాపాడడానికి మాత్రమే! దీనికే మనం ప్రజాస్వామ్యం అనే ముద్దు పేరు పెట్టుకుని మురిసిపోతున్నాం. ఈ పోలీసులు యిటీవల మా విప్లవ కవులు ముగ్గుర్ని అరెస్టు చేశారు.

"ప్రపంచ కార్మికులారా! ఏకంకండి" అనే అరుపుతోనే లెనిన్ రష్యన్ విప్లవాన్ని విజయవంతం చేశాడు. నేటి బంగ్లాదేశ్ విప్లవానికుత్తేజం యిస్తున్నది నజ్రుల్ యిస్లాం కవిత్వమే! తెలుగు దేశంలో విజృంభిస్తున్న విప్లవ కవిత్వాన్ని చూసి ఆంధ్రప్రభుత్వం వణికిపోతోంది. అందుకే ఈ సోదాలూ, నిషేధాలూ, నిర్బంధాలూను! కవిత్వం మనస్సుల మీద పనిచేస్తుంది. విప్లవ కవిత్వం ప్రజల్ని విప్లవోన్ముఖుల్ని చేస్తుంది. కమ్యూనిజంలోకి దిగిన తర్వాత కవిత్వం వ్రాసినవాళ్లు గజ్జల మల్లారెడ్డి లాంటివాళ్లు అయిదులూ పదులూ వుంటే నా 'మహాప్రస్థానం' చదివి కమ్యూనిస్టులైన వాళ్లు వేలసంఖ్యలో వున్నారు. ఈనాడు ఆంధ్రప్రభుత్వం నన్ను జైల్లో వెయ్యవచ్చు. కాని నా మహాప్రస్థానాన్ని నిషేధించలేదు. ముప్పయి, నలభై యేళ్ల నించీ నేనంటున్నదే నేటి విప్లవ కవులుకూడా అంటున్నారు. అయితే వేడినెత్తురున్న యువకులు కాబట్టి నాకన్న సూటిగా ఘాటుగా అలగాజనానికి కూడా అందుబాటయే భాషలో అంటున్నారు. అందుకే ఆంధ్ర ప్రభుత్వాని కింత కడుపు మంట. విప్లవ కవిత్వాన్ని ఎంత గింజుకున్నా ఈ ఆంధ్ర ప్రభుత్వం నాశనంచెయ్యలేదు_ సరికదా విప్లవ కవిత్వమే ఈ ప్రభుత్వానికి అచిరకాలంలో సమాధికడుతుంది.

విప్లవ కవుల మీద చేసిన ఆరోపణలన్నింటికీ వాళ్లే సమాధానం యివ్వగల సమర్థులు. అందుకు నేను ప్రత్యేకించి వకాల్తా తీసుకోనక్కరలేదు. నా విషయానికి సంబంధించిన ఒక ఆరోపణవుంది. దానికి సమాధానం ఇవ్వవలసిన బాధ్యత నాకుంది. ఏమిటా ఆరోపణ? విప్లవ కవులు నన్ను అ.ర.సం. నుంచి వేరుచెయ్యడానికి కారకులట! ఇంతకన్న అసత్యమూ, అసందర్భమూ, హాస్యాస్పదమూ అయిన అభాండం మరోటి వుండబోదు. నేనేం చిన్నవాణ్నా? చితకవాణ్నా? ఎవరో చెప్పింది విని పెయ్యిన్నానట పదహార్ల సన్మానం వదులుకోవడానికి డబ్బురూపేణా

మాత్రమే కాదు నాకుఎన్నో విధాల గౌరవాలు జరుపడానికి ఏర్పాట్లు చేశారు. అన్నింటినీ నిరాకరించానంటే అరసం మీద నా నమ్మకం పూర్తిగా నశించడమే కారణం. అంతకు ముందు పదేళ్లనుంచి అ.ర.సం. మృతప్రాయంగా పడివుంది. దానికికాయకల్ప చికిత్స చేసి లాభం లేదు. పైగా తెలుగు సాహిత్యంలో ఒక కొత్త కెరటం లేచింది. అదే విప్లవ తరంగం। దీని విజృంభణ విశాఖపట్టణంలో నా షష్టిపూర్తి నాటి నుంచీ కనిపెడుతూనే వున్నాను. చాలామందికి విశాఖ ఉత్సవమే తెలుసుగాని ఫిబ్రవరి నెల ప్రారంభం నుంచి మార్చి నెలాఖరులోగా నాకు కర్నూలు నుంచి కటకందాకా ఎన్నెన్ని చోట్ల ఎన్నెన్ని సన్మానాలు జరిగాయో తెలియదనుకుంటాను. ఇంతకొద్ది కాలంలో ఒక కవికి ఇన్ని సన్మానాలు జరగడం తెలుగు దేశంలో ఇతఃపూర్వం ఎన్నడూ జరగనిదే. ఇది గొప్ప చెప్పుకోవడం కోసంకాదు. నాకు ఎన్నిచోట్ల సన్మానాలు జరిగాయో అన్నిచోట్లా యువతరంలో చెలరేగుతున్న విప్లవ తరంగాలను నేనుస్పష్టంగా సందర్శించానని చెప్పడానికే. ఇవే నేను అ.ర.సం. నుంచి విడిపోవడానికి కారణ భూతమైన ప్రచోదనాలు. అంతేకాని ఒక జ్వాలాముఖి బెదిరించాడనో, ఒక నిఖిలేశ్వర్ బతిమాలాడనో హైద్రాబాద్‌సభల్ని (శ్రీశ్రీ ఎగ్జిబిషన్, శ్రీశ్రీ నాటక ప్రదర్శనం ఇత్యాదులు) నేను బాయ్‌కాట్ చెయ్యలేదు. నిజానికి వీళ్ళంతా హైద్రాబాద్ సభలకు వెళ్లొద్దని రాసినవాళ్లు. అయినానేను వెళ్ళాను. వెళ్లేముందు ఆంధ్రపత్రికకూ, విశాలాంధ్రకూ ఉత్తరాలు కూడా రాశాను, ముఖ్యమంత్రిగారివ్వబోయే డబ్బు తీసుకునే ఉద్దేశం నాకులేదని.

ఇవన్నీ ఈసరికే చరిత్రలో చేరిపోయిన సంఘటనలు. ఈలోగా నామీద బోలెడంత దుష్ప్రచారం జరిగింది. అరసానికి నేను వెన్నుపోటు పొడిచానట। ఇవన్నీ ఒక ఎత్తూ, విశాఖసభలు నక్సలైట్ల అధ్వర్యంలో జరిగినవేనని సాగించిన ప్రచారం ఒక ఎత్తూ। సభాధ్యక్షతవహించిన తాపీ ధర్మారావుగారూ, ప్రారంభించిన తెన్నేటి విశ్వనాధంగారూ, గ్రంధావిష్కరణ చేసిన పురిపండా అప్పలస్వామిగారూ వీళ్ళంతా నక్సలైట్లేనా?

విప్లవ రచయితలను విడుదల చెయ్యండని ఆంధ్రదేశమే ముక్తకంఠంతో ఘోషిస్తుంది. ఆనాడు తప్పకుండా ఈ ప్రభుత్వం దిగివస్తుంది. ఈలోగా నేను చెప్పదలిచిందొక్కటే. మొన్న ముగ్గురు రష్యన్ రోదసీ యాత్రికులు చనిపోయిన వార్త విని కంటనీరు పెట్టాను. ముగ్గురు విప్లవ కవులను ఆంధ్రప్రభుత్వం పీడన చట్టం కింద నిర్బంధించినప్పుడు గర్జించాను.

(సెప్టెంబర్ 1971, సంచిక 25)

# ఉప్పెన (The Hurricane) నేనెలా రాసేను?

చౌ లి-పో

1946 చలికాలంలో నేను ప్రాగుత్తరచైనాలో ప్రవేశించేప్పటికే భూసంస్కరణలు బాగా జరుగుతున్నాయి. ప్రభుత్యోద్యోగు లందర్నీ గ్రామసీమలకి వెళ్ళి రైతాంగాన్ని ఈ ప్రజాఉద్యమంలో ముందుకు నడిపించమని మా కమ్యూనిస్టుపార్టీ ఆదేశించింది. మా కాలంలో గల ప్రధానవైరుధ్యాలలో, పోరాటాలలో భూస్వాములకీ రైతుకూలీలకీ మధ్య గల వైరుధ్యాలు పోరాటాలు కూడా కలిసేవున్నాయి. అందుకే విప్లవం విజయవంతం కావాలంటే భూసంస్కరణ ఒక కీలకాంశం అని నేను గ్రహించేను. ఈ అవగాహనా, విప్లవంలో పాల్గొనవలసిన బాధ్యతా నన్ను గ్రామసీమలకి తీసుకుపోయేయి, ఆనాడు మనసా వాచా కర్మణా విప్లవ పోరాటంలోకి దూకడానికి నేను నిశ్చయించుకున్నాను. ఒక నవల రాద్దామన్న వుద్దేశం మట్టుకు నాకు అప్పటికీ లేదు.

భూసంస్కరణలు విజయవంతమయేలా చెయ్యాలంటే వ్యవసాయ కార్మికులతో కలిసి జీవించి, కష్టం సుఖం కలిసి అనుభవించాలనే తప్ప మరోలా జరగదు.

అందుచేత మేము అక్కడున్నన్నాళ్లూ ఈ కష్టజీవులేంతింటే అది తిని, వాళ్ళతో కలిసి పనిచేసేము. వాళ్ళ తిండి అంటే మరేం కాదు; జొన్న అంబలీ ఉప్పులో ఉడకేసిన కూరగాయలూను. అంతకన్నా ఒక్క పిసరు మంచితిండి తినదల్చుకొంటే వాళ్ళనీ ఆహారినీ వదిలి వెళ్ళవలిసిందే. అంటే జనం నుంచి దూరం కావడమే. పద్నాలుగేళ్ల జపాన్ పరిపాలనలో దారుణమైన దోపిడీకీ, ఘోరహింసలకీ గురైనవాళ్ల బతుకు ఆఖరికి పరమనికృష్టంగా తయారయింది. గడ్డిగాదం తింటూ రోజులు గడుపుతున్నవాళ్లు కూడా అక్కడ వున్నారు. పదిహేడు, పద్దెనిమిదేళ్ళ, పడుచుపిల్లలు, కట్టుకుందికి గుడ్డముక్క లేక యెప్పుడూ అర్ధనగ్నంగానే వుండవలసివచ్చింది.

మేము వెళ్ళిన కొత్తలో అక్కడవాళ్లు మమ్మల్ని మొదట నమ్మనూలేదు. అర్థం చేసుకోనూలేదు. మమ్మల్నీ, మా జీవితవిధానాన్ని పరీక్షగా చూసీకే కొంత నమ్మసాగేరు. మేమూ వాళ్ళలాగే అతి సామాన్య జీవితాన్ని గడుపుతున్నామనీ ఎంత చెత్త తిండైనా తినడానికి మేము సిద్ధంగా వున్నామనీ తెలుసుకున్నాక మాత్రమే మాకే దురుద్దేశాలూ లేవని నమ్మేరు వాళ్లు. పూర్వం వాళ్ళని నానాహింసలకూ గురిచేసిన పోలీసులు గుర్తుకొస్తారని- మా కాళ్ళకివున్న బూట్లు తీసి అవతల పారేసాం.

మమ్మల్ని మేము ఇట్లా మలచుకోవడం వల్ల త్వరలోనే రైతాంగం అంతా మమ్మల్ని నమ్మడమే కాదు; ఆ గ్రామంలో మా రక్షణ బాధ్యత కూడా తీసుకున్నారు. రాత్రిళ్లు మేము బయటికివెళ్తే తుపాకులు పట్టుకుని మాకు రక్షణగా వచ్చేవారు రైతులు.

రైతుకూలీలతో అంతదగ్గర సంబంధాలు ఏర్పరచుకున్న తరవాత వాళ్ళు వాళ్ళ దుర్భరమైన గతాన్ని వాళ్ళ బతుకులోని బాధల్నీ, భూస్వాముల దుర్మార్గాల్నీ, ఆ గ్రామపరిస్థితుల్నీ, ఎన్నో అంతరాంతరాల్లోని రహస్యాలనీ కూడా ఆప్తులకి చెప్పినట్లు మాకు చెప్పసాగేరు, తమను అణచేసి దోపిడీకి గురిచేసిన ద్రోహులు, స్థానిక నియంతలు, భూస్వాములు మున్నగు ప్రజాశతృవులతో మాతో కలిసి పోరాడడానికి తమ సంసిద్ధతని తెలియజేసేరు. పోరాటంలో రాటుదేలిన కొంతమంది కార్యశీలురయిన రైతులు మాతో ఎంతోబాగా కలిసుండేవారు. వ్యవసాయ కార్మికనాయకుడైన హ్వాయుయంగ్ కొమింటాంగ్ బందిపోట్లతో, గూఢచారులతో పోరాడి తర్వాత అస్వస్థుడై చనిపోయేముందు చివరిక్షణంలో కూడ నా గురించి అడిగి తెలుసుకుంటూనే వున్నాడు. అతని స్నేహన్ని, ఇతర కామ్రేడ్స్ ఆదరాభిమానాలను నేను ఎన్నటికీ మరచిపోలేను.

హెలుంగ్ కియాంగ్ రాష్ట్రంలోని షాంగ్‌చి కౌంటీలో ఆరునెలల పాటు భూసంస్కరణల్లో పాల్గొన్నాను. ఈ బృహత్తరపోరాట దశను ప్రత్యక్షంగా చూడడానికి స్వయంగా ఇతర ప్రాంతాలు కూడ తిరిగేను. హర్బిన్‌కు తిరిగివచ్చిన తర్వాత యీ సజీవమైన, విలువైన అనుభవాన్ని ఉపయోగించుకొని ఒక నవల రాయాలనుకున్నాను. సామ్రాజ్యవాదానికి భూస్వావ్యవిధానానికి వ్యతిరేకంగా 20 సంవత్సరాలుగా ప్రజలకు నాయకత్వం వహించి మా పార్టీ నడుపుతున్న మహత్తరమైన పోరాటాన్ని, ఈ కాలంలో రైతుల సుఖాలను, దుఃఖాలను చిత్రించి మొత్తంగా విప్లవపరిజానీకాన్ని ఉత్తేజపరచాలని నా ఆకాంక్ష. ఈ ఆశయం సాధించడానికి మూడు నెలలకాలం వెచ్చించి ఉప్పెన మొదటి భాగాన్ని, తర్వాత ఆరునెలలు రెండవ భాగాన్ని రాసేను.

నేను పత్రికలు చదువగలను కనుక పార్టీ మీటింగులకు హాజరయి డాక్యుమెంట్లు కూడ పొందగలిగేవాణ్ణి గనుక గ్రామసీమల్లో పనిచేసినంతకాలం భూసంస్కరణ పోరాటం గురించి నాకు ప్రాగుత్తర ప్రాంతానికి సంబంధించినంతవరకూ బాగా తెలిసివుండేది. అంతేకాకుండా ఈ పోరాటానికి సంబంధించిన యిలాంటివే ఎన్నో వాస్తవ గాథలు వినివుండడంవల్ల యీ నవలా నిర్మాణము, పాత్ర చిత్రీకరణ నాకు చాల సులువయింది. ఉప్పెనలో నేను చిత్రించిన సంఘటనలు, పాత్రలు చాలావరకూ నిజమైన సంఘటనలమీద, వ్యక్తులమీద ఆధారపడి రూపొందించబడినవే. ఉదా॥ రైతుసంఘం అధ్యక్షుడు చౌయు-లిన్ మరణము, అతని భార్య దుఃఖం, గ్రామస్తుల

దుఃఖం, స్మారకసభ అన్నీ వాస్తవ సంఘటనలే. ఒక ఊళ్లో వెన్ ఫెంగ్-షాన్ అనే కమ్యూనిస్టు కార్యకర్త వుండేవాడు. అతన్ని ఒక భూస్వామి హత్యచేసాడు. ఈ సంఘటన మమ్మలను ఎంతో కదిలించింది. అతని వీరమరణము, దానితో రైతుల్లో రగిలిన వర్గకసి, విప్లవ చైతన్యము యీ నవలలో చిత్రిస్తే దానివల్ల మన యువతరం ఉత్తేజితులై, చైతన్యవంతులై మన విప్లవయోధులు తీర్చిన బాటల్లో నడుస్తారని ఆ పాత్రను యీ నవలలో తీసుకున్నాను.

రచయిత తన నాలుగ్గోడలలో బంధించుకొని కేవలం ఊహాలోకాల్లోంచే రాయలేడు. ఒకవేళ అట్లా చేస్తే చాల అపహాస్యానికి గురయ్యే తప్పులు చేస్తాడు.

ఈ నవల రాయడంలో దినపత్రికల్లో వార్తల్నీ, పార్టీ డాక్యుమెంట్లు కొన్నింటినీ వినియోగించుకొన్నాను. కళ్లారా చూసిన విషయాలే గాక అక్కడ జనం చెప్పిన కథల్ని కూడా ముడిసరుకుగా వాడుకొన్నాను.

బందిపోట్లతో పోరాటాల గురించి ఈ నవల్లో నేను వర్ణించిన ఘట్టాలు, జనం నాకు చెప్పిన కథల ఆధారంగా రాసినవే. నేనెప్పుడూ స్వయంగా బందిపోట్లతో పోరాడకున్నా కొంతమందిని అరెస్టుచేసి ప్రశ్నించాను. నేను విప్లవ సైన్యంలో పని చేసాను కనుక నాకు పోరాటం గురించి కొంచెం తెలుసు. నేను సేకరించిన సమాచారము, మిలిట్రీ ఎత్తుగడల గురించి నాకున్న స్వల్ప జ్ఞానము బందిపోట్లతో పోరాటాలు చిత్రించడానికి తోడ్పడ్డాయి. ఈ విధంగా విషయాలు వివరంగా వినడంవల్ల, ఇతరుల అనుభవాలు అధ్యయనం చేయడంవల్ల, అవి సరిగా విశ్లేషించి, సమీక్షించి వానిలోకి తన స్వంత అనుభవాలను జోడించడంవల్ల రచయిత పరోక్ష అనుభవాన్ని ప్రత్యక్ష అనుభవంవలె చిత్రించగలడు. పరోక్ష అనుభవాన్ని చిత్రించేప్పుడు తన జీవితానుభవాన్ని కల్పనాశక్తిని పూర్తిగా వినియోగించుకొని మనం వర్ణించే పాత్రల గురించి, సంఘటనల గురించి చాల జాగ్రత్తగా ఆలోచించుకోవాలి.

'ఉప్పెన'లో లోపాలు లేవనికాదు. కథలో ఉండవలసినంత సంవిధానం లేదు. పాత్రలన్నీ ప్రాతినిధ్యస్వభావం కలవి కావు. కథానిర్మాణానికి సంబంధించిన కొన్ని వివరాలు తొలగించలేకపోయాను. మొదట భూసంస్కరణకు సంబంధించి ప్రతి సంఘటన నవలలో తేవాలనుకున్నాను కాని ఆచరణలో అది అసాధ్యమయింది. ఒక గొప్ప భూసంస్కరణ పోరాటం గురించి ఒక నవల రాస్తున్నపుడు ప్రతి విషయాన్ని జొప్పించాలని ప్రయత్నంచేస్తే ఏ సంఘటనా పాఠకునిపై గాఢమైన ముద్రవేయక పోవచ్చు. ఏ పాత్ర స్పష్టమైన ప్రభావాన్ని కలిగించకపోవచ్చు. ఒక పాత్రను

## ఇది చివరి మాట కాదు-

అల్లం రాజయ్య

చివరి మాటగా నవలకు వెనుకనున్న పరిస్థితులు, కొన్ని నా అనుభవాలు ఈ నవలను అర్థంచేసుకోవడానికి మరింత ఉపయోగపడగలవనే ఉద్దేశంతో రాస్తున్నాను.

నా చిన్నతనంలో లేగల కాయబోయినప్పుడు - వర్షం తుంపర పడుతున్నప్పుడు ఏకాకు చెత్రిలు (గొడుగులు) కుట్టుకొని విప్పచెట్లనీడకు పశువుల కాపర్లమంతా చేరే వాళ్ళం. అప్పుడు ఎవడో ఒకడు ఏదో కథ చెప్పేవాడు- కుక్కలవి, నక్కలవి- కొంచెం పెద్దవాళ్ళయితే రాజులవి, రాణులవి చెప్పేవాళ్ళు ... ఆ కథల్లో చాలా వరకు ఎక్కడో ఒక దగ్గర పశువుల కాపర్లుండేవాళ్ళు - వాళ్ళు చాలా చాలా వింత వింత పనులు చేసేవాళ్ళు- ఆ తరువాత ప్రైమరీ స్కూల్ చదువు కోసం మా అమ్మమ్మ ఊరెల్లాను. అక్కడ తరుచూ నేను మా అమ్మమ్మ దగ్గర పండుకునేవాణ్ని. మా అమ్మమ్మకు అయిదుగురు ఆడపిల్లల్ని, ఒక మగపిల్లవాణ్ని ఒదిలి మా తాత చనిపోయాడు. అంతమందిని సాదాల్సిన బాధ్యత వలన మా అమ్మమ్మ చిన్నపిల్లలను వెంటేసుకొని దున్నడం, అడవి నుండి కర్రిలు తేవటం లాంటివి చేసేది. తను పగలంతా పడ్డ కష్టం మరిచి పోవడానికి రోజూ నాకెన్నో కథలు చెప్పేది. రాను రాను నాకర్థమయిన విషయం ఆమె రోజూ ఎదుర్కొంటున్న సమస్యలనే కథలుగా నాకు చెప్తున్నదని ... అత్యంత విషాదకరమైన పరిస్థితిలో కూడా ఆ కథల్లోని పాత్రిలు గంభీరంగా వుండేవి.... నేనెన్నో

---

వర్ణించేప్పుడు ఒకేరకమయిన ఎంతోమంది లక్షణాలను పరిశీలించి శ్రద్ధగా అధ్యయనం చేసి అందరిలోవున్న సమగ్రిచిత్రాన్ని చేపట్టాలి.

చివరగా భాష గురించి రెండుముక్కలు చెప్పదల్చుకున్నాను. భాష రచయిత పనిచేసే సాధనం. జనం మాటాడే మాటల్ని రాస్తున్నప్పుడు వాళ్ళ భాషలోనే రాయకపోతే మనకి మిగిలేది అవాస్తవిక చిత్రణా, కృతక సంభాషణలూను. జనం మాటాడుకునే భాష సజీవంగానూ, సహజంగానూ, ఎంతో లోతుతోనూ వుంటుంది. వాళ్ళ భాష, వాళ్ళ దైనందిన జీవిత పోరాటాల్లోంచి పుట్టిన భాష.

తినడానికి తిండిలేని నిరుపేద " పొయిలో పిల్లి లేవలేదు" అంటాడు. 'నాది' అన్న పొలం లేని రైతుకూలీ "మా గుమ్మం అవతల పొలం ఇంకొకళ్ళది" అంటాడు. ఇలాగే ఎన్నో ఉదాహరణలు.

జీవితం నుంచీ, జీవితవాస్తవం నుంచీ పారిపోయిన 'మేధావుల' భాషకన్నా ఎంతోగొప్పది ప్రజల భాష.

(జనవరి 1973, సంచిక 40)

సార్లు మా అమ్మమ్మ కళ్ళవెంట నీళ్ళుకారడం చూశాను. కథ రుద్ధ కంఠంతో వెక్కిళ్ళతో ముగిసేది.... అట్లా కథలమీద నాకు ఆసక్తి కలిగింది.

ఆరవ తరగతి కోసం మళ్లీ మా ఊరొచ్చాను.... మా నాన్న మా వూరి పెద్ద మనుషుల్లో ఒకడు. రోజు ఎన్నో పంచాయితులు మా యింటి ముందు జరిగేవి.

ఆ పంచాయితుల్లో దొంగలు, లంగలు, తాగుబోతులు, వ్యభిచారులు, భూములు పోగొట్టుకున్నోళ్ళు, వాళ్ళల్లో వాళ్ళే తన్నుకున్నవాళ్ళు, అప్పులు తీర్చలేని వాళ్ళు, కూళ్ళు, జీతాలు ఎగబెట్టబడ్డోళ్ళు ఇలాగా ప్రతి రోజూ ఎంతోమంది మా యింటి ముందు ఏడుస్తూ, తిట్టుకుంటూ పెద్దల తీర్పును శిరసావహించేవాళ్ళు.

రానురాను వీళ్లంతా ఎందుకిట్లా కొట్లాడుకుంటారో, అసలు వీళ్ల తగువులకు మూలమేమిటోనని తెగ ఆలోచించేవాణ్ని- ఒక్కొక్క పంచాయితి రోజూ నన్ను వెంటా డేది. మా నాన్న తప్పొప్పులను నిర్ణయం పిట్టకథల రూపంలో చేసేవాడు. ఆ నిర్ణయం మీద ఆ కథల మీద నాకు నమ్మకం సడలసాగింది. మా అమ్మ తప్పక ఏదో కారణం చెప్పేది.

అలాగా వందలు కాదు వేల పంచాయతులు విన్నాను- చూశాను. పంచాయ తుల్లో నిరుపేదజనం తమ దీన పరిస్థితి చెప్పుకొని ఏడ్చేవారు. తాము నిరపరాధులమని ఆక్రోషించేవాళ్లు. ఒక్కొక్కసారి తీర్పు పంచాయతి పెద్దలు ముందే నిర్ణయించుకునే వాళ్ళు- ఎవడో ఒకడిమీద నేరం మోపబడేది. దండుగలు వసూలు చేయబడి గ్రామాధికార్ల చేతుల్లోకి వెళ్లేవి. చాలా పంచాయతులు పోలీసుపటేల్ లేకుండానే జరిగేవి. దండుగ సొమ్ము మాత్రం అతని దగ్గరికే వెళ్లేది. ఆ దండుగలు చెల్లించడం కోసం జనం ఏదుంటే అదే అమ్మేవాళ్ళు- ఆ అమ్మకం గురించి కూడా జనం చర్చించేవాళ్ళు-

వందల భూమి తగాదాల్లో రైతులు ఉన్మాద స్థితికి లోనవడం నేను చాలాసార్లు చూశాను....

అప్పుడే నేను చూసిన జీవితాల గురించి కథలు నాలో సుళ్ళు తిరిగేవి. కొన్ని పిట్టకథలు అల్లి మిత్రులకు చెప్పేవాణ్ని- కథలకు ముగింపు లుండేవికావు.... "సుఖంగా ఉన్నారు" అని చివరకు చెప్పనందుకు నా మిత్రులు నాకు శాత్రాలు (కథలు) చెప్పరావనే వారు.... ముగింపులు ఎంత ఆలోచించినా తట్టేవికావు. చాలా సార్లు నేను చెప్పిన కథలకే మిత్రులు ఎంతో సునాయాసంగా ముగింపు చెప్పేవాళ్లు. అవి నాకు తృప్తి నిచ్చేవికావు.

హైస్కూల్ చదువు సాగుతుండగా కొంత సాహిత్యం చదివాను; అప్పుడు శరత్, రవీంద్రుడు, చెలం చదివి చదివి పిచ్చెక్కింది. గోపీచందు 'చీకటి గదులు' చదివి ఉన్మాదిలా పలవరిస్తూ తిరిగాను—

ఈ సమయంలోనే కాళీపట్నం రామారావు "యజ్ఞం" కథ చదివాను— నేను అల్లుతున్న కథలకు ముగింపు ఇట్లానే ఉంటుందని అనిపించింది. అలాంటి ముగింపులతో కథలు చెప్పి చెప్పి విసుగొచ్చింది. మిత్రులకు ఆ ముగింపు నచ్చలేదు— మిగతా కథ చెప్పడంలో ఫెలయ్యానని నాకు తట్టేది కాదు.

ఆ రోజుల్లో గాంధీ హీరోగా కన్పించాడు— "గాంధీయిజం" తెలియక పోవడం వలననే జనం ఇట్లా తన్నుక చస్తున్నారనుకున్నాను. వీధులు ఊడ్చి రాత్రి బడినడిపి ఈగ కాలంత కూడా సంతృప్తి చెందలేకపోయాను. నాకేదో పిచ్చి పట్టిందని అందరు అపహాస్యం చేసేవారు— ఆ బాధతోనే "మిట్ట మధ్యాహ్నం" నవల రాశాను. అప్పటికి వరంగల్ 'మిత్ర మండలి' సభ్యులతో పరిచయాలేర్పడ్డాయి. గాంధీని నమ్మే వాళ్ళు 'నవల బాగుంద'న్నారు. ఆ నవల పోయింది— అది పోవడం ఒకరకంగా మంచిదే అయ్యింది. తర్వాత చాలా కథలు రాశాను, అయితే నేను చదువుతున్న కథలకు రాసే కథలకు చాలా వ్యత్యాసమున్నట్టుగా గమనించాను. (నాకు తెలియని ప్రేమ గురించి కొన్ని కథలు రాసి తీవ్రమైన అసంతృప్తితో ఏ పత్రికకు పంపలేదు.) నాకు తెలిసిన భాషలో తప్ప రాయడం కుదరడంలేదు. అలా గుంజాటన పడుతూనే నేను రాసే కథలు ప్రచురించడానికి కాదని ఖచ్చితంగా నిర్ణయించుకున్నాను. మరెం దుకు రాయడమో? రాసిన వాటిని ఏంచేయాలో నాకప్పుడు తెలిసేది కాదు. నేను చూస్తున్న జన జీవితం రాయకుండా ఉండనిచ్చేది కాదు.

నాచుట్టు జన జీవితంలో కొద్దిగా సంచలనం మొదలయ్యింది. నేను నివసించే తాలూకాలోని అడవి ప్రాంతం వార్తలు జనం గుసగుసగా మాట్లాడుకుంటున్నారు— ఆ వార్తలు నన్ను కలవరపరుస్తున్నాయి.

ప్రేమ్‌చంద్ సాహిత్యం చదువుతున్నకొద్ది రైతులు నాకు కొత్తగా కనిపించ సాగారు. అదే కాలంలో కొడవటిగంటి కొంచెం ఆలోచనలు రేపాడు. గాంధీ తీవ్ర శత్రువుగా మారిపోతున్నాడు— ఎందుకంటే దొరలను గాంధీ ఏం చేయజాలడని నా బాధ. మరి ఎవరేం చేయగలరోనని తెగ చదివాను.

జనజీవితంలోని సంచలనం అంతకంతకూ తీవ్రమౌతూవచ్చింది. అదేస్థాయిలో నా ఆలోచనలు పదనెక్కుతున్నట్టు నాకనిపించింది. అదివరకే 'అమ్మ' చదివేశాను. పాణిగ్రాహి పాటలు కొన్ని పాడుకున్నాను- నేను చదువవలసిన సాహిత్యం ఏదో నాకు తెలిసింది.

మొట్ట మొదటిసారిగా కరీంనగర్ 'ఉద్యమ సాహితి' వాళ్ళు "బద్‌లా" కథా సంకలనం ప్రచురించిన తరువాత నా కథలు కూడా ప్రచురించ తగినవే అన్పించింది. మిత్రులు సాహిత్యం గురించి స్పష్టమైన అవగాహన యిచ్చారు. అప్పుడే కొంత చైనా సాహిత్యం చదవడం తటస్థించింది.

ఆ తరువాత దాదాపు నేను రాసిన నాలుగు సంవత్సరాల తరువాత నా కథ ఒకటి తొలిసారిగా సృజనలో ప్రచురించబడింది- "ఎదురుతిరిగితే...." సృజనలో రావడం తోటే ఇలాంటి కథలు జనానికి అవసరమనిపించింది.

జనజీవితంలో మార్పు వేగాన్నందుకొన్నది. బాంచెగాళ్లు (బానిసలు) ప్రశ్నించ నేర్చుకున్నారు. బాంచె బతుకుకు కారణం ఉత్పత్తి సాధనాలు, వనరులు, ఉత్పత్తి కొంతమంది చేతుల్లో కేంద్రీకృతమై ఉండడమని జనం గ్రహించారు. కనుక పోరాటం వివిధ రూపాలు తీసుకొని పదునెక్కి గ్రామీణ ప్రాంతాల్లో భూపోరాటంగా పరిణమిం చింది. ప్రజల ఆలోచనల్లో వచ్చిన గుణాత్మకమైన మార్పుతో నా దృక్పథంలో మార్పు రాసాగింది. జనజీవితంలో జరుగుతున్న మార్పును రాయడం అనివార్య విషయంగా కొన్ని కథలు రాశాను- ఆ మార్పు వేగాన్ని అందుకోవడంలో నేనెంత వరకు కృతకృత్యుడనయ్యానో పాఠకులు తేల్చాలి.

క్లుప్తంగా ఈ పరిస్థితులు నన్ను రచయితను చేశాయి.

కొలిమంటుకున్నది నవల గురించి-

---

ఎప్పుడైతే భూమి మొత్తం గ్రామంలోని అన్ని వ్యత్యాసాలకు తగువులకు మూలమని తేలిందో అప్పుడే దొరల ఆధీనంలో ఉన్న వందల ఎకరాల భూమి పుట్టు పూర్వోత్తరాల గురించి ఆలోచించవలసి వచ్చింది. భూములను దొరలు పుట్టుకతోటే భుజానేసుకరాలేదు. తమ మనుగడ కోసం రైతులు ఎన్ని కష్టాలైనా ఎదుర్కొని సాగు యోగ్యంగాని భూములు సాగులోనికి తెస్తారు. అవి దొరలు ఆక్రమించు కుంటారు. కాలానుగతంగా దొరల భూఆక్రమణ పద్ధతులు మారుతూ ఉంటాయి.

కాని ఆక్రమించుకోవడం మాత్రం తప్పనిసరి. ఎంతవరకు? 'కొలిమిమంటుకో'నంత వరకే- అలాగే దోపిడి సమాజంలో ప్రతి అభివృద్ధికరమైన అంశాన్ని దొరలే వాడుకుంటారు- మౌలికంగా ఉత్పత్తి సాధనాలు, వనరులు ఉత్పత్తి శ్రామికుని పరం కానంత వరకు ఈ పరిస్థితి కొనసాగుతుంది.

ఇలా ఆలోచనలు చేస్తుండగానే ఒక దొర దౌర్జన్యాన్ని తెలిపే సుదీర్ఘమైన కరపత్రి మొకటి దొరికింది- ఆ కరపత్రి ఆధారంగా మరికొన్ని వాస్తవ పరిస్థితులు తెలుసుకోవడానికి ఆ ఊళ్లోకి దాదాపు మూడు నెలలు రాకపోకలు సాగించాను- విషయాలు తెలిసినాకొద్ది మనస్థిమితం లేకుండాపోయింది. నేను ఏదో రాయాలనే ఉద్దేశంతో ఈ విషయాలన్ని తెలుసుకోలేదు. విషయాలు తెలిసిన తరువాత వాటన్నిటిని కొన్నివందల సార్లు కలిసిన వారికల్లా చెప్పాను- ఒక కానిస్టేబుల్ విని కోపోద్రేకంతో పెద్దగా అరుస్తూ 'వాణ్ని చంపేయాల'న్నాడు. అట్లా ఆరు నెలలు గడిచిన తరువాత 1974లో 40 పేజీల కథ రాశాను. నిజానికి అది కథకాదు. ఒక రిపోర్టు మాత్రమే. అలా ఒక సంవత్సరం ఒదిలేశాను- ఆ విషయాలు చెప్పగా చెప్పగా ఎదుటి వ్యక్తికి మరింత ఆసక్తి కలిగించడం కోసం మరింత పెరిగిపోయి క్రమ పద్ధతిలో కథలాగా తయారయ్యింది. వినేవాళ్ళ ప్రశ్నలనుబట్టి పాత్రల గుణగణాలు చెప్పడం జరిగింది. ఎవరో ఇలాగే రాయమన్నారు. 1975లో మళ్ళీ ఆ రిపోర్టును కథలాగా తిరుగరాశాను. ఈసారి 80 పేజీలయ్యింది. కొందరు మిత్రులు నవలలో వాడిన భాష గురించి ఆక్షేపణ తెలిపారు. మళ్ళీ తిరుగరాసే ప్రయత్నంలో 120 పేజీలయ్యింది. ఒక వారపత్రికకు నవలల పోటీకి పంపి పీడవదిలిందనుకున్నాను. నవల తిరిగొచ్చింది. మళ్ళీ తర్జన భర్జన మొదలయ్యింది. భాష గురించి చాలామంది మిత్రులు అవహేళనచేశారు. మళ్ళీ తిరుగరాశాను. 180 పేజీలయ్యింది. ఇట్లా పెరగడానికి కారణం అనేక సంఘటనలు, ఈ నవలలోని పాత్రల జీవితాల్లో అనేక కొత్త సంఘటనలు జరుగడం- పాత్రలు ఎదుగుతున్నాయి. ఒక మిత్రుడు అచ్చువేయిస్తానని తీసుకెళ్ళాడు. ప్రెస్ యజమాని "గిదేం నవల"ని కొట్టిపారేశాడు. నవల మూల పడేశాను, దాదాపు ఆరు నెలలు ఆ విషయం మరిచేపోయాను.

అనేకానేక సంఘటనలు జరుగుతున్నాయి. ప్రజలు వీరోచిత పోరాటాలు చేస్తున్నారు. కొలిమిలో ఇనుము కరుగుతోంది. కొలిమిఅంటుకున్న పరిస్థితుల గురించి ఆలోచిస్తూ మళ్ళీ నవల బయటకుతీసి సృజనకు పంపాను; 'సాహితీ మిత్రులు' అందులోని లోపాలను తెలుపగలరని తలచి. నవల గురించి ఆఖరి ప్రయత్నం కూడా విఫల

మైందే అనుకున్నాను. సృజన 'సాహితీ మిత్రులు' చాలా వివరంగా నాతో కలిసి చర్చించిన తరువాత మళ్ళీ తిరగరాశాను. మళ్లీ చివరి ఘట్టాల గురించి మార్పులు అవసరమయ్యాయి. 1974లో మొదలైన నవల 1979 ఏప్రిల్ వరకు రాయడం పూర్తయింది–

ఈ నవల చదువగావిన్న రైతులు చాలా మంది ఇందులోని ఒక్కొక్క పాత్ర వాళ్ళ స్వభావాన్ని బట్టి మాదేనన్నారు– నేను రాయని విషయాలు కొన్ని ఉన్నాయని వాళ్ళ అనుభవాలు ఏకరవు పెట్టారు. భూమి పోగొట్టుకొని ఊరు తరుమగా బొగ్గుగని లోనికి బతుకు తెరువు కోసం వచ్చి గోదావరిఖనిలో స్థిరపడ్డాడతను– అతను సృజన కోసం ఒకటవ తారీఖు నుండి నెలాఖరు వరకు వాకబు చేస్తూనే ఉంటాడు. సృజన ఎప్పుడురాగలదో అతనికి తెలుసు– కాని అడుగకుండా ఉండలేడు. సృజనకొని నవల ఎవరి చేతన్న చదివించుకోకుండా ఉండలేడు. నాకు ఒక గ్రామంలో ఒక గుడ్డి ముసలతను తారసపడి పుల్లల్లాంటి చేతులతో నా వొళ్లంతా తడిమి సొట్ట కళ్ల నుండి నీరుకారుస్తూ తను "గట్టయ్య" నన్నాడు.

ఈ నవలలోని పాత్రలన్నింటికి మూల రూపాలున్నాయి. కనీసం గుడ్డి గట్టయ్య, నర్సింహం, బొత్తయ్య పాత్రలకు మూల రూపాలైన వాళ్ళ ఫోటోలు ప్రచురించాలనుకున్నాను. మలి ప్రచురణకు వీలైతే వేయాలని నా కోరిక–

పోరాటానికి అనివార్యంగా ప్రజలను నెట్టిన పరిస్థితుల నుండి ప్రజలు పోరాటాన్ని చేపట్టడంతో నవల ముగుస్తుంది.

వైయక్తిక పోరాటాలు సమిష్టి పోరాటాలుగా, ఒక్కొక్క బొగ్గుముక్క అంటుకొని కొలిమంతా నిప్పుకావడం ఈ నవల– ప్రజలు మరింత ఉన్నతంగా ఎదిగి చైతన్యవంతమైన వర్గ పోరాటాలు చేస్తారు–

భాష గురించి–

---

నవల మొత్తం మౌఖిక సంప్రదాయంలో నడుస్తుంది– ప్రజలు జీవించిన జీవితం, అందులోని సంఘర్షణ, ఉత్పత్తి క్రమంలో వాళ్ళ సంస్పందన నుండి పుట్టిన భాషలోనే ఈ నవల రాశాను–

ఈనాటి ఆదిలాబాద్–కరీంనగర్ రైతాంగ పోరాటానికి ముందు పరిస్థితులు ఈ నవలలో కనిపిస్తాయి. ఎన్ని మలుపులు తిరుగుతుందో, ఇంకెన్ని కొత్త కళా

## ఎడిటర్ అనేవాడు

కొడవటిగంటి కుటుంబరావు

ప్రతి పత్రిక్కీ ఎడిటర్ అనేవాడు ఒకడుంటాడు. కొద్ది వంటింటి పత్రికలు మినహాయిస్తే, ఎడిటర్ జీతగాడు అయి ఉంటాడు. వంటింటి పత్రికల ఎడిటర్లు ప్రొప్రయిటర్లే గనక వారి గొడవ ఇతరులకు పట్టదు. జీతగాడైన ఎడిటర్ల గొడవే కొంతమందికైనా పట్టుతుంది. అనేక మంది ఎడిటర్ జీతగాళ్ళ పేరు పత్రికలో ఎక్కడా కనిపించదు. అయినా వాళ్లే ఎడిటర్లు. ఎడిటరు పేరు గుద్దుకునే ఆయనకు ఎడిటింగు ఏమీ చేతకాకపోవచ్చు కూడా. అయినా పేరు అచ్చు గుద్దుకున్నందుకు, పత్రిక చదివే వాళ్ళ తిట్లూ, దీవనలూ ఆతగాడు భరించాలి. అసలుఎడిటరు వాటికి అతీతుడు. అందుచేత పేరు వేసుకున్న ఎడిటరు ఊరూపేరూలేని ఎడిటరు మీద చాల జులుం చేస్తాడు. జులుం చలాయించటానికి చాలా తేలికైన సూత్రం ఏమిటంటే పాఠకుల దీవనలన్నీ పేరుగల ఎడిటరు భరిస్తాడు. తిట్లు అసలుఎడిటరుకు బట్వాడా అవుతాయి.

ఒకప్పుడు ఈ తిట్లూ దీవనలూ చాలా సీరియస్ విషయంగా ఉండేది. ఏ పత్రికకూ వెయ్యి కాపీల ప్రచారంలేని రోజుల్లో పదిమంది మెచ్చుకున్నా లోకమంతా లేచి నిలబడి కరతాళధ్వనులు చేసినంత గొప్పగా ఉండేది. తిట్లయినా అదే ప్రమాణంలో ఉండేవి. ఇప్పుడు రోజులు మారాయి. ఏ పత్రికను ఎన్ని లక్షల మంది చదువుతారో ఎవరికీ తెలియదు. ఈ మంది మీద ఎవరన్నా మెచ్చుకుంటూ రాసినా, తిడుతూ రాసినా "వాడికి తెలీదులే!" అని సరిపెట్టుకోవచ్చు. "వాడు మన టిపికల్ రీడర్ కాడులే!" అనుకోవచ్చు. అయినా ఇతర పాసిబిలిటీస్ లేకపోలేదు. తిడుతూ వచ్చిన ఉత్తరాలను ఎడిటర్ అయినవాడు స్ప్రెస్ చెయ్యొచ్చు. మెచ్చుకుంటూ వచ్చే ఉత్తరాలు విధిగా అసలువాడికి అందుతాయి. వాటిని చూసి అసలువాడు పొంగిపోతాడా? పోడు. ఎడిటర్ పనిచేస్తున్నవాడు ఎవరిచేతైనా రాయించాడేమో.

---

రూపాలను సృష్టిస్తుందో, లేదా ఇప్పుడున్న కళారూపాలను ఏ రూపంగా మలుచుకుంటుందో పోరాటమే నిర్ణయించాలె.

ఈ నవల రాయడానికి, రావడానికి సహకరించిన ప్రజలకు, 'సాహితీ మిత్రుల'కు నవలకు 'కొలిమంటుకున్నది' పేరు సూచించిన కామ్రేడ్ వరవరరావుకు విప్లవాభినందనలు.

మంచిర్యాల.
8 జూన్ 1979. (ఆగస్టు 1979, సంచిక 94)

ఈ పరిస్థితి రెండురకాల పరిణామాలకు దారితీస్తుంది.

ఒకటి : జీతగాడైన ఎడిటరు మీద ఎడిటరునని చెప్పుకునేవాడు హమేషా నిఘా ఉంచటం. అంటే వారిద్దరి మధ్యా ఒక విధమైన కోల్డ్‌వార్ ఉంటుంది. రెండు: పాఠకుల నుంచి వచ్చే తిట్లూ, దీవనలూ పత్రిక మనుగడకు ముఖ్యం కాకపోవటం. మేధావుల కింద జమ అయినవాళ్లు తిట్టటమో, దీవించటమో చేస్తే? లాభం లేదు సార్. వాళ్లు ఇవాళ ఏ పత్రిక పాఠకులోకానికీ ప్రతినిధులు కారు; వాళ్ళ అభిప్రాయాల కోసం పత్రిక నడిపితే చిప్ప చేతికొచ్చేస్తుంది. సినిమాలు విమర్శకుల కోసం తీసినట్టే, కొంప గుండమే! (కమ్యూనిస్టులకు మేధావులంటే చిన్నచూపు అని ప్రతీతి. అది పెట్టుబడిదారీ విషయంలో అక్షరాల నిజం. మేధను అమ్ముకున్న వాడైతే అంత పరవాలేదు గాని, సొంతాన మేధ ఉపయోగించేవాడు పెట్టుబడిదారీకి గర్భశత్రువు)

రాజకీయాలలో అయేది, బిజినెస్‌లో అయేది, కోల్డ్‌వార్ ప్రతిష్ఠంభనకు దారితీస్తుంది గాని పురోగమనానికి దారితీయదు. తనకూ, ప్రొప్రయిటరుకూ మధ్య ఉండే మూగ యుద్ధం దుష్ఫలితాల నుంచి బయటపడాలంటే ఎడిటింగ్ చేస్తున్నవాడు ముందు తన మేధావిత్వాన్ని తీసి అవతలపెట్టాలి. తాను పత్రికను నడపటంలో సమర్థుడైన కారణం చేతనే తనకు ఉద్యోగం ఇచ్చి ఉండవచ్చు. కాని తాను పత్రిక ఎట్లా నడపాలో తనకన్న తక్కువ తెలిసిన వాళ్ళ నుంచి నేర్చుకోవాలి. (ఎక్కువ తెలిసిన వాళ్ళయితే ఇంకోర్ని పెట్టుకోనే పెట్టుకోరుగా!)

నిన్న గాక మొన్న కన్ను తెరిచినవారికి మన సాంస్కృతిక రంగంలో ఉన్న ఈ "తల్లకిందులు" ఆశ్చర్యం కలిగించవచ్చు. కాని ఇది అనుక్షణమూ జరుగుతున్నది. ఎవడకీ దేన్ని గురించి ఎవడికన్న ఎక్కువ తెలుసునన్న ప్రశ్న లేనేలేదు. జీతం పుచ్చుకునేవాడు ఇచ్చేవాడికి లోకువ. సినిమా ప్రొడ్యూసర్లు ప్రసిద్ధ రచయితలనూ, కళాకారులనూ బోలెడంత డబ్బుపోసి ఎంగేజ్ చేసి, వాళ్ళకు ఎట్లా రాయాలో, ఎట్లా పాటలు కట్టాలో, ఎట్లా ఆర్ట్‌వర్క్ చెయ్యాలో చెబుతారు.

ఇదంతా బిజినెస్ అమ్మంటారేమో. ఎంత మాత్రం కాదు, బాబూజీ. ఇది ప్యూర్ సంస్కృతి. ఒక ఘరానా మనిషి ఒక సుప్రసిద్ధ నర్తకిని పెళ్లాడి, "ఇక నుంచి నువు నృత్యాలు మానెయ్యాలి!" అంటాడు. ఒక రచయిత్రిని ఒక అరచయిత పెళ్లాడి - ఆవిడ రచనలు చూసి ముగ్ధుడై మరీ పెళ్లాడి - పెళ్లాడిన మరుక్షణం నుంచీ ఆవిడ కలాన్ని పామును చూసినట్టు చూస్తాడు. ఇందులో బిజినెస్ గొడవ ఏముందో?

చెప్పాను గద. ఇదొక సంస్కృతి. దీన్ని తీర్చిదిద్దినవాళ్లు బిజినెస్‌మెన్ అయితే కావచ్చు. కాని ఇది సంఘం నరనరానా ఎక్కిపోయింది. ఇది కోల్డ్‌వార్ సంస్కృతి అందాం.

మన ఎడిటర్లను దాటి చాలాదూరం వచ్చేశాం. రెండో పాయింటు: దూషణ భూషణలు పత్రికలను అంటవు. మరేది అంటుతుంది? వాటికి గూడా ముఖ్యమైనది ఏదో ఉంటుంది గద? అవును, ఉంటుంది. అది స్థూలంగా సర్క్యులేషన్; సూక్ష్మంగా రాజకీయాలు. కేవల రాజకీయ పత్రికల విషయంలో రెంటికీ అవినాభావ సంబంధం ఉన్నది. సాంస్కృతిక పత్రికల విషయంలో రాజకీయం తెరచాటుగా ఉంటుంది.

చాలాకాలం క్రితం నాకు బాగా తెలిసినవాడొకడు ఒక వారపత్రిక "చూస్తూ" ఉండేవాడు. అతను వారం వారం ఒక చిన్న బాక్స్ కట్టి అందులో కొన్ని విషయాలు వేసేవాడు. వాటిని గురించి "ఎడిటరు" గారికి ఏదో రిపోర్టు వెళ్ళినట్టుంది. జీతగాణ్ణి పిలిచి, "ఈ విశేషాలు ఏ కమ్యూనిస్టు పత్రికలోనుంచి వేస్తున్నావు?" అని అడిగాడు.

"మన ఆఫీసుకు కమ్యూనిస్టు పత్రికలు రావండి. 'న్యూస్‌వీక్'లో నుంచి వేస్తున్నాను" అన్నాడు జీతగాడు.

జీతం ఇచ్చే ఆయన ఒక క్షణం తెల్లబోయి, "అలాగా? ఏమైనా ఆ ఫీచరు మానెయ్యి" అన్నాడు. మరేనని మానేశాడు జీతగాడు.

కమ్యూనిస్టు వ్యతిరేక దేశాలకన్న కమ్యూనిస్టు వ్యతిరేకత ప్రదర్శించటంలో ఒక సంస్కృతి లేదంటారా? తప్పకుండా ఉంది. వియత్నాంలో అమెరికా చేసిన యుద్ధానికి విరుద్ధంగా అమెరికనులే ప్రదర్శనలు చేస్తూంటే మన మహా నాయకులు, స్వాతంత్ర్య పోరాటపు అతిరథులు ఆ యుద్ధాన్ని మెచ్చుకోవటంలో ఒక సంస్కృతి లేకుండా ఉంటుందాండీ?

యస్సార్; ఈ సంస్కృతిలో రాజకీయాలే ఉంటాయి. విద్యార్థులకు రాజకీయాలు ఉండరాదనండి- పోలీసులకూ, ప్రభుత్వోద్యోగులకూ, నిరుద్యోగులకూ రాజకీయాలు పనికిరావనండి- కాని దయచేసి సంస్కృతి విషయంలో రాజకీయాలు పనికిరావని అనకండి, ఈనాటి మన సంస్కృతికి ఒక రూపం ఇచ్చేది రాజకీయాలేగదండి! అందుకే గదా, ప్రాజెక్టుకు శంకుస్థాపన చెయ్యటం దగ్గర్నించీ పాడిగేదెను ఆవిష్కరించటం వరకూ ప్రతిదానికీ మంచి అంతస్థుగల రాజకీయవాదిని ఆహ్వానిస్తాం. అంత ర్జాతీయ కేన్సరు నిపుణుల మహాసభను ప్రారంభించటానికి ఎవర్ని పిలుస్తారు? కేన్స

రుతో బాధపడుతున్న వాళ్ళనా? కేన్సరు కేసులు చికిత్స చేస్తున్న వాళ్ళనా? కానేకాదు- ఏ దేశపు అధ్యక్షుణ్ణో, ప్రధాన మంత్రినో పిలుస్తారు.

చిన్న సర్కిల్‌లో పరిభ్రమించేవాళ్ళం సంస్కృతి అంటే డబ్బు అనుకుంటాం. ఎందుకంటే ఎక్కువ డబ్బున్న వాడు తక్కువ డబ్బున్న వాళ్ళను అయస్కాంతంలాగా, కృష్ణుడు గోపికలనులాగా ఆకర్షించటం చూస్తూ ఉంటాం- కాని ఇంకా పైకిపోతే అసలు విషయం రాజకీయాలని తెలిసిపోతుంది. రాజకీయ హోదా ఎదట డబ్బు చేతులు పిసుక్కోవటం మనం రోజూ చూసే దృశ్యం కాదు. అందుకేగా రాజకీయంగా పెరగటానికి లక్షలు లక్షలు కుమ్మరించేది, మరీ పైకిపోతే రాజకీయాలకూ డబ్బుకూ అవినాభావ సంబంధం కనబడుతుంది. రాబడిపన్ను వందల్లోనూ, వేలల్లోనూ ఎగ్గొట్టేవాడు జైలుకు పోతాడు. కోట్లల్లో ఎగ్గొట్టేవాడు మరింత గొప్పగా పర్మిట్లూ, లైసెన్సులూ సంపాదిస్తాడు. అమెరికా "వీపీ" (వైస్ ప్రెసిడెంట్) అగ్న్యూ రాజకీయంగా చాలా గొప్పవాడు గనక బయటపడ్డాడుగాని మామూలు మనిషైతే పదిహేనేళ్ల జైల్లో కూర్చునే వాట్ట? ఆ లెవెల్‌లో వాణ్ణి ఎవరూ ఏమీ చెయ్యలేరు.

ఈ గొడవలో మళ్లీ మన ఎడిటరు ఎటో జారుకున్నాడు. అతగాణ్ణి జీతం ఇచ్చేవాడు వెయ్యికళ్లతో కనిపెట్టి ఉండాలనుకున్నామా? లేదా? అందులో తొమ్మిది వందల తొంభైతొమ్మిది కళ్లు అతగాడి రాజకీయాలను హమేషా అన్వేషిస్తూ ఉండాలి.

అదేమిటంటే? రాజకీయాలు సంస్కృతికి ప్రాణం గద! కాని రాజకీయాల్లో చాలా రంగులున్నాయి. మత రాజకీయాలు ఫరవాలేదు. వాటిని ప్రత్యక్షంగా తిట్టినా పరోక్షంగా ప్రోత్సహించవచ్చు. కులతత్వ రాజకీయాలను గట్టిగా తిట్టరాదు కూడా. కులతత్వాలు మానండి అని ప్రజలకు- అనగా మతం కూడుపెట్టని వాళ్లకు- గొంతులు చించుకొని చెప్పవచ్చు; ఆ మాటే కులతత్వం రాజకీయవాదులతో అంటే ఎలక్షన్‌లో డిపాజిట్లు పోగొట్టుకోవలసిరావచ్చు. ఎర్రగిల్లు రాజకీయాలు చాలా ఉపయోగం కూడానూ. "ప్రజల కోసం!" అని అరిచేవాళ్లు చేతికందే దూరంలో ఉండటంవల్ల లాభమే గాని నష్టం లేదు. స్థూలంగా చెప్పుకోవాలంటే ఎన్నికల రాజకీయాలన్నీ సహించదగినవే. ఎన్నికలో ఏ మాత్రం నమ్మకంలేని బద్మాష్ రాజకీయాలను కనిపెట్టి ఉండాలి.

మన జీతగాడు (అనగా ఎడిటరు) ఏ రాజకీయాలను దొడ్డిదారిన ప్రవేశ పెడుతున్నదీ శ్రద్ధగా గమనిస్తూ ఉండాలి. సాధారణంగా జీతం డబ్బుల కోసం వాడు అన్ని రాజకీయాలు వదిలేసుకుంటాడనుకోండి: వాడి లెవెల్‌లో డబ్బుకీ, రాజకీయాలకూ

పొంతన ఉండి చస్తుందా? చావదు! అయినా చెప్పలేం. దూదిలో నిప్పులాగా వాడిలో చాలా ఏళ్ళ అనంతరం కూడా రాజకీయాలు సొరకాలుతూ ఉండొచ్చు. లేదూ, వాడు కళా, కాకరకాయా అనే దృష్టితో రాగూడని రాజకీయాలను పత్రికలోకి రానియ్యొచ్చు. (ఒక్కొక్కసారి ఏనికిమాలిన రాజకీయాలు మరింత కళాన్వితరూపంలో రచనలలో దూరటం కద్దు. కవితాకన్య కమ్యూనిస్టులను వరిస్తున్నందుకు ఒకప్పుడు సురవరం ప్రతాపరెడ్డిగారు ఆశ్చర్యం వెలిబుచ్చారు.) జీతగాడికి కళా, కందపచ్చడీ లేకుండా కడిగెయ్యటం కూడా మంచిదే.

దొడ్డిదారిన పత్రికలోకి రాజకీయాలు రాకుండా ఎలా చూడటం. అసలుఎడిటరు జీతగాడు లేకుండా పత్రిక నడపాలంటే మనది వంటింటి పత్రిక కాదాయె. ఈ జీతగాడు మనని ఏమార్చి ఏదోవేసి ప్రాణం మీదికి తీసుకురావచ్చు. ఎందుకు దీన్ని వేశావయ్యా అంటే, రచన బాగుంది, సార్! మంచి అర్టు, సార్! ఇటువంటివి వెయ్యొద్దని మీరు చెప్పలేదుగా, సార్? అనొచ్చు. అందుచేత మనం వాడికి గైడ్ లైన్స్ ఇవ్వాలి. ఇది అన్నంత తేలిక అనుకునేరు. చాలా డిఫికల్ట్, మోస్ట్ కాంప్లికేటెడ్. అనగా ఎలా చెప్పాలో మనకు చచ్చినా తెలీదు.

అందుకని మనం కొన్ని సులువు మార్గాలు అవలంబించాలి. "ఇదుగో, అబ్బాయ్! నువ్వు ఏ రచనలోనూ విప్లవం అనేమాట రానివ్వకు. వెనకటికి బ్రిటిషు వాళ్లు స్వరాజ్యం అన్నమాటను నిషేధించారు చూడూ! వాళ్లేం వెర్రివాళ్లా? సూర్యుడు అస్తమించని సామ్రాజ్యాన్ని ఏలారు ఏమిటనుకున్నావేమిటోను! శ్రీకాకుళం, వరంగల్లు, విశాఖపట్నం ప్రాంతాల నుంచి ఎవడేం రాసినా వెయ్యకంతే! మనకు రచనలు కరువా? నెల నెలా బండీడు వ్యాసాలు అవతల పారేస్తున్నావే. అందులో ఏదివేసినా పత్రిక నిండిపోతుంది గద. అదే అనొద్దు. పాఠకుల కేం తెలుసు, వెధవలు! ఏది అచ్చెయ్యి గాక చదివేస్తారు! వాళ్ళకు బుర్రలుంటే మనం ఈ పత్రిక నడప గలమా? పత్రిక గెటప్; ఎడ్వర్టయిజుమెంట్లూ - ఇవే ముఖ్యం. నీ కళా, గోంగూర పచ్చడీ వొట్టి దండగ! వ్యాసం మరీ దాగా లేకపోతే మంచి కార్టూన్ తగిలించు. నీకు లిస్టు తయారు చేసిస్తాను. మారుపేరుతో రాసినా వాళ్ళ రచనలు వెయ్యకు. చీనా, మావో, మశానమూ మనకొద్దు. అమెరికా, రష్యాలకు విరుద్ధంగా ఏదీ వెయ్యకు. ఎందుకొచ్చిన గొడవ. వియత్నాం మీద ఆ పద్యం వేసుండవలసిందికాదు. వాళ్లు గెలిస్తే మన పత్రిక్కి ఏం వొరిగింది. వాళ్లు ఓడితే మనకేం తరిగింది?...." ఇలా మనం జీతగాడికి బోధించాలి. మన బాధలు వాడి తలకెక్కేట్టు చూడాలి.

ఇదంతా సంస్కృతి కాదనుకుంటే మీరు దొడ్డి దారనున్నారు. ఇదే ఈనాటి మన సంస్కృతి. దానికి నిదర్శనం మనం ఆదర్శ ఎడిటరనుకునేవాడు.

(మార్చి 1974, సంచిక 54)

# జననాట్యమండలితో సృజన ఇంటర్వ్యూ

ప్ర: జననాట్యమండలి అవసరం ఏమిటి?

జ: నేడు మన దేశానికి విప్లవం అవసరం. దానికి ప్రజా సైన్యంతో బాటు సాంస్కృతిక సైన్యం కూడా అవసరం. అందులో భాగంగానే జననాట్యమండలి అవసరం.

ప్ర: జననాట్యమండలి ఎలా ఏర్పడింది.

జ: క్రితంలో 'ఆర్ట్‌లవర్స్' అనే సామాన్య సాంస్కృతిక సంస్థగా ఉండేది. దేశంలో వచ్చిన రాజకీయ మార్పుల కనుగుణ్యంగా 1970 కల్లా సభ్యుల ఉత్సాహంతో ఆ సాంస్కృతిక సంస్థకాస్త విప్లవ సాంస్కృతిక సంస్థగా మారింది. ఈ నూతన వెల్లువ మొదట్లో సాహిత్య గోష్ఠులను, కవి సమ్మేళనాలను మాత్రమే నిర్వహించేది. కవి సమ్మేళనాల ద్వారా గ్రామ గ్రామాన విప్లవ ప్రచారానికి పూనుకున్నది. సుమారు 10 మంది సభ్యులు సైకిళ్ళపై లౌడ్‌స్పీకర్ కట్టుకొని గ్రామాలకు వెళ్ళి, కాస్త ఎత్తయిన చోట్లో, లేక రచ్చబండవద్ద ఒక టేబుల్ వేసి రికార్డులు పెట్టి జనాన్ని ఆకర్షించి వాళ్ళు అక్కడ గుమిగూడగానే తమ తమ కవితలు చదివి వినిపించేవారు. ఏ స్థలమూ అనుకూలంగా లేకపోతే ఒక వీధిలో చాప పరచి దానిపై మైక్ పెట్టి పనిముగించేవారు. పట్టణాలలోనైతే స్కూల్ హాల్‌లోనో, లైబ్రరీలోనో కవి సమ్మేళనాలు జరిపేవారు. ఈ కార్యక్రమాలు బస్తీలలోని మధ్య తరగతి జనానికి అర్థమయ్యేవిగాని గ్రామాలలోని రైతాంగానికి పూర్తిగా అర్థమయ్యేవిగావు. ఈ కవిసమ్మేళనాలతో, సాహిత్య గోష్ఠులతో ఒక సంవత్సరం గడవడంతో సమీక్షించుకొని కొన్ని గుణపాఠాలు తీసుకోవడం జరిగింది. అది- ఈ కవి సమ్మేళనాలకంటే పాటలు, నాటకం, ఇతర జానపద కళారూపాలు జనానికి బాగా అర్థమౌతాయన్న దాంతో సంస్థ సభ్యులు (సభ్యులు వాళ్ళే, రచయితలు వాళ్ళే) కవితల బదులు పాటలు రచించాలని, ప్రదర్శించాలని నిర్ణయం జరిగింది. పాటలు మొ॥ వాటి కార్యక్రమం మొదలెట్టేవరకు మంచి ఫలితాలు వచ్చాయి. ఆ ఉత్సాహంతో నాటిక Takeup చేశాం. అవసరంలో మిగతా కళారూపాలు.

ప్ర: జననాట్యమండలి ఏర్పాటు చేయాలనుకున్నప్పుడు కళాకారుల్ని ఎలా కూడవేశారు? వారిలో ఉన్న కళా చాతుర్యాన్ని (artistic talent) బట్టా। లేక వారికున్న రాజకీయ అవగాహన బట్టా?

జ: మొదట్లో కళా చాతుర్యంగల కళాకారులపై ఆధారపడ్డాము. వాళ్ళు మొదట్లో కాస్త బాగానే ఉపయోగపడ్డారు. వారికి ఏ అవగాహనలేదు: మిత్రులైనందువల్ల వచ్చి మా సభ్యుల పాటలకు బాణీలుకట్టి పాడేవారు. ఆ తరువాత మేమే చొరవ తీసుకొని,

లేదా ? ఉంటే ఏంజేయాలి ?

జ : మనకు రిహార్సల్స్‌కు ఎక్కడ అనుకూలంగా ఉండి అందరూ రాగలుగు తారో అక్కడ రూం తీసుకోవచ్చు. ఇక పోలీసుల నిఘా అంటారా ? వాళ్ళ నిఘా లేనిచోటు మొత్తం ఇండియాలో ఎక్కడైనా ఉండగలదా ? ఐనా మనది బహిరంగ కార్యక్రమం గనుక మన కార్యక్రమాల్ని బహిరంగంగానే ప్రదర్శిస్తాం కాబట్టి ఆ ఆలో చనే అనవసరం. ఇక పక్కవాళ్ళకు అభ్యంతరంకలగకుండా చూసుకోవాలి। వాళ్ళతో కలుపుగోలుతనంగా ఉంటే ఈ సమస్య కొంతవరకు పరిష్కారం కాగలదు.

ప్ర : వాయిద్యాలు అన్నీ సమకూర్చుకొని ప్రాక్టీసు మొదలెట్టారా ? లేక క్రమంగా వాటిని సమకూర్చుకున్నారా ?

జ : క్రమంగానే సమకూర్చుకున్నాం.

ప్ర : క్రమంగా సమకూర్చుకుంటే మొదట కావలసిన వాయిద్యాలెవ్వి ?

జ : డప్పు, డోలక్, గజ్జెలు ఉంటే పని ప్రారంభించవచ్చు. హార్మోనీ ఉంటే మరీ మంచిది.

ప్ర : మీరు పాటలకు బాణీ ఎలా కట్టేవారు ?

జ : సహజంగా మేము జానపదపాటలపై కేంద్రీకరించాం కాబట్టి, ఆ దరువుల కనుగుణ్యంగా పాటలు రాసుకొని ఆ దరువులపైనే పాడుతాం.

ప్ర : మీరు ఎక్కువభాగం నగరాల్లో ఉండేవారుకదా ! గ్రామాలలోని వివిధ కళారూపాలు ఎలా పట్టుకోగల్గారు ?

జ : గ్రామాలలో పనిచేసి, రైతాంగంమధ్య తిరిగితే, ఆ అనుభవంతో వారిలో ప్రచారంలో ఉన్న కళారూపాలు పట్టుకోవడం అంత కష్టంకాదు; దానికి పట్టుదల, కృషి కావాలి।

ప్ర : మన పాటలకు ప్రజలకు నచ్చిన (Popular) సినిమా రాగం (Tune) పెట్టవచ్చా ।

జ : అలాచేయవచ్చు. మనసాహిత్యం, కళలు కత్తిలా ఎలా జనంలోకి తీసుక పోవాలన్నదే ముఖ్యంకాని సినిమా ట్యూనా, మరొకటా అన్న వివాదం అనవసరం।

ప్ర : పట్టణాల్లో మధ్యతరగతి వారికి, మేధావులకు, కార్మిక వర్గానికి, అలాగే పల్లెల్లో రైతాంగానికి వేర్వేరు పాటలు నాటికలు రాయాల్సిన అవసరంలేదా ?

జ: తప్పకుండా ఉన్నది: గ్రామాలలోగానీ, పట్టణాలలోగాని ఆయా ప్రజల స్థాయి ననుసరించి మన ప్రమాణాలను అభివృద్ధి చేసుకోవాలి: అలా చేయడంద్వారానే మనం విస్తృత ప్రజా బాహుళ్యానికి సేవచేయాలన్న దృక్పథంనుండి తప్పిపోము.

ప్ర: డప్పులు, డోలక్ లేకాక మోతర్ గన్, గిటార్ లాంటి వాయిద్యాలు (Instruments) వాడవచ్చా?

జ: మన ప్రజలలో విశేషంగా ప్రచారంలోఉన్న డోలక్, డప్పు, హార్మనీ మొదలగు వాయిద్యాలతో మనం విశేషంగా ప్రచారం చేయగలం పేద రైతాంగాన్ని ఆకర్షించడానికి, వారిని కార్యోన్ముఖుల్ని చేయటానికి నడుంకట్టాం కాబట్టి మన కార్యక్రమాలు సాధ్యమైనంత పొదుపుగా ఉండాలి. ఐసంతమటుకు హంగామాలవేపు వెళ్ళకూడదు.

ప్ర: శాస్త్రీయ సంగీతంలో పాటలు మీలో ఎవరైనా పాడతారా? దాని వలన జనాన్ని ఉత్తేజ పర్చగలమా? శాస్త్రీయ సంగీత పరిజ్ఞానం ఉంది మన అవగాహన ఉంటే, ఇప్పటికన్నా బాగా పాడగలుగుతారా? లేక బేధమేమీ ఉండదా?

జ: శాస్త్రీయ సంగీతంలో ప్రవేశం ఉంటే మంచిదే? కాని దానికోసం ఇప్పుడు పనిగట్టుకొని నేర్చుకోవల్సిన పనిలేదు. మాలో అలా పాడేవారు ఎవరూలేదు: ఇక శాస్త్రీయ సంగీతంతో జనాన్ని ఉత్తేజపర్చగలమా అన్నసమస్య: మనదేశంలో అధిక శాతం నిరక్షరాస్యులు అన్నసంగతి అందరికూ తెలిసిందే! వారిని కదల్చాలంటే జానపద రూపకాలే ముఖ్యంగా చేపట్టాల్సిఉంటుంది. శాస్త్రీయ సంగీతం లాంటివి తీరిగ్గా ఆలోచించవల్సిన విషయాలు.

ప్ర: మీరు ప్రధానంగా గద్దర్ పాటలే ఎందుకు పాడతారు? విరసం రచయితల పాటలకు, శివసాగర్ మొద॥ వాళ్ళ పాటలకు ఎందుచేత బాణీకట్టలేకపోయారు?

జ: మొదట్లో మేము విరసం రచయితల పాటలే పాడేవారం. ఆ తర్వాత గద్దర్ పాటలు రాశాడు. అవి గ్రామాలలో, ఇటు పట్టణాలలో కూడా విశేష ప్రజాదరణ పొందాయి. ముఖ్యంగా జానపదరీతిలో ఉండి, ప్రజాభాషలో ఉట్టిపడుతున్నాయి కాబట్టి, విప్లవ రచనలలో అవి విశిష్ట స్థానాన్నిపొందాయి. వాటిని జనంకోరుతున్నారు అందుచేత జనం కోరికపై గద్దర్ పాటలే ఎక్కువ పాడుతున్నాం.

ప్ర: జననాట్యమండలి కార్యక్రమాలు ప్రజలలోకి చొచ్చుక పోవడానికి వాటిలోని భావమే కాకుండా, ఇంకేమైనా కారణాలున్నాయా? అందుకు అవలంభించిన పద్ధతులేమిటి?

జ : జ. నా. మం. కార్యక్రమాలు ప్రజలలోకి చొచ్చుకపోవడానికి వాటిలో భావం (రాజకీయాలు) ముఖ్యకారణమైనప్పటికీ, దానితోపాటు రూపం, భాష కూడా ముఖ్యమైనవి. ఈ మూడింటి సమన్వయం కుదిరినప్పుడే అవి ప్రజలలోకి బలంగా వెళ్ళగలవు.

ప్ర : ప్రదర్శన ఇవ్వడానికి స్టేజీ అవసరమా ? స్టేజీలేనిచోట ఎలా ఉండాలి ? ప్రేక్షకులు ఎటువేపు కూర్చుంటారు ? కళాకారులు ఎటుతిరిగి నటించాలి ?

జ : స్టేజీ ఉంటే మంచిదే। లేకపోతే ఏ ఎత్తయిన ప్రదేశాన్నయినా స్టేజీగా ఉపయోగించుకోవచ్చు. స్టేజీ అనుకూలతనుబట్టి ప్రేక్షకులు కూర్చుంటారు. ఒక్కోసారి (తప్పని సరైనప్పుడు) స్టేజీచుట్టూ జనం కూర్చున్నా ప్రదర్శన ఇవ్వగలగాలి। ఐతే ఇక్కడ నటుడు గమనించదగ్గ విషయమేమంటే ఏదో ఒక పక్క ఎంచుకు నిటు వేపే తిరిగినటించాలి. చుట్టూ ప్రేక్షకులుఉన్నారు కాబట్టి చుట్టూ తిరిగి నటించగూడదు.

ప్ర, ప్రదర్శనకు కర్టన్లు అవసరమా ? కనీసం ముందు కర్టన్ ఐనాకావాలా ? సెట్టింగులు అవసరమా ? అవసరమైతే ఎక్కడ అవసరము ?

జ : కర్టన్లు అవసరమాలేదా అన్నది సమస్యకాదు। అవి మనకు అందుబాటులో ఉన్నాయా లేవా అన్నది– కర్టన్లు ఉంటే వాడుకోవాలి। ఐతే అవి లేనిచోట కూడా ప్రదర్శన ఇవ్వడానికి మనం సిద్ధంగావుండాలి. ఇక సెట్టింగ్ అవసరాన్ని వీలునుబట్టి.

ప్ర : ఎక్కడేనా, పట్టణాల్లోగూడా మైకులులేకుండా మన ప్రదర్శన విజయవంత మవుతుందా ?

జ : ముందు అనుకున్నట్టు తక్కువ హంగామాతో ఎక్కువ ఫలితాన్ని సాధించడం ధ్యేయంగా ఉంచుకోవాలి। మైకు, కర్టన్లు, సెట్టింగులు మొ॥ అన్ని విషయాలలో అదే పద్ధతి అవలంబించాలి। effect గా ప్రదర్శించగలగాలేకాని మైక్‌గాని మరొకటిగాని లేకుండా ప్రదర్శన ఎందుకు విజయవంతంకాదు।

ప్ర : కొన్ని గ్రామాలలో కరంటుగాని, పెట్రోమాక్సు లైట్లుగాని అందుబాటులో లేకపోతే మన కార్యక్రమం ఎలా నడపాలి ? లేక ఆపివేస్తామా ?

జ : ఆపివేస్తామా। అన్న సమస్యతో ప్రారంభమయితే ఎన్నో సమస్యలు ఎదురై కార్యక్రమాలు అసలు కొనసాగవు. కాబట్టిఎదురయ్యే ప్రతిసమస్యను మనం ఆచరణలో పరిష్కరించుకోవలసిందే। కరంటు రాకముందు అసలు ప్రదర్శనలేజరుగలేదా। ప్రజలకు సేవచేయడం అంటే ప్రజలలోకి చొచ్చుకపోయి సొంతచొరవతో ప్రదర్శనలివ్వాలి. అప్పుడు లైట్లు మైక్ అనే సమస్యలు చాలా సులభంగా పరిష్కారం ఐపోతాయి.

ప్ర: గ్రామీణ ప్రాంతాల్లో మనకు అందుబాటులో ఉండే మేకప్ (Make-up) ఏమిటి? లేక ప్రతిచోటికి మేకప్ సామాగ్రి మనతో తీసుకువెళ్ళాలా?

జ: మేకప్‌సామాగ్రి మనతో తప్పక తీసుకువెళ్ళాలి! ఒకవేళ మనం అంతగా తీసుకపోలేని పరిస్థితివస్తే, గ్రామాలలో సామాన్యంగా ప్రజలు వాడుకునే సామాగ్రి తోనే మనం వేదిక ఎక్కవలసి ఉంటుంది.

ప్ర: మేకప్, డ్రెస్ ఎలా ఉండాలి?

జ: పాత్రలకు అనుకూలంగా ఉండాలి; అతి సామాన్యంగా కూడా ఉండాలి.

ప్ర: ఏ పాత్రకైనా కావలసిన బట్టలు, ఆభరణాలు (ఉదా: గొంగడి, కంబెలు మొ॥) మీరు సొంతానికి సంపాదించుకున్నారా? లేక ఏ ఊరికెడితే ఆ ఊళ్ళో ప్రజల వద్దనుండి సేకరించారా? ఎలా చేశారు?

జ: గ్రామీణ వాతావరణాన్ని చిత్రించే రూపకాలే ఎక్కువ ప్రదర్శిస్తాం కాబట్టి గోచీలు, ధోతులు, రుమాల్లు, చీరెలు, సెల్లాలు (భుజంపై వేసుకునే కండువా) మొదలగునవి మనం సంపాదించడం అవసరం. అవి మన వెంబడి ఉంటే ఎప్పుడు ఎక్కడ ప్రదర్శన ఇవ్వాలనుకున్నా మనకు తేలిక అవుతుంది. లేకపోతే- ప్రతిదీ తడుముకోవలసివస్తుంది ప్రతిసారి. సమయానికి ఏదీదొరకదు. ఇక మోయలేని గొంగళ్ళు మొ॥ ప్రదర్శన ఇచ్చే గ్రామాల్లో రైతులనుండి సేకరించి, వాడుకొని ప్రదర్శన ఐపోవడం తోనే పాడుచేయకుండా తిరిగి జాగ్రత్తగా ఇచ్చివేయాలి: జననాట్యమండలి బట్టలు (Castooms) క్రమంగానే సంపాదించుకున్నది.

ప్ర: మీ డ్రామాకు స్క్రిప్టు (రచన) లేదట నిజమేనా? స్క్రిప్టు లేకుండా ఎలా ప్రాక్టీసు చేశారు? ఎలా ప్రదర్శించారు?

జ: ఇంతవరకు "బీదలపాట్లు" నాటికకు స్క్రిప్టులేనిమాట నిజమే! ఇప్పుడిప్పుడే సాంస్కృతిక సంస్థల ప్రదర్శనార్థం స్క్రిప్టు తయారు చేస్తున్నాం. ఐతే ఇంతవరకు Extempore గా వేసేవాళ్ళం. అందుకు నటకుల చొరవ, ప్రజ్ఞ అవసరం. ప్రయత్నిస్తే మిగతా దళాలు కూడా చెయ్యవచ్చు. కాని స్క్రిప్టు లేకుండా ఉండడమే ప్రత్యేకం అనేదిగా తయారుకావద్దు.

ప్ర: ప్రదర్శన ఇచ్చే ఒకటి రెండు రోజులముందు, ఆ గ్రామ పరిస్థితి తెలుసుకుంటారా? వాటిని మీ ప్రదర్శనలో ప్రస్తావిస్తారా? దాని ప్రభావం ఎలా ఉంటుంది?

జ; అలాచేస్తే మంచిదే: అలా అవకాశం ఉండి తెలుసుకోగలిగితే అక్కడి ప్రజలకు అర్థమయ్యేలా మన నాటికలో, ఇతర రూపకాలలో కొన్ని మార్పులతో (స్థానిక సమస్యలు) ప్రదర్శించి అక్కడి ప్రజల అభిమానం మరింత చూరగొనవచ్చు.

ప్ర : ప్రదర్శనంముందు మీ ఎడల ప్రజల ఆదరణ ఎలా ఉంది? ప్రదర్శన తర్వాత ఎలా ఉంది?

జ : ప్రజలు బూటకపు పార్టీల ప్రచారానికి చాలాకాలం నుండి బలవుతూవచ్చారు. మనం విప్లవ పార్టీ రాజకీయాలు ప్రచారం చేస్తాం కాబట్టి వాళ్ళ జీవితాలకి పరిష్కారం కనిపిస్తున్నట్లు వాళ్ళ మొఖాలు వింతకాంతితో వెలుగుతాయ్. ఇందుమూలంగా ప్రజలు ఎంత సంతోషిస్తారో, భూస్వామ్యవర్గాలు అంత బెంబేలెత్తి పోతాయి.

ప్ర : ప్రాక్టీసు పూర్తయేవరకు ఒక రూంలో ప్రాక్టీసు చేస్తూ ఉంటూ, బాగా వచ్చిన తర్వాతనే ప్రజలవద్దకుపోయి వినిపించడం మంచిదా? వీటిలో ఏ పద్ధతివలన కళాకారులు నైపుణ్యం సంపాదించగలరు?

జ : చిత్తశుద్ధితో రిహర్సల్స్ చేయడం మొదటి కర్తవ్యం. కాస్త బాగానే వచ్చింది అనుకుంటే, ప్రజలలో ప్రదర్శనలు ఇస్తూనే స్థాయిని పెంచుకోవాలి. అలోపల ప్రజలనుండి విమర్శలను స్వీకరిస్తూ మనల సంస్కరించుకోవాలి. అలా రాను రాను ప్రదర్శనలు సమర్థవంతంగా వచ్చి కళాకారులు రాటుదేలుతారు.

ప్ర : మీరు ప్రదర్శనలకు చందాలు వసూలు చేస్తారా? ఎందుకు? ఏవిధంగా చేస్తారు?

జ : సాంస్కృతిక దళం నడపడమంటే ఆర్థికంగా ఇబ్బందులుంటాయని అందరకూ తెలుసు. మన ప్రదర్శనలు ప్రజలగురించే గనుక మనం ఆ సమస్య పరిష్కరించుకోవడానికి ప్రజలపైనే ఆధారపడుతాం. అంటే హృదయపూర్వకంగా పళ్ళెం పట్టుకొని ప్రదర్శన జరుగుతూ ఉండగా ప్రజలలోకి వెళ్ళి వసూలుచేయడమే!

ప్ర : ప్రభుత్వ, భూస్వాముల నిర్బంధం ఉంటే ప్రదర్శనకు ముందు ప్రచారం ఎలా చేసేవారు?

జ : అలాంటి గ్రామాల్లో సొంత చొరవతో సాంస్కృతిక దళ సభ్యులే డప్పులు వాయిస్తూ ప్రచారం కొనసాగించేవారం. అలానే చేయవలసి ఉంటుంది.

ప్ర : వీధి మలుపుల్లో ప్రదర్శనలిస్తే (Mobile cultural squad) ఏయే కళా రూపాలు ప్రదర్శించాలి.

జ : Extempore drama (చిన్నవి- 10, 15 నిముషాలు కలవి] పాటలు. ఛాలా మొ॥ ప్రదర్శించవచ్చు.

ప్ర : జ.నా.మం.లో ఎంత తక్కువ మందితో ఎంత ఎక్కువ ప్రదర్శనలు ఇవ్వగలరు? ఎంతసేపు ఇవ్వగలరు?

జ: తక్కువ మంది సభ్యులతో ఎక్కువ ప్రదర్శనలు ఇచ్చే పద్ధతే అవలంబించాం. సుమారు 7 మందితో 3 గం॥ కార్యక్రమం (పాటలు, నాటిక, నృత్యాలు మొ॥) ఇవ్వవచ్చు.

ప్ర: జ.నా.మం.ని పిలువాలంటే చాల డబ్బు ఖర్చవుతుంది. దాన్ని పేద ప్రజలు భరించలేరుకదా! కనుక చౌకగా, తక్కువ వాయిద్యాలతో జనాన్ని ఉత్తేజ పర్చే కళారూపాలేవి!

జ: వీరగాథ, బుర్రకథ, గొల్లసుద్దులు, పాటలు మొ॥

ప్ర: పాటల పుస్తకాలను ఎలా ప్రచారం చేయాలి?

జ: అతి చౌకగా పాటలు, ఇతర జానపద కళారూపాలు ప్రచురించి సామాన్య రైతుకూలీలకు సహితం అనుకూలంగా ఉండేట్టు చూడాలి: ప్రదర్శనలు జరుగుతున్న ప్పుడు తిరిగి ఎక్కువ సంఖ్యలో పాటల పుస్తకాలు అమ్మాలి: అలాగే మనకు పరిచ యాలున్న గ్రామాలలోకూడా పనిగట్టుకొని ప్రజలలో విరివిగా అమ్మాలి: దరువులు చెప్పాలి: పేదరైతులు రోజూ పాడుకునే సాధనాలుగా తయారవ్వాలి విప్లవ రచనలు.

ప్ర: పెండ్లిండ్లలో, చావులలో, ఉత్సవాలలో, పండుగలకు ప్రోగ్రాంను ఇవ్వవచ్చా? పండుగ రోజులలో మన కార్యక్రమమేమిటని కొందరి అనుమానం, మీ ఉద్దేశం ఏమిటి?

జ: పైన పేర్కొన్న అన్ని సందర్భాలలోనూ మన కార్యక్రమాలు ఇవ్వ వచ్చు. ఇవ్వాలికూడా! ఇచ్చేది మన కార్యక్రమమైనప్పుడు, మనకు పోయేదేమీలేదు; ప్రజలలో మన కళలూ, సాహిత్యం విస్తృతంగా ప్రచారం కావడానికి అవసరమైన అన్ని పద్ధతులూ మనం అవలంబించాలి.

ప్ర: కొత్తగా నేర్చుకునే వారికి మీరు ట్రైనింగ్ ఇస్తారా?

జ: ఔను దానికి జననాట్యమండలి చాలా ప్రాముఖ్యత నిస్తుంది.

ప్ర: జననాట్యమండలి తరపున ప్రజాకళాకారులకు మీ సలహా ఏమిటి?

జ: దీర్ఘకాలం శ్రమకోర్చి, ప్రజలసేవలో అంకితమై పనిచేస్తూ, మన దేశంలో కొనసాగుతున్న నూతన ప్రజాస్వామిక విప్లవంలో, సాంస్కృతిక సైన్యంగా తమవంతు కర్తవ్యాన్ని నిర్వహించి వేలాది నూతన కళాకారుల్ని సృష్టిస్తూ, విప్లవాన్ని త్వరిత పరిచి, కోట్లాది ప్రజాసైనికులను సృష్టించాలి. అశేష రైతాంగాన్ని సమీకరించాలి. దీనికంతకూ విమర్శ, ఆత్మవిమర్శపద్ధతిని అవలంబించి, మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానాన్ని, మార్గదర్శకంగా తీసుకొని పురోగమించాలి. ఇదే నేడు ప్రతి ప్రజా కళాకారుని పవిత్ర కర్తవ్యం....

(మే 1975, సంచిక 68)

## గోర్కీ

మార్చి 16 మగ్సీం గోర్కీ జన్మదినం. జగమెరిగిన మహారచయిత గోర్కీ. తన విశ్వవిద్యాలయాలైన అట్టడుగు జీవితాల అపార అనుభవాలనూ, సంఘర్షణలనూ, శ్రామికవర్గ సంస్కృతినీ తన రచనలద్వారా మన కన్నులముందు మన మనసుల్లో సజీవంగా నిలబెట్టిన శక్తివంతమైన విశ్వకళాకారుడు. గోర్కీ 'అమ్మ' నిర్వహించిన చారిత్రిక పాత్ర గొప్పది. లెనిన్ స్వయంగా గోర్కీ అభిమాని, మిత్రుడు, మార్గదర్శకుడూ. తన కాలపు యువతరంతో, కార్మికులతో ప్రజా సంఘాలతో సంబంధం పెట్టుకుని నిజమైన ప్రజారచయితగా జీవించిన గోర్కీ మనకు చిరస్మరణీయుడు, ఆదర్శప్రాయుడూ.

(మార్చి 1975, సంచిక 66)

## సాహిత్య రచన (1934)

గోర్కీ

అనువాదం: సి. ప్రసాద్

చాలామంది ఆలోచించేదీ, వాదించేదీ జీవిత వాస్తవికతను తెలుసుకుందామని కాదు; తిరుగులేని సత్యాలను స్థాపించి ఇక ఆలోచించటం మానేద్దామని. తిరుగు లేని సత్యాలను తయారుచేయాలనే ఈ తొందరపాటు విమర్శకుల్లో ఎక్కువగా కనిపిస్తుంది. సృజనాత్మక రచనలను ఇది చాలా దెబ్బతీస్తుంది. రచన గొప్ప బాధ్యతతో కూడినది. పిడివాదం, గుడ్డి నమ్మకం హ్రస్వ దృష్టికీ, వక్ర దృష్టికి దారితీసి జీవిత వాస్తవికతను తారు మారు చేస్తాయి. అందుకే ఎంగెల్స్ "మార్క్సిజం పిడివాదం కాదు. మార్గదర్శి" అన్నాడు. మన ప్రయత్నాలన్నీ కూడా పాత సమాజాన్ని మార్చి కొత్త సమాజాన్ని నిర్మించడానికే.

మాటల ద్వారా పాత్రలను, రూపాలను చిత్రిస్తుంది సాహిత్యం. మాటల్లో సంఘటనలను, వాస్తవాలను, ప్రకృతి దృశ్యాలను, ఆలోచనా సరళిని ప్రతిబింబిస్తుంది సాహిత్యం. అలాంటి సాహిత్యంలో ప్రధానాంశం లేమిటి?

సాహిత్యంలో మొట్టమొదటి అంశం భాష. అసలైన పనిముట్టు అదే. జీవిత వాస్తవాలు దాని ముడిసరుకులు. "భాష" గురించి ఓ చమత్కారమైన పొడుపుకథ

ప్రచారంలో వుంది. "అది తేనెలాగా తియ్యగా లేకపోయినా జిగురులా ప్రతిదానికీ అంటుకుంటుంది." అంటే ప్రపంచంలో ప్రతిదానికి భాష పేరు కల్పిస్తుందని అర్థం. వాస్తవాలకు, ఆలోచనలకు మాట వస్త్రధారణ లాంటిది. ప్రతివాస్తవం వెనకాల సాంఘిక ప్రత్యేకత దాగి వుంటుంది. అలాగే ప్రతి ఆలోచన వెనక నడక, సందర్భ శుద్ధికూడా వుంటాయి. జీవిత వాస్తవాల వెనకాల దాగిన సాంఘిక సత్యాలను, వాటి ప్రత్యేకతను వెల్లడించడమే సాహిత్య ప్రయోజనం. ఈ ప్రయోజనం నెరవేరాలంటే మనం వాడే మాటలు కచ్చితంగా, తేటతెల్లంగా వుండాలి. గొప్ప రచయితలు భాషను అలాగే వాడేవారు. శతాబ్దాల తరబడి భాష అలాగే పెంపొందింది. భాష జనం వాడుకలోనుంచే పుడుతుంది. వాడుక భాషే మనంరాసే భాషకు పునాది. పుస్తకంలో పాత్రలు నిత్యజీవితంలోవే. అందు వల్ల అవి వాడుక భాషే మాట్లాడుతాయి.

చిన్నతనంలో నేను కూడా కొత్తమాటలు తయారుచేద్దామని తాపత్రయ పడే వాడిని. లాయర్లు కోర్టులో వాడే కృతక భాష నన్నందుకు పురిగొల్పింది. కాని ఇవన్నీ వ్యర్థ ప్రయత్నాలని తర్వాత తెలుసుకున్నా. చెప్పే విషయం మంచిదైనా, చెడ్డదైనా మాటలు అందంగానే వుండొచ్చు. ఎలాగంటే కోర్టుల్లో వాదితరపు వకీళ్ళు, ప్రతివాది తరపు వకీళ్ళు కూడా ఒకే రకంగా ఎంతో ఒడుపుతో పదాలను చెక్కి మరీ ప్రయోగిస్తారు. కొత్తమాటలు తయారుచేద్దామని ఎన్నో కాపీలు, పుస్తకాలు చెడగొట్టా. ఇదో చంటిబిడ్డ జబ్బు. వాస్తవికత వైద్యుడిలాగా నా జబ్బు పోగొట్టింది.

ఉత్పత్తి శక్తులు మారినప్పుడు, వర్గవైరుధ్యాలు తీవ్రతరం అయినప్పుడు భాష చాలా వేగంగా అభివృద్ధి చెందుతుంది. మన సంస్కృతి, చరిత్ర ఈ మాటే చాటి చెబుతున్నాయి.

అంతేకాదు. మన జానపద సాహిత్యం, సామెతలు. నానుడులు, పల్లెపాటలు ఈ మాటే నొక్కి చెబుతాయి. వాడుకభాష సహజ సిద్ధంగా ఇలాగే అభివృద్ధి చెందు తుంది. వాడుకలో లేని పాతమాటలు ఉపయోగించడం దండగ. అలాగే సరికొత్త మాటలు కావాలని తయారు చేయడం కూడా దండగే. మాస్కోలో జనం ఎలా మాట్లాడుతున్నారో వినేవాడు పుష్కిన్. లెస్కోవ్ వాడుకభాషలో సాటిలేని మేటి. ఆతని దగ్గరో నర్సుండేది. ఆమె మొగుడు సిపాయి. ఆమె దగ్గర బోలెడు నుడి కారం నేర్చుకున్నాడు లెస్కోవ్. అమాయక జనం, జట్కావాళ్ళు, జాలరులు,

బోయవాళ్ళు, ఇతర పాటక జనం వీళ్ళంతా భాషను సంపన్నం చేస్తారు. వాడుక భాష సెలయేరు లాంటిది. రచయితలు ఆ సెలయేటి నుంచి తేటమాటలు, సూటి మాటలు, పసందైన మాటలు ఏరుకుంటారు.

సాహిత్యంలో రెండో అంశం వస్తువు. ఈ వస్తువు రచయిత అనుభవంలోంచి వస్తుంది. ఈ అనుభవం జీవితమే నేర్పుతుంది. రచయిత మెదడులో ఆకారం లేకుండా దాగివున్న ఈ అనుభవం తనను కళ్ళకు కట్టినట్టు చిత్రించమనీ, తనకో ఆకారం ఇమ్మనీ గద్దించి అడుగుతుంది.

అన్ని రకాల వస్తువులున్నాయి. చావు, పుట్టుక లాంటివి "శాశ్వత వస్తువులు." మరికొన్ని సాంఘిక పరిస్థితులవల్ల ఏర్పడేవి. ఇవి మనిషి మనసులో వేళ్ళూని వుంటాయి – అసూయ, పగ, దురాశ వగైరా. "ప్రతిదీ మారుతుంద"ని, "ఏదీ కల కాలం ఒకే రకంగా వుండద"ని ఏనాడో చెప్పారు. విశ్వంలో విప్లవ భానూదయం వల్ల ఒక సంగతి తేట తెల్లమయింది. "శాశ్వత వస్తువు"లకు మూలం మనిషి ఒంటరి తనమే. ఈ ఒంటరితనానికి కారణం తీవ్రమైన సంఘర్షణ మీద ఆధారపడిన సమాజమే. సమాజంలో అన్నం కోసం, ఆధిక్యం కోసం ఒకరితో ఒకరు కొట్లాడు కోవాలి. ఈ ధనస్వామ్య సమాజంలో ఓ గమ్మత్తుంది. కేవలం కనీసావసరాల కోసం చాలామంది తమ సర్వశక్తులు ధారపోయాలి. జనం దీనికి అలవాటుపడి పోయారు. ఇది చాల అవమానకరం, అమానుషం. ఎక్కువ మంది దీన్ని గురించి లోతుగా ఆలోచించలేరు. ఈ వ్యవస్థలోని రాక్షసత్వాన్ని కొద్దిమందే తెల్సుకోగలరు.

సామ్యవాద సమాజంలో ఈ "శాశ్వత వస్తువులు" పూర్తిగా మాయమవుతాయి. మిగతావాటికి అర్థాలే మారిపోతాయి. ఫలానావాడు పుట్టాడు, ఫలానావాడు చచ్చాడు అనేది ముఖ్యంకాదు. అంతకన్నా చెప్పుకోదగ్గ విషయాలు సమకాలిక సమాజంలో ఎన్నో వున్నాయి. వ్యక్తివాదులు దీనిని మెచ్చరు. కాని వ్యక్తివాదం (Individualism) చరిత్రలో కొట్టుకుపోయింది.

సాహిత్యంలో మూడో అంశం చిత్రణ. ప్రజల పరస్పర సంబంధ బాంధవ్యాలు, వైరుధ్యాలు, ఇష్టాయిష్టాలు అన్నీ ఇందులోకే వస్తాయి.

భాష, వస్తువు, చిత్రణ – ఈ మూడు అంశాలు సాహిత్య సమగ్ర స్వరూపాన్ని తెలియజేస్తాయి. కొందరు శైలి, సంవిధానం గురించి కూడా చర్చిస్తారు.

కాని అవి కేవలం రచయితల ప్రతిభకు సంబంధించినవి. ఆ మాటకొస్తే ఈ ప్రతిభ కూడా ఒక రకంగా సమాజం నుంచి రూపొందేదే.

మన యువ రచయితలు సాహిత్య రచనలోని కష్టసుఖాలు తెల్సుకోవాలి. అంతేకాదు సమాజం పట్ల, పాఠకుల పట్ల తమ బాధ్యతను కూడా గుర్తించాలి.

జ్ఞానానికి సత్యం ఒకమెట్టు, పనిముట్టు. ఈ సత్యం మానవుడి శ్రమైక జీవనాన్నుంచే పుడుతుంది. మానవుడి సాంస్కృతిక అభివృద్ధి, దాని చరిత్ర కూడా ఈ సత్యాన్ని వేనోళ్ళ చాటిచెప్పాయి.

నేనెప్పుడూ ఓ మాటనుకుంటా– మన గమ్యం ఎంత గొప్పదయితే మన తెలివి తేటలు, శక్తిసామర్థ్యాలు అంత బాగా ఫలవంతమవుతాయని.

జీవితాన్ని చిత్రించి, ప్రతిబింబించడమే సాహిత్యం చేయాల్సిన పని. సత్యాన్ని వివిధ రకాల పాత్రల ద్వారా అవతరింపజేసి మన మనసుల మీద ముద్రవేయాలి. ఓ సామెతుంది. "ఎత్తు ఎక్కిన కొద్దీ దూరం చూడగలుగుతాం."

నేను పచ్చివాస్తవికవాది (Naturalist)ని కాదు. అంటే ఉన్నదున్నట్టే రాయాలనను. వాస్తవికతను అధిగమించాలి సాహిత్యం. ఉన్నతంగా చూడాలి సాహిత్యం; ఎందుకంటె సాహిత్యం కేవలం వాస్తవికతను ప్రతిబింబిస్తేచాలదు. అంతకన్నా ఎక్కువ ప్రయోజన ముంది సాహిత్యానికి. ఉన్నవాటిని చిత్రిస్తే చాలదు, మనం ఏమి సాధించగలమో కూడ గుర్తుంచుకోవాలి. మనకు తెలిసినవీ మనం చూసేవీ అన్నిటినీ కలిపి ఓ కొత్త తరహా పాత్రలను తయారుచేయాలి. చిన్న విషయాలయినా ప్రత్యేకమైన వాటిని తీసుకుని వాటినే గొప్పగా, చక్కని తరహాలో మలచాలి. అది సాహిత్యం చేయాల్సిన పని. మన సాహిత్యం అన్నిటినీ ఆవరించాలి.

[నవంబర్ 1972, సంచిక 38]

## లూసున్

అక్టోబర్ 19న (1936) చనిపోయాడు లూసున్. 1881లో పుట్టిన లూసున్ విద్యార్థి దశనుండి కూడా ఆనాటి అర్థవలస వెనుకబడిన దేశమైన చైనా ప్రజల విమోచన కొరకు కృషి చేశాడు.

చైనా ప్రజల్లో అతివాద సోషలిస్టు భావాల ప్రచారంలో మొదటి వారిలో ఒకడుగా రచయితల్లో ప్రప్రథముడుగా పనిచేశాడు. సోషలిస్టు భావాలు గల రచయితల సంఘాన్ని చైనాలో స్థాపించిన వారిలో ముఖ్యుడు నాయకుడు. వైద్యశాస్త్రంలో టోక్యోలో ఉన్నత విద్యకై తనకు వచ్చిన అవకాశాన్ని వదులు కున్నాడు. టోక్యోకు ప్రయాణమైన వాడే చైనా ప్రజల విమోచన కార్యక్రమమే, అందుకొరకు తను రచయితగా పాటు బడడమే ముఖ్యమనీ తన వ్యక్తిగత జీవితోన్నతి కంటే ప్రజల కొరకు పనిచేయటమే అత్యవసరమైన కర్తవ్యంగా ఆలోచించి, ఆ ప్రయాణాన్ని ఆ విద్యను విరమించుకున్నాడు. పరిపాలకుల చేతుల్లో చాలా నిర్బంధాలకు గురయ్యాడు.

కమ్యూనిస్టుల లాంగ్‌మార్చ్ గమనమైన షెన్సీ చేరుకున్నాక సంతోషాతిశయంతో వారికి యిలా సందేశం పంపాడు; 'యావత్ చైనా ప్రజల ఆశలూ మీమీదనే వున్నయ్.'

ఆయన కార్మికవర్గ మిత్రుడు, కార్మికునికంటే రచయితను ఎక్కువ వానిగా ఎన్నడు తలచలేదు ఆయన. కార్మికుడు తన పరికరంతో శ్రమిస్తాడు. రచయిత తన కలంతో రాస్తాడు. రచయిత కార్మికుణ్ణి, విప్లవ అగ్రగామి అయిన కార్మికుణ్ణి అనుసరిస్తాడు. రచయిత స్వయంగా నాయకుడు కాలేడు, ఆ పాత్ర ఎపుడూ శ్రమ జీవులదే. విప్లవ యంత్రంలో రచయిత ఒక మర, ఒక చక్రం, యంత్రం యొక్క ఇంజను అతను కాదు. ఇంజను కార్మిక వర్గమే.

లూసున్ చనిపోయినపుడు యింకా ఛాంగ్‌కైషేక్ నిరంకుశ పాలన జరుగుతున్న రోజుల్లోనే అన్ని వర్గాలకు చెందిన 10 వేలమంది ప్రజలు ఊరేగింపులో పాల్గొన్నారు.

చైనా ప్రజలకు, విముక్తి పొందాల్సిన సర్వప్రపంచ ప్రజలకూ చిరస్మరణీయుడు, రచయితల నిరంతర మార్గ దర్శకుడు లూసున్.

[మార్చి / ఏప్రిల్ 1973 సంచిక 42 / 43]

కళలూ సాహిత్యంపై – లూసన్

# వర్తమాన హంతకులు

అనువాదం : సారధి

సంస్కృతిపరులైన పెద్దలు "దేశీయ వాడుకభాష అసభ్యంగానూ, నీచంగా జుగుప్సాకరంగానూ" వుంటుందంటారు.

చైనాలో నిరక్షరాస్యులందరికీ వచ్చేది మాట్లాడడం మాత్రమే. కనుక, వారి భాష మరి "అసభ్యంగానూ, జుగుప్సాకరం"గానే వుంటుంది. నావంటి వాళ్లందరం "సరైన (భాషా) జ్ఞానం లేక, మా తెలివితక్కువతనం కప్పిపుచ్చుకోడానికే వాడుక భాషను సమర్థిస్తున్నాం"- అంటే మేమూ అసభ్యంగానూ, నీచంగా జుగుప్సాకరంగానే వుంటున్నామని యిక వేరే చెప్పనవసరంలేదు. కాని, వచ్చిన చిక్కంతా ఏమిటంటే ఈ సంస్కృతీ పరులు కూడా, రెండు గ్లాసుల సారాయినీ ప్లేటు మాంసాన్నీ కూడా పరమ ప్రామాణికమైన గ్రాంధిక భాషలో వర్ణిస్తూకూచునే "అద్దంలో పూలు" నవల [లిజుచెన్ (1763-1830) రచన]లోని సేవకుడిలాగా, నిత్యమూ గ్రాంధిక భాషనే వుపయోగిస్తూ కూచోలేరు. మహత్తరమైన వారి ప్రాచీనతా స్వభావాన్ని ప్రామాణిక గ్రంథ రచనల్లో మాత్రమే ప్రదర్శించి, తీరా మాట్లాడడం వచ్చేసరికి వారు కూడా యీ "అసభ్యమూ, జుగుప్సాకరమూ" అయిన వాడుక భాషలోనే పడిపోతున్నారు. చైనా అంతటా, నలభైకోట్ల మంది ప్రజలూ మాట్లాడే భాష "జుగుప్సాకరమైనది" నిజంగా ఎంత శోచనీయం.

మనుషులుగా వుంటే తృప్తి లేదు. వీరు అమరులై పోవాలనుకుంటారు. భూమి మీద బతుకుతూనే వీరు స్వర్గంలో విహరించ గోరుతారు. ఆధునికులై, ఆధునిక (నాగరికతా) వాయువులు పీలుస్తూనే, వీరు చావసిద్ధంగా వున్న కన్ఫ్యూసియన్ నీతులనూ, మాతృభాషనీ ప్రజల నెత్తిన రుద్దజూస్తున్నారు. వర్తమానానికి ఎంత అవమానం! వీరు "వర్తమానానికి హంతకులు." ప్రస్తుతాన్ని ఖూనీ చేయడం ద్వారా వీరు భవిష్యత్తును కూడా హత్య చేస్తారు.

కాని భవిష్యత్తు మన వారసులది.

Murderers of the Present (1919)

# సాహిత్యమూ - చెమటా

షాంఘైలో ఒక ప్రొఫెసరు సాహిత్యం గురించి యిలా ఉపన్యసిస్తున్నాడు. సాహిత్యం అజరామరమైన మానవతా లక్షణాలను వర్ణించాలి; లేకుంటే అది కలకాలం నిలువదు. ఉదాహరణకు, ఇంగ్లండులో షేక్స్పియరూ మరికొద్ది మందీ శాశ్వత

మానవతా లక్షణాలను గురించి రాశారు కనుకనే వారి గ్రంథాలను ఇప్పటికీ చదువు తున్నారు. ఇతరులు అలా చేయనందువల్లనే వారి సాహిత్యం నశించిపోయింది.

చదవేస్తే ఉన్న మతిపోయిందె, అన్నట్టుంది యిది. ఇంగ్లీషు సాహిత్యంలో పూర్వకృతులు అనేకం తప్పకుండా నశించిపోయే వుంటాయని నేనూ ఒప్పుకుంటాను. కాని అవి అన్నీ అనంతమైన, శాశ్వతమైన మానవతా లక్షణాలను వర్ణించకపోవడం వల్ల మాత్రమే నశించిపోయేయని నాకిప్పటివరకూ తెలియదు. అయితే, ఇప్పుడీ విషయం తెలిసింది కనుక, అవిసర్గా ఆ కారణం వల్లనే నశించిపోయేయని ఇచ్చితమైన నిర్ధారణకు రావడానికి, ఆ నశించిపోయిన గ్రంథాలను యీ ప్రొఫెసరు ఎక్కడ చూడగలిగాడా అని నాకు అర్థం కాకుండా వుంది.

నిలిచివున్నదంతా మంచి సాహిత్యమూ, నశించిపోయినదంతా చెడ్డదీను. చాలా బావుంది. ఒక దేశాన్ని ముట్టడించి, పట్టుకుంటే నువ్వు రాజువి; ఓడిపోతే బందిపోటువి. అహా! ఈ చరిత్ర సిద్ధాంతాన్ని సాహిత్యం మీద రుద్ద బోకండి.

మానవతాలక్షణాలు, అసలు నిజంగా ఎన్నటికీ మారకుండా వుండేవేనా?

కోతి, కోతిని పోలిన మనిషి, ఆదిమ మానవుడు, ఆధునిక మానవుడు, భావి మానవుడు.... జీవి యిలా పరిణామం పొందేదైతే, మానవతా లక్షణాలు కూడా మార్పు లేకుండ వుండజాలవు. మనిషికి పూర్వపు కోతి సంగతి వదిలిపెట్టండి, కనీసం లిఖిత చరిత్రకు ముందటి మనిషి యొక్క అనుభూతులనైనాసరే మనం సరిగా ఊహించ గలమా అంటే, అదీ సందేహమే. భావి మానవుడు నేటి మనల్ని అర్థం చేసుకోలేడేమో కూడా. శాశ్వత మానవతా లక్షణాలను గురించి రాయడం నిజంగా చాలా కష్టం.

ఉదాహరణకు, చెమటపోయడమే తీసుకోండి. పూర్వం మనిషికి చెమట పోసేదనే నేను నమ్ముతున్నాను. ఇప్పుడూ మనిషికి చెమటపోస్తూంది. ఇక ముందు చాలాకాలం వరకూ మనిషికి చెమటపోస్తూనే వుంటుంది. అందువల్ల సాపేక్షికంగా, యిది "శాశ్వత మానవతా లక్షణం"గానే లెక్కించ వచ్చుననుకుంటాను. అయితే, నాజూకైన యువతుల చెమట సువాసనాభరితంగా వుంటుంది; మొద్దుల్లావుండే, ఎద్దుల్లాటి శ్రామికుల చెమట కంపుకొడుతూ వుంటుంది. మరి, నేను చిరకీర్తిగల రచయితను కావాలంటే, నా సాహిత్యం కలకాలం నిలవాలంటే నేను ఏ చెమట గురించి రాయడం మంచిది. సువాసనల చెమట గురించా లేక కంపుకొట్టే చెమట గురించా? ఈ సమస్యను పరిష్కరించే వరకూ సాహిత్య చరిత్రలో మన స్థానానికి భద్రతలేదు.

ఉదాహరణకు, ఇంగ్లండ్‌లో ప్రాచీన నవలల్లో ఎక్కువ భాగం స్త్రీలకోసమే రాయబడ్డట్టు విన్నాను. అంటే సహజంగానే వాటిలో సువాసనల చెమటదే పై చేయి

# ప్రజా సేవకనుగుణంగా మన భావాలు మలచుకుందాం

మావోటున్

అనువాదం : ఐ. సుధాకర్

సాహిత్యము – కళల గురించి ఏనాన్‌నుండి చైర్మన్ మావో ప్రసంగం (మే, 1942) వెలువడి పదేళ్ళయింది. చైనా విప్లవంతో మార్క్సిజం – లెనినిజం పరిపూర్ణంగా సమన్వయం పొందాయనడానికి యీ ప్రసంగం ఒక మంచి ఉదాహరణ. 1919 మే ఫోర్తు ఉద్యమం నుండి నాటివరకు (1942) విప్లవ సాహిత్య కళా ఉద్యమాలలో జరిగిన లోపాలను, ప్రత్యేకించి మౌలిక సూత్రాలకు సంబంధించిన వాటిని, యీ ప్రసంగంలో చక్కగా విమర్శించారు. సాహిత్యము, కళల విషయంలో నేటికీ ప్రచారంలోవున్న అనేక శ్రామికవర్గేతర భావాలను, గందరగోళాలను యిది స్పష్టం చేసింది. చాలాకాలమై వివాదగ్రస్తంగా వున్న అనేక మౌలిక సమస్యలను యిది లోతుగా పరిశీలించి పరిష్కరించింది. సాహిత్యము కళలు, ప్రజలకు – ముఖ్యంగా రైతులు, కార్మికులు, సైనికులకు – ఉపకరించాలని యిది స్పష్టంచేసింది. ఈ లక్ష్యాన్ని చేరుకోవడానికై సాహితీపరులూ కళాకారులూ తమ సిద్ధాంత పునాదిని, భావజాలాన్ని పునర్నిర్మించుకోవాలి, అందుకై నిండు మనసుతో విప్లవ పోరాటాల్లోకి దూకాలి.

ఈ ప్రసంగం చైనా సాహిత్యకళారంగాల చరిత్రలో ఒక గొప్ప విప్లవానికి ప్రతీకగా నిలిచింది. ఈ చారిత్రిక ప్రసంగానికి పూర్వంకూడా చైనా సాహిత్య కళా రంగాలు ఏమీ బీడువారిపోలేదు. కాని ఆనాటి సృజనరీతులు కేవలం విమర్శనాత్మక సత్యపరంగానే ఉండేవి. ఈ ప్రసంగం తరువాత విప్లవ వాస్తవికతా దృష్టి మొదలయింది. 'ద వైట్ హెయిర్డ్ గర్ల్', 'ద రైమ్స్ ఆఫ్ లి-యు-నాయ్', 'సన్ ఓవర్ ది సంకాంగ్ రివర్', 'ది హరికేన్' వంటి రచనలు ఈ విప్లవ వాస్తవికతా యుగానికి ప్రతీకలు. అంతేకాదు భావిసాహిత్యకళాసృష్టికి కావల్సిన మార్గదర్శక సూత్రాలను కూడా ప్రసంగం సూచించింది. ఈ ప్రసంగంలో చర్చించిన అనేక విషయాలు – ప్రచారవిస్తృతికీ ప్రమాణాలస్థాయికీ మధ్య వైరుధ్యానికి గతితార్కిక పరిష్కారం:

---

అయి వుంటుంది. కాని, పందొమ్మిదో శతాబ్దం చివరికల్లా రష్యన్ సాహిత్య ప్రభావం వల్ల వారి సాహిత్యంలో కూడా కంపు చెమట చెప్పుకోదగినంత ఎక్కువగానే పారజారింది. మరి వీటిలో ఏది కలకాలం నిలుస్తుందో ?; ఇప్పుడప్పుడే తేల్చిచెప్పలేం.

చైనాలో, టావోయిస్టులు టావో గురించి మాట్లాడడం విన్నా, సాహిత్యవిమర్శలు చూసినా రక్తం గడ్డకట్టుక పోవలసిందే తప్ప, చెమట పోయడానికి సాహసం ఉండదు. కాని, చైనాలో కూడా చెమట పోయడం శాశ్వత మానవతా లక్షణమే.

Literature and persperation (23-12-1927)

[మార్చి 1978, సంచిక 77]

సాహిత్య విమర్శ విధానాలు ప్రమాణాల గురించిన నిర్దిష్ట సూత్రాలు; బూర్జువా పెటీ బూర్జువా విలువల గురించి నిశిత విమర్శ, సాహితీ కళాకారుల సిద్ధాంత పునర్నిర్మాణ అవసరం; ఐక్య సంఘటన నిర్మాణంలో సూచనలు ఒక్క చైనాకేకాక అందరికీ ప్రమాణాలే. ఈ ప్రసంగంలోని మావో బోధనలను పూర్తిగా అర్థంచేసుకొని, నిరంతరం అనుసరిస్తే ఎవరైనా సరే తప్పులు చేయరనీ, మంచి ఫలితాలు సాధించ గలరనీ వాస్తవాలే రుజువుచేసాయి. దీనిని నిర్లక్ష్యంచేస్తే పొరపాట్లు జరగక తప్పదు. కనుక, దేశవ్యాప్తంగా మావో ప్రసంగం పదవ వార్షికోత్సవం జరుపుకుంటున్న యీ తరుణంలో (1953) దీనిని మరింత లోతుగా అధ్యయనంచేసి సాహిత్యకళారంగాలలో మన దృక్పథాన్ని, కృషిని నిశితంగా పరిశీలించుకుందాం.

ఏనాన్ ప్రసంగంలో చైర్మన్ మావో, 'మనం ఎవరికోసం రాయాలి?' అనే ప్రశ్నను లేవనెత్తారు. "జపాను వ్యతిరేకోద్యమంలో సాహిత్య కళారంగాలలో పని చేస్తున్న కామ్రేడ్స్ ఈ సమస్య పరిష్కారమయి పోయినట్టే భావిస్తున్నారు కాని వాస్తవంగా మనలో చాలామంది కామ్రేడ్స్‌కు సరియైన జవాబే తెలియదు" అన్నారాయన. ఈనాటికీ మనలో అనేకులకు దీనికి స్పష్టమైన జవాబు తెలియదనే చెప్పాలి.

మనం అవలంబించే పద్ధతులు ఎలా వుండాలన్నది తరువాతి ప్రశ్న. వీలయినంత ఎక్కువమంది ప్రజానీకానికి తెలిసేలా చెప్పడం మన మొదటి కర్తవ్యమని అందరమూ ఒప్పుకుంటాం. "బహుళ ప్రచారం పొందడమే ఉన్నత ప్రమాణాలకు గీటురాయి అనీ, అయితే ప్రచారం తిరిగి ప్రమాణాల స్థాయినిబట్టే వుంటుందనీ" మనం చెబుతాం. కాని, నిజానికి ప్రచార బాహుళ్యాన్ని మనం చిన్నచూపు చూడడమూ, చవకబారు తనంగా వ్యాఖ్యానించడమూ జరుగుతూంది. ఎక్కువ ప్రచారం పొందడమూ, ఉన్నత ప్రమాణాలు సాధించడమూ రెండూ భిన్నవిషయాలని మనం అనుకుంటాం. 'ప్రచారానికి రాసేదివేరు, ఉన్నత ప్రమాణాల కొరకు రాసేదివేరు' అనే దృష్టి మనకుంది. కొందరు మరో మెట్టు ముందుకుపోయి ప్రమాణాలు అనగానే బూర్జువా కొలబద్దలు వెతుకుతారు. అటువంటి పొరపాట్లు ఎన్నో నిరంతరం జరుగుతూనే ఉన్నాయి.

"ఎవరికోసం, ఎవరి ప్రయోజనంకోసం" అనేదే మౌలిక సమస్య అని ఏనాన్ ప్రసంగంలో చైర్మన్ మావో పదేపదే హెచ్చరించారు. ఈ విషయంలో ఖచ్చితమైన పంథా అవలంబించి, సవ్యమైన కృషి కొనసాగించాలంటే పెటీబూర్జువా సాహితీ పరులూ కళాకారులూ తమ సిద్ధాంత జ్ఞానాన్ని పటిష్టంగా పునర్నిర్మించుకోవాలి. మనం

యీ ప్రసంగం చదివి యీ మాటలు గుర్తుంచుకున్నాం. కాని అది చాలదు. ఆ ఆదేశాలను ఎంతవరకు పాటించగలిగాం! వాటి కనుగుణంగా ఎంతవరకూ కృషి చేశాం అన్నది అసలు ప్రశ్న.

కార్మికులు, రైతులు, సైనికులకు నిజంగా ఉపయోగపడేలా కృషిచేయాలంటే సాహితీ కళాకారులు ముందు వాస్తవ విప్లవ పోరాటాల్లో పాల్గొనాలనీ, తద్వారా వారి భావాలు, అనుభూతులూ తదనుగుణంగా రూపొందుతాయనీ చైర్మన్ మావో మనకు చెప్పారు. అంతేగాక, మార్క్సిజం-లెనినిజం తోపాటు సమాజాన్ని కూడా బాగా అధ్యయనం చేయాలి. 'మార్క్సిజం-లెనినిజం అంటే, ప్రజాజీవితానికి పోరాటాలకు అనువర్తింపజేసే సజీవ శాస్త్రీయ విజ్ఞానం తప్ప కేవలం గ్రంథాల్లో దొరికేది మాత్రం కాదు' అనికూడా ఆయన హెచ్చరించారు. కనుక, వాస్తవ విప్లవ పోరాటాలకు నిండు మనసుతో అంకితమవుతున్నామా అనేదే కీలకమైన ప్రశ్న. నేడు దీనిని ఎవరూ వ్యతిరేకించరు. కాని, నిజంగా పోరాటాలలో పాల్గొంటున్నవారు కూడా వానిలో మనస్ఫూర్తిగా లగ్నమయారని ఖచ్చితంగా చెప్పలేము. ఒకానొక సమయంలో ఒకానొక విషయంలో పూర్ణమనస్కులుగా వున్నవారు తదితర సందర్భాల్లో అరకొరగా వుండవచ్చు.

పూర్ణమనస్కత అంటే ఏమిటి? పరిపూర్ణమైన స్వార్థరాహిత్యం. ప్రజలను-ముఖ్యంగా కార్మికులు, రైతులు, సైనికులను - సేవించడం అనే సూత్రానికి దృఢంగా కట్టుబడి వుండడం; వారి ప్రయోజనాలకు వ్యతిరేకమైన వాటినన్నిటినీ రాజీ లేకుండా ఎదుర్కొనడం యిదీ పూర్ణమనస్కత. ఇందులో ఏ మాత్రం కొరవడినా నిండు మనసుతో విప్లవానికి అంకితం కానట్టే. అలాంటి వారు భౌతికంగా పోరాటంలో పాల్గొంటున్నా నిజానికి విప్లవాన్ని బయట వుండి చూస్తున్నట్టే లెక్క. సిద్ధాంతరీత్యా పునర్నిర్మాణం పొందడానికి యిది చాలా అడ్డంకిగా వుంటుంది. పెటీ బూర్జువా వర్గం నుండి వచ్చిన మేధావులందరూ ఆలోచనలవల్ల శ్రామిక వర్గంలో చేరివుండవచ్చు. గత సమాజంలో వారు నిత్యం నిరుద్యోగ భయంతో వెంపర్లాడినవారే అస్థిరమైన బతుకుతో వారిలో అనేకులు పస్తులు కూడా పడివుంటారు. అందువల్ల పాతసమాజమంటే అసహ్యంతో వారు విప్లవాన్ని కోరుకుంటున్నారు పాతసమాజంలోని యితర బుద్ధి జీవులందరివలెనే సాహిత్య కళాకారులు కూడా నిరుద్యోగానికీ, భద్రత లేమికీ, పస్తులకూ గురిఅయినవారే బహుశా ఆ బాధలన్నీ వీరికే ఎక్కువ కూడానేమో. ఈ పరిస్థితులన్నిటినీ పరిశీలిస్తే వారి స్వభావం బోధపడుతుంది. వారిలో కొందరు

విప్లవ కార్యక్రమంలో చేరారు కూడా. అందువల్ల యీ బుద్ధి జీవులందరూ సిద్ధాంత పునర్నిర్మాణంపట్ల తరచు నిర్లక్ష్యంగానూ, విముఖంగానూ వుంటారు. "నేనెప్పుడూ బుద్ధి జీవినే, నేనెన్నడూ ఎవర్నీ దోచుకోలేదు. నేను విప్లవానికెప్పుడూ సుముఖం గానే వుంటున్నాను. నేను శ్రామిక వర్గంలో ఒకడిని కానా? మళ్ళీ నేను సిద్ధాంత పరంగా పునర్నిర్మాణం కావలసిందేముంది?" అనుకుంటారు వాళ్ళు. అంటే తమలో శ్రామికవర్గానికి చెందని అన్యవర్గ భావజాలం వున్నదనీ, సిద్ధాంతరీత్యా దానిని తిరిగి ప్రజాపరంగా పునర్నిర్మించాల్సిన అవసరం వుందనీ వారు అంగీకరించరు. ఈ ఆలోచన సరైనది కాదు.

"బుద్ధిజీవికీ, శ్రమజీవికీ ఆర్థికపరమైన వైరుధ్యం లేనప్పటికి, వారి జీవిత విధానం, పనిపరిస్థితులు ఒకటి కావు. అందువల్ల వారి భావాలు, అనుభూతులలో కొంత వైరుధ్యం కలుగుతుంది" (లెనిన్) పెటీ బూర్జువాల పరిస్థితి కూడా యిదే. ఒకవైపు విప్లవాన్ని సునాయాసంగా స్వీకరిస్తూనే వారు సిద్ధాంతపరంగా, భావజాలంలో శ్రామికులతో భేదిస్తారు, విరోధిస్తారు. ఈ వాస్తవాన్ని తిరస్కరిస్తే, పోరాటాలకు అంకితమైనప్పటికీ, సిద్ధాంత పునర్నిర్మాణ విషయంలో ఎవరూ, సాధించగలిగేదేమీ లేదు. సాహిత్య కళాకారులు యీ విషయాన్ని నిర్లక్ష్యంచేస్తే వారు కార్మికులు, రైతులు, సైనికులకు ఉపయోగపడడంకల్ల.

నిండు మనసుతో విప్లవంలో నిమగ్నం కాకపోవడం, వాస్తవ పోరాటాలకు అంకితం కాకపోవడం, తమలో అన్యవర్గ భావాలు మిగిలి వున్నాయని అంగీకరించక పోవడం - యివి పెటీ బూర్జువా సాహిత్య కళాకారులు సాధారణంగా చేసే తప్పులు - సిద్ధాంత పునర్నిర్మాణానికి వీరు పెద్ద అడ్డంకి. విప్లవ పథం స్వీకరించి, చాలా కాలం కార్మికులు, రైతులు, సైనికుల మధ్య జీవిస్తూ కూడా సిద్ధాంత పునాదిని పునర్నిర్మించుకోడానికి నిరాకరిస్తే, పరిస్థితుల్లో మార్పులు ఎదురైనప్పుడు వారు ఆ తాకిడిని తట్టుకోలేకపోతారు మనోనిబ్బరం కోల్పోయి తీవ్రమైన తప్పులు చేస్తారు. సిద్ధాంత పునర్నిర్మాణం క్రమ పరిణామంలో దీర్ఘకాలం కొనసాగవలసినదని అతి క్లిష్టమైనదనీ దీని నుండి మనకు స్పష్టమవుతుంది.

కొద్ది మాసాల కాలం పల్లెపట్టులోనో, కర్మాగారంలోనో గడిపినంత మాత్రాన పరిపూర్ణంగా సిద్ధాంత పునర్నిర్మాణం జరిగిపోయిందనుకుంటే అది తేలిక భావమూ- ప్రమాదకరమయిన ఆలోచనా కూడా. దాని గట్టిదనం వాస్తవ సమస్యల పరిష్కారంలో పరీక్షించుకోవలసిందే. సాహిత్య కళాకారులకు సృజనాత్మకమైన వారి కళా సృష్టియే

నిజమైన పరీక్ష. తమ భావజాలంలోని పునర్నిర్మాణ పటిమను పరీక్షించుకోవాలంటే రచయితలు నిర్విరామంగా రచనలు చేస్తూ, విమర్శ-ఆత్మవిమర్శ చేసుకుంటూ ముందుకు సాగిపోవడం ఒక్కటే మార్గం. రాయడం, విమర్శించుకోవడం జీవితం లోకిపోయి ప్రజల నుండి నేర్చుకోవడం, మళ్లీ విమర్శించుకోవడం, మళ్లీ ప్రజలలోకి పోవడం, యిలా యీ క్రమాన్ని తిరిగి తిరిగి శ్రద్ధగా కొనసాగించడం ద్వారా మాత్రమే సిద్ధాంతపునర్నిర్మాణం విజయవంతంగా పూర్తి చేయగలం

సాధారణంగా ఒక సమస్య ఎదురవుతూంది. "ఇతరుల రచనలు చదివితే వానిలో లోపాలు అన్యవర్గభావాలు తేలికగా ఎత్తిచూపగలను, కాని స్వయంగా రాయబోతే నా పాత్రలు బోలుగా బొక్కగా వాస్తవ దూరాలుగా వుంటాయి. శ్రామికవర్గ వేషభాషలలో బూర్జువా వర్గ భావాలనే పొదగడంవంటి తప్పులు చేయకపోవచ్చుగాని, పోరాటవీరులు, ఆదర్శ కార్మికులతో పోల్చితే నా పాత్రలు వెలవెలబోతూ వుంటాయి. నా రచనల్లో బలమైన సిద్ధాంత పునాదిలేని లోపం కన్పిస్తుంది. ఎందువల్ల? నా సిద్ధాంతజ్ఞానం సక్రమంగా సంపూర్ణంగా పునర్నిర్మింప బడనందువల్లనే నేను సిద్ధాంత రీత్యా ఉన్నతస్థాయి రచనలు చేయలేకపోతున్నానా?" అని కొందరు రచయితలు మథన పడుతున్నారు. "సూటి చూపులు, మొద్దుచేతులూ" అనే సామెత వతుగా వుంటుంది వీరిస్థితి. రచయితకు సూటి చూపు లేకపోతే ప్రమాదమే. సూటి చూపులు లేకుండానే క్షుణ్ణమైన చేతలువుండే రచయితలంటూ వుండరు. అంటే యితరుల రచనల్లో లోపాలను తెలుసుకోలేకపోయినా తాము మాత్రం నిర్దుష్టంగా రాయగలగడం ఎవరికీ సాధ్యం కాదు. నిర్దుష్టంగా రాయడానికి సూటిచూపులు తప్పనిసరిగా వుండవలసిందే. కాని, చూపులున్నంత సూటిగా చేతలుకూడా క్షుణ్ణంగా వుండేలా తీర్చిదిద్దడం ఎలా అన్నదే సమస్య.

చూపులు సిద్ధాంతజ్ఞానమనీ, చేతలు శిల్పమనీ యీ రెండూ పరస్పర విరుద్ధమైనవనీ కొందరనుకుంటారు. వీరు "మాకు మంచి ఉన్నతస్థాయి సిద్ధాంత పరిజ్ఞానం వుంది, యిక శిల్పంలో శిక్షణ పొందడమే తరువాయి" అంటారు. దీనితో నేనేకీభవించను. అంతేకాక యిది ప్రమాదకరమైన ఆలోచనకూడా. ఒక రచన సిద్ధాంత పరంగా లోపాలుకలిగి వుందంటే, ఆ రచయిత పరిశీలన నిశితంగానూ, విశ్లేషణ సమగ్రంగానూ లేదన్నమాట. ఇది రచయిత ఆలోచనా సామర్థ్యానికి సంబంధించినదేగాని శిల్పానికి సంబంధించినది మాత్రంకాదు. ఇక్కడ శిల్పం అప్రధానమైనది. మొత్తంగా శిల్పానికే ప్రాముఖ్యత నివ్వడం, శిల్పంపైనే దృష్టినంతా కేంద్రీకరించడం,

శిల్పానికీ సిద్ధాంత పరిజ్ఞానానికీ వైరుధ్యం వున్నదనడం మొదలైన తప్పుడు అవగాహన లన్నీ యిటువంటి భావాలవల్లనే కలుగుతాయి. అందుకనే యీ భావాలు ప్రమాదకర మైనవి. మార్క్సిజం - లెనినిజం అధ్యయనం చేయడం, సమాజాన్ని పరిశీలించడమే దీనికి సరైన పరిష్కారమని చైర్మన్ మావో తన ప్రసంగంలో సూచించారు.

"రచయితలు కళాకారులు శిల్పనైపుణ్యాన్ని అభ్యసించవలసిందే. కాని, ప్రతి విప్లవకారుడూ తప్పనిసరిగా మార్క్సిజం - లెనినిజం చదవాలి. రచయితలు కళా కారులు కూడా దీనికి మినహాయింపు కాదు. సమాజాన్ని కూడా బాగా అధ్యయనం చేయాలి. బాగా అధ్యయనం చేయాలి అంటే సంఘంలో వివిధ వర్గాలూ, వాటి పరస్పర సంబంధాలు, వాటి స్థితి గతులు, స్వరూపస్వభావాలు క్షుణ్ణంగా తెలుసుకోవాలి." అంతేకాదు: "మనం మార్క్సిజం - లెనినిజం చదవడం మన రచనల్లో ఆ శాస్త్ర చర్చలను, సిద్ధాంత ఉపన్యాసాలనూ గుప్పించడానికి కాదు. సమాజాన్నీ, సాహిత్యం, కళలనూ గతితార్కిక భౌతికవాద దృష్టితోనూ, గతితార్కిక చారిత్రిక దృష్టితోను పరిశీలించి అర్థంచేసుకోడానికే మనం వాటిని చదవాలి. మార్క్సిజం - లెనినిజం వాస్తవాలను సరిగా ఆకళింపు చేస్తుంది తప్ప తానే వాటిని తారుమారుచేయదు." చైర్మన్ మావో యిచ్చిన యీ ఆదేశాలననుసరించి పెటీబూర్జువా మేధావులు ముందుగా చేయవలసిన పని తమ సిద్ధాంత పరిజ్ఞానాన్ని సక్రమంగా పునర్నిర్మించుకోవడం. అంటే, కార్మికులు, రైతులు, సైనికులకు సేవచేసే దృష్టిని అలవరచుకోవాలి. ఈ దృక్పథాన్ని మనం స్థిరంగా ఏర్పరచుకోకపోయినా, ఆచరణలో దృఢంగా అవలంబిం చకపోయినా మనం కష్టజీవుల పక్షమే వహిస్తామని నోటితో చెప్పుకున్నప్పటికీ, ఎప్పటికీ, అలాచేయలేం.

అయితే యిటువంటి దృక్పథం ఏర్పడినంత మాత్రంలో మార్క్సిజం-లెనినిజం సంపూర్ణంగా అవగాహన అయింది అనుకోరాదు విప్లవకారులందరూ తప్పనిసరిగా తెలుసుకోదగిన మార్క్సిజం - లెనినిజం శాస్త్రీయంగా అధ్యయనం చెయ్యాలి. సజీవ పాత్రలను చిత్రించాల్సిన రచయితలు, కళాకారులు సమాజంలోని వర్గాలను వాని పరస్పర సంబంధాలను సమగ్రంగా క్షుణ్ణంగా అర్థంచేసుకోవాలి అందుకొరకు గతి తార్కిక భౌతికవాదం, గతితార్కిక చారిత్రకవాదం అధ్యయనం చేయాలి.

పైన ప్రస్తావించిన "సూటిచూపులు మొద్దుచేతులు" అనేది యీ విషయాన్నే సూచిస్తుంది. ఒక రచయితకు సిద్ధాంతజ్ఞానం ఎంతవున్నా అతడు సమాజ పరిశీలనలో గతితార్కిక సూత్రాల్ని సరిగా అన్వయించలేదన్నమాట. అదీ అసలు కీలకమైన

విషయం. అంతేగాని సిద్ధాంత జ్ఞాన లోపం కాదు. ఒకని సిద్ధాంత పునర్నిర్మాణం సరిగా సంపూర్ణంగా లేదంటే అతడి ఆలోచనల్లో యింకా కార్మిక వర్గేతర భావజాల బీజాలు ఉన్నాయనే అర్థం. అవి రచనలో ప్రతిఫలించి, అది మౌలికంగా సక్రమంగా వుందా లేదా అనే ప్రశ్న పుడుతుంది. అంతేగాని. అతని సిద్ధాంత జ్ఞానం స్థాయి తక్కువా ఎక్కువా అని కానే కాదు.

ఒక రచన సిద్ధాంత స్థాయి ఉన్నతంగా లేదంటే. అందులో సూత్ర విషయాలలో తప్పులు లేనప్పటికీ, విషయ పరిశీలన విశ్లేషణ తగినంత సమగ్రంగానూ పటిష్ఠంగానూ లేవని అర్థం. సమస్యల చర్చ సమాజగత వైరుధ్యాల లోతులకు పోదు; అటువంటి రచన అసలైన వైరుధ్యాలకు, చిల్లర వైరుధ్యాలకు మధ్య విచక్షణ చేయదు; ఆయా వైరుధ్యాలకు, సార్వజనీన స్వభావాన్ని గాని, ప్రత్యేక విశిష్టతను గాని బయటకు తీసి చూపలేదు. వైరుధ్యాలలోని విభిన్నాంశాల ఐక్యతను, సంఘర్షణను అట్టి రచన స్పష్టం చేయజాలదు. శ్రామిక వర్గం నుంచి వచ్చే రచయితే అయినా, మార్క్సిజం - లెనినిజం అధ్యయనం చేయక. గతితార్కిక సూత్రాలను సమాజ పరిశీలనకు సక్రమంగా అన్వయించక పోయినట్టయితే అతడి రచనలు కూడా సిద్ధాంతరీత్యా ఉన్నత ప్రమాణాలను సాధించలేవు. పెటీ బూర్జువా మేధావులు, సాహిత్య కళాకారుల విషయంలో సిద్ధాంత పునర్నిర్మాణం సరైన దృక్పథాన్ని ఏర్పరచి గట్టి చేసేది కాబట్టి యిది అత్యంత ప్రధానమైన ప్రముఖ విషయమని గమనించాలి; లేకుంటే వారు ఏ రచనలూ బాగా చేయలేరు.

ఆనాటి సాహిత్య కళావేత్తల సిద్ధాంత స్థాయి, నాటి రచనల లోపా లోపాలను గమనించి ఛైర్మన్ మావో తన ఏనాన్ ప్రసంగంలో 'ఎవరికి సేవచేయాలి', 'ఎలా చేయాలి' అనే ప్రశ్నలకు స్పష్టంగా జవాబులిచ్చారు. అంతేగాక, "ఆచరణ" "వైరుధ్యాలు" అనే మరో రెండు రచనల్లో వాస్తవ సృజనశీల పద్ధతుల గురించి యింకా సమగ్రంగా చర్చించారు. ఈ రెండు వ్యాసాల్లో వివరించిన సూత్రాలు కూడా మనం అవశ్యం తెలుసు కోదగినవి. అవి కేవలం తాత్విక చింతనకు సంబంధించినవి గనుక వానితో మనకు ప్రమేయం లేదనుకోవడం పొరబాటు.

మనకి జీవితంలో కొంత అనుభవం వుంది కాని, 'మనకు తెలిసిన విషయమంతటినీ ఎలా క్రమబద్ధం చేయాలి', 'ఆ విషయ సంగ్రహం నుంచి సర్వజనీన సాధారణ విషయాలను ఎలా సూత్రీకరించాలి', 'వాటికి ఎలా మెరుగు పెట్టాలి', 'రచనలో వాటిని ఎలా చెప్పాలి' అనే చిక్కులతో నిత్యం తికమక పడుతూవుంటాం.

ఈ గందరగోళమంతా తప్పనిసరిగా రచనల్లో ప్రతిఫలిస్తుంది. కొన్ని అంశాలు, విషయాలు గుత్తులు గుత్తులుగా జాబితాలుగా రాస్తాం; ఫోటో తీసినట్టు అద్దంలో చూపినట్టు తెలిసినదంతా మక్కీకి మక్కీ ఎక్కించేస్తాం; జీవితం లోతులకు పోకుండా పైపై విషయాలెన్నిటినో ఏకరువు పెడతాం; విహంగ దృష్టితో జీవిత సర్వస్వాన్ని పరికించి పరిశీలించటానికి మారుగా చిన్న చిన్న మూలలంట దూరి చూడయత్నిస్తాం. ఇవన్నీ మన రచనల్లో రోజూ ఎదురయే పొరపాట్లే. 'ఆచరణ' శ్రద్ధగా అధ్యయనం చేస్తే ఈ అనేకరకాల పొరపాట్లను సరిదిద్దు కోగలుగుతాం.

మనం బతుకులో అనేక విషయాల గురించి ప్రాథమిక జ్ఞానం సంపాదిస్తాం. ఇది కేవలం పైపై సమాచారానికి సంబంధించి సహజంగానే ఏకపక్షంగానూ పాక్షికంగానూ కూడా వుంటుంది. విషయం యొక్క పైపై లక్షణాలను తడువుతుందే తప్ప ఈ జ్ఞానం అసలు తత్వాన్ని వెలికితీయదు. వివిధ విషయాలను విడివిడిగా చూడటమే తప్ప యిది వాని పరస్పర సంబంధంతో వాని అభివృద్ధిక్రమాన్ని పరిణామాన్ని విశదం చేసే సూత్రబద్ధ జ్ఞానాన్ని తెలియజేయదు. ఇటువంటి ప్రాథమిక జ్ఞానం సరైనదిగానే కనుపించినా, ఒక్కొక్కసారి తప్పుడు అభిప్రాయాలకు దారి తీయవచ్చు కనక, కేవలం చూపు, రుచి, వాసన, తాకిడి, వినికిడి వలన సంపాదించే ఈ ప్రాథమిక జ్ఞానంతోనే మనం సంతృప్తి చెందరాదు. మరి కొంత ముందుకు పోయి హేతుబద్ధ విజ్ఞానాన్ని సంపాదించాలి. అంటే విషయాన్ని సంపూర్ణంగా అవగాహన చేసుకోవాలి. అసలు తత్వాన్ని, పరస్పర అంతస్సంబంధాలను అర్థం చేసుకోవాలి. అంటే విషయాలను విపులంగా, సంపూర్ణంగా లోతుగా ఆకళింపు జేసుకోవాలి.

మన జ్ఞానాన్ని ప్రాథమిక దశనుండి, హేతుబద్ధ విజ్ఞానం దశకు మలచుకోగలిగితే, నిరంతర సమాజ పరిణామ క్రమంలోని వివిధ విషయాల పరస్పర సంబంధాలను మరింత స్పష్టంగా చూడగలుగుతాం. ఆ అభివృద్ధి క్రమం వెనుకనున్న నియమాలు సూత్రబద్ధంగా అవగాహన అవుతాయి. కనుక, ప్రాథమిక జ్ఞానానికీ హేతుబద్ధ విజ్ఞానానికీ పరిమాణంతోనేగాక గుణాత్మకంగా కూడా చాలా తేడా వుంది. అయితే హేతుబద్ధ విజ్ఞానం సముపార్జించడానికి అపారమైన ప్రాథమిక జ్ఞానం అవసరమౌతుంది. ఎందుకంటే తగినంత సమాచార సంగ్రహం లేకుండా విషయం యొక్క నిజ లక్షణాలను వానికి సంబంధించిన నియమాలను, విజ్ఞానాన్ని సంపాదించలేం.

ఉదాహరణకు సాహిత్యంలో నమూనాలు వంటి పాత్రల సృష్టి తీసుకుందాం సమాజంలో ఒక స్థాయికి చెందిన ఒక నమూనా పాత్ర (Typical character)

సృష్టించాలంటే వాస్తవంగా ఆ స్థాయిలో, బ్రతికే అనేక మంది అనేక రకాల వ్యక్తులను సన్నిహితంగా పరిశీలించడం తప్పనిసరి. అలాగైతేనే ఆ స్థాయిని గురించి కొన్ని సామాన్య విషయాలు చెబుతూ నమూనాలాగ నిలిచిపోగల ఒక నిజమైన పాత్రను సృష్టించగలుగుతాం. అవసరమైన ప్రాథమిక విషయ సేకరణ మొదటి మెట్టు. తరువాత ఆ సమాచారంలోని సామాన్య సూత్రాలను తడవుతూ దానిని హేతుబద్ధ విజ్ఞానం స్థాయికి చేర్చాలి. దానిని తిరిగి ఆచరణలో పరీక్షించుకుంటూ అభివృద్ధి చేయాలి. ఆ క్రమంలో మాత్రమే మనం సరైన జ్ఞానాన్ని పెంపొందించుకోగలుగుతాం.

ఆగకుండా రచనలుచేస్తూ వుండడం, జీవితానుభవాన్ని గడిస్తూ వుండడం ఒక దాని వెంట ఒకటి నిరంతర ధారలా సాగాలి. నిరంతరం రచనలుచేస్తూ వుంటేనే మన జ్ఞానం సమగ్రంగా నిర్దుష్టంగా వున్నదీ లేనిదీ, కేవల ప్రాథమిక దశ నుండి హేతుబద్ధ దశకు పరిణతి చెందినదీ లేనిదీ ఎప్పటికప్పుడు పరీక్షించుకోడానికి వీల వుతుంది. సృజనాత్మకమైన రచనలు చేసాక తిరిగి జీవితం లోతుల్లోకిపోయి ప్రత్య క్షానుభవం గడించడం వల్లనే మనం చిత్రించిన విషయాలు సామాజిక వాస్తవాలకు సరిపోతున్నాయా లేదా, అవి సామాజిక పరిణామసూత్రాలకు అనుగుణంగా వున్నాయా లేదా అని సరిచూడగలం అయితే, ఒకసారి రాయడంతో అంతకు పూర్వం సంపా దించిన అనుభవ జ్ఞానమంతా ఖర్చయిపోయిందనీ, తిరిగి బతుకులోకి వెళ్ళి పరిశీలించ డం కొత్త సామాగ్రి సంపాదించుకోడానికేననీ భావిస్తే అది చాలా పొరపాటు.

ప్రాథమిక జ్ఞాన సముపార్జన సమాజాన్ని అర్థం చేసుకునే క్రమంలో మొదటి మెట్టు. దీనిని దాటకుండా ముందుకుపోలేం విషయసేకరణనునిర్లక్ష్యం చేస్తే మన రచనలు డొల్లగా, నిర్జీవంగా, బోరుగా కేవలం సిద్ధాంత చర్చలుగా తయారవుతాయి. అలాగని కేవలం ప్రాథమిక విషయ సేకరణతోనే తృప్తిపడితే అప్పుడు మన రచనలు సహజత్వ సిద్ధాంతం వూబిలో దిగబడతాయి. కేవల సిద్ధాంత దృష్టివల్ల రచనలు ప్రత్యేకభావాలు కలపే వస్తాయి. ప్రాథమిక జ్ఞాన సముపార్జన, తద్వారా ఒనగూడిన హేతుబద్ధజ్ఞానాన్ని ఆచరణతో అనుభవంతో పరీక్షించుకోవడం అనవసరం అనుకుంటే యిటువంటి అన ర్థాలు కలుగుతాయి. అయితే కేవలం సమాచార సేకరణపైనే కేంద్రీకరించడంవల్ల, అపారమైన విషయ పరిజ్ఞానమూ అనుభవమూ వున్నప్పటికీ దాన్ని హేతుబద్ధంగా తర్కించి విజ్ఞానంగా సముద్ధరించాల్సిన అవసరం గుర్తించకపోవడంవల్ల వీరికి సహ జత్వం అనే జబ్బు అంకురిస్తుంది.

కేవల సిద్ధాంతదృష్టి, కేవల సహజత్వ దృష్టి మాత్రమేగాక సాహిత్యంలోను, కళలోను పొడసూపే మరొక తప్పుధోరణి వుంది. అదే పడికట్టు పద్ధతి. పాతకొత్తల

మధ్య సంఘర్షణ గురించిగాని, వెనకబడ్డతనం సంస్కరణను గురించిగాని రాసేటప్పుడు అయా వైరుధ్యాల ప్రత్యేక లక్షణాలను సార్వజనీన లక్షణాలతో అనుసంధానించి ప్రత్యేక విషయాలను వర్ణించడంద్వారా సార్వజనీన విషయాలను వెలువరించే నేర్పు మనం సంపూర్ణంగా సాధించలేదు. పాఠకుడు వైయక్తిక ప్రత్యేక విషయాలకే పరిమితమైపోకుండా వుండాలంటే, వైయక్తిక విషయాలనే వర్ణిస్తున్నా మన రచన దానిని దాటి విశాలంగా చూడగలగాలి. అలాగే ప్రధాన అప్రధాన వైరుధ్యాల మధ్య విశ్లేషణ చేయడంలో కూడా మనం సిద్ధహస్తులం కాలేదు కనుకనే మన పాత్రలూ యితివృత్తాలూ పడికట్టు పద్ధతి ఒరవడిలో (Formula) పడిపోతూ వుంటాయి.

కేవల సిద్ధాంత ప్రధానంగానూ, కేవల సహజత్వ ప్రధానంగానూ రాసే రచనలకూ, పోత (లేక పడికట్టు) పద్ధతిలో రాసే రచనలకూ చాలా పోలిక వుంటుంది. వస్తురీత్యా వాటి మధ్య తేడా వుంటుంది.

పోత లేక పడికట్టు పద్ధతి తరువాతి మెట్టు ప్రణాళికా పద్ధతి (Scheme). సిద్ధాంత ప్రధాన రచనలకీ వీటికీ పెద్ద తేడా వుండదు. ప్రణాళికా బద్ధంగా రాసే రచయితలకు జీవితానుభవం శూన్యం. వీరు యితర రచయితల చిత్రణలను దొంగిలించి వాని ఆధారంగా (కాపీగా) పాత్రలు, యితివృత్తాలు కృత్రిమంగా సృష్టించి అతుకుల బొంతలు తయారుచేస్తారు.

రచయితకు జీవితానుభవం ఎంతోవున్నా ఆ విషయ పరిజ్ఞానాన్ని హేతుబద్ధ విజ్ఞానంగా సంతరించుకొనే సమర్థత లోపించడంవల్ల యీ పడికట్టు పద్ధతి రచనలు వస్తాయి. "ఆచరణ" అనే మావో వ్యాసం మన ఆలోచనాక్రమాన్నెలా సక్రమంగా పెంపొందించుకోవాలో, విషయ పరిజ్ఞానాన్ని ఎలా సృజనాత్మక పద్ధతిలో పునర్నిర్మించుకోవాలో బోధిస్తుంది. ముడిసరుకు (సమాచారం) నుండి విషయాన్ని సేకరించడం, అవాస్తవాలనుండి వాస్తవాలను వేరుచేయడం, తెలిసిన సమాచారంనుండి తెలుసుకోదగ్గ విషయాన్ని రాబట్టడం, ఉపరితలం దాటి లోతుగా పరిశీలించడం"– వీనిద్వారా పైపనిని ఎలా సాధించవచ్చునో అది సూచిస్తుంది.

ప్రాథమిక విషయ పరిజ్ఞానాన్నీ, సమాచార సంపదనూ పరిశీలించి నిజలక్షణాలను, వివిధాంశాల వైరుధ్యాలను కనిపెట్టడమే అన్నిటికంటే ప్రధానం. సమాజాన్ని అధ్యయనంచేసే మౌలిక విధానాన్ని సరిగా గ్రహించడానికి "వైరుధ్యాలగురించి" అనే రచన చాలా తోడ్పడుతుంది. మనం ముందుగా ఒక విషయం గుర్తించాలి.

"ఒక విషయంయొక్క అభివృద్ధికి కారణాలు దాని వెలుపల వుండవు; దానిలో పలనే యిమిడివున్న వైరుధ్యాలలోనే వుంటాయి. వీని మూలంగానే ప్రగతి, అభి

వృద్ధి కలుగుతాయి. అంతర్గత వైరుధ్యాలే అభివృద్ధికి ప్రాథమిక కారణం. దానికి యితర విషయాలతోగల పరస్పర సంబంధమూ, అందువల్ల కలిగే ప్రతిక్రియలూ ఆ అభివృద్ధికి అప్రధాన కారణాలు."

నిరంతర మార్పు చెందుతూ అభ్యుదయకరంగా అభివృద్ధిచెందే సమాజమూ జీవితమే సాహితీ కళాకారుల లక్ష్యం కనుక వారు ఈ విషయాన్ని బాగా అవగాహన చేసుకోవాలి. "సమాజంలో అంతర్గతంగావుండే వైరుధ్యాలే సమాజ ప్రగతికి మూల కారణం. అవియేమంటే ఉత్పత్తి శక్తులకు, ఉత్పత్తి సంబంధాలకు మధ్యగల వైరుధ్యాలు, విభిన్న వర్గాల మధ్యగల వైరుధ్యాలు, పాత, కొత్తల మధ్యగల వైరుధ్యాలు. వీని పెరుగుదలే సమాజాన్ని ముందుకు నడిపించి, నవ సమాజస్థాపనను నిరుపయోగమైన పాతను తుడిచిపెట్టే క్రమాన్ని త్వరితంచేస్తుంది." అందువల్లనే వైరుధ్యాల చిత్రీకరణ వాటి పరిష్కారం సాహిత్యానికీ, కళకీ తప్పనిసరి అవుతుంది. వైరుధ్యాలను బయటపెట్టని ఏ రచన అయినా కృతకంగావుంటుంది; ఎందుకంటే నిజ జీవితం నిండా అన్నీ వైరుధ్యాలే.

అయితే వైరుధ్యాలకు సార్వజనీనత, ప్రత్యేకత రెండూ ఉంటాయి. ఆయా సందర్భాల ప్రత్యేక లక్షణాలను ఆకళింపు చేసుకొనకుండా ఒక రచయిత కేవలం వైరుధ్యాల సార్వజనీనతను మాత్రమే చూడవచ్చు అంటే, ప్రత్యేకంగా వివరాలలోకి లోతుగా పోకుండా మొత్తంగా విషయాన్ని సాధారణ పరిశీలన చేయవచ్చు. ఉదా॥కు, ఒక కర్మాగారానికి వెళ్ళినప్పుడు రచయిత యాజమాన్యంలోని ముఖ్య కేడర్లనో కార్మిక సంఘ కార్యవర్గంలోని ముఖ్యులనో మాత్రమే కలిసి, జట్లు జట్లుగావుండే మామూలు పనివాళ్ళనూ, అసలుపనిచేసే చోట వున్న కార్మికులను కలుసుకోకపోవచ్చు. అలా చేయడం వల్ల, అసలైన, నిర్ణయాత్మకమైన విషయాలను కనిపెట్టలేకపోవచ్చు. అప్పుడు అతని రచనలు వైరుధ్యాల సార్వజనీనతను మాత్రమే సూచిస్తాయి. 'ప్రతి సంఘటనలోనూ ఆయా వైరుధ్యాల స్వీయ ప్రత్యేక స్వభావం ఒకటుంటుంది'. దానిని విడిచిపెట్టి వైరుధ్యాల సార్వజనీనత మాత్రమే ప్రదర్శించే ఏ రచన అయినా ఏక పక్షంగా వుండక తప్పదు. వైరుధ్యంలోని వివిధాంశాల స్వభావాన్ని అవగాహన చేసుకోకపోవడం', ఉదాహరణకు, రైతుల్నే అర్థంచేసుకుని భూస్వాములను అర్థం చేసుకొనకపోవడం. సమస్యను పాక్షికంగా చూడడమే అవాలి.

"ఇటు వైరుధ్యపు మొత్తం స్వభావాన్నీ గమనించక, అటు విభిన్నాంశాల స్వభావాలను విడివిడిగానూ గమనించక, లోతుకుపోయి సూక్ష్మ వివరాలను తెలుసు

కోవడమూ తద్వారా వైరుధ్యాల స్వభావాన్ని అవగాహన చేసుకోవాల్సిన అవసరాన్ని తృణీకరించడమూ, దూరాన్నుండి వైరుధ్యపు సూచనల్ని మాత్రం చూసి అంతటితోనే పరిష్కారానికి పూనుకోవడం" యిది సమస్యలను పైపైన తడివే పద్ధతి. రచనలలో సిద్ధాంతపరమైన లోపాలు, పడికట్టు పద్ధతి రచనల లోపాలు అన్నీ ఆయా రచయితల ఏకపక్ష దృక్పథం వలన, పైపై పరిశీలనతో సరిపుచ్చుకొనే పద్ధతివలన కలిగేవే. వైరుధ్యాల సార్వజనీనతకు ప్రత్యేకతకు మధ్యగల సంబంధాన్ని ఛైర్మన్ మావో యిలా స్పష్టంచేసారు.

"వైరుధ్యాల సామాన్యతకు - ప్రత్యేకతకు మధ్య గల సంబంధమే దాని సార్వజనీనతకు ప్రత్యేకతకూ మధ్యగల సంబంధం పరిణామక్రమంలో మొదలు నుంచి చివరి వరకు అనునిత్యంగావుండే వైరుధ్యమే సార్వజనీనత దీని స్వభావం ప్రత్యేక వైరుధ్యాల స్వభావంలో పొదగబడి వుంటుంది. దేనికది ప్రత్యేకమైన వైరుధ్యాలకు ప్రత్యేక స్వభావం వుంటుంది. కాని యివన్నీ తాత్కాలికమైనవీ ఆయా ప్రత్యేక పరిస్థితులపై ఆధార పడినవి కనుక ఒక దానికొకటి సంబంధించి వుంటాయి."

సాహిత్యకళాకారులకు యీ వాక్యాల ప్రాధాన్యం ఎంతయినా వుంది. ఏ రచన అయినా వైరుధ్యాలయొక్క యీ సార్వజనీన ప్రత్యేక స్వభావాలు రెంటినీ వ్యక్తీకరించగలుగుతే అది సిద్ధాంతపరంగా ఎంతో పరిపుష్టంగా వుంటుంది.

అంతేకాదు ఒకే సమయంలో అనేక వైరుధ్యాలుండి, వానిలో ఏదో ఒకటే ప్రధానమైనదిగాను మిగతావి అప్రధాన వైరుధ్యాలుగానూ వుంటాయి. ప్రధాన వైరుధ్యం అంటే ఏమిటి? "ఒక పరిణామ క్రమంలో అనేక వైరుధ్యాలుంటే వాటిలో ఏదో ఒకటే నిర్ణయాత్మకపాత్రవహిస్తూ ప్రధానంగా వుంటుంది. మిగతావి అప్రధాన స్థితిలో వుంటాయి. ఒక పరిణామ క్రమాన్ని అధ్యయనంచేసే టప్పుడు....అవిధంగా ప్రధానవైరుధ్యం కనుగొనడానికే మనశక్తినంతా ఉపయోగించాలి." అయితే, "ఒక వైరుధ్యంయొక్క ప్రధాన, అప్రధాన అంశాలు తారుమారయి అందుకనుగుణంగా ఆ విషయం గుణాత్మకమైన మార్పు పొందవచ్చు." విభిన్న వైరుధ్యాలను సరిగా పోల్చుకుని విశ్లేషించి వానిలో ప్రధాన అప్ర న అంశాలను సరిగా వివేచన చేయకపోవడం మూలంగానే గొప్ప కళాఖండాలు కావలసినవి పడికట్టు పద్ధతికి బలైపోతున్నాయి. దీనివల్లనే వైరుధ్యంలోని ప్రధాన అప్ర న అంశాల అంతర్ పరివర్తననుకూడా చిత్రించలేకపోతాం.

పైన చెప్పిన విధంగా 'ఎవరికోసం రాయాలి' అనే సమస్యను ముందుగా పరిష్కరించుకొని, తరువాత 'ఎలా రాయాలి?' అనే సమస్య ఆలోచించాలని ఛైర్మన్

మావో ప్రసంగంవల్ల మనకు స్పష్టమౌతూంది. ఈ సమస్యలను సవ్యంగా పరిష్క-రించాలంటే మనకు సిద్ధాంత పునర్నిర్మాణం తప్పనిసరి. మనకు ఒకటే పంథా వున్నది అది కార్మికులు, రైతులు, సైనికులకు ఉపయోగించేలా రాయడమే.

వాస్తవికత, సృజనా పద్ధతులకు సంబంధించిన ముఖ్య సమస్యలలో "సమాజ అధ్యయనం" అతి ముఖ్యమైంది. "ఆచరణ", "వైరుధ్యాలు" అనే రెండు రచనల్లో దీని గురించ నిర్దుష్టమైన సమగ్రమైన ఆదేశాలున్నాయి. మార్క్సిస్టు-లెనినిస్టు-సాహితీ సిద్ధాంతాలలో యీ మూడు రచనలూ ప్రమాణ గ్రంథాలు.

మన పంథాను వెలుగు వెల్లువతో నింపడానికి యింత నిర్దుష్టమైన సూత్రాలు, బలమైన సిద్ధాంత జ్ఞానం మన ముందుండగా మనం ఉన్నతమైన రచనలు ఎందుకు చేయలేం?

ఈ సందర్భంగా మనం రెండు విషయాలు దృఢంగా నిశ్చయించుకుందాం. ఒకటి - బతుకులోకి, ప్రజాపోరాటాల్లోకి లోతుగా చొచ్చుకుపోయి నిజాయితీతో మన సిద్ధాంత ప్రాతిపదికను, భావజాలాన్ని పునర్నిర్మించుకుందాం. రెండు - సమాజాన్ని సమగ్రంగానూ అత్యంత శ్రద్ధాసక్తులతోను క్షుణ్ణంగా అధ్యయనంచేసి కార్మికులు, రైతులు, సైనికులను సేవించే పంథాలో పయనిద్దాం.

(1953 స్ప్రింగ్, చైనీస్ లిటరేచర్‌లో మావోటున్ వ్యాసానికి
స్వేచ్ఛానువాదం)

(ఆగస్టు 77, సంచిక 70)

---

...."మార్క్సిజంను అధ్యయనం చేయడమంటె, ప్రపంచాన్ని, సమాజాన్ని, కళా సాహిత్యాలను పరిశీలించడంలో గతితార్కిక భౌతిక, చారిత్రక భౌతిక దృక్పథాలను ఉపయోగించటం; మన రచనల్లోనూ, కళాఖండాలలోనూ తాత్విక్లో పన్యాసాలు ప్రవేశపెట్టటమని అర్థం కాదు. మార్క్సిజం ఎలాగైతె పరమాణువులకు, ఎలక్ట్రానులకు సంబంధించిన సిద్ధాంతాలను సమాశ్లేషిస్తుంది కాని, వాటికి ప్రత్యామ్నాయం కాదో, అలాగే అది సాహిత్య కళా సృష్టిని సమాశ్లేషిస్తుంది కాని, వాటికి ప్రత్యామ్నాయం కాదు. శూన్యమూ శుష్కమూ అయిన పిడివాద సూత్రాలు సృజన ప్రజ్ఞను నిజంగానే నిర్మూలిస్తాయి; అంతేకాదు, అవి ముందు మార్క్సిజంనే నిర్మూలిస్తాయి. పిడివాదంతో కూడిన మార్క్సిజం మార్క్సిజం కాదు, అది మార్క్సిస్టు వ్యతిరేకవాదం."

(మావో యేనాన్ ప్రసంగం నుండి)

# అమరకవి - సుబ్బారావు పాణిగ్రాహి

భూషణం

పాణిగ్రాహి అనగానే గిరిజన విప్లవపోరాటం గుర్తుకువస్తుంది. వెంపటాపు సత్యం మాట; పాణిగ్రాహి పాట గిరిజనులు విప్లవించడానికి తోడ్పడ్డాయి.

సహజంగా ఆయుధధారులైన గిరిజనులు అరణ్యప్రాంతంలో క్రూరమృగాల బారినుండి రక్షించుకొనేందుకు తమ తమ ఆయుధాలను ఉపయోగించేవారు. అమాయకులూ కష్టజీవులూ అయినవారిని దళారులూ, భూస్వాములూ దోచుకుంటూ తమ బొజ్జల్ని, గాదెల్ని నింపుకుంటుండేవారు.

కమ్యూనిస్టుపార్టీ వారి దృష్టిని తమ జీవితం వైపునకు మళ్ళించింది.

అరణ్యంలో క్రూరమృగాల కంటే క్రూరాతిక్రూరమైన దోపిడీ మీ జీవితాన్ని పట్టి పీడిస్తున్నదనీ పెద్దపులికంటే క్రూరమైన పీడకులు మీ జీవితాన్ని పట్టి, మీ రక్తం చెమట దోచేస్తున్నారనీ; మీమీ ఆయుధాలు క్రూరమృగాల కంటే క్రూరమైన దోపిడీని నిర్మూలించడానికి ఉపయోగించండనీ; ఉపదేశించి విప్లవీకరించిన ఘనత పాణిగ్రాహి సాహిత్యానికి దక్కింది.

"కొండజనం" అన్న పాటలో
"కల్లకపటములేని - చల్లనీవారయ్యా
వల్లమాలిన బతుకు - విశ్వాసమున్నోరు
కొండకోనలలోన - ఉండేటి జనమయ్యా
బండచాకిరి చేస్తూ - బతుకుతూ ఉంటారు
బెబ్బులీనైనాను - నిబ్బరించాగలరు
జబ్బుసత్తువ కూడ - అబ్బ చాలా గలదు

అలాంటి జనానికి కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని సులభశైలిలో పాటలుగా వ్రాసి గిరిజనుల రక్తంలోకి పాణిగ్రాహి పంపించారు.

శ్రీకాకుళం జిల్లాలో కమ్యూనిస్టుపార్టీ ఎదుగుబొదుగుల మీద పాణిగ్రాహి కవిత్వం ఆధారపడిఉంది. నిరంతరం ఉద్యమంలో ఒకనిగా పనిచేస్తూ ఉద్యమ కార్యకలాపాల్నే పాటలుగా వ్రాస్తూ, పాడుతూ సుబ్బారావు పాణిగ్రాహి శ్రీకాకుళ ఉద్యమమే తానుగా తానే శ్రీకాకుళ ఉద్యమంగా ఐక్యత చెందారు.

శ్రీకాకుళంలో కమ్యూనిస్టుపార్టీ- "అయ్యో అయ్యో !" పార్టీగా ఉంటున్నప్పుడు పాణిగ్రాహి కూడ "అయ్యో అయ్యో !" కవిత్వం వ్రాశారు.

పార్టీ కార్యకలాపాలు పార్లమెంటుకు పరిమితం చేయబడి, కష్టజీవుల సమస్యల్ని కసాయివారికి వినతిపత్రాలూ, ఊరేగింపులూ, బహిరంగసభలూ, పేపరు ప్రకటనలూ, అసెంబ్లీలో ప్రశ్నల రూపంగా మనవి చేస్తున్నప్పుడు - పాణిగ్రాహి కవిత్వం కూడా పరిష్కారాన్ని సూచించకుండా పరిస్థితినే వివరిస్తూపోయింది.

"దొంగాటకం" అన్న పాటలో

'మునగ చెట్టులోన చేవ
సోదరా ఉందంటే నమ్ముతావా ?॥
నేతి బీరకాయలోని నెయ్యి
ఏది మచ్చుకైన కొంత పైకి తియ్యి ।'
అంటూ

'రేషనుకై కొట్టుముందు నిలబడు
'స్టాకు' లేదంటే ఇంట్లో సాగిలపడు
ఆకలేస్తే గోడవంక చూసుకో ॥
పచ్చి మంచినీళ్ళు కడుపులోన పోసుకో।'
అన్నారు.

"జనం నడనాలీ" అన్న పాటలో కూడా

"ఎన్నాళ్ళీ కాపురాలూ ।
ఏ చెరో గిరో పడి చేద్దామన్నా
ఎట్లాగీ కాపురాలూ ।
చేలన్నీ చెమటను తడిపి

నేలా బురదా నాటులు నాటీ
కళ్ళ పాళ్ళిణముతో ఇల్లు జేరితే
పిల్లలు తింటే తల్లుకు పస్తు ।
ఎన్నాళ్ళీ కాపురాలూ ? ।" అని

జనజీవితాన్ని వారిముందర వివరించుకుంటూ పోయారు.

ఆనాటి "అయ్యో అయ్యో" కమ్యూనిస్టుపార్టీ ఎన్నికలు ప్రధానాశయంగా పెట్టుకుంది.

పార్టీ కార్యక్రమం ఖచ్చితంగా అమలు జరుపుతూ పార్టీలో అంతర్భాగంగా ఉన్న సుబ్బారావు పాణిగ్రాహి ఎన్నికల ప్రచారం చేసేవారు. ముఖ్యంగా మహిళాదళాన్ని నడుపుతూ కమ్యూనిస్టుపార్టీకి ఓట్లెయ్యమని నినాదాలిస్తూ, గోడలమీద గుర్తులువేస్తూ అభ్యర్థుల పేర్లు వ్రాస్తూ జెండాలు తయారుచేసి కట్టేవారు.

పార్టీ అంటే గిట్టని గ్రామాల్లో ఆయన ఇళ్ళమీద జెండాలుకట్టే అవకాశంలేక చెట్లమీద కట్టేవారు. గోడలమీద నినాదాలు వ్రాసేవారు. అక్కడున్న భూస్వాములు చెట్లమీద జెండాలు కూడా ఉంచ నిరాకరించి తమ గూండాల చేత లాగించేసేవారు. గోడలమీద నినాదాలకు పేడజల్లించేవారు, ఇది చూచి సుబ్బారావు పాణిగ్రాహి కదిలి-

"ఎరుపంటే కొందరికి భయం భయం
పసిపిల్లలు వారికంటే నయం నయం
ప్రకృతిలో పూలు ఎరుపు మందారం
స్త్రీలనుదుట తిలకం ఎర్రని సిందూరం

అని వ్రాసి ఎరుపు నీరక్తంలోనే ఉందనీ జెండాలు పీకించినంత మాత్రాన ఎరుపు మాసి పోదనీ వివరించారు.

కాంగ్రెసుపార్టీ అవతారపురుషుడూ, భారతదేశానికి మహాత్ముడూ అయిన అహింసా మూర్తి గాంధీగార్ని కాంగ్రెసువాళ్ళు ఉత్సవ విగ్రహంగా మార్చి ఆయన విధానాల్ని తుంగలో తొక్కినా భారత కమ్యూనిస్టుపార్టీ ఆయనను వదలలేదు.

నాటి కమ్యూనిస్టుపార్టీకి మార్క్సు, ఏంగెల్స్, లెనిన్, స్టాలిన్ గాంధీఅంతా ఒకలాగే కనిపించి అహింసామూర్తి కమ్యూనిస్టుపార్టీగా ఉండేది.

శ్రీకాకుళంలో గిరిజన సంఘాలు అక్కడి భూస్వాములకు మాత్రం కంటక ప్రాయంగా తయారయినాయి. కూలిరేట్ల పెంపుదల, కంట్రోలు ధరలకు సరుకు లమ్మకం, దొంగరవాణాల్ని అడ్డడం వారికిగిట్టలేదు. అంచేత పార్టీని ఎలాగైనా అణిచి వేయాలని వారు సర్వవిధాలా సన్నాహపడుతూ ప్రభుత్వ సహకారం కూడా పొంది ఎక్కడికక్కడ కమ్యూనిస్టుపార్టీ కార్యకర్తల్నీ, నాయకుల్నీ కొట్టించడం సాగించేరు. కుదమగ్రామంలో భూస్వాములకు వ్యతిరేకంగా 'కొండదొరల' చేత చేపలు పట్టించి సందుకు అదిభట్లకైలాసాన్ని కొట్టించేరు. గుమ్మలక్ష్మీపురం సంతలో పార్టీ ప్రచారం చేస్తుండగా వసంతాడ రామలింగాచారిగార్ని కొట్టించేరు. తిరిగి వారిమీద పోలీసు కేసులు పెట్టారు.

అలాంటి హింసాకాండ అక్కడ జరుగుతున్నప్పుడు కమ్యూనిస్టుపార్టీ దెబ్బకు దెబ్బగా వ్యవహరించకుండా ఓర్మిని ప్రబోధిస్తూ ప్రధానికి లేఖలూ, ప్రకటనలూ, సంతాపాలూ, నిరసనలూ తెలియజేస్తూ కాలక్షేపం చేసింది. అప్పుడు పాణిగ్రాహి హృదయం క్షోభించి

"ప్రతీకారం చెయ్యలేక కాదు
క్రమశిక్షణ సిద్ధాంతం
మమ్మల్ని ఆపేశాయి" అన్న అర్థంలో కవిత వ్రాశారు.

నిజానికి కమ్యూనిస్టుపార్టీ ఆనాడు శ్రీకాకుళం శాఖను ఇముడ్చుకోలేకపోయింది. రోజుకోవిధంగా రాజుకుంటూ అగ్నిగోళంగా మారుతున్న శ్రీకాకుళాన్ని ఎలా రక్షించు

కోవాలో పాపం నాయకులకు రివిజనిస్టు కళ్ళద్దాల్తో ఎంత వెతికినా వ్యూహమూ, ఎత్తుగడలూ దొరకలేదు.

కానీ అక్కడి భూస్వాములు మాత్రం వారికున్న ఎత్తుగడలతో, వ్యూహంతో ముందుకు వచ్చారు.

శ్రీకాకుళం చారిత్రికంగా మలుపు తిరిగినరోజు అది. 1968 అక్టోబరు 31న గిరిజన మహాసభకు వస్తున్నవార్ని భూస్వాముల గుండాలు లేవిడి దగ్గర కాచికొట్టడం, అడ్డుకునేందుకు సభకు హాజరైన సభ్యులు కదిలి ప్రవాహంగా వస్తున్నప్పుడు చెట్టుచాటునుండి కొండగొర్రి మంగన్న, ఆరిక కువారలను కాల్చిచంపడం; అదే పాణిగ్రాహిచేత "అక్టోబరు31" అన్నగేయం వ్రాయించింది. జముకుల కథను పాడించింది. ఆ సంఘటన ఆధారంగా ఆనాటి జనశక్తిలో 'శూలపాణి' కూడా సుదీర్ఘమైన కవిత వ్రాశాడు.

"ఈ రక్తం ఒక మహత్తర
శక్తిని సృష్టిస్తుంది
ఈ బాధకు భవిష్యత్తు
తగిన మూల్యం చెల్లిస్తుంది."

నిజంగా తగిన మూల్యం చెల్లించడం జరిగింది.

డాంగే "మార్క్స" పార్టీ, సుందరయ్య 'మార్క్స్' పార్టీగా మారినా శ్రీకాకుళం ఒక ప్రశ్నగానే మిగిలింది: పశ్చిమ బెంగాల్‌లో, కేరళలో కమ్యూనిస్టు పార్టీ 'మార్క్సిస్టులకు' హెచ్చుసీట్లు రావడంతో మళ్ళీ విప్లవ పదజాలపు పార్లమెంటు పార్టీగా అది కూడా మారిపోయింది. అప్పుడు పాణిగ్రాహి వార్ని ఎగతాళిచేస్తూ

"కలకత్తా కాళిక నాలిక
రుచి మరిగెను మధుర మిఠాయీ!" అన్న పాట వ్రాసి పాడారు.

పాణిగ్రాహి ఆటపాటలూ, సూటి విమర్శలు సహించలేకపోయిన సుందరయ్యగారు ఏలూరు సభలో చివరికి ప్రజలనే ప్రశ్నించారు.

"నా ఉపన్యాసం కావాలా? సుబ్బారావు పాణిగ్రాహి జముకులకథ కావాలా?." అని.

జనమంతా ముక్తకంఠంతో

"ఉపన్యాసాలు వింటూనే ఉన్నాం. పాణిగ్రాహి జముకుల కథ కావాల"ని జవాబుగా చెప్పారు.

పాపం మరి చేసేదిలేక ఉపన్యసించకుండానే ఆయన వెళ్ళిపోయారు.

అదే రోజుల్లో ఆయన "కాలచక్రం" అన్న నాటకం వ్రాశారు. (వ్రాత ప్రతి ఎక్కడుందో తెలియదు) నిముష నిముషానికి మారిపోతున్న ఆనాటి పరిస్థితులు నాటక ప్రదర్శనకు వ్యవధి చిక్కనివ్వలేదు.

అప్పుడే.... సరిగ్గా అప్పుడే నగ్జల్‌బరీలో నిప్పంటుకుంది. శ్రీకాకుళానికి దాని కాంతులు స్పష్టంగా కనిపించాయి. కమ్యూనిస్టుపార్టీ తన విధానాల్ని ఆ కాంతుల్లో దిద్దుకోగా పాణిగ్రాహి తన కవిత్వాన్ని కూడా దిద్దుకున్నారు.

అంతకుముందు వ్రాసినపాటలు మారినపరిస్థితుల కనుగుణంగా మార్చుకున్నారు.

1) "ఎందాక నేస్తం? ఆగాగు వస్తాం
అందరం కలిసేకా ముందుకే పోదాం" అన్న పాటలో-

"ఆగాగు వస్తాం" అన్నమాట తీసేసి "ఎందాక నేస్తం? అందాక వస్తాం" అని మార్చేశారు.

ఆలాగే "ఎడమచేత పట్టవోయి ఎర్రని జెండా,
పిడికిలి బిగించవోయి వేరొకచేత" అన్న పాటలో-

"పిడికిలి బిగించవోయి వేరొకచేత" తీసివేసి "తుపాకి పట్టవోయి వేరొకచేత" అని చేర్చారు.

పార్టీ కార్యక్రమం మారేసరికి పాణిగ్రాహి కలం పరవళ్ళు తొక్కింది, విప్లవోత్సాహంతో విరుచుకుపడింది.

"పిలిచింది ఎర్రజెండా
పలికింది కొండ కొండా"

అంటూ

"దిక్కు మొక్కులేని జనం
ఒక్కొక్కరు అగ్నికణం
సింహకంఠ నాదంతో
వస్తారిక కాచుకోండి"

అని సవాల్ చేయగా శ్రీకాకుళం జూలు దులిపి ముందుకు దూకింది. అలా శ్రీకాకుళం మండింది. యావద్భారతం మండుతుంది.

(ఆగస్టు 1974, సంచిక 59)

# పెన్నూ గన్నూ పట్టిన ప్రజాకవి

రేక

"నీ కవిత్వం కట్టిపెట్టు, సాయుధపోరాటం మానుకో; లేదా- కాల్చేస్తాం. చంపేస్తాం" అన్నారు పోలీసులు- 1969 డిసెంబర్ 22న- సుబ్బారావు పాణిగ్రాహితో. ప్రాణాల సంగతి అది: "మీ తుపాకీలతో భయపెట్ట చూస్తున్నారా, పిచ్చివాళ్ళారా, నన్ను చంపినా నా ఆశయాన్ని చంపలేరు. తర తరాల పీడనలో అణగారిన నా మాతృభూమి రైతాంగం, యివాళ సాయుధ పోరాటం సాగిస్తున్నది. విజయం చేకూరేదాకా విశ్రమించేది లేదు. నన్ను కాల్చుకో, చంపుకో విప్లవం వర్ధిల్లుతుంది". అన్నాడు ఆయన- ఆ ఉదయం సూర్యునికి స్వాగతం పలుకుతూ ప్రాణాలర్పించిన వాళ్ళలో నిర్మల, రమేశ్ చంద్రసాహూ, అంకమ్మ, సరస్వతి, ఉమారావులు కూడా వున్నారు.

చనిపోయే ముందు కొద్దికాలంగా ఆయన వ్యాధితో బాధపడుతున్నాడు. భాస్కరరావు, గణపతులను పోలీసులు కాల్చివేసిన తర్వాత సోంపేట ఏరియా కమిటీ నాయకత్వ బాధ్యతను అంత అనారోగ్యంలో వుండి కూడా తీసుకున్నాడు. "నా ఆరోగ్యం ఇక బాగుపడదు. రోగంతో చావడంకన్నా పోరాటంలో చావడం మేలుకదా" అన్న అసమానమైన విప్లవకారుడు.

పార్టీని వదిలిపెట్టి తన ప్రతిభను డబ్బు చేసుకోవడానికి ఉపయోగించుకొమ్మని సలహా యిచ్చిన వాళ్ళకు- "ప్రపంచంలో గొప్పతనంగా భావించబడేదేమైనా వున్నదంటే అది కమ్యూనిస్టుగా బ్రతకడం, ప్రజల కొరకు పనిచేయడం" అని చెప్పిన పాణిగ్రాహి భారత కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రలోనే సాటిలేని కమ్యూనిస్టు.

సాయుధ పోరాటంలో చేరడానికి ఇల్లువదిలే ముందు వృద్ధురాలైన తల్లితో "అమ్మా! నిన్ను వదిలి వెళ్ళనివ్వ నీ పట్లనాకు బాధ్యతలున్నాయి. కాని దుర్భరమైన దారిద్ర్యంలో దుఃఖంలో భారతదేశమంతటా బ్రతుకుతున్న కోట్లాది తల్లుల పట్ల కూడా నా బాధ్యత వున్నది" అని చెప్పి తన వున్నతాశయం కోసం తల్లినుంచి కూడా దూరంపోగలిగిన విప్లవకారుడు.

"పాణిగ్రాహి రచనల్లో రాజకీయాలకు, కళకు ఐక్యత సిద్ధించింది. విప్లవ రాజకీయ వస్తువుకు, కళానైపుణ్యానికి పాణిగ్రహణం చేసినవాడు పాణిగ్రాహి."

ఈనాడు జనం పాటలు ఎక్కువగా పాడేవాళ్ళు ఎందరోవున్నా పాణిగ్రాహి పాటల్లోని సారళ్యం యిపుడుపాటలు రాస్తున్నకవులలో ఎక్కువ మందిలో కనిపిస్తూలేదు.

"జనం నేర్పిన చిక్కటి దేశియాలతో, ఉద్యమం నేర్పిన తత్వబలంతో, సుబ్బారావు పాణిగ్రాహి అగ్నికణాలు" లోని గేయాలు నిర్మించాడు.... జనానికి దూరంగా ఉండి, వాళ్ళకు శిరోధారమైన కవిత్వం రాసే వాడెవడైనా సుబ్బారావు పాణిగ్రాహిలా సూటిగా, సరళంగా, నిరలంకారంగా, పటిష్టంగా, పాటినేల సత్తువ తోటి, వాగునీటి స్వచ్ఛతతోటి, క్రమబద్ధమైన నడకలునేర్పి పాటలబాణీలకు ఒదిగించి, గేయాలు రాయలేదు." (కె. వి. ఆర్.)

పాణిగ్రాహి పాటల్లో ముందు నిలిచేవి— ఎరుపు తూర్పుజెండా, మేము కమ్యూనిస్టులం: వీటికి ఏ వ్యాఖ్యానమూ అక్కరలేదు.

"ఎరుపురంగు ఎన్నటికీ / కాదు అపాయం
అపాయాన్ని తప్పించే / ఒక సదుపాయం."
"ఎరుపులోనె మెరుపుంది / పోరాడే శక్తుంది
శ్రమజీవుల హక్కులకై / ఎలుగెత్తే అరుపుంది" (ఎరుపు)

"ఈ పీడన మనకెందుకు, ఈ పాలన మనకెందుకు
భవిష్యత్తు మనదేనోయ్, ఈ విపత్తు ఇక రాదోయ్"
"వర్గరహిత సమాజాన్ని కోరవోయ్
కమ్యూనిజమే నిజమని సోదరులకు చాటవోయ్" (తూర్పుజెండా)

"కష్టజీవులం మేము కమ్యూనిస్టులం
ఔనన్నా కాదన్నా అదే యిష్టులం"
"డబ్బులకై ఆశయాల / సంగడిలో అమ్మబోము
నిర్బంధానికి భయపడి / రివిజనిస్టులం కాము" (మేము కమ్యూనిస్టులం)

"నిజంకాదురా నేటి స్వాతంత్ర్యం" (బుర్రకథ)

అని చెప్తూ, పాలకులు, వారి బంట్ల గురించి:

"కాంగ్రెసు చెప్పుతుంది సోషలిజం
దానికి వంతపాట నేర్పుతుంది రివిజనిజం
ఆశపడకుమోయి వట్టి బూటకం
నీవు అనుభవించి తీరుతావు కొటకం"

అంటున్నాడు పాణిగ్రాహి— "ఆయుధాల ఆకులేసి తుపాకితో వడ్డించే" (హెచ్చరిక) "ప్రస్తుతపాలన నీకైకాదు / ఆశలు వేగ ముగించ"డం "తెలుసుకో" అనీ, "కూడూగుడ్డా, గూడూ / కరువెందుకు యీ మూడూ" అని చాలా సరళంచేసి చూపుతున్నాడు పెద్ద సత్యం యిమిడి వున్న సమస్యను.

అయితే, "కర్మ - ప్రాప్తం రెండు పదాలు / చల్లార్చెను వేడి ఎదలనూ / ఆచారం, మతధర్మం, నియమం / ఆపదు ఆకలి మంటలనోయ్" అంటూ పాత నమ్మకాల మీద దాడిచేసి, "కొద్దిమంది కోటీశ్వరులంతా / అధికారం చేస్తున్నారోయ్, పూర్వజన్మ సుఖ ఫలితం ఇదియని / కదలక మెదలక మేస్తున్నారోయ్" అని అసలైన సిసలైన ఏకైక సత్యాన్ని ప్రకటిస్తున్నాడు (తెలుసుకో). "దేశభక్తులు"గా చలామణి అవుతున్న వాళ్ళు ఎవరో కూడా చూపుతున్నాడు.

"ఇతరుల సౌఖ్యం దోచుకుతినడం / సూత్రం తెలిసిన వారండి"
"నిండు మనసుతో రెండు దజనుల / బస్సురూట్లు గలవారండి"

ఇట్లాంటి చోట, ఇట్లాంటి పరిస్థితిలో- "ఈ పాలన మనకెందుకు?" అని అడుగుతున్నాడు.

"ఎన్నాళ్ళని ఎదురు చూచినా / కన్నీళ్ళే నీ బ్రతుకోయీ
నిన్నీగతి తెచ్చిన వారిని / మన్నించుట తగదుర భాయీ"

పోరాటం చేయాలి. మరి ఎవరెవరు కలవాలి?

"కల్లలేతి కార్మికుడా / కలత నిద్రవదులుకో
అల్లదిగో కర్షకుడూ / అతని చేయి కలుపుకో" (మేలుకో)

ఇక "విగతజీవి" ఉద్యోగి వున్నాడు.

"మదిలోన ఆశలన్నీ / పదిలంగ దాచకోయీ
పదిలమౌ ఆశలకోసం / ఎదిరించే తీరాలోయీ"

అని "ఉద్యోగీ, సాగిపో" నువ్వు కూడా అంటున్నాడు పాణిగ్రాహి.

ఈ "దిక్కు మొక్కు లేని జనం" చేసే "హెచ్చరిక" చూడండి.

"కోట్లగొంతులొక్కసారి / గర్జిస్తయ్ గర్జిస్తయ్
సీట్లమీద కూర్చుండే / మంత్రులారా ఖబర్దార్"

ఇట్లా- "సింహ కంఠనాదంతో"- పెన్నూ గన్నూ పట్టిన విప్లవకారుని వెనుక నడిచే అగ్నికణాలు ఏమని పాడుకుంటున్నాయో వినండి: (వస్తాము నేస్తం)

"ఎందాక రమ్మన్నా / అందాక వస్తాము
కష్టాలు నష్టాలు / ఇష్టపడి ఉంటాము"
"యమ యాతనలు దాటి / సుఖమనుభవించాలి
మాకున్న లేకున్న / ముందు తరమైనాను"

ఈ జనమూ, ఈ పాటలూ వాళ్ళ బాటలలో "అఖండ భారతదేశాన్ని" దర్శించిన కవి జాతీయగీతం యిట్లావున్నది : (ఖబర్దార్) :-

"అదిగదిగో బెంగాల్లో / సంతాల్ తెగబక్క రైతు
గర్జిస్తూ గాండ్రిస్తూ / వైరివంక చూశాడు
శ్రీకాకుళం జిల్లాలో / ఆకలిగొను గిరిజనుడు
అర్జునులా విల్లుసాచి / బరితెగించి దుమికాడు
నైజాంలో రజాకార్ల / కాంగిరేసు పోలీసుల
నల్లగుండె కదిలించిన / నల్లగొండ జబ్బశక్తి
మళ్ళీ రుచి దొరుకునులే
తెలంగాణ వీరజాతి / తెగువ మరల జూపునులే
దాపర మడుగున హరిజన / వాడలన్ని బుసకొట్టును
రుస రుసలాడినదదిగో / అస్సాంలో కొండజాతి
త్రిపురాసురులందరినీ / యమపురికంపగ నేడే
త్రిపురలోని ఆదిశక్తి / ప్రళయ నాట్యమాడసాగె"

పాణిగ్రాహికి స్వజాతి దురభిమానం లేదు. "ఒకదేశపు ఆవేశం / ఒకదానికి ఆశయం" కావాలని కోరిన అంతర్జాతీయ మానవతావాది అయిన ఆయన కవిత్వంలో విశ్వరూపం చూడండి : (జనత మేల్కొన్నది) :-

"అదిగదిగో కాంగోప్రజ / అంగలు వేస్తున్నారు
సింగపూరు మలయాలో / సింగాలైయున్నారు
బర్మాలో అధర్మాలను / బందీలను చేస్తున్నయి
లంకలోని పీడకుల / బింక మొదలగొడుతున్నయి
అరమరికలు లేకుండ / అమెరికా గడ్డపైనే
నల్లవాళ్ళు లేస్తున్నయి / కొవ్వు రాలగొడ్తున్నయి"

శ్రీకాకుళం గిరిజన ఉద్యమానికి శ్రీకారం చుట్టిన మార్పు పద్మనాభం "తాతకు" అర్పించిన "జోహార్" నే సుబ్బారావు పాణిగ్రాహికి అర్పిద్దాం :-

"కరకు పాలకుల కబంధ హస్తం
కక్షకట్టి నీ మేను చుట్టినా
కదలలేదు నీ కార్యదీక్ష"
"పీడబోములే నీదు ఆశయం"

[డిసెంబర్ 77, సంచిక 74]

# ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు తిరస్కృతి

## శ్రీ కాళీపట్నం రామారావు ప్రకటన

లోగడ నేను రాసిన కొన్ని కథలు "యజ్ఞం" అనే పేరుతో ఓ సంపుటిగా వెలువడ్డాయి. ఈ సంపుటిని ఉత్తమ కథలుగా నిర్ణయించి అందుకు వెయ్యినూట పదహార్లు బహుమతిగా యివ్వ నిశ్చయించినట్టు ఆం. ప్ర. సాహిత్య అకాడమీవారు నాకు తెలియజేసేరు. పత్రికా ముఖంగా మీకూ తెలియజేసేరు.

వారి నిర్ణయం మనచేతుల్లో లేకపోయినా వారిస్తామనే బహుమానం తీసుకోవడమా మానడమా అనేది మన చేతుల్లోనే వుంది. ఈ ఆం. ప్ర. సాహిత్య అకాడమీ ప్రజాసంస్థ కాదు. ఇది ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం స్థాపించిన సంస్థ. ఒక సెక్రెటరీ లెవెల్ ప్రభుత్వోద్యోగి దీని పనులు నిర్వహిస్తారు. ఓ మంత్రిగారి పర్యవేక్షణ కింద దీని కార్యకలాపాలు సాగుతాయి. కవులూ పండితులూ [అభ్యుదయ భావాలు కలవారు కూడా] ఎందరున్నప్పటికీ దీని మీద హయాం మాత్రం ప్రభుత్వం వారిదే – ఈ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఎవరిదైనా కావచ్చుకాని కష్టించిపనిచేసే పేదలది మాత్రం కాదు. అందుకు నిదర్శనం ఈ ప్రభుత్వంలో కూడా పరాయి పాలన లో లాగే నూటికి తొంభై మంది నిరుపేదలుగానే మిగిలిపోవడంతో మేం ఎందుకిలా వుండాలని ప్రశ్నించే ఆ పేదవారిని కిక్కురు కక్కురుమనకుండా కాల్చేస్తున్న ఈ ప్రభుత్వం పేదల మీది ప్రభుత్వమే గాని పేదల ప్రభుత్వం కాదు, ఎన్నటికీ కాజాలదు.

కొన్ని వేల జనాన్ని తుపాకులతో కాల్చిచంపి తుపాకులమీదే తప్ప మరింకే దేనిలోనూ తనకి నమ్మకం లేదని ఈ ప్రభుత్వం రూఢి చేసింది. ఈ ప్రభుత్వపు ఉచ్చుల్లోంచి బయటపడాలంటే పేదజనం కూడా తుపాకుల ఉపయోగం మీదే నమ్మకం పెట్టుకోవాలి తప్ప ఎలక్షన్ల ఎండమావుల మీద ఆశలుంచుకుని లాభంలేదు. ఇది గమనించిన మా విప్లవ రచయితలు ఆ నిజాన్ని జనానికి చెబుతున్నందుకు ఈ ప్రభుత్వం జైళ్ళలో పెట్టించడమే కాక యింకా అనేక విధాల దాడులు చేసి వారిని యిబ్బందిపెట్టి హింసిస్తూంది.

ఈ ప్రభుత్వ సాహిత్య అకాడమీ బహుమానం వడ్డీ వ్యాపారులు ఏటా పండుగలకి పేదలకి చేసే అన్నసంతర్పణ లాంటిదని తెలిసిన వారంటారు. ఈ బహుమతి నేను తీసుకుని ఏ జనం కోసమైతే 'యజ్ఞం' కథ రాసేనో వారికి ద్రోహం చేయదల్చుకోలేదని ఈ వేళ ఈ జనం మధ్య నిల్చొని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి అవసరంగానూ, స్పష్టంగానూ తెలియజేస్తున్నాను.

కాళీపట్నం రామారావు

విశాఖ
25-10-74

[డిసెంబర్ 1974, సంచిక 63]

చారిత్రిక పత్రం :

# విప్లవ మంటే....?

[కోర్టులో భగత్‌సింగ్ వాఙ్మూలం]

అనువాదం : ముదార్ వేణు

మా అర్థంలో విప్లవమంటె యిప్పుడు అన్యాయ చట్రంలో బిగించబడ్డ పరిస్థితులు మారాలి. వస్తూత్పత్తికి కారకులైన కార్మికులు సమాజంలో కీలకమైన వ్యక్తులుగా వుండి కూడా వారి శ్రమఫలితాన్ని యజమానులు దోపిడీ చేయడమే కాక ప్రాథమిక హక్కులు కూడా వారికందకుండా చేస్తున్నారు.

ప్రజలందరి ఆహారావసరాలు తీర్చడానికి శ్రమించి పంట పండించే రైతు తన భార్యా పిల్లలతో సహా ఆకలికి మాడే దౌర్భాగ్యస్థితి, ప్రపంచానికంతటికి గుడ్డల్ని అందించే సాలెవాడు తన పిల్లల్ని చిరుగులతో కప్పాల్సిన నికృష్టస్థితి, భవంతుల్ని నిర్మించి ఆధునికాలంకారాల్ని వాటిలో సమకూర్చే తాపి, కమ్మరి, వడ్రంగి తాము నివసించేందుకు పూరిగుడిసెలు కూడా లేక సంసారాల్తో సహా మురికి గుంటల ప్రక్క దొర్లాల్సిన హీనస్థితి ఏర్పడింది. ధనికులు, దోపిడీదార్లు సమాజాన్ని జలగల్లాపట్టి లక్షలకు లక్షలు తమ విలాసాలకు యిష్టమొచ్చినట్లు ఖర్చుపెట్టుతున్నారు. దారుణమైన అసమానతలు, అవకాశాల్లో భేదాలు తీవ్రపరిణామానికి దారి తీయక మానవు. ఈ ప్రస్తుత పరిస్థితులు యింకెంతో కాలం సాగవు. తమ సంపదలతో, వైభవాలతో కన్నుగానక - ఆనందంలో మునిగిపోయిన ఈ ధనిక వ్యవస్థ బద్దలు కాబోతున్న అగ్ని పర్వతపు లావాలో మునిగి తీరుతుంది.

ఈ నాగరికతా భవనాన్ని సరైన సమయంలో రక్షించని యెడల, తుత్తునియలు కాక మానదు. ఇప్పుడు పెద్ద మార్పు అవసరం. సోషలిజం పంథాలో సంఘాన్ని పునర్నిర్మించ దలచిన ప్రతివారూ ఈ సత్యాన్ని తప్పక గుర్తించాలి. మనిషినిమనిషి, దేశాన్ని దేశం దోపిడీ చేయడాన్ని అరికట్టనంత వరకు - నేడు ప్రజల్ని భయంలో ముంచుతున్న బాధలు, యుద్ధంలో దారుణ మారణాలు తప్పవు. నేడు ప్రతి దేశం చిలుక పలుకులుగా పలుకుతున్న యుద్ధనివారణ, ప్రపంచ శాంతి అన్నీ ముసుగులో దాగిన బూటకాలు.

విప్లవమంటే ఈ పై అనర్థాలకు గురికాని, కార్మిక నియంతృత్వాన్ని అమోదించగలిగిన వ్యవస్థను స్థాపించడం. సామ్రాజ్యవాదం నుండీ, ధన స్వామ్యం నుండీ, యుద్ధాలనుండీ ప్రపంచ దేశాలన్నీ రక్షింపబడాలి.

ఇదే మా సిద్ధాంతం. ఈ సిద్ధాంత ప్రేరణతోనే మేం తీవ్రంగా హెచ్చరిస్తున్నాం.

# పెట్టుబడిదారీ దేశాల మధ్య యుద్ధాల అనివార్యత

స్టాలిన్

[కామ్రేడ్ స్టాలిన్ యీకింది విషయాల్ని 1952 ఫిబ్రివరిలో రాశారు. అప్పటి సోవియట్ యూనియన్ ప్రభుత్వం రాజకీయ అర్ధశాస్త్రాన్ని రాయడం కొరకు కొంత మంది శాస్త్ర వేత్తలను నియమించింది. వారు ఒక చిత్తుప్రతిని తయారుచేశారు. అది సోవియట్ అకాడమీలో చర్చించబడింది. ఆ చిత్తుప్రతినీ, దానిపై జరిగిన చర్చల సందర్భంలో వెల్లడయిన భిన్నాభిప్రాయాలను దృష్టిలో వుంచుకొని కామ్రేడ్ స్టాలిన్ రాజకీయ అర్ధశాస్త్రానికి పరిపుష్టిచేకూర్చే లక్ష్యంతో సమగ్ర విమర్శ రాశారు. అందులో సామ్రాజ్యవాదుల మధ్య వైరుధ్యం తప్పక యుద్ధాలకు దారితీస్తుందనే లెనిన్ సూక్తి సామ్రాజ్యవాదుల మధ్యగల వైరుధ్యం కంటే సామ్రాజ్యవాదానికీ సామ్యవాదానికీ మధ్య గల వైరుధ్యమే బలమైనదిగా తయారైన ఈనాడు వర్తిస్తుందా? యుద్ధాన్ని నివారించాలనే ప్రపంచశాంతి ఉద్యమం ఎంతో బలంగావున్న ఈనాడు సామ్రాజ్యవాదం బతికివున్నంత వరకు యుద్ధం అనివార్యమనే లెనిన్ సూక్తికి కాలం చెల్లలేదా? వగైరా విషయాలపై రాయబడ్డ భాగం ఒక అంశం. ఆ భాగాన్ని మాత్రమే ఇక్కడ అనువదించి ప్రచురిస్తున్నాం.

---

ఒకవేళ ప్రస్తుత ప్రభుత్వం సహజ గా వుప్పొంగుతూ పారే ఈ ప్రవాహాన్ని ఆపడానికి ప్రయత్నిస్తే ఆ అడ్డంకుల్ని త్రోసివేయడానికి శ్రామిక నియంతృత్వాన్ని స్థాపించడానికి, విప్లవ సిద్ధాంతాన్ని సాధించడానికి తిరుగులేని పోరాటం జరుపుతాం.

విప్లవం మానవుని జన్మహక్కు. స్వాతంత్ర్యం ప్రతివ్యక్తికి స్వంతహక్కు. నిజంగా సంఘాన్ని నిలపగలిగేది శ్రమశక్తి వొక్కటే. ప్రజాశ్రేయస్సే కార్యకర్తల అంతిమ లక్ష్యం కావాలి.

ఈ లక్ష్యాల కోసమూ, ఈ నమ్మకాలతోనూ ఎటువంటి బాధలైనా మేమాహ్వానిస్తాం. ఈ పరమ పవిత్రమైన విప్లవ కార్యం కొరకే యువకులమైన మేము— సమిధలుగా మమ్ము మేము అర్పించుకొంటూ— ఈ మహత్తర కార్యక్రమంలో ఎటువంటి త్యాగానికైనా సిద్ధంగా వున్నాం. రాబోయే విప్లవం కొరకు ఎదురు చూస్తున్నాం.

విప్లవం వర్ధిల్లాలి।

[భగత్‌సింగ్‌ను కోర్టులో జడ్జి "విప్లవమంటే ఏమిటి?" అంటూ ప్రశ్నించాడు. దానికి భగత్‌సింగ్ యిచ్చిన జవాబు కోర్టు రికార్డు నుండి తీసి యధాతధంగా పంజాబ్ యూనివర్సిటీ వారు ఇంగ్లీషులో ప్రచురించిన "భగత్‌సింగ్" జీవిత చరిత్రలో వెలువరించారు. దాని తెలుగు అనువాదమే పైవ్యాసం. అనువాదకుడు.]

(మార్చి 1974, సంచిక 54)

మూడవ ప్రపంచ యుద్ధాన్ని గురించి యీనాటికీ పలురకాల అభిప్రాయా లున్నాయి. పశ్చిమాసియాలోనో, ఆగ్నేయాసియాలోనో, మరో ప్రాంతంలోనో ఉద్రిక్తత హెచ్చినప్పుడల్లా, నేడో రేపో ప్రపంచ యుద్ధం ఆరంభం కాబో తున్నట్టూ, అలాంటి ఉద్రిక్తతలు కాస్త సడలిపోగానే ఇంతట్లో యుద్ధప్రమాదమే లేనట్టూ భావించే వారు యీనాటికీ చాలా మంది వున్నారు. అలానే యుద్ధాన్ని గురించి కామ్రేడ్ స్టాలిన్ రాసిన రోజున వున్న అభిప్రాయాలన్నీ యీనాటికీ విభిన్న రూపాల్లో వ్యక్తమవుతూనే వున్నాయి. ప్రత్యేకించి అమెరికా అధ్యక్షుడు చైనాయాత్ర కొనసాగించినప్పటి నుండీ యిక ఇంతట్లో మూడవ ప్రపంచ యుద్ధ ప్రమాదం లేనే లేదనే ధోరణి ప్రబలమయ్యింది. సామ్రాజ్యవాద పత్రికలన్నీ పనిగట్టుకొని అలాంటి అభిప్రాయాన్ని కల్పించే వాతావరణం సృష్టించడంలో రాజకీయాలు లేకపోలేదు. అంతేకాదు, ఒకవేళ యుద్ధమే రావడ మంటూ జరిగినా సామ్రాజ్యవాదుల మధ్య జరగడం అసంభవమనీ, ఒకవేళ జరిగితే ప్రపంచ సామ్రాజ్యవాదుల కూటమికీ చైనాకు మధ్యనే జరుగుతుందనే అభిప్రాయం కూడా తగినంత బలంగానేవుంది. ప్రపంచంలో వివిధ సామ్రాజ్యవాద దేశాలమధ్యా ముఖ్యంగా సోవియట్, అమెరికా సామ్రాజ్యవాద దేశాల మధ్యా, మరోవైపు చైనాకీ తదితర సామ్రాజ్యవాద దేశాలకు మధ్యా జరుగుతున్న సంప్రదింపులూ, వ్యాపార ఒడంబడికలే అలాంటి అభిప్రాయాలకు ప్రాతిపదిక. యుద్ధాలను గురించిన మార్క్సిస్టు అవగాహన లోపించడం వల్లనూ, పైకి అంతా సజావుగానే కనిపిస్తున్న వాతావరణాన్ని మాత్రమే చూస్తూ దాని వెనుకనున్న వైరుధ్యాలలోతును పరిశీలించే గతితార్కిక దృష్టి లోపించడంవల్లనూ అలాంటి అవాస్తవికమైన అంచనాలు రూపొందుతున్నాయి. వివిధ సామ్రాజ్యవాద దేశాలమధ్యగల వైరుధ్యాలను గురించి 1952లో కామ్రేడ్ స్టాలిన్ ఊహించిన అభిప్రాయాలు చాల వాస్తవమని యీనాడు కళ్ళకుకట్టినట్టు రుజువ వుతుంది. జర్మనీ, జపాన్‌లు అమెరికా ఇనపపాదాల నుండి బయటపడి మార్కెట్ల కొరకు దానితో ఎంతో బలంగా పోటీపడుతున్నాయి. అలానే ఫ్రాన్సు వగైరా సామ్రాజ్యవాద దేశాలు కూడ మార్కెట్ల పంపకం కొరకు అమెరికాతో పోటీపడు తున్నాయి. వెనుకబడ్డదేశాల నుంచి ముడిసరుకుల్ని చవకగా కొనేయడానికీ గ్యారంటీ అయిన మార్కెట్లను సంపాదించుకోవడానికీ అరబ్బుదేశాలలోని నూనె వనరులను తమ స్వప్రయోజనాలకు ఉపయోగించు కోవడానికి సామ్రాజ్యవాద దేశాలన్నీ ఒకదాని తో ఒకటి తీవ్రాతి తీవ్రంగా పోటీపడుతున్నాయి. ప్రపంచమంతటా పలుకుబడి విస్తరణ ప్రాంతాలు ఏర్పరచుకోడానికి ఎన్నడూ లేనంత తీక్షంగా ప్రయత్నిస్తున్నాయి.

ఒక వైపున శాంతిని గురించి ఒకరినిమించి మరొకరు పెద్దపెద్ద ఉపదేశాలు చేస్తూనే, మరోవైపు తమ దేశాలలో ఆయుధసైనిక శక్తిని పెంచుకోడానికి ఒకరితో మరొకరు పెద్ద ఎత్తున పోటీపడుతున్నారు. సామ్రాజ్యవాదుల మధ్యగల అంతర్గత వైరుధ్యం, సోషలిస్టు ప్రపంచానికీ, సామ్రాజ్యవాదానికీ మధ్యగల వైరుధ్యం నానాటికీ తీవ్రతర మవుతున్న పర్యవసానం ఎలా వుంటుందీ, ఆ పరిస్థితుల్లో అనుదినం పురోగమిస్తున్న ప్రపంచ విప్లవశక్తులు ఏ మార్గం అవలంబించాల్సి వుంటుంది అనే విషయాన్ని నిర్ణయించుకోడానికిగాను శాస్త్రీయమైన ఆలోచనా విధానాన్ని కల్గించడానికి తోడ్పడుతుందనే ఉద్దేశ్యంతో కామ్రేడ్ స్టాలిన్ రాసిన "సోవియట్ యూనియన్‌లో సోషలిజానికి సంబంధించిన ఆర్థిక సమస్యలు" అన్న పుస్తకంలో నుండి పైవిషయానికి సంబంధించిన యీ భాగాన్ని అనువదించి ప్రకటిస్తున్నాం. – సంపాదకుడు]

రెండవ ప్రపంచయుద్ధం తరువాత నూతన అంతర్జాతీయ పరిస్థితులు తల ఎత్తడం వలన పెట్టుబడిదారీ దేశాలమధ్య యుద్ధాలు యింకెంత మాత్రమూ అనివార్యం కాదని కొందరు కామ్రేడ్స్ భావిస్తున్నారు. పెట్టుబడిదారీ దేశాల మధ్యమన్న వైరుధ్యాల కంటె సోషలిస్టు శిబిరానికీ పెట్టుబడిదారీ ప్రపంచానికీ మధ్యనున్న వైరుధ్యాలే తీవ్రతరమైనవి. తక్కిన పెట్టుబడిదారీ దేశాలను తగినంతమేరకు అమెరికా తన ప్రాబల్యంలోనికి తెచ్చుకొన్నది. అందుచేత అవి తమలో తాము యుద్ధానికి దిగి పరస్పరం బలహీనపరుచుకోవడం అనేది నివారింపబడింది. అగ్రశ్రేణి కాపిటలిస్టు మేధావులు రెండు ప్రపంచయుద్ధాల నుండి అవి యావత్తుపెట్టుబడిదారీ ప్రపంచానికి తెచ్చిపెట్టిన వినాశనం నుండి గుణపాఠాలు నేర్చుకున్నారు. అందుచేత పెట్టుబడిదారీ దేశాలను తమలో తాము యుద్ధానికి దింపడానికి వారు సాహసించరు. ఈ కారణాలన్నింటివలన పెట్టుబడిదారీ దేశాలమధ్య యుద్ధాలు ఇంకెంత మాత్రమూ అనివార్యంకాదని వారు అనుకుంటున్నారు.

ఈ కామ్రేడ్సు పొరపాటు పడుతున్నారు. వారు పైపై విషయాలను మాత్రమే చూస్తున్నారు. బలీయమైన అసలు శక్తులను వారు గమనించడంలేదు. ఇప్పటి వరకు సూక్ష్మరూపంలో పనిచేస్తున్నప్పటికీ సంఘటనల పరిణామాన్ని నిర్ణయించేది అవి మాత్రమే.

పైపై చూపులకు అంతా సజావుగానే సాగిపోతున్నట్లుగా కనిపిస్తుంది. పశ్చిమ యూరప్, జపాన్, తదితర పెట్టుబడిదారీ దేశాలపై అమెరికా కొన్ని పరిమితులను విధించింది. పశ్చిమ జర్మనీ, ఫ్రాన్సు, ఇటలీ, జపాను– అమెరికా చేతుల్లో చిక్కి

దాని ఆజ్ఞలకు శిరసావహిస్తున్నాయి. అయినా ఎల్లకాలము ఇలాగే సాగిపోతుందని అనుకోవడంగానీ, యీ దేశాలు అమెరికా పెత్తనాన్ని, పీడనను ఎల్లకాలం సహిస్తా యనిగానీ, అమెరికా బంధాలను తెంపుకొని, స్వేచ్ఛాభివృద్ధి పంథాను చేపట్టవనిగానీ అనుకోవడం పొరపాటు.

ఉదాహరణకు మొదట బ్రిటను, ఫ్రాన్సులను తీసుకుందాం. నిస్సంశయంగా అవి సామ్రాజ్యవాద దేశాలు. చౌక ధరలకు ముడిసరుకులు, నమ్మకమైన మార్కెట్లు వాటికి నిస్సంశయంగా ముఖ్యాతిముఖ్యమైన విషయాలు. ఇప్పుడేం జరుగుతున్నది? "మార్షల్ ప్లాను సహాయం" ముసుగులో బ్రిటన్, ఫ్రాన్సుల ఆర్థిక వ్యవస్థలలోకి అమెరికావారు చొచ్చుకొని వస్తున్నారు. వాటిని అమెరికా వ్యవస్థకు అనుబంధంగా తయారుచేయాలని ప్రయత్నిస్తున్నారు. బ్రిటిష్, ఫ్రెంచి వలసలలో అమెరికా పెట్టుబడి ముడిసరుకులకు మార్కెట్లను వశపరచుకొంటున్నది. తద్వారా బ్రిటిష్, ఫ్రెంచి కాపిటలిస్టుల అధిక లాభాలకు ప్రమాదం ముంచుకొచ్చింది. ఈ పరిస్థితిని వారు ఎల్ల కాలం సహిస్తారని ఊహించగలమా? పెట్టుబడిదారీ బ్రిటను, తదుపరి పెట్టుబడిదారీ ఫ్రాన్సు అమెరికా విషకౌగిలి నుండి విడివడి ఒక స్వతంత్ర ప్రతిపత్తిని సాధించు కోవడానికి, అంటే అధిక లాభాల కొరకు, దానితో సంఘర్షణలోనికి దిగుతాయని అనుకోవడం వాస్తవానికి దగ్గరగా లేదా?

ఇక ముఖ్యమైన ఓడిపోయినదేశాలు జర్మనీ, జపానుల విషయం చూదాం. ఈనాడు అవి అమెరికా సామ్రాజ్యవాదపు యినుప పాదాలకింద నలిగిపోతున్నాయి. ఆ దేశాలలోని పరిశ్రమలు, వ్యవసాయం, వ్యాపారం, అంతర్గత విదేశాంగ విధానాలు, ఆ మాటకువస్తే వాటి జీవితం యావత్తూ అమెరికా ఆక్రమణ "ప్రభుత్వ"పు కోరికలకు అనుగుణంగా మలచబడుతున్నాయి. కాని కొద్దికాలం క్రితం అవి యూరపు, ఆసియా లలో బ్రిటన్, అమెరికా, ఫ్రాన్స్‌ల ఆధిపత్యాన్ని సవాలు చేసిన బ్రహ్మాండమైన సామ్రాజ్యవాద దేశాలు. ఈదేశాలు మళ్ళీతలఎత్తి నిలబడవనీ, అమెరికా "ప్రభుత"ను ధ్వంసం చేయడానికి ప్రయత్నించవనీ, స్వేచ్ఛాభివృద్ధి మార్గాన్ని చేపట్టవనీ అను కోవడం అద్భుతాలను విశ్వసించడమే అవుతుంది.

పెట్టుబడిదారీ దేశాల మధ్యనున్న వైరుధ్యాల కంటె పెట్టుబడిదారీ విధానానికీ, సోషలిజానికీ మధ్యనున్న వైరుధ్యమే బలవత్తరమైనదని అంటున్నాం. సిద్ధాంత రీత్యా బహుశా అది నిజమే కావచ్చును. అది యీనాడే కాదు రెండవ ప్రపంచ యుద్ధానికి పూర్వం కూడా సత్యమే. పెట్టుబడిదారీ దేశాల నాయకులు ఏదో కొంత

మేరకు దానిని ఆచరణలో సాధించారుకూడా. అయినప్పటికీ, రెండవ ప్రపంచయుద్ధం రష్యాతో యుద్ధంగా మొదలుకాలేదు. పెట్టుబడిదారీ దేశాల మధ్య యుద్ధంగానే ప్రారంభమైంది. ఎందుచేత? ఒకటి, కాపిటలిస్టు వ్యవస్థకు, సోషలిస్టు దేశమైన రష్యాతో యుద్ధం, పెట్టుబడిదారీ దేశాల మధ్య యుద్ధం కంటె ప్రమాదకరమైనది. ఎందుచేతనంటే పెట్టుబడిదారీ దేశాల మధ్య యుద్ధంలో ఇతర దేశాలపై కొన్ని పెట్టుబడిదారీ దేశాల ఆధిక్యత సమస్య అవుతుంది. రష్యాతో యుద్ధం అంటే పెట్టుబడిదారీ వ్యవస్థ యొక్క ఉనికియే సమస్య అవుతుంది. రెండు పెట్టుబడిదారులు తమ ప్రచారం నిమిత్తం సోవియట్ యూనియన్ దురాక్రమణ పూరిత స్వభావాన్ని గురించి అల్లరి చేస్తున్నప్పటికీ అది దురాక్రమణ పూరితమైనదని వారే భావించడం లేదు. సోవియట్ యూనియన్ శాంతియుత విధానం వారి గమనంలో వుంది. అది తనంతటతాను పెట్టుబడిదారీ దేశాలపై దాడి చేయదని వారెరుగుదురు.

ఈనాడు కొందరు కామ్రేడ్స్ జపాను, జర్మనీల పని అయిపోయిందని భావిస్తున్నట్లుగానే మొదటి ప్రపంచయుద్ధం ముగిసినతర్వాత జర్మనీ పనిఅయిపోయిందని అనుకోవడం జరిగింది. అమెరికా యూరపును చెప్పుచేతల్లో ఉంచుకుంటున్నదనీ, జర్మనీ మళ్ళీ తలయెత్తుకొని నిలబడజాలదనీ, పెట్టుబడిదారీ దేశాల మధ్య యుద్ధం ఇక జరగదనీ పత్రికల్లో గొడవగొడవగా రాశారు. అయినప్పటికీ జర్మనీ తన బంధాలను తెంచుకొని స్వేచ్ఛాభివృద్ధి మార్గాన్ని చేపట్టి, ఓటమి తర్వాత పదిహేను సంవత్సరాల కాలంలోనే ఒక బలీయమైన శక్తిగా తయారయ్యింది. ఇక్కడొక ముఖ్యమైన విషయమేమంటే జర్మనీ ఆర్థికంగా కోలుకోవడానికీ యుద్ధానికి సంబంధించిన ఆర్థిక వనరులను యితోధికం చేసుకోవడానికీ సహకరించింది బ్రిటన్, అమెరికాలే. బ్రిటన్, అమెరికాలు జర్మనీ ఆర్థిక పునరుజ్జీవనానికి సహాయం చేసింది యీ విధంగా కోలుకొని బలపడిన జర్మనీని సోవియట్ యూనియన్‌పైకి ఉసిగొల్పడానికి, అంటే సోషలిస్టు మాతృభూమికి వ్యతిరేకంగా ఉపయోగించే ఉద్దేశ్యంతో మాత్రమే. అయితే జర్మనీ ప్రప్రథమంగా తన బలగాలను ఇంగ్లండ్ - ఫ్రాన్సు - అమెరికా సంఘటనపై కేంద్రీకరించింది. హిట్లరు జర్మనీ సోవియట్ యూనియన్‌పై యుద్ధం ప్రకటించినపుడు యీ ఇంగ్లండు - ఫ్రాన్సు - అమెరికా సంఘటన హిట్లరు జర్మనీతో చేరడం అటుంచి, దానికి వ్యతిరేకంగా రష్యాతో ఐక్యసంఘటనలో చేరవలసి వచ్చింది.

తత్ఫలితంగా కాపిటలిస్టు ప్రపంచానికీ, సోషలిస్టు శిబిరానికీ మధ్యనున్న వైరుధ్యంకంటె మార్కెట్లకొరకు పెట్టుబడిదారీ దేశాల పోరాటం తమ ప్రత్యర్థులను నాశనం చేయాలనే కాంక్ష బలవత్తరమైనదని ఆచరణలో తేలిపోయింది.

ఐనప్పుడు జర్మనీ, జపాను దేశాలు మళ్ళీలేచి నిలబడవనీ అమెరికా బంధాలను బద్దలుచేసుకొని స్వతంత్ర జీవనం సాగించడానికి ప్రయత్నించవనీ గ్యారంటీ ఏమున్నది? అటువంటి గ్యారంటీ యేమీలేదనే అనుకుంటాను.

అందువలన పెట్టుబడిదారీ దేశాలమధ్య యుద్ధాలు అనివార్యం అనే వాదం నిలబడుతుంది.

శాంతిని పరిరక్షించడానికీ, మరో ప్రపంచయుద్ధానికి వ్యతిరేకంగానూ యీనాడు బలీయమైన శక్తులు ముందుకు వచ్చాయి కాబట్టి సామ్రాజ్యవాదం అనివార్యంగా యుద్ధాలకు దారితీస్తుందనే లెనిన్ సిద్ధాంతానికి కాలం చెల్లిందని అంటున్నారు. అది వాస్తవం కాదు.

ఈనాటి శాంతి ఉద్యమం లక్ష్యం శాంతిని కాపాడడానికి, మరో ప్రపంచ యుద్ధాన్ని నివారించడానికిగాను విస్తృత ప్రజానీకాన్ని పోరాటానికి సంసిద్ధంచేయడం. అందుచేత యీ ఉద్యమం లక్ష్యం పెట్టుబడిదారీ వ్యవస్థను కూలద్రోసి సోషలిజాన్ని స్థాపించడం కాదు. శాంతిని కాపాడాలనే ప్రజాస్వామిక లక్ష్యానికి అపరిమిత మవుతుంది. ఈ విషయానికి సంబంధించి యీనాటి శాంతి ఉద్యమానికి మొదటి ప్రపంచ యుద్ధంనాటి ఉద్యమానికీ తేడావుంది. ఆనాడు సామ్రాజ్యవాద యుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చడం మనలక్ష్యం. అది సోషలిస్టు లక్ష్యాన్ని నెరవేర్చడానికి కృషి చేసింది.

కొన్ని పరిస్థితులలో యీ శాంతి పోరాటం అక్కడక్కడ సోషలిజం కొరకు పోరాటంగా పరిణమించవచ్చును. ఐతే అప్పుడు అది యీనాటి శాంతి ఉద్యమంగా ఉండదు. అది పెట్టుబడిదారీ వ్యవస్థను కూలద్రోసే ఉద్యమమవుతుంది.

బహుశా జరగబోయేదేమంటే శాంతిని కాపాడే ఉద్యమంగా నేటి శాంతి ఉద్యమం జయప్రదమయినట్టయితే ఒక ప్రత్యేకమయిన యుద్ధం నివారింపబడుతుంది. లేకపోతే అది తాత్కాలికంగా వాయిదా పడవచ్చును. ఏదైనా ఒక నిర్దిష్టమైన ప్రాంతంలోనో, దేశాల మధ్యనో శాంతిని కాపాడగలగవచ్చును. ఎక్కడైనా అధికారంలోని యుద్ధోన్మాద ప్రభుత్వం రాజీనామాచేసి దాని స్థానంలో తాత్కాలికంగా శాంతిని కాపాడడానికి సిద్ధపడిన ప్రభుత్వం అధికారంలోనికి రావచ్చును. అది జరిగితే మంచిదే. చాలా మంచిది కూడా. అయినప్పటికీ పరిస్థితిలో మార్పురాదు. పెట్టుబడిదారీ దేశాలమధ్య యుద్ధాలు అనివార్యంగా వచ్చే అవకాశాన్ని అది రూపుమాపజాలదు.

ఎందుచేతనంటే శాంతి ఉద్యమం ఎన్ని విజయాలు సాధించినప్పటికీ సామ్రాజ్యవాదం జీవించే ఉంటుంది. అందువలన యుద్ధాల అనివార్యత కూడా వాస్తవంగానే ఉంటుంది.

యుద్ధాల అనివార్యతను తొలగించాలంటే, సామ్రాజ్యవాదాన్ని రూపుమాపడం ఎంతైనా అవసరం.
ఫిబ్రవరి 1, 1952.

(సెప్టెంబర్ 1973, సంచిక 48)

[హిట్లర్ ఫాసిజం తెచ్చిపెట్టిన రెండో ప్రపంచయుద్ధాన్ని సామ్యవాద ప్రజల విజయాన్ని త్వరితం చేసే ప్రజాయుద్ధంగా మార్చిన సోవియట్ 'ఎర్రసైన్యం' నాయకుడు స్టాలిన్ శతజయంతి సంవత్సరమిది. కంపూచియాపై రష్యా ప్రోత్సాహంతో వియత్నాం దురాక్రమణ, అఫ్ఘనిస్తాన్‌పై రష్యా దురాక్రమణ మూడో ప్రపంచయుద్ధప్రమాదాన్ని మరింత తీవ్రంగా శాంతి కాముకులైన ప్రజల ముందు సవాల్‌గా నిలిపిన తరుణం.

అందువల్ల ఈ వ్యాసాన్ని ఈనాడు మరింత శ్రద్ధగా చదవాల్సిన అవసరం వున్నది — 'సాహితీ మిత్రులు'. 20-3-80]

---

"రెండో ప్రపంచ యుద్ధం తరవాత ప్రపంచ విప్లవం బాగా అభివృద్ధిచెందడం వల్ల సామ్రాజ్యవాదం ఎత్తుగడలు మార్చుకుంది. శ్రామికవర్గం అధికారానికి రానిచోట లంచాలిచ్చి జోక్యం కల్పించుకోవడం, శ్రామికవర్గం అధికారానికివస్తే కూలదోయడం, చాపకింద నీరులా చొచ్చుకుపోవడం ఇలాంటి పనులన్నీ బూర్జువావర్గం చేస్తూంది. సైనిక చర్యలు, సాయుధ దండయాత్ర, రాజకీయ కుతంత్రం ఇవీ వాళ్ల నయావలస విధానాలు. విద్రోహులకు, కీలుబొమ్మలకు లంచాలిచ్చి పరోక్షంగా వలసపాలన సాగించడం, లేదా సైనిక సాయం, ఆర్థిక సాయం ముసుగుల్లో విదేశాలకు సరుకులు గుప్పించి, పెట్టుబడులుపెట్టి బడుగు దేశాలను ఆర్థికంగా దోపిడీచేసి, సైనికంగా ఆర్థికంగా అదుపుచేయడం, లేదా ఇతర దేశాలను తమ మీద సొంతం ఆధారపడేటట్టు చేయడం ఇవీ సామ్రాజ్యవాదులుచేసే పనులు. ప్రజలను బానిసలుగాజేసి, ప్రపంచాధిపత్యం సంపాదించి, వలసపాలన కొనసాగించేందుకు సామ్రాజ్యవాదులు ఎలాంటి కుతంత్రాలయినా, కుట్రలయినా చేస్తారు. సామ్రాజ్యవాదులు ఎన్నిరకాల కొత్తకొత్త ఎత్తులెత్తినా దోపిడి అనేది పోరాటాన్ని, పీడన అనేది ప్రతిఘటనను రగుల్కొల్పక మానవు. వాళ్లు దురాక్రమణకు దిగినందువల్ల తమ మెడకు తామే ఉచ్చు బిగించుకుంటున్నారు. వెధవ పనులు ఎక్కువ చేసినకొద్దీ ఉచ్చు మరింత బిగుస్తుంది. వాళ్ల ఘాతుకాలన్నీ వాళ్లకు త్వరలోనే గోరీకట్టడానికి దారితీస్తాయి. ఎక్కువకాలం మనలేవు.

("ప్రపంచ చరిత్ర ఎందుకు చదవాలి?" నుంచి— మార్చి 1978, సంచిక 77)

# ఎక్స్-రే ....

సృజనలో సమీక్షలు తక్షణంగా, మొక్కుబడిగా, స్వీకారంగా వచ్చేవికావు. ఆలోచనలను మరగనిచ్చి నిష్కర్షగా సమగ్రంగా వచ్చేవి.

సృజన సమీక్షలు మంచి పుస్తకాల పరిచయాలు, చెడ్డపుస్తకాల ఖండనలు. మంచి ధోరణులను, ఆలోచనలను, దృక్పథాలను వెలుగులోకి తెచ్చి అభివృద్ధి నిరోధక కుహనా అభ్యుదయ, విప్లవ వ్యతిరేక భావాలను నిశితంగా విమర్శించడం సృజన సాధారణ పాలసీ.

శ్రీశ్రీ ఖడ్గసృష్టిపై, సృజనలో సమీక్ష సమీక్ష సమీక్షల వరస కొనసాగి వినూత్న సంప్రదాయాన్ని నెలకొల్పింది. (కె.వి. రమణారెడ్డి, త్రిపురనేని వెంక టేశ్వరరావు ఫిబ్రవరి 67, ఫిబ్రవరి 68, ఆగస్టు 68, మే 69, ఆగస్టు 69 సంచికలు 2, 6, 8, 11, 12)

దిగంబర కవితా ఉద్యమంపై సృజన అంచనాలే నాటికీ నేటికీ ఆ ఉద్యమంలోని విధ్వంస - నిర్మాణ అంశాలను, విశృంఖల, విప్లవ లక్షణాలను, నెల్లును పొల్లును సరిగా బేరీజు వేశాయి. (దిక్కుల నడుమ ధిక్కారం - దిగంబర కవితా సమీక్ష కె.వి. రమణారెడ్డి ఫిబ్రవరి 67 సంచిక 2, దిగంబర కవులు సంపుటి 3 పాములపర్తి సదా శివరావు నవంబర్ 68 సంచిక 9)

పైగంబర కవులపై సిఎ. జగన్మోహన్ సందేహం సరియైనదని కాలం రుజువు చేసింది. (పైగంబర కవులు విప్లవ కవులా ? జూన్ / జూలై 71 సంచిక 21/22)

"పేదప్రజల పక్షాన నిలిచి" (కె. కృష్ణమూర్తి మే 1970 సంచిక 15) "సాయుధ కవితోద్యమానికి పిలుపు" (అదే సంచికలో ఆర్. వి. బి. శర్మ) ఇచ్చిన కవులుగా "తిరుగబడు" కవులను పరిచయం చేసింధి కూడ సృజనయే.

అప్పటి నుంచి ఇప్పటి దాకా విప్లవ కవితోద్యమంలో పేర్కొనదగిన ప్రతి కవినీ, కవిత్వాన్నీ, దళనూ సృజన పరిచయం చేసింది.

"అభ్యుదయ" అనుభూతి, అకాడమీ కవులను సృజన 'విశ్లేషించింది'. శ్రీరంగం నారాయణబాబు "రుధిరజ్యోతి" సమీక్ష (సెప్టెంబర్ 1972, సంచిక 36) సమీక్షగానే కాకుండా నారాయణబాబును అడ్డంపెట్టుకొని విప్లవ సాహిత్యోద్యమం మీద శ్రీశ్రీ మీద బురదజల్లడానికి ప్రయత్నించిన అందరిమీద గట్టి offence (ఎదురుదాడి) లాగున్నది.

మరీ ముఖ్యంగా పేర్కొనదగినవి "చేతనా వర్తం‌పై వి.సి. మౌళి (ఫిబ్రవరి 68 సంచిక 6) రంధిసోమరాజు "ఎదగండి" (సోమరాజుగారూ ఎదగండి అక్టోబర్ 71 సంచిక 25) "బూర్జువా పెళ్ళికూతురు" (వెండిచెంబు కాలేని కుండపెంకు ఆగస్టు 73 సంచిక 47) కావ్యాలపై 'వియ్యన్న' సమీక్షలు. "చేతనావర్తం"లో ఆధునిక

చేతనగాని దానికొక ఆవర్తంగాని లేదని వాళ్ళ మాటలతోనే తేల్చిచెప్పాడు వి.సి. మౌళి. కుళ్ళు మనస్తత్వంతో విప్లవ కవితోద్యమాన్ని, శ్రీశ్రీని "అలగా" జనం భాషలో, భావాల్లో ఎత్తిపొడుస్తున్నానను కొన్న కవిని ఆయనకు ఆమైమరపులో సర్టిఫికెటు ఇచ్చిన "ప్రజాస్వామ్య" "అభ్యుదయ" రచయితలను వ్యంగ్యంగా నిశితంగా శాస్త్రీయంగా విప్పిచూపాడు వియ్యన్న.

1973లోనే నగ్నముని "విలోమ" "సృష్టి"ని దూరదృష్టితో "తూర్పుగాలి" కెరటాల్లోనే దాగిన చెడుగాలిగా గమనించింది సృజన సమీక్ష. (మార్చి / ఏప్రిల్ సంచిక 42 / 43).

"యజ్ఞం" (అక్టోబర్, నవంబర్ 71 సంచికలు 25, 26) కథలపై, "అడివంటుకుంది" కథలపై (ఫిబ్రవరి 74 సంచిక 53) శ్రీపతి "భూషణం కథలు" (డిసెంబర్ 72, సంచిక 39) పై చలసాని ప్రసాదరావు "పుణ్యభూమీ కళ్ళుతెరు"పై బొజ్జాతారకం (జనవరి 73 సంచిక 40) పరిశీలనలు సమగ్రంగాను విమర్శనాత్మకంగాను ఉన్నాయి.

సాహిత్యవిమర్శ గ్రంథాలపై సృజనలో వచ్చిన సమీక్ష చాల తక్కువ. ఆ లోటు కొంచెం పూరించింది విరసం సాహిత్యవిమర్శ ప్రసంగవ్యాసాలు ప్రచురించిన జనవరి 1980, సంచిక 99 సృజన.

అనువాద గ్రంథాలను సృజన సమీక్షించిన తీరు అన్నిటికన్న పాఠకులకు ఎక్కువ ప్రయోజన కారిగా రుజువయింది. పాఠకులకు ప్రపంచ విప్లవోద్యమ చరిత్ర తెలుసుకోవడానికి, అంతర్జాతీయ శ్రామికవర్గ చైతన్యమూ, త్యాగ స్వభావమూ అలవరుచుకోవడానికి తోడ్పడినవి.

ఐతే ఇవన్నీ ఒక ఎత్తు- సిద్ధాంత గ్రంథాలలోని సారాన్ని అవి ఇంగ్లీషువైనా అనువాదాలైనా కొడవటిగంటి కుటుంబరావు పరిచయం చేసిన తీరు ఒక ఎత్తు. ఆయా పుస్తకాలలోని సారాన్ని సులభమైన సూటియైన మాటల్లో పాఠకులకు అందించడమే. ఈ పద్ధతి పాఠకులను బాగా ఆకట్టుకొని educate చేసింది.

పత్రికకు ఆ పత్రిక దృక్పథాన్ని ఆకళించుకొని, దానిని ప్రతిబింబించే సమీక్షకుడుండాలి. సమీక్షకు పుస్తకాలు రాగానే ఆయా సమీక్షకులకు పంపించి వారి నుంచి సమీక్షల కొరకు నిరీక్షించడం తప్ప సృజనకు అవసరమైన పుస్తకాలను సకాలంలో సమీక్ష చేయించే నిర్మాణం లేదు. సమీక్షల విషయంలో సృజన కొక పాలసీవున్నది. ప్రజోపయోగకరమైన సాహిత్యాన్ని ఆలోచనలను ప్రోత్సహిస్తూ, ప్రమాదకరమైన సాహిత్యాన్ని ఖండిస్తూ పాఠకులకు హితమేదో, విహితమేదో చెప్పడమే సమీక్ష లక్ష్యం కావాలన్నది ఆ పాలసీ. హితాహితాలను ఎన్నిక చేయగల నిర్మాణం వుంది గానీ వెనువెంటనే వివరించగల వేగం లేదు. ఆ వేగాన్ని ఇప్పటి నుంచైనా సృజన అందుకుంటుందని ఆశిద్దాం.

పేద ప్రజల పక్షాన నిలచిన

# తిరుగబడు కవులు

కె. కృష్ణమూర్తి

ఇది సమాజ పురోగమనాన్ని అడ్డుకొనే శక్తుల సింహాసనాలక్రింద డైనమైట్లు ప్రేలుతున్న కాలం. పాతసామాజిక శక్తులు గుండెలు పగిలి రక్తం కక్కుతుంటే-నూతన శక్తులు విప్లవ జ్వాలల్ని విరజిమ్ముకుంటూ విజృంభిస్తున్న కాలం.

సమాజంలో దోపిడి గర్భంనుంచే హింసపుట్టింది. అన్ని కాలాల్లోనూ దోపిడీ శక్తులు హింసను ఒక కళగా అభివృద్ధిపరిచాయి. దీనికి విరుగుడుగానే, దీని నుండే ప్రతిహింస పుట్టింది. హింసను ప్రతిఘటించే క్రమంలో, అది అభివృద్ధి చెందుతూ వచ్చింది.

విశాల జనంపై హింసను రుద్దే అల్పసంఖ్యాకులను, 'అహింసామూర్తులు'గా వారిని ప్రతిఘటించే ప్రజలను 'హింసావాదులు'గా కొందరు చిత్రించడం- అదే సందర్భంలో ప్రజల ప్రతిఘటనను విప్లవ పంథాగా, వారిపై సాగే దాడిని విప్లవ ప్రతిఘాతకచర్యగా గుర్తించడం చరిత్ర పుటల్నిండా కన్పిస్తుంది.

ఈ రెండూ భిన్న దృక్పథాలుగా వుండడం, వీటిమధ్య నిర్విరామంగా ఘర్షణ సాగడం, అంతిమంగా ప్రజలపక్షం నెగ్గడం చూస్తాం.

మన దేశంలో, కొన్ని ప్రాంతాల ప్రజలు చేబడ్తున్న విప్లవ మార్గాన్ని సమర్థించడానికి సాహితీరంగంలో కొన్ని శక్తులు మన రాష్ట్రంలో గొంతువిప్పుతున్నాయి, జనంలో జ్వలిస్తున్న వీరత్వాన్ని కీర్తించి, వారి విప్లవ పంథాకు నైతిక పుష్టినిచ్చి వుత్తేజపరచడానికి ఈ శక్తులు తమ సృజనాత్మక సాధనాలను సంధిస్తున్నాయి. దీని వెన్వెంటనే ప్రజల విప్లవ పంథానుమయ్యాబట్టడానికి, కొత్త గొంతులను నొక్కివేయడానికి కొన్ని కీచు గొంతుకలు రంగంమీదకు వస్తున్నాయి.

ఈ స్థితిలో ప్రజలవైపున వారికోరకు గొంతులు విచ్చే శక్తుల వైపున నిలవడం ప్రగతిశీలుర ప్రాథమిక కర్తవ్యం.

సాహితీరంగంలోని ఈ కొత్తగొంతుల్లో "తిరుగబడు కవులు' ఒకరు.

ఇక్కడొక విషయాన్ని గ్రహించాలి.

ప్రజలకు సంబంధించిన ఒక విప్లవ సిద్ధాంతమూ- ఆ సిద్ధాంతాన్ని అమలుజరపగల నిర్మాణరూపమూ సామాజిక విప్లవాల విజయానికి కీలకమైనవి. అదే విధంగా విప్లవ దృక్పథాలనూ, కార్యాచరణలనూ ప్రచారంలోపెట్టి, ప్రజలను వుత్తేజపరచ

దంలో సాహితీ, సాంస్కృతిక సాధనాలు ముఖ్యపాత్ర వహిస్తాయి. ఈ రెండు రంగాలూ సామాజిక విప్లవాల విజయానికి అత్యవసరమైనవి. ఒకటి కీలకమైనది. రెండవది దానికి సహాయభూతమైన అత్యవసర సాధనం.

ఈ దృష్టితో చూచినప్పుడు తిరుగబడు కవుల కృషికిగల ప్రాధాన్యతను అర్థం చేసుకోగలం.

తిరుగబడు కవులు పీడిత ప్రజల కొరకు, వారి విముక్తిని కాంక్షిస్తూ కలం పట్టారన్నది నిర్వివాదాంశం.

సంకలనంలో ప్రవేశికలో యువతరానికి యిచ్చిన పిలుపులో స్వరాజ్యం, ప్రజా స్వామ్యం, సామాన్యుడు, అతనికీగల స్వాతంత్ర్యం, విద్యా విధానం, రాజ్యాంగం, దోపిడీ, మతం తదితర అంశాలపట్ల వ్యక్తపరచబడిన భావాలన్నీ దేశ విప్లవ ప్రజా సీకం యొక్క భావాలకు స్థూలంగా సన్నిహితమైనవి. ప్రవేశికలో ప్రజల తిరుగు బాటు తత్వాన్ని, వారి గెలుపు అనివార్యతను స్పష్టంగా చూశారు. 'అరణ్యాల్లో, కొండకోనల్లో, చెట్లల్లో, పొదల్లో కార్చిచ్చుల్లా రాజుకుంటున్న జ్వాలల్ని' చూడడం ద్వారా సమకాలీన పరిస్థితులపట్ల వాస్తవిక దృక్పథాన్ని ప్రదర్శించారు. విప్లవ జ్వాలల్ని పంచడానికి హస్తాలు చాచడం ద్వారా విప్లవ మార్గం పట్ల స్పష్టంగా Commit అయ్యారు.

పీడిత ప్రజల కొరకు వ్రాయబడిన ఈ కవితలు ఈ వర్గాలకు చేరతాయా? అన్న అంశాన్ని లోతుగా పరిశీలించాల్సి వుంటుంది. ఈ పరిశీలన వీరికి మాత్రమే పరిమితం కాదు. విప్లవ పోరాటాలను, భావాలను బలపరుస్తూ నేడువస్తున్న కవిత లన్నింటిలోనూ ఒక లక్షణం కన్పిస్తున్నది. అది, ఆ కవితలు ప్రధానంగా పీడిత వర్గాల గూర్చి వ్రాయబడ్డాయి. సరిగ్గా ఈ వర్గాలకే కవితలు చేరవు. కనీసం సాధారణ రాజకీయ కార్యకర్తలకైనా అవి చేరవు. ఈ కవితలను ప్రజలకు ఎవరో చదివిపెట్టినప్పటికీ ఆ కవితల్లోని భావాలనర్థం చేసుకొనడానికి ప్రజల సాధారణ భాషా పరిజ్ఞానం చాలదు. అందితే_ అవి ప్రజలకు ఆకర్షణీయమైన రూపంలో (Form) వుండవు. ఇది నేడు విప్లవ సాహిత్యానికీ_ప్రజలకూ మధ్య నున్న ప్రధాన వైరుధ్యం. ఈ అంశాన్ని ఆత్మ విమర్శనా దృక్పథంతో పరిశీలించడం విప్లవ కవుల కర్తవ్యం.

రచనా విధానం (Form) సమస్య ముఖ్యాంశం. వచన కవితా రూపం అత్యంత ప్రజాస్వామిక రూపంగా నేడు ముందుకొచ్చింది. ఐతే_ ఈ విధానానికి

ప్రజాబాహుళ్యంలో నేడు పునాదులు లేవు. జనంలో, ముఖ్యంగా, గ్రామీణ ప్రాంతాల్లోని పీడిత జనంలో పాటలు, బుర్రకథలు, గొల్లసుద్దులు నేటికీ బాగా ప్రచారంలో వున్నవి. గ్రామీణ శ్రమజీవులు, మహిళలు నేటికీ మోటకాడి పాటలు, కోలాటం పాటలు, బతుకమ్మ పాటలు పాడుకొనడం చూస్తాం. ఈ స్థితిలో విప్లవ కవులు తాము చెప్పదలుచుకున్న భావాలు విశాల ప్రజానీకానికి చేరాలంటే అందుకను గుణమైన రూపాలను గణనలోనికి తీసుకోవాల్సి వుంటుంది. ప్రజల స్థాయిని, వారికి బాగా కరతలామలకమైన శైలులను, రూపాలను చేబట్టాల్సి వుంటుంది. ఈ రూపాల్లోని (Popular Forms) అశాస్త్రీయ అంశాలను తొలగించి నూతన రూపాలను అభివృద్ధి చేయాల్సి వుంటుంది. ఆ విధంగా మాత్రమే విప్లవ సాహిత్యం లోతుగా పీడిత వర్గాల్లోకి చొచ్చుకొని పోగల్గుతుంది. వచన కవితారూపం చేపట్టిన తిరుగుబాటు కవులు ఈ అంశాన్ని పరిశీలించాలి.

'సాహిత్యం సామాన్యుడికి నేరుగా చేరడం సాధ్యపడదు!' అన్న వాదనలు తరచుగా అభ్యుదయ వాదుల నుండి కూడా వింటాం. సాహిత్యాన్ని, విజ్ఞానాన్ని ప్రజల కందకుండా చరిత్రనిండా నిర్మించబడిన బారికేడ్లలో ఈ వాదం ఒక ఆధునిక రూపం మాత్రమే. కవిత్వానికీ – ప్రజలకూ మధ్య ఒక బ్రిడ్జి వుండాలనడం ప్రజా వ్యతిరేక వాదం. నిజానికి ఈ బారికేడ్లను తొలగించుకొని సాహిత్యం యిదివరకే ప్రజల దగ్గరకు వెళ్ళింది. పొట్టచీల్చితే అక్షరం ముక్కరాని గ్రామీణ శ్రామిక జనం సృష్టించిన సాహిత్యం సమృద్ధిగా వున్నది. వీరుతమ ఆలోచనల్ని నోటికే పాటలుగా అల్లి పాడటం చూస్తాం. ఎక్కడో, ఎప్పుడో విన్న పాటలను పాడుకొనడం చూస్తాం, ఇదంతా ప్రజల్లో వున్న సాహిత్యసంపదకు, సాహిత్యాభిలాషకు చిహ్నం కాదా! ఈ ఈ అంశాన్ని విప్లవ కవులు పరిశీలించాలి.

లోచన్‌గారి "ట్రిగర్ పై వేళ్లతో" అన్న కవితలో సమాజ వ్యవస్థపై నిశిత మైన, సూటైన విమర్శ వున్నది. ప్రబోధం వున్నది.

"బానిసజాతి"లో 'గడ్డి కరిచి ప్రభువుల ముడ్డి కడిగేజాతి' అన్న దూషణ సరైందికాదు. పేదవర్గాలు నేటి సామాజిక వ్యవస్థలో బ్రతకాల్సిన పరిస్థితుల్లో సంతరించుకున్న కొన్ని అవలక్షణాల్లో బానిసవృత్తి ఒకటి. వారిని ఓపిగ్గా సరైనమార్గం లోకి తెచ్చుకోవడానికి యత్నించాలి. మొత్తంగా తిట్టడం పరిష్కారం కాదు. ఆ లెక్కన పీడిత వర్గాలు అన్నిదశల్లోనూ పీడకవర్గాల దాస్యం చేస్తూనే వస్తున్నారు. వారే ఒకానొక దశలో తిరుగబడి పీడకులను కూల్చుతున్నారు. అదే సమయంలో

పీడక వర్గాల ఏజెంట్లుగామారి, పోరాటాల్లో కలిసిరాక ప్రజావ్యతిరేక కార్యకలాపాల్లో పాల్గొనేవారు కూడా పేదవర్గాల్లో వుంటారు. వీరు శత్రువర్గాల్లో చేరతారు. ఐతే మొత్తంగా ప్రజలపట్ల వారిలోపాలపట్ల సరిదిద్దేవైఖరి తీసుకోవాల్సిందేగాని శత్రువైఖరి కాదు.

"లేవరేం!" అన్న పిలుపు పీడిత ప్రజలకు వుద్దేశించబడింది. దీనిలో కిషన్ గారు 'కోరికల చెరసాలలు' లేని.... విశ్వజనీనతకు వెళ్దామంటున్నారు. కోరికలు చెరసాలలు కావు. అవి పురోగమనానికి సోపానాలు కాగల్గుతాయి. అదే విధంగా తిరోగమనానికి కూడా దారితీస్తాయి. ఐతే_ వాటిస్వభావాలను బట్టి ఫలితాలుంటాయి. కిషన్‌గారు చేరుకోనగోరుతున్న లోకంలో కూడా కోరికలుంటాయి. దోపిడీవర్గాల కోరికలను చెరసాలల్లో బంధించి, పీడిత వర్గాల కోరికలకు రూపకల్పన చేయడమే కిషన్‌గారు కోరుతున్న విప్లవ సమాజ నిర్మాతల లక్ష్యం. విప్లవ పోరాటాల్లో ప్రజలు చేసే రక్తతర్పణను, ప్రాణత్యాగాలను "గత్తర్ల"తో కిషన్‌గారు పోల్చారు. ఇది ప్రజల బలిదానాలను కించపరుస్తుంది.

సుదర్శన్‌గారు "కవిత్వం కాదిది" అన్న కవితలో "జడంగా పడివున్న జాతి-తాటాకు చప్పుళ్లకి.... మేలుకొంటుందన్న 'దురాశ'ని త్రుంచెయ్!" అని యువ తరానికి పిలుపిస్తున్నారు.

నేటి పరిస్థితుల పట్ల బాగా విసిగి, విప్లవ పంథాలో తప్ప మరో మార్గంలో విముక్తి సాధ్యం కాదన్న నిర్ణయానికి వచ్చిన యువతరం అదే తీవ్రతలో ప్రజలు విప్లవ పంథా చేపట్టడం లేదని విసిగి, తిట్టిపోయడం అక్కడక్కడా నేడు చూస్తాం. దీనిలో రెండు లక్షణాలున్నాయి- 1) ప్రజల విప్లవ స్వభావాన్ని చూడలేకపోవడం; 2) ప్రజలకంటే తామే నిజమైన విప్లవకారులమని చాటుకోజూడ్డం. ఈ రెండూ విప్లవకారుల్లో వుండకూడని లక్షణాలు.

సుదర్శన్ గారి పై కవితలో ఈ లక్షణాలు కన్పిస్తాయి.

ప్రజల్లో జడత్వం పేరుకొనడానికి కారణం ఆ ప్రజల్లో విప్లవచేవ లోపించి వుండడం కాదు. చరిత్ర పొడుగునా పరివర్తనావాదులు ప్రజల విప్లవ చైతన్యం పెరగ కుండా చేయడానికి, అది కార్యరూపం తీసుకొనకుండా అదిమిపెట్టడానికి యత్నిస్తున్నా, నిర్బంధాలూ, హింసాకాండ స్వైరవిహారం చేసినా ప్రజలు వీటి నెదిర్చి, విప్లవ లక్షణాలను ప్రదర్శించిన సందర్భాలున్నాయి. నేటి దశకు అభివృద్ధి చెందిన మానవ సమాజంలో వివిధ కాలాల్లో, దశల్లో ప్రజలు చేపట్టిన, చేపడ్తున్న పోరాట రూపాలు

ఎవరో గదుల్లో కూర్చొని ప్రయోగాలు చేసిగానీ, పుస్తకాలతో తలబ్రద్దలు కొట్టుకొని గానీ రూపొందించినవి కావు- వివిధ దశల్లోప్రజలు తమ్ము తాము కాపాడుకొనడానికి, శత్రుదాడిని తిప్పికొట్టడానికి ఆయా పోరాటరూపాలను చేబట్టాల్సిన ఆవశ్యకతను గుర్తించి చేపట్టారు. ఈ విధంగా ప్రజల పోరాటాల అభివృద్ధి క్రమంలోనే వివిధపోరాట రూపాలుపుట్టి అభివృద్ధి చెందినవి. అన్ని సందర్భాల్లోనూ ప్రజలే నిజమైన విప్లవ కారులు, మార్గదర్శకులు. ప్రజల విప్లవ స్వభావం చూడ నిరాకరించినవారు, ప్రజల కంటే తాము ముందున్నామనీ, వుండగలమనీ, అనుకున్నవారూ ప్రజలను వదలి, కొన్ని సాహస చర్యలకు పూనుకొని, విప్లవాలను తుదికంటా తీసుకుపోవడంలో విఫల మైన వుదాహరణలు చరిత్రలో కన్పిస్తాయి. అదే సమయంలో ప్రజలపై విశ్వాస ముంచినవారు ఒకానొక సందర్భంలో ప్రజల్లో కన్పించే అచేతనత్వాన్ని చూసి విసిగి పోకుండా, వారి విప్లవ శక్తులను జాగృతపరిచి విజయవంతంగా పోరాటాలకు నాయ కత్వం వహించినట్లు ప్రపంచ విప్లవ చరిత్ర చెప్తుంది.

ఈ వాస్తవాన్ని పరిశీలించాలన్నదే సుదర్శన్‌గారికి నేను చేయగలసూచన.

"అజ్ఞానం + భయం = మతం" అన్న నిర్వచనం బాగానే వున్నది. ఐతే- ఇది అసంపూర్ణ నిర్వచనం. ప్రజలకు సంబంధించినంత వరకు మత భావాలకు అజ్ఞానం, భయం మాత్రమే కారణం. దోపిడివర్గాలకు సంబంధించి నంతవరకు యివి కారణాలు కావు. ప్రజల్ని అజ్ఞానంలోకి, భయంలోకి, మైకంలోకి తోసే ఈ నల్లమందు వ్యాపారులు చేస్తున్నది పెద్దకుట్ర. మతానికి వున్న ఈ దోపిడీవర్గ ప్రయో జనాన్ని మతానికి యిచ్చే నిర్వచనంలో తప్పనిసరిగా చేర్చాలి. అప్పుడే దాని దుష్ట స్వభావం పూర్తిగా స్పష్టమవుతుంది.

పీడిత జన విముక్తికి విప్లవమే మార్గమన్నది తిరుగబడు కవులందరి అవగాహన.

భావాల వ్యక్తీకరణలో అక్కడక్కడా కొద్దిపాటి అస్పష్టతలు కన్పించినా వాటి నధిగమించడం సాధ్యం. ఈ అస్పష్టతలను మైక్రోస్కోపుల్లో చూడనవసరం లేదు.

పీడిత ప్రజల వాస్తవ జీవితాలకు సంబంధించిన లోతైన అవగాహన లోపిస్తున్నది. ముఖ్యంగా ఫ్యూడల్ సమాజ లక్షణాలను వీరు మరింత నిశితంగా పరిశీలించాలి. సమాజంలోని వివిధ వర్గాలను, ఆ వర్గాల ఆలోచనా విధానాలను - ఆ వర్గాల మధ్య వున్న సంబంధాలను బాగా అధ్యయనం చేసినప్పుడే కవితల్లో జీవంపుట్టి పడుతుంది. భావాలు సంపన్నంగా, సక్రమంగా వుంటాయి.

కవితలో చాలాచోట్ల పొడి పదాలు, నినాదాల రూపంలో భావ ప్రకటనలు కని పిస్తాయి. సాహిత్య ప్రక్రియకిది సరిపడని లక్షణం. కవిత్వంలో భావాలు అస్పష్టంగా ఉండడం ఎంత నేరమో, కళాత్మక విలువలు లోపించడం అంతే హాని కరం. ఒక కవితలో మంచి దృక్పథం లోపించి, ఎంత గొప్ప కళాత్మక విలువలను సింగారించుకున్నా అది శవాలంకరణగానే వుంటుంది. అదే విధంగా కళాత్మక విలువలు లోపించి పొడి నినాదాలుగా దృక్పథాలు కవితల్లో ప్రకటిస్తే ఎవెంత మంచి వైనప్పటికీ అవి సజీవంగా వుండవు. దీన్ని బట్టి దృక్పథాలను – కళాత్మక విలు వలతో సమర్థవంతంగా ఐక్యపర్చడంలోనే కవుల విజయం వున్నది. ఈ సామర్థ్యాన్ని తిరుగబడు కవులు పెంచుకోవాలి.

వచన కవితకు తోడుగా Popular Forms లో సాధనచేయాలి. ఆ రూపాల్లో విరివిగా కవితలు వ్రాయాలి.

ఈ సంకలనంలో విప్లవ పోరాటాలకు సంబంధించిన లోతైన అవగాహన లోపి స్తున్నది. ఈ లోపాల్లేకుండా విప్లవ కవులు సజీవమైన రచనలు చేయాలంటే – పుస్తక పరిజ్ఞానంచాలదు. దానివల్ల ప్రజలనుసరించే పోరాట రూపాలనూ, క్రమాన్నీ, నిత్య జీవితంలోనూ, పోరాట క్రమంలోనూ ప్రజలెదుర్కొంటున్న సమస్యలను వారు అర్థం చేసుకోలేరు. రచనలు పాక్షిక వాస్తవాలపైన, అసమగ్ర వివరాలపైన ఆధార పడ్తాయి. కనుక కవులు ప్రజల్లోకి వెళ్ళి, వారి సమస్యలను, పోరాటానుభవాలను స్వయంగా పరిశీలించాలి. అప్పుడే వారి జ్ఞానం సమగ్రం కాగలుగుతుంది.

రాష్ట్ర వ్యాపితంగావున్న విప్లవకవులు కృషిని సమన్వయపరిచి విప్లవోద్యమా వసరాలను గుర్తించి, దాని పురోగమనానికి తోడ్పడే పద్ధతుల్లో కార్యకలాపాలను మేళ వించి, విస్తృతంచేయాలి. ఈ కర్తవ్య నిర్వహణలో తిరుగబడు కవులు చొరవ తీసుకోవాలి.

ప్రజల పట్ల – ప్రజాశత్రువుల పట్ల తీసుకోవాల్సిన వైఖరి పట్ల స్పష్టతవుండాలి. వెనుక బాటు చైతన్యం గల ప్రజల్ని వోపిగ్గా educate చేసి ముందుకు నెట్టడం, విప్లవపంథా చేపట్టిన ప్రజల్ని దృఢంగా సమర్థించి, మరింత వుత్తేజపరచడం ప్రజల పట్ల తీసుకోవాల్సిన జనరల్ దృక్పథం. ప్రజాశత్రువుల ముసుగుల్ని లాగివేసి, వారిని ఎండగట్టడం, ప్రజలశక్తిని, పురోగమనాన్ని చిత్రించి, శత్రువుల గుండెలదర గొట్టి, వారిపతనం అనివార్యమని మళ్ళీమళ్ళీ చాటి చెప్పడం ప్రజాశత్రుల పట్ల తీసు కోవాల్సిన దృక్పథం.

## నగ్నముని 'తూర్పుగాలి'

త్రిపురనేని మధుసూదనరావు

తూర్పు, పశ్చిమాల సంగతి అలావుంచి నగ్నముని ఎప్పుడూ కొత్తగాలే. కవిగా నగ్నముని నిన్నటితోనూ, ఇవ్వాళతోనూ సంతృప్తిపడే వ్యక్తికాదు. అటు కళా రంగంలోనూ, ఇటు సంఘ రంగంలోనూ పూర్తి మార్పుకోసం తపనపడటం నగ్నముని వ్యక్తిత్వం. ఆ మార్పు సమాజానికి మంచి చేస్తుందా, కళారంగంలో ఆరోగ్యకరమైన ధోరణా, కాదా అనేది వేరే విషయం. ముందు మారాలి. ఉన్నస్థితిని భరించటం సాధ్యంకాదు. తన చుట్టూ వొక ధోరణిలో స్థిరపడిపోయి పేరు తెచ్చుకున్న కవులూ వున్నారు. కొత్త అంటే ముఖం చిట్లించుకునే వాళ్లూ వున్నారు. నలుగురూ నడిచేదారిలోనే నడవటం అంటే నగ్నమునికి మహా చిరాకు. మర్యాదగా చెపితే వినరనుకుంటే వినేట్టు చెప్పటానికి పూనుకోవాలి గదా – స్తబ్దత అంటే ఇతడికి చావు కంటే భయంకరంగా కనిపిస్తుంది. మధ్యతరగతి బొద్దింకల్ని చూస్తే నగ్నమునికి మహా కసి.

తెలుగు దేశం ఈ మధ్య తెలివి మీరి పోయింది. "జీవితం అంటే నటించటం" అనే సూత్రం మీద జనం బతికేస్తున్నారు. చదివి డిగ్రీ సంపాదించుకోవాల్సిన అవసరంలేదు. డిగ్రీ కొట్టేస్తేచాలు. ఎవడినయినా ఆశ్రయించి కులం పేరు చెప్పో, డబ్బు పేరు చెప్పో ఎవడూచూడకుండా కాళ్లు పట్టుకునో ఆ వోటమిని గుండెల్లో భరిస్తూనే పైకి వెధవనవ్వు నవ్వుతూ కన్పించటం– అంతా నకిలీసరుకే, తన వ్యక్తిగత సమస్యల్ని చీకట్లోనో, గుడ్డి వెలుతురులోనో ఏదోవొక మార్గంలో ఎంత నికృష్టమైనా సరే పరిష్కరించుకోవటం, సమాజ దృష్టిని పూర్తిగా కోల్పోయి. తిరుగుబాటు అనేది వ్యక్తిగతంగా కూడా మరిచిపోయి జనం బురదలో పురుగుల్లా బతుకుతున్నారు. కానీ తాము చాలా గౌరవంగా బతుకుతున్నట్టు ఇతరులను నమ్మించటానికి ప్రయత్నించటం, తాను కూడా నమ్మటం జరుగుతోంది. ఇదంతా ఎక్కువగా మధ్యతరగతి జీవితంలో

---

విప్లవ లక్ష్యంతో, నేటి చారిత్రిక కర్తవ్యాన్ని గుర్తించి, ఈ మార్గం ఎంత కంటకావృతమైనదో, ఎన్ని తుఫానులను ఎదుర్కొని నిలవాల్సివుంటుందో తెల్సుకొని పీడితప్రజల పక్షాన నిలవడానికి ముందుకు వచ్చిన తిరుగబడు కవులకు విప్లవాభినందనలు తెల్పడం, వారిలోపాలను స్నేహపూరితంగా విమర్శించి, వారు చాచిన తిరుగుబాటు హస్తాన్ని అందుకొనడం 'వెన్నెముకా' ముందుచూపూ వున్న ప్రతివాడూ చేయాల్సింది. ఈ హస్తాన్ని అందుకొనడంలో యోగ్యత సంపాదించడానికి యత్నిస్తానని చెప్తూ ముగిస్తాను.

[మే 1970, సంచిక 15]

కనిపిస్తోంది. మనిషి ముఖానికి తగిలించుకున్న ముసుగు (Persona) మనిషిని తోసి వేసి ఆస్థానాన్ని ఆక్రమించుకొంది. తనను గూర్చితాను కష్టపడి లోకం ముందు వుంచిన "అబద్ధం" నిజం గొంతును నులిమేసింది. వ్యక్తుల్లో పెరుగుతున్న ఈ వక్ర సంస్కారం సమాజానికి కుష్ఠురోగం తెచ్చేంత ప్రమాదస్థితికి చేరుకుంది. సమాజ వాదం పూర్తిగా మరుగునపడి జనంలో సంఘస్పృహ పూర్తిగా చచ్చిపోయింది. ఎవడికివాడు అందినంత అవకాశమున్న మార్గంలో నమిలి మింగటమే లక్ష్యంగా చేసుకున్నాడు. ప్రజాస్వామ్యం అనేది సమాజపరంగా వోడిపోయి, సర్వమానవ విలువల్ని నాశనం చేసే వొక జడతరాన్ని వుత్పత్తిచేసింది. ఆలోచించటం, పోరాటం చేయటం, పురోగమించటం, అనేవి దేనికీ కొరగానివిగా మారిపోయాయి.

స్వాతంత్ర్యం సంపాదించామని వొక వర్గం చాలా జాగ్రత్తగా స్వతంత్రాన్ని తనకే పరిమితం చేసుకుంది. పార్లమెంటు అనీ, అసెంబ్లీ అనీ, రాజ్యాంగం అనీ, కోర్టులనీ, విద్యాలయాలనీ, ప్రాజెక్టులనీ, సర్వోదయం అనీ, ప్రజాస్వామ్య సోష లిజం అనీ, దేశభక్తి, సైన్యం అనీ అన్నిటినీ తమ స్వాతంత్ర్యాన్ని గట్టిగా పదిల పరచుకోవటానికి వీలుగా తీర్చిదిద్దుకొంది. మేం అభివృద్ధి సాధిస్తాం- మేం అనుభ విస్తాం- మేం జైళ్ళలోవుండి స్వతంత్రం తెచ్చాం- అది మా హక్కు- దాన్ని మరొ కడు కావాలంటే జైల్లో వేస్తాం అని ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ బల్లగుద్ది చెప్పింది. వీళ్లలోనే కొంతమంది దూరదృష్టికలవాళ్లు ప్రభు భక్తి పరాయణులై "జస్టీస్" లేబిల్ మీద ఐ. సీ. యస్. సీతాకోకచిలుకలుగా, సైన్యంలో కమాండర్లుగా వుండిపోయారు. రావుబహద్దూర్ తలపాగా తగిలించుకొని బుర్రమీసాల, కిర్రుచెప్పుల సంస్కృతిని కాపాడారు. స్వాతంత్ర్యం వచ్చింతర్వాత వీళ్ళంతా తమ వర్గమే అయిన పాలక పక్షంలో కలిసిపోయి పాలక యంత్రాంగంలో కీలక స్థానాల్ని ఆక్రమించుకొన్నారు. ఈ విధంగా "ఖద్దరుతరం" చాలా జాగ్రత్తగా దేశ స్వాతంత్ర్యాన్ని, ప్రజాస్వా మ్యాన్ని హక్కు భుక్తంచేసుకుంది.

ఆనాటి బ్రిటిష్ సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా అనేక దేశాల్లో లేచిన స్వాతంత్ర్య వుద్యమానికి నాయకత్వం వహించిన మహాత్ముల తరాలు గత దశాబ్దంలో చిక్కుల్లో చిక్కుకున్నాయి. ఈ వృద్ధతరం మీద ఏదో విధంగా యువతరం తిరుగు బాటు చేయటం ప్రపంచ ధోరణిగా పరిణమించింది. ఆ తిరుగుబాట్లు అన్నిచోట్లా బలమైన నిరసనోద్యమాలుగా రూపొందాయి. పాలకపక్ష స్వభావాన్ని బట్టి యువ తరానికి దొరికిన నాయకత్వాన్ని బట్టి యివి అనేక రూపాల్ని తీసుకున్నాయి. పాశ్చాత్య

దేశాల్లో హిప్పీ, కృష్ణభజన సంఘాలుగా యింకా అనేక విధాలయిన అరాచక వలయాల్లో చిక్కుకుపోయాయి. New-left, pop-heroism, dropping-out గాను తయారై యువక నిరసనోద్యమాలు తప్పుదోవన పడ్డాయి.

జనచైనాలో పెకింగ్ యూనివర్సిటీ మీద విద్యార్థుల దాడితో ఆరంభమైన నిరసనోద్యమం సాంస్కృతిక విప్లవ మహోశయపంథా స్వీకరించింది. చైర్మన్ మావో నిర్దేశించిన విప్లవ కార్యక్రమం ఆచరణలో సాధించిన "రెడ్ గార్డ్ దళం" ప్రపంచ యువకోద్యమాలకి మార్గదర్శకం అయింది. దేశ దేశాల యువత కార్మిక రైతాంగంతో సమైక్యమై దీర్ఘకాలిక పోరాట పంథా స్వీకరించి విప్లవ చైతన్యంతో వర్గరహిత మహాసమాజం కోసం విప్లవించింది. మరి, మనదేశంలోనూ యువతరానికి వృద్ధతరం మీద నమ్మకం పోయింది. విద్యా విధానం పాలకపక్షాన్ని సమర్థించేది కావటంచేత కాలదోషం పట్టిన పాఠ్యాంశాల్తో కొత్త సమస్యలకి అనుగుణంగా మారలేదు. నిరుద్యోగం, జడజీవితం - అన్ని రంగాల్లోనూ వృద్ధతరం నాయకత్వం యువతరంలో సంక్షోభానికి కారణమయ్యాయి. సమ్మెల రూపంలోనో, మరో రూపంలోనో యూనివర్సిటీల మీద, కళాశాలల మీద, విద్యా విధానాన్ని పాలకపక్షానికి తాకట్టుపెడుతున్న నాసిరకం మేధావుల మీద యువత తిరుగుబాట్లు చేయటం ఆరంభించింది. భవిష్యత్తు మీద ఏ మాత్రం ఆశనూ కలిగించలేని వృద్ధతరం మీద ఏ చిన్న కారణం కనిపించినా యువతరం నిరసన తెలియచేస్తోంది. నిర్జీవ విద్యా విధానం, జీవితాన్ని పేలవం చేస్తున్న యథాతథ వాదం కారణంగా యువతరంలో సిద్ధాంత దారిద్ర్యం, రాజకీయ విముఖత్వం, నైతిక సంక్షోభం కరుడుగట్టుకుపోయాయి. ఈ అరాచకం నుంచీ, స్తబ్ధత నుంచీ బాధ్యతాయుత యువత చైతన్యతరమై సుదీర్ఘ సాయుధ పోరాట పంథా చేపట్టింది. ఈ దేశంలోని యువతలకు అరుణారుణ దిక్సూచిని ప్రదర్శించింది.

ఈ పరిస్థితుల్ని పట్టించుకోకపోతే దిగంబరకవిగా, విప్లవకవిగా నగ్నమునిని అర్థంచేసుకోవటం సాధ్యంకాదు. తూర్పుగాలిలో నగ్నముని "దిక్కు"ల్ని కూడా చేర్చాడు. కాబట్టి దిగంబర కవిగా కూడా పరిశీలించవలిసిన పరిస్థితి ఏర్పడింది. ఈ "దిక్"లను చేర్చటంతో నగ్నముని దృష్టికొంత అస్పష్టమైంది. దిగంబర కవిత్వం విప్లవ కవిత్వం కాదని చర్చలేకుండానే తీర్మానించవచ్చు. విప్లవకవిగా మారిన తర్వాత దిగంబర కవిత్వాన్ని వదులుకోవలిసిందే. నగ్నముని తన రచనలన్నింటిని సంకలనంగా వేయదల్చుకుంటే అదివేరే విషయం. చిన్నప్పటినుంచీ రాసినవన్నీ

ఇప్పుడు "విప్లవకవులు" ప్రచురించుకోవడంలో చాలా చిక్కులున్నాయి. విప్లవ కవిత్వం పేరుతో చిన్ననాటి రచనల్ని కూడా ప్రజల్లోకి వదలటం కవిరుజుత్వలోపమే. తాను నిబద్ధుడు కాకముందు, మార్క్సిస్టు విప్లవమే సమాజ పరిష్కారమార్గంగా గ్రహించక ముందు చేసిన రచనలన్నీ విప్లవకవి ప్రచురించటం మంచిపని కాదనే నా అభిప్రాయం. (ఏదో షష్టిపూర్తి అయింతర్వాత చేయాల్సిన పనులన్నీ ఇప్పుడే చేయాలా ?)

వి.ర.సం ఆశయాల్ని అంగీకరించి విప్లవ ప్రజాపోరాటాల్ని సమర్థిస్తూ చేసిన రచనల్తో పాటు నగ్నముని దిగంబర కవితల్ని గూడా చేర్చటం విషయంలో నాకు చాలా అభ్యంతరం వుంది. ఇది పాఠకుల్ని, విప్లవకవిత్వ అభిమానుల్ని గందరగోళ పరిచే వ్యవహారం. పోనీ యితని దిక్కులు వెలుగు చూపకపోతే కొంత లిబరల్‌గా చూడవచ్చు. రెండుసార్లు యిప్పటికే ప్రచురింపబడిన వాటిని మళ్ళీ యిందులో చేర్చటం అంటే ఎలా అర్థం చేసుకోవాలి ? తూర్పుగాలిలో దిగంబరకవిగా, విప్లవకవిగా పరిశీలించవలిసిన పరిస్థితిని నగ్నమునే తెచ్చిపెట్టుకున్నాడు. ఇంతకీ విప్లవకవిగా పూర్తిగా పరిణామం చెందాడా లేదా అని కూడా ఆలోచించాలి.

దిగంబర కవిత్వాన్ని గూర్చి చర్చించేటప్పుడు '65 నాటి ఆంధ్రదేశాన్ని, అందు లోనూ ముఖ్యంగా ఆంధ్ర సాంస్కృతిక రంగాన్ని బాగా దృష్టిలో వుంచుకోవాలి. ఇప్పటి వ్యవస్థలో మెచ్చుకోదగిందేమీ లేదు. ఆర్థిక విధానం, రాజకీయాలు, మతం, సాహిత్యం, వ్యక్తుల సంస్కృతి ఆరోగ్యకరంగా లేవు. సామ్రాజ్యవాదుల గుప్పిట్లో ఆర్థికం విలవిలలాడుతోంది. రాజకీయ నాయకులకు పదవులు తప్ప ఇంకేం అవసరం లేదు. మత ప్రతినిధులు, ఆచార్యులు, మిషనరీలు, ఆశ్రమాలు, బాబాలు, యోగులు కాలదోషం పట్టిన ప్రజా వ్యతిరేక అజ్ఞానంతో పెద్ద భోగంతో బతికేస్తున్నారు. విద్యా వంతులు, మేధావులు బట్టీయం పండితులై వ్యక్తిగత స్వార్థమే లక్ష్యంగా వాళ్ళనీ, వీళ్ళనీ కాకాబట్టి భజనచేసి బతుకుతున్నారు. యూనివర్సిటీలు నీరస జాతిని తయారు చేసే కర్మాగారాలుగా తయారయాయి. కాంట్రాక్టర్లు, బ్లాక్ మార్కెట్‌దారులు, స్మగ్లర్స్ దేశ ఆర్థికవ్యవస్థను చిన్నా భిన్నం చేస్తున్నారు. నిన్నటి వరకూ వున్న చరిత్ర అది ఎంతగొప్పదైనా యీనాటి సమస్యల పరిష్కారానికి పనికి రావడంలేదు. వర్తమానం ఎంత సంక్షోభంలో వున్నా భవిష్యత్తుకోసం యువతరం బాధ్యత తీసుకునే స్థితిలోలేరు. కవులు పేదల కోసం రాయటం, ప్రజల పక్షాన నిలబడటం Out of date అని సినిమా కవిత్వం రాసుకుంటున్నారు. సాహిత్యాన్ని ఉద్ధరిస్తాం అని ఎకాడమీలు

పాత సాహిత్యాన్ని పునరుద్ధరించడంలోనూ, పలుకుబడి వున్న పనికిమాలిన కవులకూ, పండితులకు ఆర్థిక సహాయం చేయటంలోనూ మునిగిపోయాయి. కార్మిక పక్షాలు ప్రజలకు దూరమై, చీలిపోయి తమలో తామే కొట్లాడుకుంటున్నాయి. చుట్టూ జాగ్రత్తగా చూస్తే ఎంత ఆశాజీవికి సైతం సంఘ జీవితం ఆశావహంగా కనబడలేదు. ఈ దశలో లేచింది దిగంబర కవుల నిరసనోద్యమం. ఈ కవుల తీవ్ర నిరసనకు గురి కానిది, వీళ్ళ సూక్ష్మదృష్టిని, తప్పించుకుపోయింది ఒక్కటి కూడా లేదు. భాష, భావ ప్రతిమలు కూడా నిరసనకు తగిన విధంగా కొరడా రూపాన్ని దాల్చాయి. నిహిలిజం, శాడిజం- అని ఏ ఇజాన్ని తీసుకొచ్చి తూచడానికి ప్రయత్నించినా దండగే. నానా రకాల విమర్శకులు దిగంబర కవుల్ని ఖండిస్తున్నారంటే వాళ్ళూ వీళ్ళ నిరసనకు గురైన పరిధిలో వాళ్ళే. అలాంటి విమర్శల వల్ల ఏమీ ప్రయోజనం లేదు. దిగంబర కవుల మీద నిజమైన విమర్శ ఎలా వుండాలంటే, వాళ్ళ ముందు సక్రమమైన, శాస్త్రీయమైన, ఆచరణ సాధ్యమైన ఆశామార్గాన్ని ప్రదర్శించ గలగాలి. అలా సమాజానికి పట్టిన రోగాలకు శస్త్ర చికిత్స చేయడానికి సిద్ధమైన ప్రజా విప్లవ వీరుల పిలుపుతో దిగంబర కవులు నిరసనను విసర్జించి నిర్మాణాత్మక మార్గాన్ని చేపట్టారు. కనిపించిన నక్షత్రాల వెలుగులోకి ఆశయం నిండిన గుండెలతో ప్రవేశించారు. వాస్తవానికి దిగంబర కవుల మీద దిగంబర కవులే నుంచి విమర్శకులు. సంప్రదాయపు పాత గొంగళీలు కప్పుకొని కుండలాలు కదిలేటట్టు పండితులు పళ్ళు కొరికినా, శ్రోత్రియ కమ్యూనిస్టులు కొందరు కోపారుణ నేత్రాల్తో శాపనార్థాలు పెట్టినా తామూ నిరసనకు గురికావటమే కారణం. ఆత్మవిమర్శ చేత కాని ఆడంబర వాదులు ఆర్భాటం చేశారు. ఈ దృష్టితోనే తెలుసు కవిత్వంలో దిగంబర కవిత్వం నిస్సందేహంగా చారిత్రిక సంఘటన. నిర్జీవ స్తబ్ధతలో కూరుకు పోయిన కవిత్వాన్ని కొరడా దెబ్బలు కొట్టి ముందుకు నడిపించారు. దిగంబర కవిత్వ పరిధిలో ఈ కవులకు పూర్తి లైసెన్సు వుంది. బూతులు తిట్టారని మనం తిరిగి తిట్టడం, కుసంస్కారులనటం, ఆంధ్ర సాహిత్య చరిత్రలో యింతటి కుసంస్కారులు లేరనటం, లండన్ ప్రోలిటేరియట్ అనటం- అన్నీ దిగంబర కవిత్వానికి ప్రేరణ యిచ్చిన శక్తుల్ని అర్థం చేసుకోలేక పోవటమే కారణం. కూచిమంచిజగ్గకవితోనూ, కవి చౌడప్పతోనూ పోల్చటం అసందర్భ ప్రలాపాలు. ఈ నిరసనను ప్రవచించటంలో నగ్నమునిది బలమైన కంఠం.

'రాజకీయాల రోగాలు తగలని కోళ్ళ
నీ ఆమ్లెట్లలోకి ఆరోగ్యవంతమైన గుడ్లు ఆనందంగా పెట్టాలి'
(తొడ విరిగినతరం)

అంటే దిగంబర కవిత్వంగా అభ్యంతరంలేదు కాని, విప్లవ కవిత్వంలో రాజకీయ విముఖత్వం ఏ విధంగా సమర్థనీయం? విప్లవ దృక్పథంతో చూస్తే 'తొడ విరిగినతరం' తల విరిగిన రచన. వేణులాటి వాళ్ళను పోరాటంలోకి ఆహ్వానించటం మరీ అమాయకత్వం. పాలక వ్యవస్థకు దళారీ అయిన వాడిని గూర్చి ఈ ప్రార్థన ఏమిటి?

'సీసాల్లో స్నానమాడించి
సిల్కు చీరల లంగాల్లో నిన్ను పాతేశారు'

ఈ మాత్రానికే పాలకుల పాదరక్ష అయిన బలహీనుడు ప్రజల్లోకి వచ్చి ఏం చేస్తాడు? అందుకని యీ రచనని దిగంబర కవితగా అంగీకరించగలను కానీ విప్లవ కవితగా మాత్రం చాలా అసహ్యకరమైన రచన. తొడ విరిగిన తరాన్ని చూసి జాలిపడటం కాదు. దుర్యోధనుడు లాంటి వ్యవస్థ తొడ విరగ్గొటే తరాన్ని అనుసరించటం అవసరం. 'బుద్ధక్షమ'– గాడిద లక్షణమైన సహనాన్ని బుద్ధుడికి అంటగట్టడం చాలా ఆశ్చర్యకరం. బౌద్ధమతం ఈనాటి సమస్యలకి దేనికీ కొరగాని మాట నిజమే గాని వైదిక మతాచారాల మీద అతడు చేసిన తిరుగుబాటును విప్లవ కవి గుర్తించవద్దా? 'ప్రశ్నించటం చేతకాని అస్తిత్వాన్ని నేను క్షమించలేను' (బుద్ధక్షమ). నిజమే మరి బుద్ధుడు వేదాధికారాన్ని ప్రశ్నించాడు. అసలు దేవుని వునికినే ప్రశ్నించాడు కదా? దిగంబర కవిగా 'బుద్ధక్షమ'ని నిరసించటాన్ని క్షమించవచ్చునేమో కానీ హేతు దృష్ట్యా అసహ్యమైన ఈ క్షమను బుద్ధుడికి అంటగట్టడం న్యాయం కాదు. బుద్ధుడు దారి తప్పిన విషయాలు వేరే చాలా వున్నాయి. నగ్నముని ఈ రచనను కూడా యిందులో చేర్చటం సమంజసం కాదు.

'నాయకులు ప్రజల ముఖాలపై పోస్తున్న ఉచ్చుని
కరుణ రస గంగాజలంగా గతుకుతున్న యువతరాన్ని' –

యువతరం మీద ఈ విప్లవ కవి అవగాహన యింత ఘోరంగా వుందా? నగ్న శిశువు కాస్మిక్ జాతి కోసం, కుష్ఠురోగి – ఈ 'దిక్'లన్నీ విప్లవ కవిత్వ రేఖలు కూడా లేనివి. ఈ విధంగా 15 'దిక్'లను 'తూర్పుగాలి' పేరు పెట్టిన కవితా సంకలనంలో చేర్చారు. ఈ దిక్కులు విప్లవ కవిత్వంగా అంగీకరించడానికి ఏ మాత్రం అవకాశం లేదు. మరి ఎందుకు నగ్నముని చేర్చినట్టు? విప్లవ కవిత్వం 'లేబిల్' మీద చెలామణీ చేయడానికా? ఇదే ఉద్దేశ్యమైతే యితడి చిత్తశుద్ధిని శంకించవలసిందే. ఈ దిక్కుల్ని కూడా విప్లవ కవిత్వమే అని నగ్నముని భావిస్తే అది అవివేకం. ఇలాంటి

పనులవలన అశ్రద్ధగా వుండేవాళ్ళు, శతృవులు, విరసం మీద మసిపూయడానికి పూనుకున్నవాళ్ళు, దిగంబర కవిత్వాన్ని, విప్లవ కవిత్వాన్ని ఒకే గాటలో పెట్టి ఖండిస్తున్నారు. అలాగే చిత్తశుద్ధితో విప్లవ రచన చేయాలనుకునే ఉత్సాహవంతులైన యువ కవులు దిగంబర శైలిలో రాస్తున్నారు. ఇన్ని అవాంఛనీయ పరిస్థితులకు దారి తీసే ఈ 'దిక్కు'ల్ని యిందులో చేర్చటం ఏ మాత్రం న్యాయం కాదు.

'దిక్కులు' కాకుండా తూర్పుగాలిలో వున్న తక్కిన రచనలన్నీ విప్లవ కవిత్వమనే దృష్టితోనే పరిశీలించాలి. కనీసం యీ అభిప్రాయం నగ్నమునికి వుంది "వర్గ చైతన్యంతో మనం ముందుకు వెడదాం" 'ఉషస్' 'వర్గ చైతన్యంతో ముందుకు వెళ్ళు' 'అరణ్యం.' విప్లవ కవిత్వానికి వర్గ చైతన్యమే పునాది. చారిత్రిక సంబంధాల శాస్త్రీయమైన అవగాహన వర్గ చైతన్యానికి మూలం, ఉత్పత్తి శక్తులు, సాంఘిక విధానం, చైతన్యం చరిత్రకి ముఖ్యమైన శక్తులు. మానవ భౌతిక అవసరాలు ఉత్పత్తి శక్తులకు మూలం. ఈ శక్తులనుంచీ ఏర్పడిన ఉత్పత్తి సంబంధాలే సాంఘిక విధానం. ఈ సాంఘిక విధానం నుంచీ చైతన్యం ఏర్పడుతుంది. తన చుట్టూ వుండే పరిసరాలతో తనకుండే సంబంధాలే చైతన్యం. ఏ చారిత్రిక క్షణంలో అయినా యీ మూడు వుంటాయి. ఆలోచనాశక్తే మనిషిని పశువు నుంచి వేరుచేస్తోందనుకోవడం తప్పు. భౌతిక జీవితాన్ని ఉత్పత్తి చేయగలగటమే మనిషిని పశువు నుంచీ వేరుచేస్తోంది. ఉత్పత్తి సంబంధాలు పశువులకు ఉండవు. మనిషికుండే ఈ సంబంధాలే చైతన్యం. ఉత్పత్తి సాధనాల్ని హస్తగతం చేసుకున్న వాళ్ళు ఒక వర్గంగా, ఉత్పత్తిలో శ్రమని వెచ్చించి ప్రత్యక్షంగా పాల్గొనేవాళ్ళు మరొక వర్గంగా విడిపోతారు. దీంతో సాంఘిక సంబంధాలన్నీ మారిపోతాయి. పీడక వర్గంలో పోటీ, స్వార్థం ఎక్కువగా వుండటంతో వాళ్ళలో సంబంధాలు నామ మాత్రంగా, బలహీనంగా వుంటాయి. తిరోగామి వర్గం కాబట్టి దీనికి చైతన్యం వుండదు. ఉత్పత్తి చేసే వర్గం పీడిత వర్గం కాబట్టి వర్గరహిత ధ్యేయంతో పురోగమించేది కాబట్టి ఆ వర్గానికే చైతన్యం వుంటుంది. వర్గ చైతన్యం అన్నప్పుడు యీ మొత్తం భౌతిక సూత్రాల పరిజ్ఞానమే కాక పీడిత వర్గ పక్షపాతం వహించటం కూడా అవుతుంది. శ్రామిక వర్గంలో వర్గ పరివర్తన సాధిస్తూ కవి తన శక్తిని ఆ వర్గానికి అంకితం చేయడమే వర్గ చైతన్యం. ఈ చైతన్యంలో భాష ప్రధానాంగం. భాష చైతన్యానికి పునాది. చైతన్యం భాషకు భవనం. చైతన్యం వలెనే భాష కూడా అవసరం నుంచి పుడుతుంచి, ఇతరులతో సంబంధాల అవసరం నుంచి పుడుతుంది. 'Language, like Consciousness, only arises from the need, the necessity, of intercourse with other men'. (Marx) భాష (Practical

consciousness) ఆచరణాత్మక చైతన్యం. వర్గ చైతన్యానికి, భాషకి చాలా శాస్త్రీయమైన సమీప సంబంధంవుంది. 'వర్గభాష' అనటం అతిశయోక్తి కాని, మధ్యతరగతి మేధావి వర్గానికి, కార్మిక - రైతాంగానికి విద్యా ప్రమాణాలు కారణంగా భాషా ధోరణిలో కొంత తేడా వుంది. అదీ పదాల్లోనే కాని వాక్యనిర్మాణంలో అంతగా వుండదు. వర్గ చైతన్యంతో ప్రజాకవిత్వం రాసేవాడు ప్రజా వ్యవహారంలో సజీవంగా వున్న మాటల్ని నేర్చుకోవాలి. దీనికి అనుభవం, పరిశీలన కావాలి. ప్రజలతో కలిసి జీవించడం- ఒక్కటే సరైన మార్గం. కార్మిక రైతాంగం, వర్గ పరివర్తనంతో విప్లవాచరణలో నిమగ్నమైన మధ్యతరగతివాళ్ళు విప్లవ వర్గం. ఈ విప్లవ వర్గంతో మమేకమై కవిత్వం సాధనంగా సాంస్కృతిక పోరాటం చేయటం విప్లవ చైతన్యం. సోషలిస్టు విప్లవం వెలుగులో సకల జీవితరంగాలనూ వ్యాఖ్యానిస్తూ విప్లవాభిముఖం చేయటం విప్లవకర వర్గ చైతన్యం, సాయుధ పోరాట రూపంలో విప్లవ భావాన్ని సజీవంగా వుంచుతూ, ఆ మార్గంలోకి శ్రామిక వర్గం ప్రవహించేట్టుచేసే 'విప్లవ ఆచరణ' విప్లవకవి విప్లవ సిద్ధాంతం, ఈ సిద్ధాంతంతో ముందుకు పోతున్న ప్రజాపోరాట పంథాకి అనుగుణ్యంగా జీవితాన్ని విప్లవీకరించటం విప్లవ వర్గ చైతన్యం, ఫ్యూడల్, దళారీ బూర్జువాల ప్రజావ్యతిరేక స్వభావాన్ని శాస్త్రీయంగా చిత్రించగలగాలి. ఏ రూపంలో వున్న సామ్రాజ్యవాదాన్ని తీవ్రంగా ఖండించాలి. శ్రామిక అంతర్జాతీయత, విప్లవ ప్రపంచ వాస్తవికత విప్లవకవి సంస్కారంలో లీనం కావాలి. సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా విప్లవాగ్నితో మండే జీవితం విప్లవకవి వస్తువుకావాలి.

నగ్నమునికి యీ విధమైన విప్లవ వర్గ చైతన్యం లేదు. వొళ్ళు అమ్మి బతికే స్త్రీలు, వాళ్ళ పిల్లలు, పెంటకుప్పలమీద ఎంగిలాకుల కోసం కుస్తీపట్టేవాళ్ళు, అర్ధరాత్రి పేవ్‌మెంట్ పక్కనే దుమ్ములో, వుమ్ములో పేడపురుగుల్లా ఎదుగుతున్న ఆడపిల్లలు, రోడ్డుమీద ఒకరిమీద ఒకరు పడుకుని న్యూసెన్స్‌చేసే ఆడ, మగ, దాపల్లు, జేబుదొంగలు, గుమాస్తా చీమలు- ఈ రకం నిర్భాగ్యుల్నే నగ్నముని ఎక్కువగా 'వర్గం'గా స్వీకరించాడు, వీళ్ళంతా బాధితులే, సంఘం చేత విసరివేయబడ్డ వాళ్ళే. కాని శ్రామికులు కారు. ఉత్పత్తితో ప్రత్యక్ష సంబంధంలేని, సిద్ధాంత ప్రభావితులు కావటానికి మేధలేని యీ రకం 'అలగా జనం' విప్లవవర్గం కాదు. విప్లవ పరిణిత దశలో విప్లవ సైన్యాన్ని అనుసరించగలరేమో కాని విప్లవాన్ని రగిలించగల పోరాట శక్తి, యుక్తి వీళ్ళకు వుండవు. ఈ రకం జనాన్ని చూసి స్పందించకుండా వుండేవాడు కళాకారుడేకాడు. వర్గచైతన్యం వున్న కవి యీ జనాన్ని ఆసరాగా చేసుకొని విప్లవాచరణ బోధించటం శాస్త్రీయం కాదు. అలాగే వర్గశత్రు స్వభావాన్ని, వర్గశత్రు

సంస్కృతి నాగరికతల్ని కూడా విప్లవ కవి సరిగా అవగాహనచేసుకోవాలి. భూస్వాములు, దళారీ బూర్జువాలు యివ్వాళ పాలకవర్గం. కారులో నోట్ల కట్టల్తో వుబ్బిన జేబుల్తో బార్లను వెతుక్కుంటూ పోయేవాళ్ళు, రాజకీయ పరిజ్ఞానంలేని నిషా నాయకులు నానా రకాల చిల్లర వ్యాపారులు, వడ్డీ బొజ్జల వాళ్ళు, లాడ్జింగ్ వోనర్లు, కాంట్రాక్టర్లు, కమీషన్ వ్యాపారస్తులూ సంఘ వ్యతిరేక శక్తులే కాని కార్మిక వర్గానికి బలమైన శత్రువులు కారు, ఈ రకం పురుగుల్ని ఏరి పారేయడానికి గూండాలు, లాడ్జింగ్ అమ్మాయిలు చాలు. వర్గ శత్రువుని ఆశ్రయించుకొని బతికే వికారమైన నీడల్ని నగ్నముని వర్గశత్రువు అనుకుంటున్నాడు. భూస్వాములు, బూర్జువాలు ఉత్పత్తి సాధనాల్ని తమ కైవసం చేసుకొని పీడితుల శ్రమను తమ సంపదగా మార్చు కుంటారు. నగ్నముని సాధారణంగా నిరసించే వర్గ శత్రువులకు ఉత్పత్తి సాధనాల మీద అధికారం వుండదు. స్థూలంగా వర్గ శత్రువును గుర్తుపట్టినా, శాస్త్రీయంగా వర్గ శత్రు స్వభావాన్ని, నైతిక విలువల్ని, బుద్ధి పాటవాన్ని, సాంఘిక పాత్రని నగ్నముని అర్థం చేసుకోలేకపోయాడు. విప్లవ కవికి ముఖ్యంగా వుండవలసిన వర్గ చైతన్యాన్ని సక్రమంగా పెంచుకోవాల్సిన సాంఘిక బాధ్యతని నగ్నముని గ్రహించాలి.

నగ్నముని చైతన్యానికి తగినట్టే భాష కూడా వుంది. భాష – చైతన్యం యీ రెండింటినీ విడదీయలేం. ఆరంభదశలో తేడావున్నా క్రమంగా చైతన్యాన్ని భాష, భాష చైతన్యాన్నీ అనుసరిస్తాయి. విప్లవ కవిగా నగ్నముని 'సెక్స్ యిమేజరీ' ద్వారా సమాజాన్ని ఖండించే వలయం నుంచీ బయటపడాలి. ఈ రకం యిమేజరీ శక్తివంతమైన భావాల్ని కూడా హాస్యాస్పదంగా చేస్తుంది. స్త్రీ పురుష సంబంధాలు కుటుంబ వ్యవస్థ అత్యంత ప్రధానమైన సహజ చారిత్రిక సంబంధంగా నగ్నముని గుర్తించవలసివుంది. ఈ విషయంలో దిగంబర ధోరణి విప్లవ భావధోరణికి పూర్తిగా విరుద్ధమైంది: దీన్ని నగ్నమునే కాక యువ విప్లవ కవులంతా శ్రద్ధగా గమనించాలి, 'డక్కులు' కాకుండా మిగిలిన కవితల్లో కూడా చాలా వరకు దిగంబర ధోరణే వుంది. 'మనం నిజంగా జనంగా సాయుధంగా లేచినప్పుడే తూర్పు ఎర్రబడి ఉదయమవుతుంద'ని గుర్తించడమే చాలదు. ఆ ఆశయం వైపు శాస్త్రీయంగా జీవిత చిత్రణ జరగాలి. చివరిదాకా దిగంబర ధోరణిలో రాసుకుంటూ పోయి చివర నాలుగు వాక్యాల్లో అరణ్యాల్లోనూ, కొండల్లోనూ వెలుగుతున్న కాగడాలను చూపినంత మాత్రాన విప్లవ కవిత్వం అవుతుందా? నగ్నముని దిగంబర కవిత్వం నుంచీ విప్లవ కవిత్వానికి గుణాత్మకంగా మారలేదు. అలాంటప్పుడు 'తూర్పుగాలి' పేరుపెట్టి.

## అడివంటుకుంది

శ్రీపతి    భూషణం కథలు - శ్రీకాకుళం ప్రచురణలు

భూషణం తూర్పు కొండల్లో పండించిన పోడుపంట అడివంటుకుంది. కొండల్లోకి షావుకార్లు చొరబడిన దగ్గర్నుంచి దోపిడీ శక్తులని గిరిజన రైతాంగం ప్రతిఘటించె దశ వరకు శ్రీకాకుళం ఏజన్సీ జీవితం ప్రధానంగా యీ కథల్లో మనకు దొరుకుతుంది. జర్నలిస్టుల నిజాయితీకి చేతనైన ప్రత్యక్ష కథనం యీ రచనల బలం.

షావుకారు సత్తయ్య పల్లంలో చెడిపోయాడు. కొండల్లో సవర పల్లెల్లో తల మీద గంపతో ఉప్పు పొగాకు బెల్లము మోసి ఇంతవాడు అంతవాడై, అంతవాడు పోలీసుల్నీ, కోర్టుల్నీ అజ్ఞాపించ గలిగిసంతవాడై రాజ్యాంగానికి ప్రతినిధిగా అడివంతా తానె అయిపోయాడు.

దిక్కుమాలిన చావు చావడానికి అడవుల్లోకి వచ్చినపుడు సవరగూడ పెద్ద సారికి సిద్ధం, బడిసాల్లోకి బత్తెంపంపించి పేసిగానికి తోడిచ్చి, తిండిపెట్టి బతుకు మీద ఆశ కల్పించాడు. తిన్న ఇంటి వాసాలు లెక్క బెట్టాడు సత్తియ్య షావుకారు.

అడవుల్ని, జనరల్ ఎలక్షన్లని, పంచాయితీ ఎన్నికల్నీ, పంచవర్ష ప్రణాళికల్ని, గిరిజనాభివృద్ధి పథకాల్ని, కార్పొరేషన్లని, తినేసి బలిసి దోపిడీ శక్తుల నిరంకుశత్వానికి ప్రతినిధిగా షావుకారు సత్తియ్య తన తుపాకి గుండ్లకు సారికి సిద్ధం కొడుకు మంగుల్ని పొట్టపెట్టుకున్న కథయిది. మూడు రంగుల జెండా పేల్చిన తుపాకి గుండుకు ప్రతీకారంగా గిరిజన రైతాంగం గొడ్డళ్ళు, కొడవళ్ళు, బాకులు బాణాలు

---

'నరుడు - శివుడికి' అంకితం చేస్తూ, విరసంలో సభ్యుడుగా వుంటూ యిలాంటి రచనలను ప్రజలముందు పెట్టటం న్యాయం కాదు. నగ్నమునికి ఆదర్శప్రాయంగా పుంజదగిన కవిత్వం 'తూర్పుగాలి' లోనే వుంది. కపీ, తూర్పు, యోధుడు లాంటి కొద్ది గేయాల్లో బలమైన విప్లవ రచనా రీతులు వున్నాయి. జనాన్ని గందరగోళ పరచటంమాని, పూర్వాశ్రమాన్ని నామరూపాల్లేకుండా త్యజించి నగ్నముని విప్లవ కవిగా గొంతెత్తి యువతరానికి మార్గదర్శి కావాలి.

'ఉదయించని ఉదయాలు' ముందు మాటలో ఆరుద్ర తిరుగుబాటుదారుల మీద కూడ తిరుగుబాటు ఒకప్పుడు అవసరం అన్నాడు. అయితే కేశవరావుగా నగ్నముని చేసింది తిరోగమన బాటే, కాని నగ్నమునిగా ఆరుద్రాదుల మీద తిరుగుబాటు చేశాడు. ఇక నగ్నముని తనమీదే తాను తిరుగుబాటు చేసుకోవాలి.

[మార్చి/ఏప్రిల్ 1973, సంచిక 42/43.]

పట్టుకొని అంటుకున్న అడవి నడుస్తున్నట్టుగా దోపిడీ వర్గాల మీదికి పోతున్న దృశ్యం యీ కథ.

"ఉద్ధరింపు" రెండో కథ. లెక్కలాంటిది. ఏజన్సీలో షావుకార్ల దోపిడీ నుంచి గిరిజనుల్ని కాపాడ్డానికి దయగల ప్రభుత్వం కార్పొరేషన్లను నెలకొల్పింది. షావుకారు సరుకు గిరిజనుల్నించి కొనకూడదు. గిరిజనులు అమ్మకూడదు.

ఒకానొక నిమ్మక సంగమ్మ దగ్గర్నుంచి ఒకానొక చిన్న షావుకారు దొంగ తనంగా ఇప్ప పప్పు కొంటుండగా ఒకానొక కార్పొరేషన్ మనిషి కళ్ళల్లో పడ్డాయ్. షావుకారుకి వార్నింగ్ యిచ్చి పంపించేసి అదే పప్పును ఏలిన వారి కార్పొరేషన్‌లో తూకం వేయించి గోదాంలో వేయించాడు.

షావుకారు తూకం వేస్తే ఆరు కేజీలయిన ఇప్ప పప్పు కార్పొరేషన్ తూంకలో మూడు కేజీలయింది. షావుకారు కేజీ రూపాయి ఎనభైపైసల్లెక్కన పది రూపాయిల ఎనభైపైసలైతే పదకొండు రూపాయిలు ఇవ్వజూపితే అదే ఇప్పపప్పు ప్రభుత్వం ధర కేజీ రూపాయి ఇరవైపైసలు చొప్పున మూడు రూపాయల అరవైపైసల్ని దయగల ఏలినవారి కార్పొరేషన్ నిమ్మక సంగమ్మ చేతిలో పెట్టారు. ఎంత ఏడ్చినా పప్పు తిరిగి ఇవ్వలేదు సరికదా వాచ్‌మన్‌తో బయటికి గెంటించారు. తల్లి జబ్బుపాలయింది. డాక్టరుబాబు ఫీజుకోసం తను నెలరోజులు కష్టపడి ఏరిన ఇప్పపప్పు అమ్మాల్సి వచ్చింది. తీరా చేతికందిన ఫలితం అలాగే ఆ చేతుల్తోనే డాక్టరు చేతుల్లో పోసింది నిమ్మక సంగమ్మ. డిస్టిల్ వాటర్ సూది మందు ఇచ్చి అక్కడికి అది సరిపోయిం దనుకున్నాడు.

పది రూపాయిలకు ఏడు రూపాయిలు లాభమయితే నూరు రూపాయిలకు ఎంత లాభం? వెయ్యి రూపాయిలకు ఎంత లాభం? ఈ లాభాలు ఎక్కడికి పోతున్నాయి? ఈ పెద్దషావుకారు ఎవరు? వాడు ఈ లాభాల దోపిడీ వ్యాపారం సాగించడానికి వెనక ఉన్న సాధన సామగ్రి ఏమిటి? అదే సమయంలో పది రూపాయిలకి ఏడు రూపాయిల చొప్పున నష్టపోతే నష్ట శాతం ఎంత? కోట్లాది శ్రమజీవులకు ప్రతినిత్యం జరుగు తున్న ఈ నష్టం ఎంత? ఈ లెక్కలు వర్గ చైతన్యం ఉన్న పాఠకులు చెయ్యాలి.

ఉద్ధరింపు కథలో మనకి స్పష్టంగా తెలిసేదేమిటంటే ప్రత్యక్షంగా ప్రభుత్వం ప్రొక్యూర్‌మెంట్, కార్పొరేషన్ల పేరుతో సాగించే దోపిడీ. నిమ్మక సంగమ్మల నెలరోజుల కష్టం ఈజ్ ఈక్వల్‌టు డాక్టరుబాబు డిస్టిల్డ్‌వాటర్ సూది మందు. ఏలినవారి ఉద్ధరింపు అదంతా.

మూడో కథ "తీర్పు" తెలుగులో వచ్చిన మంచికథల జాబితాలో చేరాల్సినంత గొప్పకథ. శిల్పంలో వస్తువులో, పెద్ద కేన్వాసు మీద చిత్రీకరణలో రచయిత ప్రతిభని చూపించిన కథ. రచయిత సమర్థతని, తన సొంత ముద్రనీ చూపించిన కథ తీర్పు.

పాపినాయుడు భూకామందు. పాతికెకరాల మెట్ట పాతికెకరాల పల్లమూ కాక నాలుగ్గదుల డాబా, చింతపిక్కలాంటి కోడలు, మంచం పట్టేసిన పెళ్లము, గెడకర్ర లాంటి ఒకే ఒక్క కొడుకూ, సొందొందల తులాల బంగారము, రెండు బీరువాల్లో లెక్కలేనంత రొక్కమూ పాపినాయుడుకున్న సంపద.

శివ్వాల సత్తిగాడు (కరెంట్‌గాడు) రోజుకూలీ. వాడికి వాడి వొళ్ళు, కురిసే ఒక చిన్న ఇల్లు ఉన్న సంపద.

పట్టణాల్లో కూలీలు, కళాసీలు, పల్లెల్లో రైతుకూలీల కంటె నికృష్టమైన బతుకు కంబార్లు- జీతగాళ్ళు. పాలేర్లు అని చెప్పబడే శ్రమ జీవులది. వీళ్ళు మన సమాజం లోని అర్ధబానిసలు. పెద్దరైతులు, భూస్వాములు వీళ్ళని సంవత్సరానికి ఖరీదు కడ్తారు.

శివ్వాల సత్తిగాడు రోజు కూలిగా బతకలేక పాపినాయుడు దగ్గర కంబారిగా చేరిన పరిస్థితుల్ని, కంబార్ల బానిసత్వాన్ని చిత్రించే కథ తీర్పు.

సమితి ఎలక్షన్ రాజకీయాల్లో ఊరుకు కరెంటు వచ్చిన కొత్తలో నేస్తుల ఇగ టాల్లో శివ్వాల సత్తిగాడు ఎలక్ట్రిస్తంబం ఎక్కి పోయి తీగెల్ని పట్టేయబోయి అక్క ణ్నించి షాక్‌తో కిందపడి దాంతో మంచం పట్టేసి, అప్పుల పాలయి, బతికి బట్టకట్టి పాపినాయుడు దగ్గర కంబారి తనానికి కుదురుకుని కరెంటుగాడయ్యాడు.

ఆ రోజుల్లో ఊళ్లల్లో "సంగాలు" వెలుస్తున్నాయి. పేదరైతుల్ని. వ్యవసాయ కూలీల్ని, కంబార్లనీ ఒక్కటి చేస్తున్నాయి. శ్రమజీవులకు వర్గ దృక్పథం కలుగు తున్నది. వర్గ చైతన్యం రగుల్కొంటున్నది. ప్రజల సంఘటిత శక్తిని భూకా మందులు భరించలేక పోతున్నారు. కరెంటు షాకుతో మంచాన పడినప్పుడు సేవచేసిన పొట్టిసరస ప్రోత్సాహంతో సంగంలో చేరాడు సత్తిగాడు. తర్వాత సరస తన పెళ్ళమయింది.

సంగం కంబార్ల సమ్మెనడిపింది. గ్రామం తట్టుకోలేక మీటింగులు పెట్టుకుని సంగం అడిగిన దాంట్లో సబుపు ఒప్పుకుని బుగతలు తాత్కాలికంగా లొంగి పోయారు. బుగతల ఎత్తుగడ అది. వ్యవస్థపరంగా తమకు లభిస్తున్న అన్ని నిరంకుశ హక్కుల్ని, హంగుల్నీ సరిచేసుకుని సంగం మీద దెబ్బతీయడానికి బుగతలకు వ్యవధి కావాలి.

ఆ కుట్రలో భాగంగా పాపినాయుడు సత్తిగాడి మీద మోపిన దొంగతనం. ఘూకాసుందులు, బుగతలు, నిండుచూలాలు సరసని తెచ్చి పాపినాయుడు గుమ్మంలో గజానికికట్టి ఉంచారు. పోలీసులు ప్రత్యక్షం అయ్యారు. ముందు పోలీస్ స్టేషన్‌కి, కోర్టుకి జైలుకి ఇదీ సంగం మీద దెబ్బతీయడానికి బుగతల ముందున్న కార్యక్రమం.

సంగం ఇచ్చిన చైతన్యంతో తెగించేసాడు సత్తిగాడు. సరసని కట్టేసిన కట్లిప్పి "ఎవళకి ముందు సవ్వాలనుంటే అలే తొలిరండి. దెబ్బకి బుక్కోడు రగతాన్ని కక్కుదురుగాని" అని తొడలు చరిచి కర్రపైకెత్తి నిలబడ్డాడు. చుట్టూ మంచాల మీద అరుగుల మీద కూడున్న బుగతల నుద్దేశించి. తన మీద తీర్పు చెప్పడానికి ఎదురు తిరిగి తానే తీర్పు చెప్పాడు.

ఈ సంపుటిలోని మూడు కథల్లో బాగా జీవితాన్ని పట్టుకున్న కథ "తీర్పు". పాత భూషణం స్థాయిలో ఉన్న కథ "ఉద్దరింపు", శిల్పంగా బలహీనమైన వస్తువు బలంగా ఉన్న కథ "అడివంటుకుంది".

మొదటి కథ "అడివంటుకుంది" చచ్చిపోడానికి అడివిలోకి పోతున్న సత్తెయ్య షావుకారుతో ఆరంభమవుతుంది. అయితే ఆ చెప్పడంతో కన్‌విన్స్‌కాము, కాశీ మజిలీ కథలో ఉన్నట్టు ధ్వనిస్తుంది తప్పించి వాస్తవంలో తోచదు. క్లాసికల్ సింప్లిసిటీ కాశీమజిలీ కథల్లో ఉన్న లక్షణం అదికూడా కాదు. పాత్రని, కథని, సంఘటననీ రచయిత తొలి వాక్యాల్లో పరిచయం చేయాల్సి ఉంటుంది కాబట్టే కథ ఆరంభం కోసం రచయితలు పడే ప్రసవవేదన ఈరాసామి పోలీసు వేషం వేసుకొని మేకపిల్లని సవర గూడెం నుంచి పట్ట పగలు పబ్లిగ్గా ఎత్తుకుపోతున్న దృశ్యం దగ్గర సత్తియ్య షావుకారును పరిచయం చేస్తే ఆరంభం బలంగా ఉండేది. పెద్ద భూస్వాములకు, పెద్ద వ్యాపారులకు పోలీసు అధికారులకు ఏజంట్లుగా ఉండే గుండాలకి మాత్రమే ఆదెమ్మ మేకపిల్లను ఎత్తుకుపోగల బలం వుంటుంది. ఎప్పుడన్నా ఈరాసామిలాంటి వాళ్ళు ఇలాంటి మోసాలు చేయొచ్చు కాని పదే పదే చేయలేరు. తమకు సవర పల్లెల్లో ఉన్న దోపిడీ హక్కుని ఈరాసామిలాంటోళ్ళు కాజేయటానికి పోలీసులు గాని, భూస్వాములు గాని, వర్తకులు గాని, వాళ్ళ ఏజంట్లు గాని ఒప్పుకోరు. "కర్రిట్టుకోని జమానుబాబునాగ దమాయించేసి ఏది దొరికితే అది లంకించుకొని వాచ్చీసి పల్లంలో అమేత్తన్నాను" అంటాడు ఈరాసామి.

సత్తెయ్య షావుకారు వ్యాపారంలో దెబ్బతినేయడానికి రచయిత చెప్పే కారణాలు ఇవి. "ధాన్యం బస్తాలకు అడ్వాన్స్‌గా ఇచ్చిన డబ్బులు భూస్వాములు ఎగ మెట్టేసేరు. కాతాలు పెట్టుకెళ్ళిన వాళ్ళు సగం సగం జమలిచ్చీసరికే తల ప్రాణం తోక్కొచ్చినట్టు చేస్సీ, దివాలా తీయించీసేరు. కరిణం వల్లో పడిపోయిన పెళ్ళం

ఇల్లు గుల్లచేసి ఉన్న పదీ పరకా అతగాడికి దోచేసింది. అంతే కాకుండా కూతురు ఇరువై తులాల పాల బంగారం తీసుకొని మనసబుగా రబ్బాయితో లేచిపోయింది".

ఈ కథాకాలం నాటికి వర్తకులు దెబ్బతినేయడానికి ప్రధాన కారణం ఆర్థిక సంక్షోభం - పెద్ద వర్తకుల దోపిడీకి చిన్న వర్తకులు బలవడం. ధరలు పెరిగి పెరిగి యుద్ధానంతరం ఒక్కసారి పడిపోయాయి. ఈ దశలో చాలామంది వర్తకులు భూస్వాముల కిచ్చిన అడ్వాన్సులు వదులుకోవాల్సి వచ్చింది. పడిపోయిన ధరలకు కొనలేక సత్తెయ్య షావుకారుకు ఎదురయిన కుటుంబ కారణాలు ఒకటో రెండో అక్కడా అక్కడా జరిగితే జరగొచ్చు. కాని దోపిడీ సమాజ స్వభావాన్ని పట్టిచ్చే రచనల్లో వర్గ సమాజంలోని ఆర్థిక సంక్షోభాన్ని ఆ కారణాలు చూపలేవు.

తీర్పు కథలో సంగం చైతన్యాన్ని చెపుతూనే, సమ్మెచేసి సాధించిన విజయాన్ని చూపుతూనే కరెంటుగాడి (సత్తిగాడి) పెళ్ళం సరస కడుపుతో ఉండే భూస్వాములు తెచ్చి గుమ్మంలో కట్టేసినపుడు, కరెంటుగాడి మీద దొంగతనం నేరం మోపినప్పుడు ఏ సంగమూ కనబడదు. వ్యవసాయ కూలీలూ కనబడరు. కంబార్లూ కనబడరు. ఒక్క కరెంటుగాడె తన యుద్ధం తాను చేసుకుంటాడు. దీనిక్కారణం సంగం చైతన్యం లోపం కాదు. రచయిత అవగాహనలోపం స్పష్టం. సంగం సంగం అని చెప్తూనే సంగం రాజకీయాలని చెప్పేదగ్గర రచయిత రాజీ ధోరణిలో కనబడతాడు. ఈ కథల్లో, కమ్యూనిస్ట్, నక్సలైట్ అన్న పదాలు అవసరం, అనివార్యం అయిన దగ్గర కూడా అవి రాకుండా ఉండటానికి రచయిత చాలా జాగ్రత్త పడ్డాడు. శ్రీకాకుళం జిల్లాలో గిరిజన రైతాంగం పోరాటంని నడిపింది కమ్యూనిస్ట్ పార్టీ అని చెప్పటానికి రచయితకి ఏం అడ్డమొచ్చిందో అర్థం కాదు. శ్రమజీవులకు కమ్యూనిస్ట్ పార్టీ, ఎర్రజెండా తల్లీ తండ్రీ లాంటివి. ముఖ్యంగా దశాబ్దంపైగా చరిత్రఉన్న గిరిజన రైతాంగ ఉద్యమానికి కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం వహించింది. భారతదేశ రాజకీయాలకు క్రొత్తవేగాన్ని ఇచ్చిందిక్కడ. మహోన్నతమైన రైతాంగ సాయుధ విప్లవాన్ని సృష్టించిన కమ్యూనిస్టు పార్టీ పాత్రపట్ల రచయిత ఉదాసీన వైఖరి చరిత్ర వక్రీకరణ ప్రమాదాన్ని తెచ్చిపెడ్తున్నది. ఐతే రచయిత నిజాయితీని శంకించాల్సిన పనిలేదు. రచయిత రాజకీయ అవగాహన లోపం వల్లనే ఈ పొరపాట్లు జరిగాయి. సంపుటి తప్పనిసరిగా కథారచనలో ముఖ్యంగా పీడిత ప్రజల పక్షాన నిలబడ్డ రచయితల మీద పెద్ద ప్రభావాన్ని చూప గలుగుతుంది. కథా సాహిత్యంలో- రాచకొండ విశ్వనాథ శాస్త్రిగారన్నట్టు- ఇవి మూడు (కొత్త) భూషణాలు.

[ఫిబ్రవరి 1974, సంచిక 53]

# ఒక మహత్తర నూతన సామాజిక వ్యవస్థకు దిక్సూచి-
# 'మార్పు'

రవి

ఎనభైకోట్ల చైనా ప్రజల గురించీ; వారు గడచివచ్చిన దారులు, నడచి వెళుతున్న మార్గాల గురించీ తేటగానూ, తెల్లంగానూ చిన్నపిల్లలకు సైతం తేలిగ్గా వంటబట్టేటట్టు చిత్రించుతున్న పన్నెండుకథల సంకలనం 'మార్పు'. నిజానికి- శీఘ్రంగా మారిపోతూ వచ్చిన యిటీవలి యాభైఏళ్ళ చైనా సామాజిక చరిత్రకు, పరిణామగతికీ ఎత్తిపట్టిన అద్దం. చైనా చరిత్రిలోకెల్లా మహత్తరమైనదీ, నిర్ణయాత్మకమైనదీ, అద్వితీయమూ, అపురూపమైనదీ ఈ కాలపు చైనా చరిత్ర.

"చైనాలో విప్లవానికి ముందునుండి ఈనాటి వరకూ వేర్వేరు కాలాల్లో వ్రాయబడిన (... దాదాపు నూరు చైనీస్ కథలనుండి ఎన్నికచేసి అనువదించిన) పన్నెండు కథలు ఈ సంపుటిలో ఒక క్రమంలో ఉన్నాయి. ఆ విధంగా వివిధదశల చైనీస్ కథానికా సాహిత్యం పరిచయం చేయబడుతున్నది. ఆయాదశల్లో చైనా ప్రజాజీవనం, వారి ఉద్యమాలు ఎలా పరిణామం చెందుతూ వచ్చిందీకూడా ఈ కథలు వివరిస్తాయి-" అతిశయోక్తికి తావు లేకుండా ప్రచురణకర్తలు ఎంతో ఆచి తూచి చెప్పినమాట లివి. ఈ కథలు చదివిన ఎవరేనా దీనిని ఒప్పుకుంటారు.

ఇరవైఏడేళ్ళ స్వరాజ్యంలో ఆకలితో, అనారోగ్యంతో, దుర్భరమైన దోపిడీకి, తీరని వైఫల్యాలకు గురి అవుతూ దీనాతిదీనంగా బతుకులు తెల్లార్చుకుంటున్న కోట్లాది అభాగ్యులు, అన్నార్తులతో నిండిన దేశం మనది. బడుగుతనంలో పేదరికంలో నిన్నటి వరకు మనలను మించి దోపిడీకీ, అణచివేతకూ గురైన ప్రజలు ఆశ్చర్యకరమైన విజయాలను సాధిస్తూ ప్రపంచాన్నే దిగ్భ్రాంతి చెందిస్తున్న 'మహాద్భుతం' - చైనా! ....నిన్నటికి భిన్నమైన, పూర్తిగా కొత్తదయిన యీ చైనా. నవచైనాను, దాని ప్రగతినీ అర్థం చేసుకోవడానికిప్పుడు దేశదేశాల నిపుణులూ, నిష్ణాతులూ, ప్రపంచనాయకులూ 'పేలంవెర్రి'గా ఎగబడడాన్ని మనం చూస్తున్నాం. జనచైనా ఘనవిజయాలలో ప్రపంచ దృష్టిని అంతగా తనవేపు ఆకర్షించుకుంది మరి.

ఇది ఎలా సాధ్యమయింది ?- "ఏదిశగా వారు పయనిస్తున్నారు ? .... వీటన్నిటికీ సాహిత్యరూపంలో యీ పన్నెండు కథల్లోనూ రేఖా మాత్రంగా సమాధానాలు లభిస్తాయి." అన్నారు ప్రచురణకర్తలు.

సమాధానాలు లభించడమే కాదు, ప్రవహించే నదిలాగా, పయనించే 'బిడారు' లాగా ఒక సజీవమైన చరిత్ర చిత్రం, ఓ మహత్తర సామాజిక పరిణామక్రమం మన కళ్ళముందు అలా కదిలి సాగిపోతుందీ కథల్లో. తరచు **అతి సామాన్యమైన**, అప్రధానమైన అంశాలే 'వస్తువు'గా నడిచే యీ కథల్లో ప్రతివ్యక్తి, ప్రతి సంఘటన పఠితల మనసులమీద గాఢమైన ముద్రలు వేసుక హత్తుకుపోతూ ఉంటుంది. 'స్వాతంత్ర్యం' అనేదాని అసలు స్వరూపమూ, నవజాగృతీ, పునర్నిర్మాణమూ, వాని నిజమైన అర్థమూ మన కిందులో కనిపిస్తాయి. చైనాను దాని గమనంలో చూడ్డానికీ, చైనా ప్రజల కృషికి, సంకల్పబలానికీ కారణమైన అంశాలను అవగాహన చేసుకోటానికీ యీ కథల సంపుటి చక్కని దిక్సూచి. మనకు దీని అవసరం, ప్రయోజనమూ ఎతైంనా వుంది.

నిన్నటి చైనా నేటి భారతదేశ పరిస్థితులను గడచివెళ్ళిన బడుగుదేశమే. అందువల్లనే యీ కథల సంపుటిలో నేడు ఛిన్నాభిన్నమై శిథిలమైపోతున్న గ్రామీణ ఆర్థిక వ్యవస్థ రూపురేఖలు; రైతాంగం, గ్రామీణపనివారు గురిచేయబడుతున్న దుర్భరమైన దోపిడి, దారిద్ర్యం; ధనం 'పిడికిలి'లో విలవిలలాడి నిస్సహాయంగా అంతరించిపోయే మానవవిలువలు కళ్ళకు కట్టినట్లు కనిపిస్తాయి. 'పునరపి మరణం - పునరపి జననం'గా మరల మరల కొల్లగొని దోచుకోబడుతున్న కుటుంబాల నుండి, కమ్యూనిస్టుల మాటలు విని 'చెడి'పోతున్న మన కుర్రవాళ్ళను, వాళ్ళు సాగించే తిరుగుబాటును - త్యాగాలను, వాని విజయాన్నీ కూడా మనం యీ కథల్లో చూస్తాం. చివరకు యీ త్యాగాలు, పోరాటాల ఫలితంగా ఏర్పడే ఓ నూతన సామాజిక వ్యవస్థ: ఆ వ్యవస్థలో సగర్వంగా తలెత్తి లేచే ఒకానొక నూతన మానవుడూ - 'మార్పు, బాధ్యత' అన్న కథల్లో మనకు సాక్షాత్కరిస్తారు.

అన్నిటికీ మించి, "గేదే కన్నా పంది కన్నా కూడా" దీనంగా, హీనంగా 'కొనబడి - అమ్మబడీ' నిస్సహాయురాలైన స్త్రీ సమున్నతంగా నిలచి, సామాజికోత్పత్తి క్రమంలో తన స్థానం స్వీకరించి, నాయకత్వం వహించగల శ్రామిక మేధావిగా పరిణతినందే ఒక ఉజ్జ్వలక్రమాన్ని యీ కథలు మనకు చూపుతాయి. స్త్రీయొక్క యీ రెండు రూపాలనూ మరింత స్పష్టంగా వ్యక్తంచేసేవి 'దానిసత్వం', 'కళాకారుని కళ' అనే కథలు.

"చైనాలో విప్లవానికి ముందు కాలంలోగల ప్రజల దుర్భరదారిద్ర్యాన్నీ, భూస్వాముల దోపిడీని చిత్రించే రెండు కథలను యీ సంపుటి మొదట్లోనూ, 'సాంస్కృ

తిక విప్లవానంతరకాలంలో వ్రాయబడిన' మూడు కథలను చివరలోనూ చేర్చారు. మార్క్సిస్టు మూలసూత్రాలను, మౌలిక అవగాహనను సమాజంలోని అన్నిరంగాలకు, అన్ని ఆలోచనలకు, అందరు వ్యక్తులకు సృజనాత్మకంగానూ, సరిగానూ, దృఢంగానూ అనువర్తింపజేసే ప్రయత్నమే చైనాలో సాగిన సాంస్కృతిక విప్లవం లక్ష్యంగా తోస్తుంది. విస్తృత ప్రాతిపదికపై అయా చోట్లన్నింటా పెటీ బూర్జువా అలవాట్లను, ఆలోచనాక్రమాన్ని, దాని ఆధిక్యతనూ, బద్దలుకొట్టి, ఆ స్థానంలో శ్రామికవర్గసంకల్ప విశిష్టతనూ, స్ఫూర్తినీ, మార్క్సిస్టు మౌలిక అవగాహననూ బలంగానూ, ఘటిష్ఠంగానూ ప్రతిష్ఠించటమే యీ విప్లవంగా చివరి మూడు కథలూ నిరూపిస్తాయి.

ఒకదానికన్న మించి మరొకటి మిన్నగా అనిపించే నూరు మంచి కథల నుండి పన్నెండు మేలితునకలను ఎన్నికచేయట ఎంత కష్టమో, వాటిని ఒక వరుస క్రమంలో కూర్చటం కూడా అంత కష్టం. ఈ రెండు పనులను అనాయాసంగా సాధించిన సంకలనకర్త, (శ్రీ చలసాని ప్రసాదరావు) అంతకు మించిన ప్రతిభను అనువాద కృషిలో ప్రదర్శించటంతో యివి 'సహజ'మూల రచనలుగానే మనకు తోస్తాయి. పేర్లు, స్థలాలు మార్చితే అచ్చంగా యివి తెలుగు ప్రజాజీవితం నుండి ఉద్భవించిన తెలుగు రచనలే - మూలంలో రచయితలు సాధించిన వాస్తవికతతో పాటు తెలుగు చేయటంలో అనువాదకుడు నిరూపించుకున్న సృజనాత్మక కౌశలం యిందుకు కారణ మయింది. ప్రతి కథకూ మొదట ఆ కథలోని బలమైన సన్నివేశాన్నో, భావాన్నో తెలిపే చక్కని చిత్రాలను చేర్చారు.

ప్రారంభించిన కొద్ది కాలంలోనే 'జనత ప్రచురణలు' అందించిన మంచి పుస్తకాలలో మరో మంచి ముత్యమిది. అన్నివిధాలా మేలి ముత్యమే. కథల ఎన్ని కలో ఆయనవేసిన తూకం, చూపిన అభిరుచీ హాయిగా, అభినందనీయంగా వున్నాయి.

మన కాలపు మంచి కథానికల సంపుటిల్లో, ప్రయోజనకరమైన సృజనాత్మక అనువాదసాహిత్యంలో 'మార్పు' ఒకటి. అనువాదకుని ప్రతిభదీనిని బాలసాహిత్య మంత సరళంగా చేసింది.... ఒక్క మాటలో నేటి (జన) చైనాను అర్థం చేసుకోటా నికీ, చైనా ప్రజలను తెలుసుకోటానికీ - మనమూ ఓ సంకల్పం ఏర్పరచుకోడానికీ సంగ్రహంగా 'మార్పు' ఒక్కటి చాలు.

[అక్టోబరు 1974, సంచిక 61]

# మార్క్సిస్టు తత్వశాస్త్రం

కొడవటిగంటి కుటుంబరావు

విరసం ఉద్భవించిన కొత్తలో విప్లవ రచయితలు మార్క్సిస్టులు కానవసరం లేదనీ, అనుభవం నుంచి విప్లవరచనలు రావచ్చుననీ ఒక వాదం వెలువడింది. దీని వెనుక ఉన్న మనస్తత్వాన్ని మూడు దశాబ్దాల చిల్లరక్రితమే డేవిడ్ గెస్ట్ ఖండించాడు.

"అనుభవం చాలదా? సిద్ధాంతం దేనికి?" అనేవారు శ్రామికవర్గంలోనే ఉండటాన్ని అతను తప్పుపట్టి "సిద్ధాంతం కార్యకర్తకు అడుగడుగునా అవసరమే" అన్నాడు. ఏమి చేసి ఏ ఫలితం సాధించాలన్నా ఒక సార్వత్రిక సూత్రాన్ని ఆధారం చేసుకోవాలి. ఇలాంటి సార్వత్రికసూత్రాలన్నే చేరి సిద్ధాంత మవుతాయి. అనుభవం ద్వారా రుజువైన సిద్ధాంతం శాస్త్రీయ సిద్ధాంతం అనిపించుకుంటుంది.

సిద్ధాంతమూ అనుభవమూ పరస్పరాధారం గలవి. శాస్త్రజ్ఞానమంతా అనుభవం నుండి పుట్టి, అనుభవాన్ని విస్తరించుతూ దానిద్వారా పెరుగుతూ వచ్చినదే. సిద్ధాంతమూ, అనుభవమూ అనేవి వైరుధ్యాలు. అవి విడదీయరానివి. "వైరుధ్యాల ఐక్యత" అన్నది గతితార్కిక భౌతికవాదానికి వెన్నెముక.

అయితే వర్గసమాజంలో - ముఖ్యంగా బూర్జువా సంస్కృతిలో - అనుభవ సిద్ధాంతాల ఐక్యత గుర్తించబడదు. బూర్జువా ప్రపంచ దృక్పథం శాస్త్రజ్ఞానంతో సమాజ స్వభావాన్ని అవగాహన చేసుకునే వైఖరి సహించదు; ఎందుకంటే అలాంటి అవగాహన విప్లవ స్వభావం కలిగి ఉంటుంది. బూర్జువా సంస్కృతిలో అంతో ఇంతో మతదృష్టి ఉంటుంది; పదార్థంకన్న మనస్సూ, "ఆత్మ" ప్రాముఖ్యం వహిస్తాయి; పెట్టుబడిదారీ దశ చిరస్థంగా ఉండాలన్న ఆరాటం ఉంటుంది.

ఈ సంస్కృతి శ్రామికవర్గశత్రువు. ప్రపంచాన్ని భౌతికదృష్టితో చూడటమూ, దానిలో కలిగే విప్లవ పరిణామాలను గ్రహించటమూ గతితార్కిక భౌతిక తత్వం చేసే పని. అదే శ్రామికవర్గదృక్పథం.

"సిద్ధాంతం బాగానే ఉండవచ్చు, కాని ఆచరణలో సాధ్యం కాదు." అన్న మాట అర్థంలేని మాట. ఆచరణలో రుజువైనదే సిద్ధాంతం. బూర్జువా సంస్కృతిలో ఆచరణకూ, సిద్ధాంతాలకూ పొంతన లేకుండాపోయిన కారణంగా యిటువంటి మాటలు పుట్టుతాయి.

శాస్త్రీయ సామ్యవాదం శ్రామికోద్యమానికి ప్రాతిపదిక. అన్ని శాస్త్రాల దృక్పథాన్నీ యిది పరిగ్రహిస్తుంది. మానవ సమాజం మొదలుకొని ప్రతిదాన్ని

శాస్త్రీయదృష్టితో అర్థం చేసుకుంటుంది. అందునా బూర్జువా తత్వంతో దీనికి ఘర్షణ తప్పదు. ఈ ఘర్షణ స్వరూపం ఆధునికమైనదైనా స్వభావం ప్రాచీనమే. మన పూర్వులలోనే ప్రకృతి వాదమూ, ఆధ్యాత్మికవాదమూ ఘర్షణపడ్డాయి, (ప్రకృతివాదం నుంచి శాస్త్రవిజ్ఞానమూ, ఆధ్యాత్మికవాదుల నుంచి ఈశ్వరుడూ, ఇహపరవిభజనా, కర్మసిద్ధాంతమూ పుట్టుకురావటం యాదృచ్ఛికం కాదు.) ఆధ్యాత్మికవాదం అనేది చేసేది ఏమంటే, భౌతికకారణాలవల్ల కలిగే పరిణామాలకు అలౌకికకారణాలు ఆపాదించటం. దీని వెనక మతదృష్టి ఉంటుంది. ఆధ్యాత్మికవాదుల దృష్టిలో భౌతిక ప్రపంచం యొక్క అస్తిత్వమే అనుమానాస్పదం. దాన్ని గురించి మనకు నిజంగా ఏమీ తెలీదు। తెలుసుననుకునే దంతా భ్రమ.

అయితే ఆధ్యాత్మికవాది జీవించేది భౌతిక జీవితమే. ఆకలి అన్నం తింటే పోతుందని తెలుసు; వానలో తడవకుండా గొడుగు పట్టుకోవాలని తెలుసు. మొండి కత్తికి పదును పెట్టించాలని తెలుసు. రైతులూ, కూలీలూ పొలాలలో పడి గొడ్ల లాగా పనిచేస్తేనేగాని పొయిలో పిల్లి లేవదని తెలుసు. అయితే ఈ ఆధ్యాత్మికవాది ఆధిక్యత ఎక్కడ వున్నదంటే తనను పోషించేవారి శ్రమను చిన్నచూపు చూడటంలో ఉన్నది; తాను తన లాభక్షేమాల కొరకు వినియోగించే శాస్త్రజ్ఞానాన్నే తిరస్కరించి తాను కూర్చున్న కొమ్మనే నరుక్కునేవాడి మనస్తత్వం ప్రదర్శించటంలో ఉన్నది; ఆధ్యాత్మికవాదులు బుద్ధిని పైకెత్తి, శరీర శ్రమను చిన్నచూపు చూస్తూనే మహామేధావులైన శాస్త్రవేత్తలు కనిపెట్టే శాస్త్రజ్ఞానాన్ని కూడా ప్రతిఘటిస్తారు. ఆధ్యాత్మిక దృష్టి హేతుబద్ధంగా వుండటానికి వీల్లేదు.

ఆధ్యాత్మికవాదులకు వాస్తవమైన పునాది లేదు. "ఈశ్వర సత్యం జగన్మిథ్యా" అన్న ప్రాతిపదికమీద వారు ఆధ్యాత్మికవాదాన్ని నిర్మించారు. జగత్తు మిధ్య అన్న విశ్వాసానికి ఆధారం ఏమిటి? జగత్తు వాస్తవమే అనుకుని దానిమీద మేధాశక్తితో సిద్ధాంతాలు చేస్తూ పోతే నిజమైన భౌతికవాదం రూపొందుతుంది. జీవంకన్న మరణమే మేలన్న ప్రాతిపదికమీద జీవితసత్యాలు పుట్టుకురావుగదా.

మన జ్ఞానేంద్రియాలు భ్రమలు కలిగిస్తాయన్నది ఆధ్యాత్మిక దృష్టిని నిరూపించదు. శాస్త్రవేత్త ఆ భ్రమలు ఏ కారణాలవల్ల కలుగుతాయో, వాటివెనక "సత్యం" యెలా ఉంటుందో భౌతికదృష్టితోనే అన్వేషిస్తాడు, కామెర్లరోగికి లోకం పచ్చగా కనిపించటం భ్రమే. అంతమాత్రం చేత ప్రపంచం మిధ్య కాదు. పచ్చగా కనిపించే ప్రపంచం వెనక ఉన్న కామెర్లరోగానికి చికిత్సచేస్తే ఆ భ్రమ పోతుంది. అన్నీ

రోగసంబంధమైన భ్రమలే కావు- అనేక భ్రమలు ప్రకృతిసిద్ధమైనవి. మన జ్ఞానేంద్రియాల నిర్మాణం, వాటికి గల పరిమితులు అనేక భ్రమలు కలిగిస్తాయి. అవి ప్రకృతిసిద్ధమైనవి అన్న తరవాత ఈశ్వరుణ్ణి చర్చలోకి తేనక్కరలేదు; ఆ భ్రమలకు భౌతిక కారణాలే దొరుకుతాయి.

"జగత్తే మన దత్తాంశం (డేటమ్), అది మనకు ప్రసాదితం, అది ఉన్నది, అదే మన నిత్యప్రపంచం, మన సమానుభవం (కామన్ ఎక్స్‌పీరియన్స్) అందులో పరిణామాలు జరుగుతాయి." అన్నాడు ప్రొఫెసర్ లెవీ.

ఇలాటి వైఖరి ఆత్మవిధ్వంసకమైనది కాకపోగా హేతుబద్ధమైనది కూడా.

అసలు ఈ ఆధ్యాత్మికవాది వైఖరి అనేది ఎలా వచ్చింది? అవకతవక దృక్పథాలకు కూడా కారణాలుంటాయి. భౌతికవాదానికీ, ఆధ్యాత్మికవాదానికీ అంతులేని సంఘర్షణ జరిగింది, జరుగుతున్నది. ఇది కేవలమూ భావసంబంధమైన సంఘర్షణ కాదు. (అల్పాయుష్కుడైన శంకరుడు సాంఖ్యంతోనూ, చార్వాకంతోనూ చాలా ఘర్షణ పడ్డాడు. చిట్టచివరకు సాంఖ్యానికీ, ఆధ్యాత్మికవాదానికీ పొసగని లంకె కృత్రిమంగా తగిలించారు.) ఇలాటి సంఘర్షణలు ఆకాశం నుంచి ఊడిపడవు. ఈ సంఘర్షణ వర్గసమాజం నుంచీ, వర్గపోరాటం నుంచీ పుట్టింది, వర్గపీడనకు ఉపయోగపడుతున్నది. లేకపోతే వర్గపీడనలోనూ, వర్గసంబంధాలలోనూ ఉన్న సాంఘిక దురన్యాయాన్ని సమర్థించటం ఎలాగ? ఉత్పత్తిమీద ఆధారపడిన సమాజంలో ఉత్పత్తి చేసే వాళ్లు హీనులనీ, చెయ్యీ కాలూ కదల్చకుండా అందలాలెక్కి తిరిగేవాళ్లు ఉన్నతులనీ వాదించటమెలాగ? పెట్టుబడిదారీ సమాజానికి కూడా ఈ ఆదర్శవాదాన్ని అసరా చేసుకోక తప్పలేదు. చిత్రమేమిటంటే, పెట్టుబడిదార్లు అందుబాటులో ఉన్న శాస్త్ర విజ్ఞానాన్ని పుష్కలంగా వినియోగించుకుంటారు. శ్రామికవర్గాన్ని మరింత క్షీణదశకు తీసుకురావటానికి ఆటోమేషన్‌లాటి సాంకేతిక ప్రక్రియలకు వారికి అభ్యంతరం లేదు. కాని వారికి భౌతిక తత్వవాదం సరిపడదు. పెట్టుబడిదారీలో ఉన్న సాంఘిక వైరుధ్యాలలో ఇది కూడా ఒకటి.

ఉత్పత్తి చేసే శ్రామికుడికి ఈ అధ్యాత్మికవాదం ఎందుకూ పనికిరాదు. దున్నేవాడూ, వడ్రంగం చేసేవాడూ, లేత్ మీద పనిచేసేవాడూ, యంత్రాలు తయారుచేసేవాడూ పచ్చి భౌతికవాదులుగానూ, నైపుణ్యం మీద ఆధారపడినవారుగానూ మాత్రమే పనిచెయ్యగలరు. వాళ్లకు ఈశ్వరుడు లీలలను గురించీ, పూర్వజన్మ తాలూకా పుణ్యపాపాల గురించీ, అలాటి లిఖితాలను గురించీ చెప్పాలంటే తీరికవేళలలోనే

సాధ్యం: ఈ ఉచ్చుల నుంచి బయటపడాలంటే శ్రామికవర్గం భౌతికవాదానికి పరాకాష్ఠ అయిన మార్క్సిజమును అవలంబించాలి. అది ప్రపంచకార్మికుల సొంతం.

ఆదికాలంలో తత్వవేత్తలు భౌతికవాదాన్నే అవలంబించారు. ప్రపంచం పాంచభౌతికమని ఊహించారు. గ్రీకు తత్వవేత్తలు నాలుగే చెప్పారు; ఆకాశాన్ని వదిలేశారు. అణుసిద్ధాంతం కూడా చాలా ప్రాచీనమైనది. అయితే ఆకాలపు తత్వవేత్తలకు ప్రయోగవిధానాలు లేవు: అవి కొద్ది శతాబ్దాల క్రితంవచ్చి, ఆధునిక శాస్త్రవిజ్ఞానానికి దోహదం చేశాయి.

భౌతికవాదంనుంచి "యాంత్రికవాదం" వచ్చింది. బ్రిటనులో యంత్ర నాగరికత పెరుగుతున్న దశలో యంత్ర సంబంధమైన విజ్ఞానాన్ని పెంచటానికీ, మతరాజస శక్తులను ప్రతిఘటించటానికీ ఈవాదం అవసరమయింది. మూడు వందల ఏళ్ళక్రితం ఇతర శాస్త్రవిజ్ఞానం కన్న యాంత్రిక విజ్ఞానమే హెచ్చుగా అభివృద్ధి చెందింది.

యాంత్రిక భౌతికవాదం ప్రకారం ప్రపంచం ఒక క్లిష్టమైన యంత్రం. దాన్ని "కీ" ఇచ్చి ఆడించటం మొదలుపెట్టారు; అప్పటి నుంచీ అది నియమిత సూత్రాల ప్రకారం మార్పు లేకుండా నడుస్తూ వస్తున్నది. ఈ దృక్పథంలో పరిణామవాదానికి ఆస్కారం లేదు. ఈ వాదం సాధారణతర్కాన్ని ఆశ్రయిస్తుంది. గతితర్కానికి అవకాశం లేదు. ఈ వాదంలో ఉన్న పెద్ద లోపం సులువుగా గ్రహించవచ్చు. ఈనాడున్న ప్రాణులన్నీ ఆది నుంచీ ఉండి ఉండాలి; కొత్త జీవజాతులు పుట్టటానికి గాని, పాతవి అంతరించటానికి గాని వీలులేదు. మానవ సాంఘిక వ్యవస్థలో కూడా మార్పుకు అవకాశంలేదు. ఈ కారణంచేత ఇది మత విశ్వాసం లాంటిదిగా తయారవుతుంది. ఎందుకంటే, మత విశ్వాసాలు మారరాదు. ఆ కారణంచేత ఇది "ఆదర్శవాదానికి" దారి తీసింది; విప్లవ ధోరణులను అటకాయించింది.

అందుచేత దీనిని ప్రతిఘటించుతూ గతితర్కం వచ్చింది. గతితర్కం మార్పుల వెనక ఉండే హేతువులను వివరిస్తుంది. గతితర్కం శాస్త్రవేత్తలకు కూడా అవసరమయింది. దాని సహాయం లేకుండా జీవ పరిణామం ఎలా అర్థమవుతుంది? చరిత్రా, సాంఘిక పరిణామమూ ఎలా అర్థమవుతాయి? కొంతమంది చారిత్రక పురుషుల చర్యలే చరిత్ర అన్నది చరిత్రకు అర్థం చెప్పదు. గతితార్కిక విధానాన్ని రూపొందించినవాడు హెగెల్.

కాని హెగెల్ ఒక అలౌకిక శక్తిని మూలకారణంగా పేర్కొని, అదే పరిణామాన్ని సాధించుకుంటూ పోతున్నదనీ, మానవ మేధస్సుతో దానికి ఎలాటి ప్రమే

యమూ లేదనీ అన్నాడు. మార్క్స్, ఎంగెల్స్‌లు ఈ తలకిందులు సిద్ధాంతాన్ని భౌతిక వాస్తవికత అనే కాళ్లమీద నిలబెట్టారు. చరిత్ర పరిణామంగాని, సాంఘిక పరిణామంగాని, జీవ పరిణామంగాని సూటిగా (యాంత్రికంగా) జరగలేదు. అది కిందినుంచి మీదికీ జరిగింపే గాని, దాని మార్గం గమ్యానికి సూటిగా జరగలేదు. వంకర టింకరగా, ఎగుడు దిగుడుగా జరిగింది. అందుచేత పరిణామం వెనక అవాఙ్మానస శక్తిన ఏదీలేదు. భౌతిక సూత్రాలే పనిచేస్తున్నాయి.

గతితర్కం భౌతికవాదాన్ని దృఢంగా నిలబెట్టింది. ఇప్పుడు ప్రపంచవాస్తవాన్ని శాస్త్రీయంగానూ, భౌతికదృష్టితోనూ అవగాహన చేసుకునేటందుకు వీలు ఏర్పడింది. అంతేగాక ఇది విశ్వాన్ని ఏకాండంగా భావన చెయ్యగలదు; ప్రతి విషయాన్ని విశ్లేషించగలదు.

గతితార్కిక భౌతికవాదాన్ని మొదట ప్రవచించినవాళ్లు మార్క్స్, ఎంగెల్స్‌లు. సిద్ధాంత ఆచరణల ప్రాతిపదిక గల ఈవాదం శ్రామికోద్యమంలో ప్రచారం కావటంలో వింతలేదు. యాంత్రిక దృక్పథం నుంచి విముక్తి పొందలేని బూర్జువా ఆలోచనాధోరణికి సిద్ధాంతాచరణల ఐక్యత సాధ్యం కాదు. "గతితార్కిక భౌతికవాదం" అన్న మాటే అయోమయంగా ఉన్నదన్న బూర్జువా మేధావులున్నారు. కాని భౌతికవాదంలో గతి తర్కం ఎలా ఉంటుందో అర్థం చేసుకొనటం చిన్నపిల్లలకు కూడా సాధ్యమే. ఇది ముందు చూద్దాం. విశ్వమంతటా జరిగే పరిణామాలను వివరించే తత్వం రూపంలో గతితార్కిక భౌతికవాదం అవతరించింది. 19వ శతాబ్దంతో ప్రకృతిశాస్త్రాలు గతితర్కాన్ని పుష్కలంగా రుజువుచేశాయి. శక్తి అన్నది ఒక రూపం నుంచి మరొక రూపానికి పరివర్తన చెందగలవని రుజువయింది. యాంత్రిక, ఉష్ణ, కాంతి, విద్యుత్, అయస్కాంత, రసాయన సంయోగశక్తులన్నీ "కదలిక" యొక్క రూపాంతరాలేనని రుజువయింది. ప్రకృతిలో గల కదలికలన్నీ ఒకటే నన్నది కేవల తాత్విక ప్రతిపాదనగాక ప్రకృతి శాస్త్రజ్ఞానంలో ఒక వాస్తవం అయింది.

బహుకణజీవులన్నీ కణవిభజనా, కణ విచక్షణా అనే ప్రక్రియలద్వారా ఏర్పడతాయన్నది రుజువయింది. చెట్లు చేపలు మొదలుకుని తిమింగిలంలాంటి మహాప్రాణి దాకా ప్రతిజీవీ ఏక కణంగా జీవితం ఆరంభించటం జరుగుతున్నది. అలాటప్పుడు ఇన్ని కోట్లరకాల జీవరాసులు ఎలా ఏర్పడ్డాయన్న ప్రశ్నకు పరిణామ వాదం సమగ్రమైన సమాధానం ఇచ్చింది. ఈ విధంగా గతితర్కం విజ్ఞానరంగంలో వివిధ శక్తి రూపాల మధ్య సరిహద్దులను తుడిచివేసి, వాటివెనక ఉన్న ఏక సత్యం "కదలిక" (గతి) అని నిరూపించింది.

ఎంగెల్స్ 19వ శతాబ్దికి చెందిన ప్రకృతి శాస్త్రాలను ప్రత్యేకంగా అధ్యయనం చేసి, ప్రకృతినీ, చరిత్రనూ నయితం "గతిసూత్రాలు" శాసిస్తున్నాయనీ, యాదృచ్ఛికంగా ఏదీ జరగటం లేదనీ సిద్ధాంతీకరించి, స్థూలంగా మూడు సూత్రాలు ప్రతిపాదించాడు. క్రియా(Process) పరివర్తనా. (Change) , పరిణామమూ (development).

గతి సూత్రాలను హెగెల్ ఇలా నిబంధన చేశాడు.

1. ప్రమాణమూ, గుణమూ ఒకదాని నుంచి మరొకటిగా మారుతాయి.
2. వైరుధ్యాల మధ్య ఏకత్వం (పరస్పర సంబంధం, సామ్యం) ఉన్నది.
3. వ్యతిరేకించినది వ్యతిరిక్తం అవుతుంది (Negation of Negation).

మార్క్స్, ఎంగెల్స్‌లు ఈ సూత్రాలను వినియోగించుకొన్నారు. ఈ మూడు సూత్రాలూ అనుభవంలో ఎలా వర్తించేదీ చూడవచ్చు.

1. గుణం నుంచి ప్రమాణమూ, ప్రమాణం నుంచి గుణమూ మార్పు చెందుతాయి.

పదార్థాలలో ప్రమాణానికి అనుగుణంగా కొత్తగుణాలు ఎలా వస్తాయో, కొత్త గుణాల ద్వారా ప్రామాణికమైన మార్పులు ఎలా కలుగుతాయో ఈ సూత్రం చెబుతుంది. పదార్థాల ఘన, ద్రవ, వాయు స్థితులు మనకు తెలిసినవే. నీరు ద్రవం. దాన్ని వేడెక్కిస్తే ఆవిరి అవుతుంది. చల్లబరిస్తే మంచు అవుతుంది. ఈ స్థితి మార్పు కూడా క్రమంగా జరగదు; ఒక దశలో ఆకస్మికంగా జరుగుతుంది.

ఈ ఉదాహరణలో ప్రమాణం వేడిది, గుణం నీటిది. ఎందుకంటే మంచి ఉష్ణోగ్రతకు నీటిని చల్లబరచవచ్చు; అది ఇంకా నీరు రూపంలోనే ఉంటుంది. మరింత "చలి" చేరితే తప్ప నీరు మంచుగా మారదు. అలాగే నీరు ఆవిరి అయ్యే ఉష్ణోగ్రతలో నీరు వెంటనే ఆవిరి అయిపోదు. మరికొంత వేడిని స్వీకరించిన మీదటనే నీరు ఆవిరిగా మారిపోతుంది.

ఇదే ఉదాహరణలో నీరును ప్రమాణంగా భావించి నీటి ప్రమాణం గుణంలో మార్పుకు ఎలా కారణభూతమవుతుందో చూడవచ్చు. మాటవరసకు ఒకే ఒక నీటి అణువుకు ఘనద్రవవాయుస్థితి అంటూలేదు. మంచులోనూ, నీటిలోనూ, ఆవిరిలోనూ కూడా నీటి అణువురూపం మార్పు చెందదు. అదే అనేక కోట్లకోట్ల అణువులు చేరే సరికి వాటికి నీరుగానూ, మంచుగానూ, ఆవిరిగానూ ఉండేగుణం సాధ్యమవుతుంది.

అదే విధంగా ఏ అరణ్యం మధ్యనో, నిర్జనద్వీపంలోనో నివసించే ఒకరిద్దరు మానవులలో సామాజికుల గుణాలు ఉండవు. అధికసంఖ్యలో ఒకే జీవితంలో భాగస్వాములైన మానవులే సామాజికుల గుణాలు అలవరుచుకుంటారు. వ్యక్తి తిరుగుబాట్లు విప్లవం కావనీ, వర్గాలకు వర్గాలు కదిలి తిరుగుబాటు చేసినప్పుడే విప్లవం వస్తుందనీ మనకు తెలుసు. ప్రమాణం కొత్త సామాజికగుణాలకు దారితియటానికి విప్లవం మంచి ఉదాహరణ.

కొత్త గుణాలు కొత్త ప్రమాణాలకు దారితీయటం మానవ చరిత్రే మంచి ఉదాహరణ. ఆహారం ఏరుకుతింటూ, జంతువులను వేటాడుతూ తిరిగిన దశలో జన సమూహాలు ఒకటి రెండు డజన్లను మించేవికావు. వ్యవసాయం రాగానే స్థిరనివాసానికీ మంది సమిష్టి జీవనానికీ ఆస్కారం ఏర్పడింది. లోహయుగం నగర నిర్మాణానికి దోహదం చేసింది. ఆధునికశాస్త్ర విజ్ఞానం కోటిమందికి సమిష్టి జీవనం చెయ్యటమేగాక, మానవజాతినే ఏకం చెయ్యటానికి ఉపక్రమించింది. ప్రపంచమే కుంచించుకుపోయింది. ఆయా దశలలోని సమాజస్వరూపాలను తరిచిచూసి నట్టయితే జన ప్రమాణం సాంఘిక గుణాలలో ఎటువంటి మార్పు తెచ్చిందీ కూడా స్పష్టమవుతుంది. గుర్తుంచుకోవలిసిన అంశమేమంటే, గుణంనుంచి పరిమాణానికీ, పరిమాణం నుంచి గుణానికీ కలిగే మార్పులన్నీ విప్లవ పరిణామాలు; అవిక్రమంగా జరిగేవి కావు. నీరు చిక్కబడి మంచుకావటం అనేది ఉండదు.

## 2. వైరుధ్యాల ఐక్యత

వాస్తవ ప్రపంచమంతా వైరుధ్యాల మయమని ఈ సూత్రం చెబుతుంది. వైరుధ్యాలనేవి ఒకదానికొకటి వ్యతిరేక స్వభావం కలవే అయినా వాటిమధ్య విడదీయరాని సంబంధం ఉన్నది. ధనికులు లేనిచోట పేదలంటూ ఉండే అవకాశం లేదు. ఒకడి ఋణం మరొకడి ఆదాయం. తూర్పుగా వెళ్లేదారే, పడమరగా వచ్చేదారి. ఋణ విద్యుత్తు ఉండబట్టే ధన విద్యుత్తు ఉన్నది. ఉత్తరధృవం ఉండబట్టే దక్షిణ ధృవం ఉన్నది. అచ్చగా ఉత్తర శృంగమో, దక్షిణ శృంగమో గల సూదంటురాయిని తయారుచేయటం అసాధ్యం. ఎండ లేనప్పుడు నీడా లేదు. పదార్థమూ, శక్తీ కలిసి ఉంటే వైరుధ్యాలే! వైరుధ్యాలను గురించి అర్థం చేసుకోవటం యొక్క ప్రాముఖ్యాన్ని లెనిన్ చెప్పాడు.

మానవ సమాజంలో గల వైరుధ్యాలను గ్రహించటం ద్వారా సామాజిక పరిణామాన్ని వివరించటం మార్క్సిజంకు సాధ్యమయింది.

మరొకటి ఏమంటే, వైరుధ్యాల మధ్య ఐక్యత అన్నది ఒక తాత్కాలిక పరిస్థితిని బట్టి మాత్రమే ఉంటుంది. కాని విశ్వదృష్టితో చూసినట్టయితే వైరుధ్యాలమధ్య సంఘర్షణే గతిని (పరిణామాన్ని) నిర్ణయించేది.

3. వ్యతిరేకించినది వ్యతిరిక్తమవుతుంది.

అన్ని రంగాలలోనూ విప్లవ పరిణామాలు కలిగే పద్ధతి గుండ్రంగా తిరుగుతూ పైకిపోయే మెట్ల (spiral) లక్షణం కలిగి ఉంటుందని ఈ సూత్రం చెబుతుంది. ఒక క్షణంలో పడమరగా మెట్లు ఎక్కుతున్నవాడు మరొకదశలో దానికి వ్యతిరేకంగా, తూర్పుగా, ఎక్కుతూ కనిపిస్తాడు; మరొకదశలో దానికి వ్యతిరేకంగా మళ్ళీ పడమరగా ఎక్కుతాడు. విశేషం ఏమిటంటే వాడు పూర్వం ఉన్న స్థితికన్న ఎత్తులో ఉంటాడు. అంటే పరిణామం ఒకప్పుడు విసర్జించిన దశ తాలూకు లక్షణాలను కొన్నిటిని ప్రదర్శిస్తుంది; అయితే ఇది ఉన్నత దశ. యాంత్రిక భౌతికవాదాన్ని తోసిపుచ్చి గతి తార్కిక భౌతికవాదం రావటం ఇందుకు ఒక ఉదాహరణ. ఆదిమ జాతులలో ఉండిన సామ్యవాదమూ, నిర్బంధ ప్రజాతంత్రమూ ఉన్నతదశలో - కమ్యూనిస్టు వ్యవస్థలో - తిరిగిరావటం మరొక ఉదాహరణ అనుకోవచ్చు.

ఈ సూత్రాలను బలాత్కారంగా చరిత్రకుగాని, ప్రకృతికిగాని అంటగట్టటం సాధ్యం కాదు. మార్క్సు, ఎంగెల్సులు ఈ విషయం నొక్కివక్కాణించారు.

పైన చెప్పిన సూత్రాలమధ్య సమన్వయం గ్రహించాలంటే గతితర్క విధానాన్ని అవగాహన చేసుకోవాలి. ఈ పని లెనిన్ చేశాడు. వైరుధ్యాల అవినాభావ సంబంధం గతితర్కానికి మూల సంబంధమనీ, అయితే ఆ సూత్రాన్ని వివరించటమూ, విస్తరించటమూ అవసరమనీ ఆయన అన్నాడు. ఇందుకుగాను ఆయన పదహారు అంశాలు చెప్పాడు. అవన్నీ ఈ పుస్తకంలో చెప్పబడిఉన్నాయి. ఈ సందర్భంలో, వైరుధ్యాలను గురించి మావో వ్యాసాలు మరింత స్పష్టమైన అవగాహనతో కూడుకుని ఉండి, అందరూ చదవదగినవి....

గతితార్కిక భౌతికవాదాన్ని చరిత్రకు అనువర్తింపజేసిన దాకా శాస్త్రీయమైన చరిత్ర లేకపోయింది. చరిత్రను భౌతికదృష్టితో అవగాహన చేసుకోవటం- చారిత్రిక భౌతికవాదం - శాస్త్రీయ సామ్యవాదానికి అవసరం. శాస్త్రీయం కాని చరిత్ర పుక్కిటి పురాణాలపుట్ట. బూర్జువా దృష్టిలో "చరిత్ర ఇంకా శాస్త్రం కాదు, అది శాస్త్రమనే అభాస కలిగించటానికి కొన్ని దాటివేతలూ, వక్రీకరణలూ అవసరం." (బెర్ట్రాండ్

రసెల్). ఈ అభిప్రాయం తప్పని మార్క్సిజం నిరూపించి, స్థూలమైన ప్రపంచ ఆర్థిక సంక్షోభం ఫలితంగా ఫాసిజం పుట్టుకు వచ్చిన దశలో సోవియట్ ఆర్థిక వ్యవస్థ యొక్క ఆధిక్యత మార్క్సిజమును రుజువుచేసి, అనేక మంది బూర్జువా ఆర్థికవేత్తల కళ్లు తెరిచింది.

మార్క్సుకుపూర్వం సోషలిస్టు భావవాదులుండేవారు. వారు పెట్టుబడిదారీలోని అవలక్షణాలను ఖండించి, ఉజ్వలమైన సాంఘిక వ్యవస్థను గురించి కలలు కన్నారు. కాని పెట్టుబడిదారీలోని అవలక్షణాలను విశ్లేషించలేకపోయారు. సమాజాన్ని పునర్నిర్మించే శక్తి ప్రొలిటేరియన్ వర్గం నుంచి వస్తుందని తెలుసుకోలేకపోయారు. వారి దృష్టిలో సోషలిజం అనేది పరమ సత్యానికీ, పరమ విచక్షణకూ, పరమ న్యాయానికీ ప్రతీకలు. ఈ "పరమ"లు వాస్తవ వర్గ సంఘర్షణకు అందేవి కావు.

కమ్యూనిస్టులు అవలంబించే సిద్ధాంతాలు ఎవరో సంస్కర్తలు సృష్టించినవీ, కనిపెట్టినవీ కావనీ, వాస్తవ వర్గ పోరాటం నుంచీ, ప్రత్యక్ష చరిత్రగతి నుంచీ ఏర్పడ్డ వాస్తవ సంబంధాల నుంచి సూత్రీకరించినవేనని కమ్యూనిస్టు మానిఫెస్టో చెబుతున్నది. వర్గ సమాజాలు ఏర్పడినది లగాయతు మానవ చరిత్ర అంతా వర్గ కలహ చరిత్రగానే ఉంటున్నది: పీడితులకు, పీడకులకూ మధ్య తీవ్ర సంఘర్షణ ఉంటూనే ఉన్నదని కమ్యూనిస్టు మానిఫెస్టో విస్పష్టంగా చెబుతున్నది. వర్గ పోరాటాన్ని ఆమోదించని బూర్జువాలు చరిత్రను అస్పష్టం చేస్తారు.

గతితర్కాన్ని మనం చరిత్రకు అనువర్తింపజేసి, అందులోని పరిణామాలను తెలుసుకోవాలంటే, అందులోని వైరుధ్యాలను, విరుద్ధ పక్షాలనూ పరిశీలించాలి. సమాజంలోని ప్రధాన వైరుధ్యం వర్గ పోరాటంలో వ్యక్తమయిందని చప్పున అనిపిస్తుంది. కాని, సమాజం అభివృద్ధి చెందే కొద్దీ పోరాటంలో పాల్గొనే వర్గాలలో మార్పులు కలిగాయి. ప్రతి సామాజిక విప్లవంలోనూ ఒకరకం వర్గపోరాటం సఫలమై, కొత్త వర్గాలు, కొత్త సంఘర్షణలు రావటం జరిగింది. ఈ విషయం ఇలా ఉంచి, ఆదిమ సమాజంలో వర్గాలు లేకుండానే అది అభివృద్ధి చెందింది: అలాగే, కమ్యూనిస్టు వ్యవస్థలో కూడా వర్గాలుండవు. కనుక వర్గకలహం మూలకారణాల కోసం మనం మరింత లోతుగా అన్వేషించాలి.

వర్గకలహం యొక్క మూలం ఉత్పత్తి విధానాలకూ, ఆస్తి సంబంధాలకు మధ్య గల వైరుధ్యమని మార్క్సు కనిపెట్టాడు. ఒక చారిత్రిక దశలో (పెట్టుబడిదారీ వ్యవస్థలో) ఈ వైరుధ్యం వర్గశత్రుత్వంగా వ్యక్తమవుతుంది. ఈ దశలో ఉత్పత్తి

శక్తులు విస్తరించే ధోరణిలో ఉంటాయి. అస్తి సంబంధాలు ఉత్పత్తిని అరికట్టే ధోరణి కలిగి ఉంటాయి. కాని వర్గరహిత సమాజంలో కూడా ఈ మూలవైరుధ్యం ఉండనే ఉంటుంది, ఉండి, ఉత్పత్తి శక్తులు పెరిగేకొద్దీ సాంఘిక సంబంధాల అభివృద్ధికూడా కొనసాగుతుంది. (విప్లవం విజయవంతమైన అనంతరం కూడా కొనసాగే వర్గసంఘర్షణకూ ఇక్కడ చెప్పిన వైరుధ్యానికీ సంబంధం లేదు.)

మార్క్స్ ఇలా చెప్పాడు. సామాజిక ఉత్పత్తి కొనసాగించే మనుషులకు కొన్ని సంబంధాలు అనివార్యంగా ఏర్పడతాయి. వారి ఇచ్ఛతో వాటికి సంబంధం ఉండదు. ఈ ఉత్పత్తి సంబంధాల సమిష్టి స్వరూపమే సామాజిక ఆర్థికవ్యవస్థ. ఆ పునాదిపైనే సమాజం యొక్క న్యాయ, రాజకీయ నిర్మాణం జరిగి, ఒక సామాజిక (భావ) చైతన్యం ఏర్పడుతుంది. సమాజంలోని సాధారణ రాజకీయ, సాంస్కృతిక ధోరణులు ఎలా ఉండేదీ భౌతిక జీవనోత్పత్తి విధానాలే నిర్ణయిస్తాయి మనుషుల భావ చైతన్యం వారి మనుగడను నిర్ణయించదు వారి మనుగడే వారి భావ చైతన్యాన్ని నిర్ణయిస్తుంది (బానిసబతుకు బతికేవాడికి బానిసబుద్ధి ఉన్నట్టు). ఉత్పత్తి విధానాలలో అభివృద్ధి కలుగుతూ పోయేటప్పుడు ఒక దశలో ఆ విధానాలకూ, అస్తి సంబంధాలకూ సంఘర్షణ ఏర్పడుతుంది. (వైషమ్యం ఏర్పడుతుందనటం సరిగా ఉంటుంది.) అదే సామాజిక విప్లవదశ.

విప్లవానంతరం జరిగేదికూడా మార్క్స్ స్పష్టం చేశాడు.

పునాది అయిన ఆర్థికవ్యవస్థ మారగానే దాని ఆధారంపైన నిలబడిన శాసన, రాజకీయ, మత, సాంస్కృతిక, తాత్విక భావాలన్నిటిలోనూ మార్పు వచ్చి తీరాలి. అయితే, ఆర్థికవ్యవస్థ తాలూకు భౌతికపరివర్తనను శాస్త్రీయంగానూ, నిర్దుష్టంగానూ అంచనా వేసినట్టు "భావ" పరివర్తనలను అంచనా వెయ్యటం సాధ్యం కాదు. (పాత ధోరణులు ఒకంతట అంతరించవనీ, అవి ప్రచ్ఛన్నంగా వర్గకలహాలను కొనసాగించి, విప్లవ విఘాతాన్ని కలిగించ యత్నిస్తాయనీ ఈనాడు మనకు స్పష్టంగా, అనుభవం ద్వారా తెలుసు.) ఆ దశలో ఉండే భావచైతన్యాన్నిబట్టి ఆ దశను నిర్ణయించటానికి లేదు. ఒక సామాజిక వ్యవస్థలో ఉండే ఉత్పత్తి శక్తులన్నీ పూర్తిగా అభివృద్ధి చెందే దాకా ఆ వ్యవస్థ అంతరించదు. పాతవ్యవస్థలో నూతన ఉత్పత్తి సంబంధాలకు అవసరమైన భౌతిక పరిస్థితులు పరిపక్వమయినప్పుడే ఉన్నత సంబంధాలు అవతరించవు. (ఇది అక్షరాలా నిజం కాదు. చీనావంటి అర్థవలసదేశంలో సోషలిస్టు విప్లవం జరిగి, విప్లవ ఆర్థికవ్యవస్థకు అవసరమైన భౌతిక ఆర్థిక పునాదులు విప్లవం ద్వారానే నిర్మించబడ్డాయి.)

చరిత్ర కేవలమూ ఆర్థిక పునాది మీదనే ఆధారపడుతుందని మార్క్స్ అన్నట్లు ఆరోపణలు వచ్చాయి. కాని ఈ ఆక్షేపణలు సరికావు. చరిత్ర గతికి మూలాధారం ఆర్థిక పునాదికి చెందిన మార్పులే అయినప్పటికీ, దానిపైన ఉండే ఉపరి నిర్మాణానికి ఉండే ప్రభావాన్ని కాదనటానికి లేదు. ఆర్థిక పునాదిపై పెరిగే భావజాలం యొక్క ప్రభావం పునాదిపైన కూడా ఉంటుందని మార్క్సిస్టులు ఒప్పుకుంటారు.

మార్క్స్ చరిత్రగతి అనివార్యం చేశాడనీ, మానవుల ఆలోచనాధోరణులు దానిని మార్చలేవన్నాడనీ మరొక ఆరోపణ. అలా అనుకోవటం మార్క్సిస్టు తత్వానికే విరుద్ధం. "మానవులు తమ చరిత్రను తాము నిర్మించుకుంటారు. కాని తమ ఇష్టం వొచ్చినట్టు కాదు. పరిస్థితులు వారి చెప్పు చేతలలో ఉండవు. గతం తమకు అందించిన పరిస్థితి ఆధారంతో వారు కృషిచేయాలి."

గతితార్కికతత్వం మూలంగా పరిణామవాదం ఆమోదయోగ్యం అయింది. డార్విన్‌లాటి శాస్త్రవేత్తలు ప్రాణి పరిణామాన్ని రుజువు చేశారు. అటు తరువాత కూడా పరిణామాన్ని గురించి రెండు సిద్ధాంతాలు బయలుదేరాయి. పరిణామం విప్లవ లక్ష్యంతో కూడుకున్నదనీ, అది సాఫీగా సాగిపోయేదనీనూ. మార్క్సిస్టులది విప్లవ పరిణామవాదం. పరిణామానికీ, విప్లవానికీ పొంతన కుదరదన్నది రెండోవాదం.

ఈ రెండోవాదంలో ఉన్న పెద్దలోపం ఏమిటంటే అభివృద్ధి క్షయాలు పెంపొందాలంటే వాటి ఉనికి ఆమోదించాలి; ఉన్న లక్షణాలే పరిణామం ద్వారా అభివృద్ధి క్షయాలు పొందుతాయి. కొత్త లక్షణాలు పుట్టుకు రావటానికి అవకాశం లేదు. అభివృద్ధి జరిగేటప్పుడు ఏర్పడే వైరుధ్యాలు ఏర్పడటం ద్వారా విప్లవ పరిణామాలు కలుగుతాయని గతితర్కం స్పష్టం చేస్తుంది.

### తర్కమూ, గతితర్కమూ

జగత్తును గురించి మనకు వాస్తవమైన జ్ఞానం సంపాదించే అవకాశం ఉన్నదనీ, మన భావాలు భ్రమలు కావనీ, అవి బాహిరవాస్తవాన్ని ప్రతిబింబించగలవనీ, ఆచరణ ద్వారా రుజువు అవుతుంది. అయితే, "ఏది సత్యం ?" అన్న ప్రశ్న పరిష్కారం కావాలి. భావానికీ, వాస్తవానికీ గల సంబంధం వివరించటం అవసరం.

"యాంత్రిక"వాదులు వాస్తవానికీ, జ్ఞానానికీ తేడా లేదంటారు. మన జ్ఞానం సమగ్రం కాకపోతే అందుకు కారణం అందులో కొంతభాగం అలభ్యంగా ఉండటమేనని వారి వాదన. "శాస్త్రజ్ఞానం ఒకనాటికి సమగ్రజ్ఞానం అవుతుంది." (బెర్ట్రాండ్

రసెల్). ప్రాచీన తాత్వికులు అనేకులు జ్ఞానం యొక్క పాలాన్ని చేరుకున్నామనే అనుకున్నారు.

దీనికి వ్యతిరేకంగా కొందరు జ్ఞానమన్నది సాపేక్షకమంటారు. ఎందుకంటే, శాస్త్రవిజ్ఞానం మార్పు చెందుతూ వస్తుంది. భావవాదుల నడిగితే జ్ఞానమే లేదనీ, అంతా మిథ్యేనని తోసిపారేస్తారు.

ఈ ధోరణులన్నీ మానవుడి జ్ఞానానికి ఏదోవిధంగా వర్తించేవే. కాని గతితర్కం తెలియని వాళ్లు అయోమయంలో పడ్డారు. పరమం (absolute) లో సాపేక్షం (relative) ఎలా ఉండేదీ, సాపేక్షంలో పరమం ఎలా ఉండేదీ గతితర్కం వివరిస్తుంది. శాస్త్రజ్ఞులు ప్రయోగాలుచేసి ప్రతిపాదించిన కొన్ని సూత్రాలు మరింత సున్నితంగా చేసిన ప్రయోగాల ద్వారా తప్పుపోయినట్లు స్పష్టమయింది. అంతమాత్రాన ఆ పాతసూత్రాలు తప్పుడివి అయిపోవు. ఆ సూత్రాలలో పరమసత్యం గర్భితంగా ఉన్నది. ఆ సూత్రాలను సంస్కరించటం ద్వారా ఆ పరమసత్యం పాలు పెరుగుతుంది. (ఇది రుజువు చెయ్యటానికి ఎంగెల్స్ "బాయిల్సలా" తీసుకున్నాడు.)

న్యూటన్ సిద్ధాంతం ఇందుకు మంచి ఉదాహరణ. న్యూటన్ సిద్ధాంతాలు విశ్వమంతటికీ వర్తించినట్టే - పరమ సత్యంలాగే - కనబడ్డాయి. కాని వాటిని ఐన్‌స్టైన్ సిద్ధాంతం సంస్కరించింది. అందువల్ల న్యూటన్ సిద్ధాంతాలలో గల పరమ సత్యం అబద్ధమై పోలేదు. ఆ సత్యం ఐన్‌స్టయిన్ సిద్ధాంతంలో మరింతగా పెరిగింది.

సాధారణతర్కానికీ, గతితర్కానికీ తేడా ఉన్నది. సాధారణతర్కం వర్గీకరణలకు (abstractions) సంబంధించి ఉంటుంది. ఈ వర్గీకరణలు ప్రాథమిక భావాలకు సంబంధించినవి. సాధారణతర్కం వాటిని పేరుపరచి ఉంచటానికి పనికి వస్తుంది. మామూలు వర్గీకరణల ప్రయోజనం ఉన్న మేరకు సాధారణతర్కం ఉపయుక్తమైనదే. ఆమేరలో ఆ వర్గీకరణలు పరమమైనవి. వాటి మధ్యగల సంబంధాలూ, సంపర్కాలూ గణనలోకిరావు. పరిణామ ప్రక్రియలను గురించి తెలుసుకోవటానికి సాధారణతర్కం పనికిరాదు. ప్లెఖనోవ్ అన్నట్టు గతితర్కంలో సాధారణతర్కం ఒక ప్రత్యేక అంతర్భాగం. సామాన్యగణితానికీ, క్లిష్టగణితానికీ ఉండే సంబంధమే సాధారణతర్కానికీ, గతితర్కానికీ ఉన్నదని ఎంగెల్స్ అన్నాడు.

"ఆధునిక భౌతికవాదం గతితర్కంతో కూడినది. దానికి శాస్త్రజ్ఞానానికి అతీతమైన తత్వజ్ఞానంతో పనిలేదు." (ఎంగెల్స్) ఆలోచనా విధానానికి సంబంధించిన శాస్త్రాన్నీ, దాని తాలూకు సిద్ధాంతాలనూ తత్వం అనే పక్షంలో గతితర్కం ఒక తత్వమే.

గతితర్కాన్ని కుతర్కానికి ఉపయోగించిన వారున్నారు. ఫాసిజం గతితర్కం మీదనే ఆధారపడిందట. రష్యా విప్లవం తరువాత అక్కడ ఏర్పడినది ఫాసిజమేట. బూర్జువా మేధావులు ఇటువంటి సిద్ధాంతాలు చాలా లేవదీశారు. ఏ సిద్ధాంతమైనా అభివృద్ధికి దోహదం చేస్తూ ముందుకు వచ్చినప్పుడు. అభివృద్ధి నిరోధకులు మొదట దాన్ని నిరాకరించటానికి ప్రయత్నిస్తారు. అది సాధ్యం కాకపోయేసరికి దాన్ని వక్రీకరించటానికి ప్రయత్నిస్తారు. విప్లవం అంటే పీడకలలు వచ్చేవారు కాలానికి తలఒగ్గి తామే విప్లవం అన్నపదాన్ని నినాదం చేసుకొని, దాన్ని వక్రీకరించటం మనం చూస్తున్నాం. వీళ్ళు ఆమోదించే విప్లవాలు ఆకలిచావులకూ, అంతులేని దారిద్ర్యానికీ, ఇతరదేశాలకు అమ్ముడుపోవటానికీ దారి తీస్తున్నాయి. గతితార్కిక భౌతికవాదం సమస్యలను సృష్టించరాదు, పరిష్కరించాలి. మార్క్సు, ఎంగెల్సు, లెనిన్, స్టాలిన్‌లు దానిని అలా ఉపయోగించారు.

తాత్విక సంఘర్షణ

పెట్టుబడిదారీ వ్యవస్థలో మార్పులు జరుగుతున్న కొద్దీ ఆ మార్పులకు అనుగుణంగా తాత్విక దృక్పథాలు ఏర్పడతాయి. మొదట పచ్చి భౌతికవాదులుగా ఉండే పెట్టుబడిదార్లు అభ్యుదయకర పాత్ర వహించి భౌతికవాదానికి కట్టుబడి ఉంటారు. తరువాత సామ్రాజ్యవాదం వస్తుంది. దానివెంట మతతత్వం ప్రవేశిస్తుంది. ఇది ఒకప్పుడు బూర్జువావర్గం నిరసించినదే. ఇదే సమయంలో కార్మికులలో చీలికవస్తుంది. వారిలో బాగుపడిన వర్గం సామ్రాజ్యవాదంతో రాజీపడుతుంది. మరొకవర్గం విప్లవ పంథా చేపడుతుంది. చరమదశలో పెట్టుబడిదారీ ఫాసిజమును ఆశ్రయిస్తుంది. ప్రోత్సహిస్తుంది.

మనదేశంలో కూడ జాతీయోద్యమమప్పుడు దేవుడూ, కులతత్వాలూ ఎక్కడ పోయాయో ఎవరూ గమనించలేదు. స్వరాజ్యం గుత్తపెట్టుబడిదార్ల ఒళ్ళో పడగానే మతమూ, దేవుడూ, కులతత్వమూ, సాంఘిక అవినీతి వీరవిహారం సాగించాయి. ఫాసిజం దొడ్డిదారిన అమలు జరుగుతున్నది. పుస్తకాల నిషేధమూ, అనుమానాల మీద అరెస్టులూ, చెయ్యబోయే నేరాలకు జైలుశిక్షలూ ఫాసిజం యొక్క నగ్నరూపాలే. ఈ దశలో కొందరు "మేధావి" వర్గీయులు పెట్టుబడిదారీ పాలనకు బాసటగా ఉండి విప్లవ భావాలనూ, తిరుగుబాటు చర్యలనూ ప్రతిఘటించటం వారి సామాజిక తాత్విక దృష్టికి నిదర్శనం.

ఈ తాత్విక వైరుధ్యాలను సమన్వయించే ప్రయత్నం జరిగింది. (పరిష్కరించే ప్రయత్నం కాదు) ఎర్న్‌స్ట్‌మాఖ్ అనే ఆస్ట్రియను భౌతిక శాస్త్రవేత్త- తత్వవేత్త

భౌతికవాదానికీ, భావవాదానికీ వైరుధ్యం లేదన్నాడు. ఈ దృక్పథం యూరపులోనూ, అమెరికాలోనూ వ్యాప్తిచెందింది. ఈ దృక్పథాన్ని అవలంబించిన బెర్ట్రాండ్ రసెల్ జగత్తుయొక్క మూలద్రవ్యం భౌతికమైనదీ కాదు, మానసికమైనదీ కాదు; దాని నుంచి మనసూ, పదార్థమూ పుట్టాయన్నాడు. దీనిని ఆయన "తటస్థఅద్వైతం" అన్నాడు. లెనిన్ "మాఖ్" వాదం గురించి చేసిన విమర్శ రసెల్‌కు సూటిగా తగులుతుంది.

మాఖ్‌వాదులు తాము భావవాదానికీ, భౌతికవాదానికీ అతీతులమన్న ఫోజు పెట్టటానికి అష్టకష్టాలు పడ్డారు; కాని ఆ రెండు వారాలమధ్య జరిగే సంఘర్షణలో భావవాదంవైపే మొగ్గుతూ వచ్చారు. ఇది మార్క్స్ చెప్పిన పెటీబూర్జువా లక్షణం.

మాఖ్‌వాదం సంస్కరణవాదానికి చాలా సన్నిహితమైనది. దానినే మార్క్సిజం అనిచెప్పి బ్రిటిషు కార్మికోద్యమంలో ప్రవేశపెట్టటానికి ప్రయత్నించారు. ఇలాటి తాత్వికధోరణులు ఊబిలోకి తీసుకుపోతాయని లెనిన్ అన్నాడు.

గతితార్కిక భౌతికవాదంతో పెట్టుబడిదారీ దశలో కార్మికుల సంఘర్షణ సమస్యలే గాక సామ్యవాద సాంస్కృతిక సమస్యలను కూడా పరిష్కరించవచ్చు. శ్రామికవర్గం అధికారం చేజిక్కించుకున్న అనంతరం సామాజికరంగంలో ఏర్పడే సమస్యలను విప్లవ తాత్వికవాదం పరిష్కరించగలదు.

పెట్టుబడిదారీలో సిద్ధాంత ఆచరణల మధ్య సంబంధం ఉండదు. పెట్టుబడిదారీలో ఉండే ప్రత్యేక శ్రమవిభజనే దానికి కారణం. అలాగే దైహిక, మానసిక పరిశ్రమలు వేరువేరు అరలలో జరుగుతాయి. శాస్త్రవిజ్ఞానరంగంలో కూడా గణితాలూ, భౌతికశాస్త్రమూ, రసాయనిక శాస్త్రమూ, జీవశాస్త్రమూ, మనోవిజ్ఞాన శాస్త్రమూ, ఇంజనీరింగు మొదలైన శాఖలలో జరిగేకృషి ఆ శాఖలకే పరిమితమై ఉంటుంది. ఏ రంగంలో ఏ విషయానికి ప్రాముఖ్యం ఉంటుందనేది పారిశ్రామికరంగంలో దాని ప్రాముఖ్యాన్ని బట్టి ఉంటుంది. ఈ అన్ని వైజ్ఞానికరంగాల సమిష్టి దృక్పథం ఏర్పడాలంటే ఈ వేరు వేరు విజ్ఞానాల సామాజికవిలువలు శాస్త్రజ్ఞులకు తెలియాలి. అణువు బాంబులు తయారుచేసే సాంకేతిక ప్రావీణ్యం కనిపెట్టినవారు అణుబాంబు ప్రయోగాల ఫలితాన్ని గురించి ఆలోచించలేదనే అనుకోవాలి. పెట్టుబడిదారీ సమాజం కల్పించిన ఈ అరలలో శాస్త్రవేత్తలు యాంత్రికంగా, విధిచోదితులలాగా పనిచేస్తారు. వెనకటికి కథలో చెప్పినట్టు, ఒక వైజ్ఞానికుడు చచ్చిన సింహానికి ప్రాణం పొయ్యగలనని నిరూపించి దాని చేతిలో చచ్చాడట. వాడు పెట్టుబడిదారీ యుగంలో ఉండదగినవాడే.

కాని సామ్యవాద సంస్కృతి (గతితార్కిక భౌతికవాదంతో) సమస్తాన్నీ సమ్యక్ దృష్టితో చూస్తుంది. ఉత్పత్తి ప్రణాళికాబద్ధ మవుతుంది. సిద్ధాంతాలకూ, ఆచరణకూ సమన్వయం ఉంటుంది. (మావో దృష్టిలో ఆచరణకు రాని విజ్ఞానం శుద్ధ దండుగ!) శ్రామిక రంగంలోనూ, విజ్ఞాన రంగంలోనూ ఒకదాని సహాయంతో ఒకటి అభివృద్ధి చెందాలి.

సోషలిస్టు సాహిత్యం కూడా సిద్ధాంతాచరణల సమైక్యతతోనే అభివృద్ధి అవుతుంది. దీనికే గోర్కీ సోషలిస్టు వాస్తవికత అని పేరు పెట్టాడు. వర్గసమాజంలో సాహిత్యం ప్రజాసామాన్యానికి దూరమవుతుంది. సోషలిస్టు వ్యవస్థలో ఈ దూరం రద్దవుతుంది; విప్లవ రచయితలు బూర్జువావర్గ పక్షం నుంచి శ్రామికుల పక్షానికి వచ్చేస్తారు; శ్రామిక వర్గం నుంచే రచయితలు పుట్టుకొస్తారు.

భౌతికవాదాలలో అనేక భేదాలున్నట్టుగానే వాస్తవికతలో కూడా చాలా రకాలున్నాయి. సోషలిస్టు వాస్తవికత కానివన్నీ బూర్జువా వ్యక్తివాదాన్ని బలపరిచేవే. ఆదిలో బూర్జువా సమాజాభివృద్ధికి తోడ్పడిన బూర్జువా వాస్తవికత రానురాను వాస్తవికత నుంచి పలాయనంగా పరిణమించింది. ఈనాడు "వాస్తవికత" అన్నది సంఘంలోని వైరుధ్యాలను చిత్రించాలి. అది గతితర్కాన్ని ఉపయోగించి, సోషలిస్టు వాస్తవికతను చేరుకునేలాగా ఉండాలి.

వివిధ శాస్త్రాల మధ్య అడ్డుగోడలు పడిపోయి శాస్త్రజ్ఞానమంతా ఏకాండంగా పునర్నిర్మాణం కావాలి. అది మానవులందరి సొత్తు కావాలి. ఇది కమ్యూనిస్టు వ్యవస్థ యొక్క ఉన్నత దశలలో జరుగుతుంది.

కమ్యూనిస్టులకు ధర్మమూ, నీతి అన్నవి ఉండవని బూర్జువాలు ఆక్షేపిస్తారు. దేవుడి ప్రవచనాలలాటి బూర్జువా ధర్మాలనూ, నీతులనూ కమ్యూనిస్టులు ఆమోదించని మాట నిజమే.

మార్క్సిస్టులు వీటిని కూడా మిగతా ఆదర్శాలలాగే వర్గస్వభావం కలవిగా పరిగణిస్తారు. బూర్జువా నీతిని బయటపెట్టకుండా పోలీసులేయనులు దాని ప్రభావాన్ని ప్రతిఘటించలేరు. కాని ఈ తిరస్కారణకూ పెటీబూర్జువాల నీతి అవసరం లేదనే వైఖరికీ ఎలాటి పోలికా లేదు. వర్గపోరాటం మీద ఆధారపడిన సోషలిస్టు ఉద్యమం ఆ వర్గపోరాటానికి అనుగుణమైన ధర్మాన్నీ, నీతినీ అవలంబించక తప్పదు. వర్గ సమైక్యతా, సమిష్టికోసం వ్యష్టిత్యాగాలూ అత్యవసరం. విప్లవ చర్యలు చేసేవారిలో ఇది మరింత అవసరం. విప్లవ పోరాటం అన్ని దశలలోనూ కార్మికవర్గ ప్రయోజనమూ, తద్వారా మన భవిష్యత్తూ ఇమిడి ఉంటుంది. విప్లవ పార్టీలో పెటీబూర్జువా వ్యక్తివాదాన్ని సహించలేదన్నది స్పష్టం.

పెట్టుబడిదారీ కింద సాగే వర్గపోరాటంలో ప్రారంభమయే సోషలిస్టు నీతి సామ్యవాదవ్యవస్థలో పూర్తిగా వికసనం పొందుతుంది. కానీ అది ఆ దశలోనే స్థిర పడిపోక, సోషలిస్టు సమాజం అభివృద్ధి చెందిన కొద్దీ సోషలిస్టు "జనవాక్యానుసారం" అభివృద్ధి చెందుతూ ఉంటుంది.

* * *

ఈ పుస్తకంలోని ఉపన్యాసాలు చేసినవాడు డేవిడ్ గెస్ట్. 1911లో పుట్టాడు. ఇతడు గొప్ప గణితవేత్తా, తాత్వికుడూనూ. ఇంగ్లండులోనూ, జర్మనీలోనూ చదివాడు. 1931లో విద్యార్థి ప్రదర్శనలో పాల్గొని అరెస్టయాడు. నిరాహార దీక్షపట్టి రెండువారాల అనంతరం విడుదల చేయబడ్డాడు. 1937లో ఇతను గణితం బోధించటానికి లెక్చరరుగా చేరాడు. కాని త్వరలోనే, స్పెయిన్‌లో ఫ్రాంకోకు విరుద్ధంగా పోరాడటానికి వెళుతున్న అంతర్జాతీయ దళంలో చేరి, యుద్ధంచేస్తూ చనిపోయాడు. అందుచేత ఈ ఉపన్యాసాలు చాలాదశాబ్దాల క్రితంవి. అయినప్పటికీ వీటిలో మార్క్సిస్టులు కాగోరేవారు తెలుసుకోదగిన ప్రధానవిషయాలన్నీ ఉన్నాయి. అప్పటికీ, ఇప్పటికీ ప్రపంచం చాలామారింది. అయినా ఆ మార్పులను అర్థం చేసుకునేటందుకు అవసరమైన సూత్రాలు ఈ పుస్తకంలో ఉన్నాయి.

[నవంబర్ 1972, సంచిక 38]

## "ఆలోచనలకు సంకెళ్ళు"

## (Prisoners of Conscience)

భారత దేశంలో రాజకీయ ఖైదీలపై నిర్మించబడ్డ ఆనంద్ పట్వర్ధన్ నలభై నిముషాల డాక్యుమెంటరీ "ఆలోచనలకు సంకెళ్ళు" (Prisoners of Conscience). రాజకీయ ఖైదీలపట్ల ప్రభుత్వ నిర్లక్ష్య వైఖరిని, జైళ్ళలో పోలీసుల చిత్రహింసలను పాశవిక చర్యలను కళ్ళకు కట్టినట్టు చూపించి పౌరహక్కుల ఉద్యమ ఆవశ్యకతను నొక్కిచెప్తుంది.

ఈ చిత్రం ఢిల్లీ చాందినీ చౌక్‌లో ఒక సంఘటనతో మొదలవుతుంది. గట్టిగా నినాదాలిస్తున్న ఒక యువకుడిని పోలీసులు బలవంతంగా వ్యానులోకి ఎక్కిస్తుంటారు. అతని ఆక్రందన లాఠీ దెబ్బలతో నిరోధించబడుతుంది. తరువాత ఇందిరా గాంధీకి వ్యతిరేకంగా నినాదాలిస్తున్న గుంపుపైపు కెమెరా ఫోకస్ చేయబడుతుంది. అవి 1975 మధ్యకాలంలో వేలాది మంది ప్రజలను అరెస్టు చేస్తున్న అత్యవసర పరిస్థితి రోజులు.

అరెస్టులు ప్రత్యేకమైన పార్టీకే పరిమితం కాలేదు. ఈ చిత్రం ఏ రాజకీయ పంథాను సమర్థించలేదు. దర్శకుడు వివిధ పార్టీల రాజకీయ ఖైదీలను ఇంటర్వ్యూ చేస్తే వాళ్ళ అనుభవాలు చెప్పారు. అతడు విద్యార్థులు, మధ్య తరగతి మేధావులు,

పత్రికా రచయితలు, రైతులు, మార్క్సిస్టు-లెనినిస్టు, సోషలిస్టు పార్టీల వారితో మాట్లాడాడు. "విద్యుత్తు అంటే తెలియని గ్రామాలున్న బీహారు జైల్లో ఖైదీలను కరెంటుతో చిత్రహింసలు చేసారని, పిచ్చివాళ్ళకు, జైలు నుంచి పారిపోవడానికి ప్రయత్నించిన వాళ్ళకు మాత్రమే సంకెళ్ళు వేయాలని జైలు నిబంధనల్లో ఉన్నా నక్సలైట్లని అనుమానింపబడ్డ ఖైదీలకు కూడా రాత్రిం బగళ్ళు ఐదు సంవత్సరాల వరకు సంకెళ్ళు వేసి వుంచారని", మేరీ టేలర్ జైలులో తను ఉన్నప్పటి పరిస్థితి వివరించింది.

ఎమర్జెన్సీ కాలమంతా నిర్బంధించబడిన ఆంధ్ర ప్రదేశ్ విప్లవ రచయితల సంఘం సభ్యుడు సుబ్బారావు 1వ డిసెంబర్ 1975న మొట్టమొదటిసారిగా 'స్వతంత్ర' భారత దేశంలో 'చట్టబద్ధం'గా రాజకీయ ఖైదీలైన భూమయ్య కిష్టాగౌడ్‌లను ఉరితీసిన విషయం చెప్తారు. వాళ్ళను ఉరితీస్తారన్న విషయం తోటి వారికి 24 గంటల ముందు మాత్రమే తెలుస్తుంది. ఆ రాత్రి జైలంతా ఖైదీల పాటలతో దద్దరిల్లిపోయింది. భూమయ్య కిష్టాగౌడ్‌లను ఉరితీసిన పాశవిక చర్యను దర్శకుడు స్లైడ్స్ ద్వారా చూపుతాడు. అక్కడి నుంచి కెమెరా 1977 రిపబ్లిక్‌డే పరేడ్‌కు మారుతుంది. "సారే జహాసే అచ్ఛా" అనే పాట పాడుకుంటూ కవాతుచేస్తున్న దృశ్యం నుంచి ఇందిరాగాంధీ తనను చూడడానికి వచ్చినతనితో బాతాఖానీ చేస్తున్న దృశ్యంతో ఆగిపోతుంది.

దేశమంతా పౌరహక్కుల సంఘాలు ఏర్పడాలని, ప్రజలంతా ప్రభుత్వం చేస్తున్న వాగ్దానాలను నిలబెట్టుకొనేట్టు చేయడానికి అప్రమత్తతతో ఉండాల్సిన అవసరాన్ని జయప్రకాశ్‌నారాయణ్ నొక్కిచెప్పాడు. మిడ్నపూర్ జైలు ఖైదీలచే రాయబడ్డ పాట తెరవెనుక వినవస్తూండగా పౌరహక్కుల సంఘం ఊరేగింపుగా రాజకీయ ఖైదీలను విడుదల చేయాలని డిమాండ్ చేస్తూ వస్తుంది.

పట్వర్ధన్ రాజకీయ ఖైదీలకు, దేశ సాంఘిక నిర్మాణానికి గల సంబంధాలను చూపెడ్తాడు. రాజకీయ ఖైదీలు అత్యవసర పరిస్థితిలో మాత్రమే ఉన్నారని కాదు-26 జూన్ 1975 కన్న ముందూ వున్నారు. ఈ రోజు వరకూ ఉన్నారని ఈ చిత్రం చూపుతుంది.

అత్యవసర పరిస్థితిలో అరెస్టులు, చిత్రహింసలు, ఇంకా "ఎదురు కాల్పులు" ముఖ్యంగా అతివాద వామపక్ష రాజకీయాల వారి పట్ల జరిగాయి.

ప్రజా క్షేమం కోసమై, ప్రజాతంత్ర హక్కుల పరిరక్షణ కొరకై కంకణం కట్టుకొని, కష్టనష్టాలకోర్చి ఈ సినిమా నిర్మించాడు ఆనంద్ పట్వర్ధన్. "ఈ సినిమా మధ్యతరగతి వాళ్ళకోసం నిర్మించాను. ఎందుకంటే వాళ్ళ సామర్థ్యం ప్రభుత్వ విధానాన్ని ప్రభావితం చేస్తుందని నాకు విశ్వాసం వుంది" అన్నాడు ఆనంద్ పట్వర్ధన్.

(జనవరి 1979, సంచిక 87)

# అభిప్రాయాలు

వ్యక్తో ....

నూరో సంచిక వెలువరించే సందర్భంగా సృజనతో ఇదివరలో సంబంధమున్న, ఇప్పుడు సంబంధమున్న, మొదటి నుంచీ సంబంధమున్న 'సాహితీ మిత్రుల' నుంచి అభిప్రాయాలు కోరాలనుకున్నాం. ముఖ్యంగా సృజన వ్యవస్థాపక 'సాహితీ మిత్రులు' నవీన్, రామన్నల అభిప్రాయాలు వేయలేక పోవడం మాకు వెలితిగావుంది. ఎవరికో కొందరికి తప్ప చాల మందికి ఏదైనా అంశంయిచ్చి, నూరు సంచికల సృజనను ఆ అంశం పరిధిలో, కోణంలో పరిశీలించమని కోరాం. కొద్దిమందిని మాత్రమే తొలి నుంచీ సృజన చదువుతున్న వారుగా వాళ్ళ ప్రతిస్పందనలు, reflections, అభిప్రాయాలు రాయవలసిందిగా కోరాం.

సృజనపై, సృజనలో వస్తున్న రచనలపై ప్రచురణార్థం, కేవలం మా అవగాహన కొరకు మొదటి నుంచీ వస్తున్న ఉత్తరాలు, అభిప్రాయాలు మాకు ఎంతో విలువయినవి.

సృజనలో వస్తున్న సాహిత్య విమర్శ ఎక్కువగా 'తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదం'గా ఉంటున్నదని పాఠకుల షికాయతు వుంది. 'ఆధునిక' శబ్దానికి పాశ్చాత్య సాహిత్యంలో వచ్చిన వివిధ నూతన ధోరణులు అని మా అవగాహన వున్న రోజుల్లో ఎక్కువగా విలాయితీ భావాలు చోటుచేసుకొని సామాన్య పాఠకులను గందరగోళ పరుస్తున్నాయని ఉత్తరాలు వచ్చాయి. అదే రోజుల్లో కవిత్వంలో కొంత వరకు విశృంఖల, అయోమయ, 'అనుభూతి', 'స్వతంత్ర', పలాయన ధోరణులు కూడ చోటు చేసుకున్నాయని కూడ పాఠకులు హెచ్చరించారు (కొ.కు.).

అట్లాగే సృజన రచయితల పత్రికగా వుంటున్నదికాని పాఠకుల పత్రికగా వుండడం లేదన్న ఆరోపణ ఎక్కువగానే ఎల్లకాలాల్లోనూ వుంటున్నది.

అనువాదాలు, వార్తలు, ప్రకటనలు ఎక్కువగా చోటుచేసుకొని సాహిత్య అంశ బాగా తగ్గిపోయిందని అభిప్రాయపడిన రోజులూ వున్నాయి.

నినాదాలు, పడికట్టుపదాలు, కొటేషన్సు, సూత్రీకరణలు, మూసలో పోసిన రచనలు, వైవిధ్య దృష్టిలేని కాలమానాలు సృజనను మొనాటనస్ బోరిడమ్‌గా మారుస్తున్నాయన్న విమర్శ కూడ వచ్చింది.

ప్రజా ఉద్యమాలు, పోరాటాలు వున్నస్థాయికన్న అతిశయోక్తిగా చిత్రించబడుతున్నాయని, ప్రజలతో వుంటూ ప్రజలను ఒక అడుగు ముందుకు నడిపించే నినా

దాలు, కళారూపాలు కాకుండా ప్రజలకు దూరంగా ఒంటరి సాహసికత్వంతో కనిపించే రచనలు వస్తున్నాయని ఒక ఆరోపణ.

విప్లవోద్యమానికంతా ప్రాతినిధ్యం వహించేది కాకుండా అందులోని ఒక ధోరణికి మాత్రమే వేదికగా సృజన ఉపయోగపడుతున్నదన్నది కూడ ఒక ఆరోపణ.

ఈ అన్నిటికన్న పాఠకులు ఆరాటపడుతున్నది సృజన వ్యాసాల్లోని భాష తమకు కష్టంగా వుంటున్నదని; అందువల్ల తెలుసుకోవలసిన విషయాలు చాల తెలుసుకోవడం కష్టసాధ్యమవుతున్నదని.

సృజనలో కథలు రాకపోవడం పెద్ద లోపంగా చాలమందికి కనిపిస్తున్నది. అయితే అనువాదాలైనా సరే కథలు కోరుకునే పాఠకులు కొందరైతే అది ఏదైనా కాని అనువాదం, చైనాఅనే మాటలు పడని పాఠకులు కొందరు.

అట్లే ప్రత్యేక సంచికలంటేనే పట్టని పాఠకులు కొందరు కొందరు పాఠకులు ప్రత్యేక అంశాలపై ప్రత్యేక సంచికల సంప్రదాయాన్ని కొనసాగించక పోవడం లోటుగా భావిస్తే, ఇకనైనా ప్రత్యేక సంచికలు మానేయండి అని కొందరు హితవు చెప్పారు. సృజన పాఠకుల్లోవున్న విభిన్న రుచులు ఇందుకు కారణం.

సృజన పాఠకుల్లో అత్యధిక సంఖ్యాకులు విప్లవోద్యమ అభిమానులు. అయితే కొందరు సాహిత్యాభినివేశం వల్ల సాహిత్యం కిటికీ నుంచి పోరాటాపరణలోకి చూపు తిప్పే వాళ్ళయితే, కొందరు పోరాటాభినివేశం వల్ల పోరాటరంగం నుంచి సాహిత్య సీమల్లోకి తొంగిచూసేవారు. కొందరు 'మహాప్రస్థానం' నుంచి విప్లవంలోకి వచ్చిన వాళ్ళయితే ఎక్కువ మంది శ్రీకాకుళం తరం. తరాల అంతరాలు, అభిరుచుల ప్రాముఖ్యతలు, పరిచయ ప్రవేశాలు ఈ పాఠకుల నుంచి వచ్చే పరస్పర భిన్నమయిన అభిప్రాయాలకు కారణమవుతున్నవి.

సకారణమైన, సోపపత్తికమైన, విచారణ (investigation) పై ఆధారపడిన అభిప్రాయాలు, ఆరోపణలకన్న ఎక్కువగా ఏవోకొన్ని రచనలపై, ఏవోకొన్ని సంచికలపై, ఎవరో కొందరు వ్యక్తులు చెప్పిన అభిప్రాయాలపై, ఎవరో కొందరు వ్యక్తులతో, దృక్పథాలతో సృజనను ముడివేసి చూడడంపై ఆధారపడి ఏర్పడిన అభిప్రాయాలే ఎక్కువ. ఇలాంటి పాఠకులందరూ ఉత్తరాలుఏం రాసినా, అభిప్రాయాలు ఏమి ఏర్పరచుకున్నా 'సాహితీ మిత్రుల'తో స్వయంగా చర్చించే అవకాశం వచ్చినపుడు

మాత్రం సృజన నిజమైన చోదకశక్తి ఏమిటో అర్థంచేసుకుంటున్నారు. అయితే అక్షరాకృతి పొంది సుదూరతీరాల్లో వున్న పాఠకుల చేతుల్లో పడినప్పుడు తొలగించలేని సందేహాలు, అపోహాలు పాఠకులు సృజన దాకా నడచివస్తే తొలగిపోతాయనడం సాహిత్యం ఒక కళగా సాధించలేనిది వివరణ ద్వారా సాధిస్తుందని చెప్పడమే అవుతుంది. ఇది ఒక బలహీనతే. సృజన ప్రేల సంచికపై ఇటువంటి పొరపాటే, తొందర పాటే అటు సృజన పాఠకులు, ఇటు 'సాహితీ మిత్రులు' ప్రదర్శించారు.

ఎమర్జెన్సీకన్న ముందు వున్నంత ఘాటుగా సృజన ఇప్పుడు వుండడంలేదని చప్పగా, డల్‌గా వుంటున్నదని ఒక విమర్శ. మిర్చీ, మసాలా చాలడంలేదని, ఈనాటి పాఠకులకు అట్లావుంటేనే నసాళానికెక్కుతుందని కొందరు పాఠకులన్నారు.

'సాహితీ మిత్రులు' మాత్రం ఆదిలాబాదు - కరీంనగర్ రైతాంగ పోరాటం నేపథ్యంలో ప్రజా దృక్పథాన్ని అలవరచుకుంటున్న ఈనాటి సృజనయే తమకు తృప్తికరంగా వుంటున్నట్లు భావిస్తున్నారు.

సృజన ఆలస్యమైతే ఎందుకాలస్యం అని అడుగకుండా అందితే అందిందని కూడ చెప్పకుండా, సృజన కార్యాలయంతోగానీ, సాహితీమిత్రులతోగానీ ఎలాంటి సంబంధమూ, సంప్రదింపులూ లేకుండా సృజన కోసం ఆరాటపడుతూ, సృజనరాగానే శ్రద్ధగా కొనుక్కొనిగానీ, ఎక్కడైనా అడుక్కొనిగానీ, లైబ్రరీలోగానీ, ఏదైనా పబ్లిక్ స్థలంలోగానీ చదివే పాఠకులు అసంఖ్యాకంగానే వున్నారు. వాళ్ళు సృజనకందిస్తున్నది అవ్యక్తశక్తి. సృజనను మొదటినుంచీ చదువుతూ, గమనిస్తూ వాళ్ళేమనుకుంటున్నారో తెలుసుకునే పద్ధతి ఏమిటి? సృజన గురించి మళ్ళా రచయితలే (సంప్రదాయ అర్థంలో కాకున్నా, కాగితం మీద కలంపెట్టగలవారు, కలిసినపుడైనా నోరువిప్పవారు అనే అర్థంలోనైనాసరే) తమ అభిప్రాయాలు చెప్పగలరు తప్ప ఈ 'పాఠక పాఠకజనులు' ఏమనుకుంటున్నారో అది చాల అవసరం కాదా? వచ్చేవారు వస్తూ, పోయేవారు పోతూ సృజన కొనుగోలుదార్ల సంఖ్యలో మార్పు లేదు, సృజన పాఠకుల సంఖ్య?! ఆ పాఠకుల అభిప్రాయాలు???

# నిత్యనూతన సృజనాత్మక సాధన - సృజన

పి. సి. నరసింహారెడ్డి

పత్రికలు పలురకాలు. దారి చూపేవి కొన్నైతే దారి తెలియనివి కొన్ని. దారి తప్పేవి కొన్నైతే దారి తప్పించేవి కొన్ని. దారి చేసుకునేవి కొన్నైతే దారి చూసుకునేవి మరికొన్ని. అన్నీ మొదట మొదట ఏదో ఒక ఆశయంతోనే ఆరంభించబడతాయి. ఆచరణలో ఎదురుదెబ్బలు తగిలి ఆగిపోతాయి. ఆశయ సాధనకు అవసరమైన నిరంతర కార్యదీక్ష, దక్షతా, కృషీ, ధైర్యం, తెగువ అన్నిటికీ ఉండవు. ఉండవంచే ఉండే పరిస్థితులు సిద్ధంగా ఉండవు. అయితే పరిస్థితులు పత్రికల్ని నడిపించినట్టుగానే పత్రికలు పరిస్థితులను ఎదురొడ్డి నిల్చి వాటిని మార్చడమూ జరగవచ్చు. అరుదుగా జరిగే ఈ సంఘటన వెనక స్పష్టమైన సైద్ధాంతిక అవగాహన వుంటుంది. సృజన ఆ కోవకు చెందిన సాహిత్యపత్రిక.

సాహితీ వేత్తలకే పరిమితమైన 'మరోసాహిత్య పత్రిక' కాదు సృజన. ప్రయోగశీలత్వం, సృజనాత్మక శక్తి, ఆధునిక దృక్పథం పునాదిగా మొలిచిన, నిలిచిన ఆధునిక సాహిత్యవేదిక. మారుతున్న కాలాన్నీ, విస్తృతమౌతున్న జాగృతినీ ప్రతిబింబించి, అనువదించే ఒక Forum. సార్థకమైన సాహిత్య ప్రయోగం. పన్నాలుగేళ్ళ సృజన చరిత్ర ఆటుపోటుల్నెదుర్కొంటూ రాటుతేలుతున్న ఆధునికపోరాట సాహిత్య చరిత్ర.

వంద సంచికల నిత్య సంచలనం సృష్టించిన సృజన తొలిదశలో ఒక వంక తిలక్ (ప్రారంభ సంచిక), బుచ్చిబాబు (తొలి జన్మదిన సంచిక), చలం (ప్రత్యేక సంచిక) మజిలీల్ని ఒక్కొక్కటే దాటి శ్రీశ్రీని (శ్రీశ్రీ సాహిత్య సమాలోచన సంచిక) చేరుకుంది. ఈ Expeditionలోనే వేరొక వంక సాహిత్యంలో నూతన తరంలో వస్తున్న గుణాత్మక పరిణామ బీజాలైన నిప్పురవ్వలు - 'తిరుగబడు', 'మార్చ్' కవుల్ని రాజుకొల్పింది. 'పీడితప్రజల్ని సాయుధం చేస్తున్న రివల్యూషనరీ నేడు కవి' అనే అవగాహనను కలిగించింది.

మలిదశ - విరసం ఆవిర్భావంతో లక్ష్యనిర్దేశం చేసుకుని 1970 అగస్టులో వెలువడిన సృజన 16వ సంచిక. ఆ సాధన క్రమంలోని పరిణతమైన కృషికి సంకేతం ఈ మజిలీ.

మూడు నెలలకోసారి మాత్రం వస్తున్న సృజన 17వ సంచిక నుండి మాస పత్రికగా అవతరించడం మరోమలుపు. ఇది చారిత్రికంగా కూడా అనివార్యమైంది.

అప్పటి వరకు తమతమ దారుల్లో కృషిచేస్తూ, కూడా ప్రయనిస్తున్న సంవేదన, విద్యుల్లత, వేకువ మొదలైన పత్రికలు ఆర్థిక కారణాలవల్ల క్రమంగా ఒక్కొక్కటే ఆగిపోయాయి. అట్టి పరిస్థితుల్లో ఆధునిక పోరాట సాహిత్యకారుల్ని ఓ సంఘటిత శక్తిగా తీర్చిదిద్దాల్సిన తక్షణకర్తవ్యం, వారి సాహిత్య కార్యకలాపాల్ని వేగవంతం చేయాల్సిన ఏకైక బాధ్యత సృజనపై పడింది. విరసం ఆవిర్భావంతో గమ్యం తెలిసిన ఆధునికపోరాట సాహిత్యానికి సృజన నెలనెలా వేదకగా తోడ్పడింది. ఇందులో విద్యుల్లత, ప్రభంజనం వంటి పత్రికలు కొంతవరకు అండగా నిలిచాయి. క్రమంగా జీవనాడి, పిలుపు, విమోచన, జనశక్తి వంటి పత్రికలు ఆచరణాత్మకమైన పోరాట సాహిత్య సృజనకు సన్నద్ధమయ్యాయి. తెలుగు సాహిత్యంలో ఎప్పుడూలేని సంచలనం ప్రారంభమైంది. పుస్తకాలు నిషేధించబడ్డాయి. రచయితలు నిర్బంధింపబడ్డారు పత్రికలపై ఆంక్షలొచ్చాయి. పత్రికలపై కేసులు మోపారు. పాలకవర్గాల దమన నీతికి దారుణంగా గురై కొన్ని ఆగిపోయాయి. సృజనకు కూడా ఈస్థితి ఏర్పడింది. అయితే ఎప్పటి కప్పుడు ఆటంకాల్ని అధిగమించడమే సృజన చరిత్ర. ప్రతిదెబ్బను కాచుకుంటూ, ఎదురయ్యే ప్రతి సమస్యలో పరిష్కారం అన్వేషిస్తూ రెట్టించిన ఉత్సాహంతో, దేశం నలుమూలల్నుంచి లభించిన స్నేహపూర్వకమైన సహకారాన్ని పొందుతూ ఇప్పటికి నూరవ మజిలీ చేరుకుంది. తలెత్తుకుతిరిగే సంకల్పాన్ని, మనోబలాన్ని నూరిపోసే పత్రికలు, ఒక్కొక్క సంచికతో సాహిత్యంలోనేకాదు జీవితంలో కూడా పోరాటానికి పురికొల్పి దారిచూపే సృజన లాంటి పత్రికలు నూరు సంచికలు రావడం సంస్థకేకాదు సమాజంలో విప్లవ శక్తులకే ఘనవిజయం.

సృజన పట్నాల్లో మధ్యతరగతి పాఠకులకే పరిమితమయ్యే సంకుచిత పరిధిని అధిగమించి పల్లెసీమల్లోని చదువురాని శ్రామికవర్గానికి సన్నిహితమైంది. పోరాట రంగంలో వారితోపాటు గొంతులో గొంతుకల్పి పాలుపంచుకుంది. పత్రిక చదువు తుండగా గుంపులు గుంపులుగా ఆతురతతో వినే సాహిత్య శ్రోతల్ని సమకూర్చుకో గలిగింది సృజన.

ఇంతేకాదు రాత కూర్పు (Written Composition) ఒరవడిలో పడిపోయి ప్రజలకు దూరమైన సాహిత్యాన్ని భూమార్గంపట్టించి మళ్ళీ ప్రజలకు సన్నిహితమైన నోటి కూర్పు (Oral composition) దారుల్లోకి మళ్ళించింది సృజన. కవిత్వం లోనే కాకుండా ఇటీవల కథ, నవల వంటి ప్రక్రియల్లో సైతం ఈ గుణాత్మకమైన రూపనిర్మాణ పరిణామం రావడానికి కారణమైంది. నోటి పాటలే కాకుండా శ్రవ్య నవలా సమర్పించింది.

పోరాట రంగంలో ఎప్పటికప్పుడు సృష్టించ బడుతున్న ప్రజా సాహిత్యాన్ని (ఒక్కొసారి ఊరూ పేరూ లేకుండా పంపుతున్న వాటిని కూడా) అందజేసి, పోరాట బాటలో సాహిత్యాన్ని నడిపించి, పీడితుల వాణిని వినిపించి తన చారిత్రిక కర్తవ్యాన్ని నిర్వహించింది సృజన. శ్రామికవర్గ సంస్కృతిలోని నిసర్గ సౌందర్యాన్ని నిత్యాను భవంలోకి తెచ్చి దోపిడీవర్గ సంస్కృతి, పెట్టుబడిదారీ వ్యాపార నాగరకతలోని బండారం బట్టబయలుచేసింది. శ్రామికవర్గ సాహిత్యంలోని మౌలిక విలువలు దృష్టికి రాని మధ్యతరగతి సాహిత్యకారులకు వాటిని పరిచయంచేసి, కొత్త రుచుల్ని కల్పించి, ప్రజల జీవనాడిని పసిగట్టే అవకాశం ఏర్పరచింది. ప్రజల భాషను ప్రోత్సహించి జనజీవితంలోని భావజాలానికీ, చైతన్య స్థాయికి అనురూపమైన వ్యక్తీకరణ రీతులకూ స్థానం కల్పించింది. నిజమైన ప్రజాసాహిత్య సృష్టికి దోహదం చేసింది. విప్లవ సాహిత్య పంటా వేరూని దృఢంగా నిలబడడానికి అంచెలంచెలుగా ప్రాతిపదికలు వేసి సాహితీపరుల మధ్య లంకెగా, వారిని నడిపించే చోదకశక్తిగా వ్యవహరించింది. విప్లవ సాహిత్య చైతన్యాన్ని పూరించి రచయితల కత్యంత సన్నిహితమైన పత్రికగా రూపొందింది.

కవితలు, కథలు, నాటికలు, నవలలే కాకుండా విపులమైన సిద్ధాంతస్థాయి విమర్శలు, శాస్త్రీయమైన సమీక్షలు, ఇంటర్వ్యూలు, రిపోర్టులు, ప్రత్యేక పరిచయవ్యాసాలు, వార్తలు, చర్చలు, లేఖలు, సూక్తులు ఇలా భిన్న పద్ధతుల ద్వారా సమకాలిక జీవిత, సాహిత్య అవగాహనను పెంపొందించింది. సమస్యల్ని పాఠకుల ముందుంచి పరిష్కారాల్ని వెతికేలా ప్రోత్సహించింది. ఉత్తేజకరమైన విశ్లేషణాత్మకమైన సంపాదకీయాలతో నిత్యనూతనమైన సృజనాత్మక సాధనగా, సాధనంగా రూపొందింది సృజన.

'అభ్యుదయ' సాహిత్యం సమకూర్చుకోలేని సాహిత్య విమర్శశాఖను విప్లవ సాహిత్యానికి సృజన సమకూర్చి పెట్టింది. తెలుగులో విప్లవ విమర్శ ఈనాడు శాస్త్రంగా, శస్త్రంగా రూపొందుతోంది.

అనువాద సాహిత్యంద్వారా అంతర్జాతీయ, దేశీయ విప్లవ సాహిత్య స్థితిగతులు, స్వరూప స్వభావాలు, అవి నిర్వహించిన విప్లవాత్మకమైన పాత్ర పాఠకులకు తెలియ పరచింది. వారి చైతన్యాన్ని విస్తృతపరచి, దృక్పథాన్ని నిశితపరచింది. అయితే 'సృజన' నోరులేని, చదువురాని అట్టడుగు ప్రజల నోటి కూర్పుగా, వాణిగా, పోరాట బాణిగా యింకా యింకా ప్రజల్లోకి పోవాల్సి ఉంది.

సృజన ఈనాటి ఈ దశకు చేరుకోవడానికి వెనకాల ఎంతో కృషి, పట్టుదలా, దీక్షా ఉన్నాయి. ఎందరెందరో తమవంతు కర్తవ్యాన్ని ఎప్పటికప్పుడు ఆచరణాత్మక

# సృజన - నక్సల్బరీ దశాబ్దం

## కాలానికి కత్తుల వంతెన

వైశాఖి

మనం / బలవంతపెడ్తేనే గతం / ముందు దారి చూపిస్తుంది-
లేకపోతే / ద్వారాలు లేని తన కూపంలో / అది మనల్ని బంధిస్తుంది.
మనం / చరిత్రను నిర్మించకపోతే / చరిత్రే మనకు రూపాన్నిస్తుంది.

మార్గెపియర్సీ
(మంత్లీ రివ్యూ - ఆగస్ట్ 78)

1960 ల ఆఖరి సంవత్సరాలు రెండవ ప్రపంచ యుద్ధం తరువాత ప్రపంచానికి చెప్పుకోతగ్గ సృజనాత్మక కాలం. ప్రపంచ మంతటా నూతన ఆలోచనా ధోరణులు తిరుగుబాటు పై తిరుగుబాటు చేసిన కాలం. యుద్ధం తర్వాత తరం చారిత్రిక రంగ స్థలంపై చేసిన యవ్వన ప్రయోగాల కాలం. క్యూబాలో ఉపప్రధాని పదవిని వదిలి బొలీవియా అడవుల గుండా చేగువేరా లాటిన్ అమెరికా చైతన్య భూమిలో వేళ్ళూను కున్నాడు. అమెరికా 'అభేద్యమయిన' అణుశక్తి ఆసియా అజ్ఞాత గ్రామాలలో వియత్నాం గెరిల్లాల పోరాట సంకల్పంతో తన మరణ శయ్యను చేరుకుంది. ఫ్రాన్స్‌లో రెక్కవిప్పిన రివల్యూషన్ విశ్వవిద్యాలయాలలో తిరుగుబాటుతో ఆరంభమయి, కార్మికుల్ని కలుపుకొని యూరోపియన్ ధనస్వామ్య సమాజ పునాదుల్ని, ప్రశ్నించింది. "కేంద్ర స్థానంపై దాడి చేయండి" (Bombard the head Quarters) అన్న నినాదంతో, చైనాలో, కరడుగట్టిన కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంపై మొట్ట మొదటి

---

మైన సంకల్పబలంతో నిర్వహించడంవల్ల ఇది సాధ్యపడింది. ముఖ్యంగా కత్తిమీద సాములాంటి పత్రికా నిర్వహణను చేపట్టిన 'సాహితీ మిత్రులు' ఎంతైనా అభినంద నీయులు.

'సృజనతో మొదట్నుంచి సన్నిహిత సంబంధమున్న సాహితీ మిత్రులుగా మీ impressions రాయండి' అని 'సాహితీ మిత్రులు' కోరినప్పుడు- 14 ఏళ్ళ సాహిత్య పోరాటాన్ని సాగించి, నూరు సంచికల పూలుపూసిన ఈ ఎర్రెర్రని సాహిత్య శాఖ సాధించిన విజయ పరంపరను తలచుకుని నా ఒళ్ళు పులకరించింది. 'శక్తి'గా సృజనకు ముఖపత్రంమీద అలవోకగా అక్షర రచన చేసినప్పుడు ఇంత సంచలన పత్రికగా రూపొందబోతుందని ఊహించలేదు. నెలనెలా నా అక్షరాలు దిద్దుకుని విప్లవ జ్వాలల్ని రేపే సృజన ఈనాడు నూరు సంచికల పండగ చేసుకుంటోంది. సృజన చిరకాలం వర్ధిల్లాలని నా ఆకాంక్ష.

8-1-1980

కమ్యూనిస్టు తిరుగుబాటుగా సాంస్కృతిక విప్లవం మార్క్సిజానికి జీవం పోసింది. నక్సల్బరీ ఈ అంతర్జాతీయ సంచలనాత్మక చరిత్రలో ఒక అధ్యాయం.

రాజకీయార్థిక పరిణామం దృష్ట్యా గ్రామీణ భారతాన్ని మూడు దశలుగా విభజించవచ్చు. ఎక్కువ సారవంతం కాని భూమి, సాంప్రదాయికమైన పనిముట్లు, మార్కెట్‌తో బలపడని సంబంధం, అధిక భూభాగాన్ని స్వంతం చేసుకొన్న భూస్వామి కేంద్రంగా జరిగే ఉత్పత్తి- మొదటి రకం ప్రాంతాల స్వభావం. ఈ ప్రాంతాలలోనే సాంకేతికంగా మరింత వెనకబడి సమాజ ఆర్థిక వికాసానికి అవలనే ఉండిపోయిన గిరిజన వ్యవస్థలను కూడా కలుపుకోవచ్చు. రెండవరకం, సాంకేతికంగా అభివృద్ధి చెంది, సాంప్రదాయిక ఉత్పత్తి సంబంధాలు బలహీనపడి, ఇటీవల బలపడిన ధనిక రైతాంగానికి - వ్యవసాయ కూలీలకి మధ్య వైరుధ్యం ప్రధానంగా ముందుకు వచ్చిన ప్రాంతాలు. మూడవ రకం ఈ రెంటికి మధ్య ఉన్నదశ.

భారతదేశంలో గ్రామీణ ప్రాంతాలలో సాయుధ రాజకీయ ఉద్యమాలు ఇంత వరకూ కేవలం మొదటి రకం ప్రాంతాలలోనే తమ ప్రాబల్యాన్ని స్థాపించుకోగలిగాయి. 19వ శతాబ్దపు సంథాల్ నీలిమందు తిరుగుబాటుల నుండి 1940ల నాటి తెభాగా తెలంగాణా ఉద్యమాల దాకా గ్రామాల తిరుగుబాటు చరిత్ర అంతా అందుకు ఉదాహరణ. ఆ చారిత్రిక సాంప్రదాయంలోనే నక్సల్బరీ తిరుగుబాటు- నక్సల్బరీ, పార్వతీపురం- మొదలైన ఏజన్సీ ప్రాంతాలలో మొట్టమొదట చెలరేగింది.

కమ్యూనిస్టు ఉద్యమానికి మొట్టమొదట రూపాన్నిచ్చింది యూరోప్. యూరోప్ నుండే కమ్యూనిస్టు అవగాహనను, నిర్మాణాన్ని నిర్దేశిస్తూ కొన్ని ప్రాథమిక సూత్రాలు మార్క్సిస్ట్ భావజాలంలో భాగమయ్యాయి. అయితే భూస్వామ్యం ఆర్థికంగానూ, సాంస్కృతికంగానూ బలంగా ఉన్న వలస దేశాలలో, మరీముఖ్యంగా జనసంఖ్య ఎక్కువగా ఉన్న ఆసియా దేశాలలో ఇవి ఎంతవరకు సరిఅయినవో మొదటి నుండి ఆలోచిస్తూ, ప్రశ్నిస్తూ చైనా విప్లవం ఎదిగి విజయవంతమయింది. సమాజంలోనూ పార్టీలోనూ వర్గపోరాటం, ఐక్యత, ప్రజాస్వామ్యం ప్రధానాంశాలుగా మావో ఆలోచనా విధానం ముందుకు వచ్చింది. భూస్వామ్య పెత్తందారీతనానికి (Rural autocracy) ప్రత్యామ్నాయంగా నూతన ప్రజాస్వామ్యాన్ని నిలబెట్టింది. వలస, అర్థవలస దేశాల మార్క్సిజంగా మావో ఆలోచనా విధానం రూపొందింది. వలస ప్రాంతాలలో సైద్ధాంతికంగా నిర్మాణరీత్యా తను కూరుకుపోయిన జడాత్మకత నుండి కమ్యూనిస్టు ఉద్యమం విముక్తి చెందనారంభించింది. (ఇందుకు ఉజ్వలమైన ఉదాహరణ ప్రజాతంత్ర కంపూ

చియా). లండన్-మాస్కోల నుండి ఉత్పన్నమయిన భారత కమ్యూనిస్టు ఉద్యమం యూరోపియన్ మార్క్సిస్ట్ దృక్పథానికి, ముఖ్యంగా, పార్టీ నిర్మాణ పద్ధతులకి గురి అయింది. దాని నుంచి మనకు ఆ విముక్తి క్రమంలో వచ్చిన ఆరోగ్యకర జీవలక్షణం నక్సల్బరీ.

భారత సాంస్కృతిక చరిత్రలో ముఖ్యమయిన మలుపు 19వ శతాబ్దపు 'పునరుజ్జీవ' దశ. తెలుగులో కందుకూరి, గురజాడలతో ఆరంభమయిన ఈ దశ సాంఘిక సంస్కరణలు, పాశ్చాత్య నాగరికతా ప్రభావం ప్రధానమయిన ధోరణులుగా ఆరంభమయి సాంఘిక చైతన్యానికి (ఉన్నవ), రిబెల్ ధోరణికి (చలం), కాల్పనికతకు (కృష్ణశాస్త్రి) దారి వేసింది. ఆ క్రమంలోనే ప్రజల గురించి రాసే సాహిత్యానికి దారి వేసిన శ్రీశ్రీ కూడా వచ్చాడు.

దేశమంతటా కూడా ఈ శతాబ్దపు నాలుగో దశాబ్దం కమూనిస్టు ఉద్యమ సాంస్కృతిక దశగా చెప్పుకోవచ్చు. తెలంగాణా రైతాంగ పోరాటం ఊపిరితో తెలుగులో ప్రజానాట్యమండలి, అభ్యుదయ రచయితల సంఘం జాతీయ సంస్కృతికి సోషలిస్ట్ భవిష్యత్‌కి మధ్య వంతెనలు వేసినయి. మరోపక్క జాతీయోద్యమ ప్రభావం, మధ్యతరగతి ఆదర్శవాదం సాహిత్యంలో ఒక ధోరణిగా అస్పష్టంగా లేకపోలేదు. అయితే తెలుగులో వామపక్ష సాహిత్య ఉద్యమం బలవత్తరమైన ప్రవాహం నుండి వేరుపడి ఒక స్పష్టమైన రూపాన్ని అది తీసుకోలేకపోయింది.

భౌతిక పునాదిలేని ఈ ధోరణి దశాబ్దం గడవకుండానే వ్యాపార ప్రక్రియగా దిగజారిపోయింది. 1955 అసెంబ్లీ ఎన్నికల తర్వాత కొట్టవచ్చినట్టు ఆరంభమయిన 'అభ్యుదయ' సాహిత్యోద్యమం దిగజారుడు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం మలుపులతో కళాహీనమయిన సాహిత్య స్వభావంగా మారి క్రమంగా వ్యాపార నాగరికతలో కలిసిపోయింది. ఈ రెండు కుళ్ళిపోయిన ధోరణుల కలయిక విశృంఖలంగా విజృంభించిన వ్యాపార పత్రికలతో బలపడి సర్కారీ సంస్కృతితో సన్నిహిత సంబంధాలు ఏర్పరుచుకుంది. ఈ కుళ్ళుకు, కపటత్వానికి ప్రతిక్రియగా దిగంబరకవులు, తిరుగబడు కవులతో సృజన ముందుకు వచ్చింది. ఈ వినూత్న తిరుగుబాటు ధోరణి 1970లో విశాఖ శ్రీశ్రీ 60వ జన్మదిన సభలో స్పష్టమైన రూపాన్ని పోసుకొని విప్లవ రచయితల సంఘావిర్భావానికి విత్తనాలు వేసింది.

ఈ చారిత్రిక సందర్భమే చైతన్యంగా సృజన నక్సల్బరీతో తన భవిష్యత్‌ను ముడి వేసుకొంది. సృజన నక్సల్బరీతో పుట్టలేదు. చారిత్రిక పరిణామ క్రమంలో

ఏ సృజనాత్మక ధోరణులు రాజకీయార్థికరంగంలో నక్సల్బరీని సృష్టించాయో, ఆ విప్లవ ధోరణులే సాంస్కృతిక రంగంలో సృజనను మలచాయి. ఈ కలయిక ఏక కాలంలో స్పాంటేనియస్, చైతన్యవంతమూ కూడా. యుద్ధంలో ఎటువైపు ఉంటామో తెలుసుకోవడానికి పుస్తకాలు చదవనవసరం లేదన్నాడు మైకోవస్కీ. యుద్ధంలో ఎటువైపు వుంటామో తేల్చుకోవడానికి యుద్ధం మన అనుభవంలోకి రావాలి.

తెలంగాణా రైతాంగ పోరాట కాలంలో వచ్చిన నవల, నాటకాల్ని మినహాయిస్తే తెలుగు వామపక్ష సాహిత్యంలో కవిత్వమే ప్రధానాంశంగా ఉంటూవచ్చింది. అనివార్యంగా సృజన ఈ సాంప్రదాయాన్ని కొనసాగించింది. సృజన ఈ కవిత్వం తాకిడితో తను ఆరంభించిన కొన్ని ఉత్తమ సాంప్రదాయాలను నిలబెట్టుకోలేకపోయింది. శ్రీశ్రీ, చలం సాహిత్య సమాలోచన సంచికల లాంటి భావాల రాపిడితో ఆలోచనలను రేకెత్తించిన చర్చా వేదికలు మళ్ళీ ఇటీవలకాలందాకా కనపడలేదు. కవిత్వంలో కూడా ఏ అనుభూతి లేని గేయాలు చాలానే వచ్చాయి. ఈలోగా విరసం, తర్వాత జననాట్యమండలి, అరుణోదయ, నవోదయ మొదలయిన సంస్థలు మట్టిలో మరుగయిన జానపద బాణీలకు కొత్తఊపిరినిపోసి మేధావుల సాహిత్య ప్రపంచానికి ప్రజా సాంస్కృతిక సంప్రదాయాలకు వంతెనలు వేసాయి. వస్తువు గురించి ఎన్ని భేదాభిప్రాయాలున్నా, ఈ ధోరణికి చేయూతనిచ్చి సృజన గర్వించతగ్గ పాత్ర నిర్వహించింది.

ఆరంభంలోనే అఖిల భారత విప్లవకారుల సమన్వయ సమితిలో మొదలయిన అనైక్యత నక్సల్బరీ ఉద్యమంలో కాలక్రమేణా బలమైన అంశంగా స్థిరపడింది. ఐక్యత, అభిప్రాయభేదాన్ని చర్చించే ప్రజాస్వామిక దృక్పథం మావో ఆలోచనా విధానంలో వర్గపోరాట మంత ప్రాధన్యం కలవి. నిజానికి వైరుధ్యాల మధ్య సంఘర్షణే అభివృద్ధికి దారి తీస్తుందని మావో స్పష్టంగా సూత్రీకరించాడు. లక్షలాది మంది ప్రజలను ఊచకోత కోయించిన చాంగ్ కై షేక్‌తో కలపడంలోనూ, అవసరమయితే ఒకప్పుడు ప్రముఖపాత్ర నిర్వహించిన కమ్యూనిస్టు నాయకులతో సంఘర్షించడంలోనూ మావో ఈ సూత్రానికి గల అద్భుత శక్తిని నిరూపించాడు. ఆచరణలో ఇది ఎంత వరకు నక్సల్బరీలో భాగం కాగలదన్న విషయాన్ని చారిత్రిక పరిస్థితులు నిర్ణయిస్తాయి. బహుశా అందుకే రాజకీయవిభేదాలు సంస్థాపరమైన విభేదాలుగా రూపొంది అంతర్గత వైరుధ్యాలు సంఘర్షించే వేదిక లేకుండా పోయింది. వ్యక్తులతో గుర్తింపబడ్డ ధోరణులు ఆ వ్యక్తులపట్ల దృక్పథమే ప్రధానంగా ఉద్యమాన్ని చీల్చివేసాయి. ఉద్యమం రేకెత్తిన నూతన భావాల్నికానీ, పోరాటంలో ముందుకు వచ్చిన ప్రజల్ని కానీ సంఘటితపరచి ముందుకు తీసుకువెళ్ళ లేకపోయింది నాయకత్వం.

అనివార్యంగా సృజన కూడా ఇందులో ఒక భాగమయింది. అంతేకాక తెలుగు దేశంలో ఒక ప్రధాన ధోరణికి అనధికార వాహిక కూడా అయింది. ఇది కేవలం సంపాదకుల రాజకీయ దృక్పథంలోనే కాక ప్రచురించబడ్డ సాహిత్యంలో కూడా తన ప్రభావం చూపింది.

అయినా, నక్సల్బరీ చీలికలేకాదు, కేవలం సమాధానం ఇవ్వని ప్రశ్నలు మాత్రమేకాదు. కలుషితంకాని ఆదర్శం, స్వార్థంలేని త్యాగం, అలసించని పోరాట పటిమ రాజీలేని వర్గదృష్టి తన స్వభావాలుగా ప్రజా రాజకీయాలకి విప్లవ జీవంపోసింది నక్సల్బరీ. వేలాది యువకులు మరణానికి సిద్ధపడ్డారు. భవిష్యత్‌లోకి తన దృష్టిని సారించిన యువతరం పోరాట స్వప్నాలకి ఆచరణ పాఠాలునేర్పింది నక్సల్బరీ. కలకత్తా నగరం రహదారుల్లో, నర్సంపేట గిరాయిపల్లి అడవుల్లో ప్రాణాలుపోతున్నపుడు కూడ రెండుచేతులా జుర్రుకోవాలనిపించే యవ్వన ప్రాభవాన్ని ఒక ఆదర్శం కోసం చిరు నవ్వుతో అర్పణచేసి పట్టువిడవని పోరాటంచేసి భయంకరంగా పాతుకుపోయిన వ్యవస్థని ఎదిరించింది. హీరోలను వాళ్ళ అద్భుతమైన రూపంలో గమనించాలంటే వర్తమాన ప్రపంచంలోకి చూడాలన్నాడు మావో. భారతదేశంలో ఏ రాజకీయ ఉద్యమం చవిచూడని పాశవికమైన నిర్బంధాన్ని నిర్భయంగా పోరాడింది నక్సల్బరీ.

కార్యాలయాలపై దాడులు, నిర్బంధాలు, సంచికల నిషేధం, కుట్రకేసులు, కారాగారవాసంతో సృజన కూడా ఈ పోరాటంలో భాగమయింది. ఎమర్జెన్సీనిశా నిశ్శబ్దం లోంచి ఆత్మాలోచనలోకి పరిణతి చెందింది.

గత రెండు మూడు సంవత్సరాలలో ఉద్యమంలో ఆహ్వానించదగ్గ పరిణామాలు కరీంనగర్, ఆదిలాబాద్, సింగ్‌భూమ్, జార్ఖండ్, ధన్‌బాద్, భోజ్‌పూర్‌లలో ప్రసవ వేదనపడుతున్నాయి.

సృజనలో కూడా నూతన ప్రభావాలు అస్పష్టంగా మెదుల్తున్నాయి. తెలుగులో అరుదయిన సీరియస్, బాధ్యతాయుత పత్రికారచనలో ప్రయోగాలు చేస్తోంది. యాంత్రికమయిన భాగాల నుండి విముక్తి చెంది సమాజాన్ని విశ్లేషించ ప్రయత్నిస్తోంది. జానపద సాహిత్యంలో పునాదివర్గాల కవులు కన్పిస్తున్నారు. ప్రజల మౌఖిక సాహిత్యాన్ని మధ్యతరగతికి పరిచయం చేస్తోంది. ప్రస్తుతానికి సంకేతాలే అయినా ఈ ప్రభావాలు ఆశాసూచికలు.

1970 ఆఖరి సంవత్సరాలు, 60 ఆఖరి సంవత్సరాలు కావు. ఈ దశాబ్ది కాలంలో గాలి కూడా తన రుతువుని మార్చుకొంది. బ్రిటిష్ వలస వాదాన్ని అమెరికన్

సామ్రాజ్యవాదాన్ని ఓడించి 'అమ్మయ్య' అని సేదదీరకముందే మూడోప్రపంచం ఇవ్వాళ మూడోశక్తిని ప్రతిఘటించవలసి వస్తోంది. లాటిన్ అమెరికా విప్లవ ప్రతీక క్యూబా ఆఫ్రికాలో కిరాయి సైన్యాలతో దాడి చేస్తోంది. 1940లలో తూర్పుయూరప్నంతా విముక్తిచేసిన సోవియట్ ఎర్రసైన్యం ఇవ్వాళ జెకొస్లవేకియా నుంచి ఆఫ్ఘనిస్థాన్ దాకా దురాక్రమణ చేస్తున్నది. వియత్నాం గ్రామీణ గెరిల్లాలు కంపూచియా నగర దురాక్రమణ సైనికులయ్యారు. చైనాలో సాంస్కృతిక విప్లవం బలమయిన ప్రతిబంధకాల్ని ఎదుర్కొంటోంది. నక్సల్బరీ ఇంకా ఐక్యత సాధించవలసే ఉంది. కాలం చరిత్రకు లోబడి ప్రవహిస్తోంది.

పత్రికలు కూడా తప్పటడుగుల బాల్యమూ, ఉద్రేకాల యవ్వనమూ, గాయాల వయసుతో పరిణతి చెందుతాయ్. వెనక్కి తిరిగిచూస్తే ఈ దశలు స్పష్టంగానే అర్థం కావచ్చు, తనదంటూ ఒక వ్యక్తిత్వాన్ని సంతరించుకునే క్రమం పరిణతి చెందేదాకా సహజంగానే సాగుతుంది. కాని కాలం మనం విమర్శనాత్మక దృక్పథం అలవర్చుకొనేదాకా ఆగదు. అందుకే సృజన ఇవ్వాళ తన నూరవ సంచికను ప్రచురిస్తోంది. వయసులో మనసులో ఎదిగి, వందపూలు వికసించనివ్వండి, వేయి ఆలోచనలను పోటీ పడనివ్వండి అంటోంది.

స్వప్నానికి – వాస్తవికతకు, పోరాటానికి - ఆత్మాలోచనకు, చైతన్యానికి - సంఘర్షణకు మధ్య నిరంతరం సాగే సంభాషణ ప్రజాపత్రిక. వెనక్కి తిరగని రోజువారీ సమాజపు సీస్మోగ్రాఫ్ గానే కాక తెలుగు సాంస్కృతిక రంగంలో చరిత్రకు భాష్యకారిగా (Spokes person of the history) సృజన రూపొందుతుందా?

'నడుమ తడబడి కడలి మునుగుక పడవ తీరం క్రమిస్తుందా?'

సృజన - వి.ర.సం.

కె. వి. రమణారెడ్డి

"…. సాయుధ విప్లవపోరాటాలు సాగుతున్నాయి గనుకనే విరసం సాహిత్య సాంస్కృతిక బాధ్యతలు ఒక ఊపుతో ఉత్తేజంతో నిర్వహించ గలుగుతున్నది. ఈ సాయుధ సత్యాన్ని గుర్తించి, నెత్తురుతో తడిసిన దీర్ఘకాల ప్రజావిముక్తి పోరాట మార్గంలో ప్రజలతో, ప్రజాసైనికులతో వాళ్ళ పనిముట్లకు, ఆయుధాలకు బాసటగా తమ పనిముట్లతో, కలాలతో అడుగులో అడుగువేస్తూ నడవడమే తన ఏడుగడగా, తన ఉనికిగా, తన ఊహగా విరసం ఉద్యమిస్తుందని ఆశిద్దాం."

'సాహితీమిత్రులు' నిర్వహిస్తున్న 'సృజన' 53వ సంచిక (1974 ఫిబ్రవరి) సంపాదకీయం– "ప్రజలను సాయుధం చేస్తున్న రెవల్యూషనరీ నేడు కవి"– చివరి మాటలు పైవి.

ఇటీవలిదాకా 'సాహితీమిత్రులు' ఎవరైందీ నాకు తెలీదు. ఇప్పుడైనా ఒక రిద్దరే నాకు తెలిసిన వ్యక్తులు. నాకుగానీ మరొకరికిగానీ ఎవరెవరో ఎందుకు తెలియాలి? తెలియాల్సిందల్లా వాళ్ళ కృషిఫలితమైన 'సృజన' మాత్రమే. ఇప్పటికి 99 సంచికలు తెచ్చి ఇప్పుడు నూరో సంచిక తేవడం, వ్యాపారసరళి పత్రికలకు విశేషం కాదు. టైటిల్ పేజిమీద తప్ప బొమ్మలు లేకుండా, సినీమాయలు లేకుండా, జోకర్లు కాకుండా, వ్యాపార ప్రకటనలు లేకుండా, పాఠకుల మీదనే 99 శాతం ఆధారపడి, తెలుగు దేశంలో, ఒక పత్రిక వెలువడుతూ రావడం ఆశ్చర్యకరం, అభినందనీయం. 1970లో విప్లవ రచయితల సంఘం (వి.ర.సం.) ఏర్పడింది మొదలు, 'సృజన' పేరు ప్రఖ్యాతులు రాష్ట్రాంతరాల్లోనూ వ్యాపించి, ప్రతిఘటనా తీవ్రతకీ స్థిరసంకల్పానికీ ప్రజాపోరాట మగ్నతకీ అది పెట్టింది పేరైందంటే, ప్రజా విమోచనోద్యమానికి సాహిత్య రూపంలోనే గాక రాజకీయ రూపంలో కూడా అది ప్రోత్సాహకర శక్తి అయిందంటే, అతిశయోక్తి కాదు. 'అండర్ స్టేట్మెంట్' కాక పోవచ్చునేమోగాని, యథార్థం.

'సృజన' ప్రథమ సంచికలో 'ఆధునిక సాహిత్యవేదిక' అనే మాటల విశేషార్థం అప్పట్లో నన్ను పూర్తిగా తృప్తిపరచలేదు. దాని సంపాదకీయంలో ("ప్రయోగం") యిలాగుంది:

"ఆధునిక సాహిత్యమంటే- శాస్త్రీయ దృక్పథం, హేతువాదం, సమకాలీన సమాజం- వీని ప్రభావం వ్యక్తి జీవితంలోని అన్ని అంశాల మీద కొద్దోగొప్పో ఉన్నదని గుర్తించడం. ఈ గుర్తింపు ఉన్న రచనని ఆధునిక సాహిత్యంగా నిర్వచించవచ్చు; ఇతరమైన విలువల్ని కూడా విస్మరించకుండా." పైమూడు మాటలూ అప్పటికే నలిగి నలిగిదొంతగా మారాయి. తాము దీన్ని పత్రికగా గాక, "మారుతున్న కాలాన్ని విస్తృతమౌతున్న జాగృతినీ, ప్రతిబింబించే అనువదించే ఒక Forum "గా భావించి, "ప్రయోగశీలత్వం, సృజనాత్మకశక్తి, ఆధునిక దృక్పథం" యీ వేదికకు పునాదులని వర్ణిస్తూ, "ఒక Broad- based standard of literature కు" ప్రేరణనీ వేదికనీ కల్పించాలని బాలగంగాధర్ తిలక్ సలహా మేరకు, సాధకులే తప్ప సంపాదకుడు లేని యీ పత్రిక గాని పత్రిక పుట్టింది. తిలక్ స్మృతి సంచిక 1966 నవంబరులో త్రైమాసికగా వెలువడ్డాక, రెండో సంచికలోనే (1967 ఫిబ్రవరి) 'సంపాదకుడు' పేరు కనిపిస్తుంది- "'సాహితీమిత్రులు' పక్షాన." 1970 ఆగస్టు - అక్టోబరు (సంచిక 16) దాకా అలాగే సాగినట్టు గుర్తు. ఈలోగా బుచ్చిబాబు సంస్మరణ సంచిక, చలం ప్రత్యేకసంచిక, కథల సంచిక, శ్రీశ్రీ సాహిత్య సమాలోచన సంచిక, భారతీయ

సాహిత్యాల పరామర్శ- 1970 దాకా 'సృజన' సంకల్పించుకున్న 'విశాలవేదిక'కు తగినట్టుగానే 'ఆధునికత'ను నిరూపిస్తూ వచ్చినంతగా, 'శాస్త్రీయ దృక్పథం' గాని, 'సమకాలీన సమాజం' గాని దాని పరిధిలోకి రావలసినంతగా, రాలేదనిపిస్తుంది. దాని తొలిపాఠకుల్లో, వ్యాసరచయితల్లో, సమీక్షకుల్లో ఒకణ్ణిగా బాధ్యతతో రాసే మాటలే ఇవి. 'ఆధునికత' కాలిక విశేషమైతే ఏమోగాని, మరోకటైతే మాత్రం, ఈ సంచికల్లో విశాలత్వం నిర్విచక్షణత్వంగా మారివుండేదికాదు. అయితే ఏ మార్పూ హఠాత్‌గా రాదు. మార్పు రాకుండానూ వుండదు. 'సాహితీమిత్రులు' క్రమంగా 'సమకాలీన సమాజం' మీద చూపు నిలిపేనాటికి, సమాజం తీవ్రమైన మార్పుకిలోనై, "పుడమి తల్లికి పురుటి నొప్పులు" లాంటి రైతాంగ విప్లవ పోరాటాలు, ఎక్కడో నక్సల్బరీ-టీరీ భూముల్లోనో మరెక్కడో శ్రీకాకుళం కొండల్లోనోగాక, తమ చేరువకే వచ్చినట్టు బోధపడింది. దాంతో మొదలైంది మనకు ప్రియాతిప్రియమైన 'సృజన', కుబుసం విడిచిందనను, చర్మం మార్చిందనను, రాజకీయ సిద్ధాంతాన్ని మతం చేసుకొందని అనను- అవన్నీ తలతిక్క మాటలు. 'సృజన' అంతస్సత్వమే మారింది.

నాలుగేళ్ళలో (1966 నవంబరు - 1970 ఫిబ్రవరి) 14 సంచికలు వెలువరించాకనే 'సాహితీ మిత్రులు' జ్ఞానోదయం పొందారా? లేదు. "తిరుగబడు" అనడం కంటె ముందు 'తిరుగబడుదాం' అనుకోవడం జరిగింది. 'ఆలోచన' అంటే "ఊకదంచడం" కాదనీ, "వ్యథల్ని చించడం / సుధల్ని పంచడం" అనీ శ్రీశ్రీ రాసిన గేయచరణాలను స్థలపూరణం కోసమే వేసుకోలేదు. (సంచిక 13, 1969 నవంబరు). ఈ సంచికలో పింగళి రంగారావు పాళీనుంచి 'నక్సలైట్' ఎదురయ్యాడు. 'తిరుగబడు' అన్నది 'స్వేచ్ఛా సాహితి'. అలజడీ, ఆందోళనా, తిరుగుబాటూ కర్తవ్యంగా 'నిజాయితీ' కలిగిన యువకులు బయలుదేరారు. తిరుగుబాటంటే విప్లవమేనా, యిది వేరేదా అని తర్కానికి దిగలేదు సరికదా, తిరుగుబాటుని పట్టసగ్గల్లేని విధ్వంసంగా దిగంబర కవుల్లా కూడా అపసవ్యంగా భావించనూలేదు. అయితే 'సెక్స్' వైపరీత్యాలను చిత్రించే నవీన్ 'అంపశయ్య' 'సృజన' ప్రచురణల్లో ఒకటి కాగలిగింది. అంటే, సిద్ధాంత పరంగా స్పష్టతలేని సంక్రమణదశ అని అనుకోవచ్చు. ఇదీ సరికాదేమో? "తిరుగబడు" సమీక్షలు చూస్తే, ఆ స్పష్టతవేపు 'సృజన' ప్రయాణిస్తున్నట్టు, అస్పష్టతనుంచి బయటపడి 'సాయుధ కవితోద్యమానికి పిలుపు' యివ్వబూనినట్టు తెలుస్తూంది.

శ్రీశ్రీ షష్టిపూర్తి సభలు తెలుగు సాహిత్యలోకంలో కలిగించిన సత్ఫలితాలలో ఇది ముఖ్యమైంది. రాజకీయ చైతన్యం కొత్తతరానికి వ్యాపించింది. ఇది ప్రజా

విప్లవపోరాట రాజకీయ చైతన్యం. అందుచేతనే దీనికి సిద్ధాంతబలం, దానికి దీటైన ఆచరణ బలం అవసరమయ్యాయి. ఈ స్థితిలో, పాత 'అభ్యుదయ' కవులు ముగ్గురు నలుగురు, 'దిగంబర' కవుల్లో నలుగురు, 'తిరుగబడు' కవుల్లో అనేకులు కలిసి, 'అభ్యుదయ సాహిత్య సదస్సు' పేరిటి సర్కారీ - రివిజనిస్టు సాంస్కృతిక కుట్రను బద్దలు కొడుతూ, 1970 జూలై 4న విరసంగా రూపొంది, శాస్త్రీయ సోషలిజమే తమ ధ్యేయంగా ప్రకటించాక, "సాహిత్య నగ్జలైట్లు" అవతరించారంటూ సాంస్కృతిక-రాజకీయ సాంప్రదాయికులూ పాత-కొత్త రివిజనిస్టులూ అక్షరయుద్ధం ప్రారంభించారు. ఆ యుద్ధంలో 'సృజన' లేకుంటే, విరసం వాణి వినిపించేదేమోగాని, నిండుగా నిబ్బరంగా మాత్రం వినిపించేదిగాదు. నేటిదాకా 'సృజన' విరసం పత్రికే అని ఎందరెందరో అనుకుంటున్నారంటేనే, అది నిర్వర్తించిన చారిత్రిక పాత్ర విశిష్టత గుర్తించవచ్చు. 'ఎరుపు' పేరుతో అప్పుడప్పుడు విరసం సంచికలు వచ్చినా, రెండేళ్ళుగా 'అరుణతార' విరసం అధికార వాణిగా వెలువడుతున్నా, 'సృజన' లేకుంటే విరసంకు ఒక కన్నే, ఒక చెయ్యే లేనట్టు. 16వ సంచిక (1970 ఆగస్టు-అక్టోబరు) విరసం ప్రారంభ మహాసభా సంచిక. నడిదారిలో భ్రష్టపట్టి ప్రజా ధ్వజాన్ని దించేసి పాలకుల పంచన చేరిన 'భారత కమ్యూనిస్టుపార్టీ' సాంస్కృతిక వేదికైన అరసం దేన్నైతే విడిచిందో దాన్ని విరసం చేపట్టిందని, ఫాసిస్టు పద్ధతుల నవలంబిస్తూన్న ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలను తట్టి లేపి నడపడంలో "స్వేచ్ఛాప్రియులైన రచయితల" పాత్రను స్వీకరించిందని 'రహీ' రాసిన వాక్యాలు గుర్తుంచుకోదగ్గవి, గుర్తుచేసుకో దగ్గవి మళ్ళీ మళ్ళీ.

ఈ తొలి వూపులో, ప్రత్యర్థులకూ విమర్శకులకూ సమాధానా లివ్వడంలో, విరసం రచయితలు కొందరు 'డిఫెన్సివ్'లో పడి విప్లవ పార్టీలకూ విరసంకూ నిర్మాణ పరమైన లంకె లేదనడం కాకుండా, రాజకీయం - సాహిత్యం వేరేవేరే రంగాలని అనడం జరిగింది. ఇలాంటివారి 'పెద్దరికం'ను ఖాతరుచెయ్యాబట్టి మాత్రం 'సృజన' ఆ ప్రతివాదాలను ప్రకటించిందనుకోను. (ఆ 'పెద్దల'లో నేనూ ఒకణ్ణి. అప్పటికి ఆ విమర్శలు బాధే.) తన అవగాహనా లోపమూ కొంతైనా వుండితీరాలి. 'విజ్ఞత' ఆజన్మ సిద్ధం కాదుగదా! శాస్త్రీయ సోషలిజం ధ్యేయం అంటేనే చాలా? పునాదికీ ఉపరితలానికీ మధ్య వుండే పారస్పర్యం విషయంగానీ, ఉపరితలానికి స్వచ్ఛందత లేకున్నాగాని కొన్ని దశలలో వుండే ప్రాముఖ్యం గురించిగానీ, ఉపరితలంలోనే ఒక్కో అంశం ఒక్కో దశలో బాగా ముందుకొచ్చి మిగతా అంశాలనే గాక పునాదినిసైతం స్పృశించే విషయంగురించిగానీ- అంటే, మార్క్సిజం గురించి- విరసంలో అందరికీ

అప్పట్లో శాస్త్రీయ అవగాహన లేదు, లేక, తక్కువ. అందుకే, విప్లవ పార్టీలు విరసంలో తలెత్తి బలపడసాగిన అశాస్త్రీయ ధోరణుల గురించి ఆందోళన చెందాయేమో! ఇది విమర్శ కాదు, దిద్దుబాటు. దిద్దుబాటుకి గూడా పద్ధతి వుండాలి. దాన్ని స్థిమితంగా సహనంతో అనుసరించడం, ఆ పార్టీలకు అప్పుడు చేతనైతే బాగుండేది. అపసవ్యమైన ప్రతిపాదనలను ప్రకటించిన 'సృజన'లోనే అపసవ్యమైన పద్ధతులతో గూడి ఖండన అనిపించే దిద్దుబాటుని ప్రకటించడం జరిగింది. ఇలా ఎందుకు జరిగిందీ అంటే, 'సృజన' తానూ తన అవగాహనను దిద్దుకోసాగింది గనకనేగాని, ఇతరులమీద బురద చల్లితే ఆనందించేందుకో, చల్లించేందుకో, వివాదాలు రేపి వ్యాపార పత్రికల్లా అమ్మకాలు పెంచుకోడానికో గాదు. అంటే, 'సృజన' పత్రిక విరసంకు పాఠశాలగా కూడా పనికివచ్చిందన్న మాట. అంతేగాదు, విరసం రచయితలకు ఎందరికో ఇది ప్రయోగశాల (లాబొరేటరీ) కూడా అయింది.

అయితే, పోను పోను, యీ విప్లవభావ అభినివేశం తీవ్రమైన కారణంగా (అది సుగుణమే), 'సృజన'లో ప్రారంభదశ ముందుకి తెచ్చిన స్వతంత్ర రచనల స్థానంలో అనువాద రచనలు కాస్త హెచ్చు మోతాదులో రావడం జరిగింది. ఇదీ సుగుణమేనా అంటే, ఒక విధంగా 'అవును' అనీ, ఇంకోవిధంగా 'కాదేమో!' ననీ అంటాను. విరసం ప్రణాళికను (ఆనాటిదే) చూస్తే, దేశాంతరాల ప్రజాసాహిత్య ధోరణులలోని ఉత్తమ రచనలను మనం స్వీకరించడం ఒక అంశంగా కనిపిస్తుంది. ఇది ఏనాటికీ అవసరమే. అయితే మన నిర్దిష్ట భౌతిక పరిస్థితుల్లో నుంచి ఉత్పన్నమయ్యే సృజనాత్మక రచనలు మన మధ్యతరగతి పాఠకులనే గాక ఇతరులను కూడా గట్టిగా తాకగలవు. 'నాకుటుంబం', 'ఉప్పెన' వంటి రచనల అనువాదాలు అనవసరమని కాదు, భారమనీకాదు, వాటికి నకళ్ళైనా అప్పట్లో రావడంలేదే అని మాత్రమే. 18వ సంచిక (1971 మార్చి)లో కా.రా. గారి 'చావు' కథ ఒక మంచి మలుపు. అలాగే శివసాగర్, రెంజిమ్ రచనలు. ఆ తర్వాత గద్దర్ దర్శనం. ఇంకా తర్వాత వంగపండు రాక. మరీ యిటీవల అల్లం రాజయ్య చెయ్యి. వీటన్నిటినీ విడిచో, మరిచో, "అయ్యో! 'సృజన' వట్టి అనువాదాల పుట్ట అయిందే" అని వాపోవడం అనవసరం, ఆ పత్రికకి అన్యాయం. సృజనాత్మక రచనల్నే గాక, పోరాట వాస్తవ కథనాలనూ యీ పత్రిక సమాదరించాలని యిప్పుడు కొందరు కోరుతున్నారు. ఇది సక్రమమే. అయినా 'సృజన' ఆసాంతం చూస్తే మాత్రం, యీ కథనాలు (ఉదా: గురజాల మోతె, పండితాపురం వగైరా) 'సృజన'కు కొత్తకావు. ఆ సూచన చేసిన వాళ్ళు సరికొత్త తరం రచయితలయినా అయివుండాలి, లేదా, వారికి యింకా తాజా సరుకు ఘాటుగా హాట్‌హాట్‌గా వుండాలని అనిపించివుండాలి.

"ఝంఝ" నిషేధం మొదలు సోదాలు, జప్తులు, అరెస్టులు, కేసులు– ఇన్ని విషయాల్లోనూ 'సృజన' పౌరహక్కుల కోసం చేసిన పోరాటం చివరికి దాన్నే ప్రభుత్వ దురాగ్రహానికి గురిచేసింది. రచయితల విషయమే కాదు– జనం విషయం, పోలీసు దౌర్జన్యం విషయం 'సృజన' పట్టించుకున్నంతగా మరే పత్రికా పట్టించుకోలేదు. 'సృజన' జనం గుండె మంట, కంటి కాంతి, రెట్టల సత్తువ, పోరాట పటిమకు అంకితమై, తాను 'కేండిల్'లా మండుతూ చీకటినీ పరాధీనతనీ అధైర్యాన్నీ మేతావి (కాళోజీకి కృతజ్ఞత) తనాన్నీ చీల్చి చెండాడే సంస్థ అయిందంటే, వూరకే కాలేదు.

"రచయిత, ప్రజలకు సంబంధించిన ప్రతి సమస్యపైన తన అభిప్రాయం చెప్పాలి. అది మనకు సంబంధించింది కాదు, మన కెందుకులే అనుకోవడం పిరికితనం. దేశం గడ్డుసమస్యల కత్తెర్లకు లోనైనప్పుడు రచయిత మౌనంగాని, ఉదాసీనతగాని ప్రజాద్రోహంకన్నా తక్కువేమీకాదు." ('కలాలకు సంకెళ్లు', 18వ సంచిక, 1971 మార్చి)

పెండ్యాల కిషన్‌రావు ('మార్చ్' సంకలనం) చెంపమీద పోలీసు అధికారి పెట్టిన పెట్టు, ఆయనతో అక్కడ ఆగలేదు శివారెడ్డి పురాణం సుబ్రహ్మణ్యశర్మ వంటి కొందరు తప్ప తక్కిన 'ప్రజాస్వామిక' వాదులైన 'మేధావుల' మౌనమే, ఉదాసీనతే, ప్రభుత్వ పశుత్వాన్ని రచయితల మీదికి తోలేందుకు పనికి వచ్చింది. జాఁపాల్‌సార్త్ర మార్క్సిస్టుగాకున్నా, భావ ప్రకటనా స్వాతంత్ర్యం విషయంలో అతని ఒరవడిని 'సృజన' ప్రదర్శించినా, చాలా మంది మేతావులు మేధావులు కాలేదంటే, వాళ్ళకు విప్లవోద్యమ పోరాటాల స్వభావం గురించి సానుభూతి సరిగదా, సదభిప్రాయమే వుండేదా అని సందేహం. అయితే క్రమంగా నిరసన పత్రాలమీద దస్కత్ చేసేందుకు కావలసిన ధైర్యం సంపాదించుకున్నారు కొందరైనా. ఒక్క రివిజనిస్టులు మాత్రం, వారి అ.ర.సం. మాత్రం ఫాసిజానికి వెల్లవెయ్యబూనుకుంది. మా మాండలికంగా అది 'సాధు పలవ'. నగ్గలైట్లన్నా వి ర.సం. అన్నా గుడ్డివ్యతిరేకతతో సి.పి.యం. 73లో పోలీసు లాఠీచార్జికి గూడా వరంగల్‌లో అవకాశం కలిగించింది. తమ దాకా వస్తేగాని తెలీలేదు వారికి 'ఇందిరాయిజం' అనబడే దేశవాళీ ఫాసిజం. వరంగల్ మెడికల్ కాలేజీ అధికారులు శ్రీశ్రీని దూరంబెట్టినా, 'మేధావుల' కెందరికి పట్టింది? (మే 71, సంచిక 20)

'సృజన'లో చాలామందికి సరిపడని సంగతి, అది డాక్యుమెంట్ల వేదిక గూడా కావడం. వి.ర.సం. తీర్మానాలూ ప్రకటనలూ యీనాటికీ దినపత్రికలకు పట్టవు.

వారికి మంత్రుల (అధిక) ప్రసంగాలతోనే అక్కర. లేకుంటే, అభూత విషయాలు, భూతు విషయాలూ 'బాక్సులు' కట్టి బొమ్మలు వేసి మరీ మురిపించి బులిపిస్తాయి. Conspiracy of silence తరహాలో కూడ బలుక్కుని జనచైనా వార్తల్నీ సిపిసి పత్రాల్నీ అవి తొక్కిపెడుతూన్నప్పుడు, 'సృజన' ఏ పార్టీ పత్రికకూ తీసిపోకుండా సొంత నైత్యం కలపకుండా, డాక్యుమెంట్లకు గల చారిత్రిక ప్రాముఖ్యాన్ని గుర్తించింది. ఎన్ని కరపత్రాలు పునర్ముద్రించిందని ! ఇది సభావేదిక, బాకా కాగలిగింది.

స్టాలిన్, మావోల రచనలు మళ్ళీ తెలుగు వాడి కళ్ళ బడేవేనా అప్పట్లో కుటుంబరావుగారి ద్వారా పనిగట్టుకుని మరీ అనువాదాలో, సమీక్షలో రాయించకపోయి వుంటే ? నెహ్రూ కోటు బొత్తాం కన్నంలోని రోజాపుష్పం రోజులు "వెళిపోయాయ్యెళి పోయాయి." అలాగే, కొత్తపల్లి రవిబాబు అనువదించిన రాల్ఫ్‌ఫాక్స్ గ్రంథం 'నవల - ప్రజలు', చలసాని ప్రసాద్ అనుసరించిన మాక్సింగోర్కీ సాహిత్య వ్యాసాలు, వీటితోబాటు మావో కవితలు.... యివన్నీ మనకింకా, యింగ్లీషువాడి మాట వాడవలసివస్తే, Closed book అయివుండేవి. శ్రీపతి, ఎన్నెస్, బి. టి. రామానుజం, పెద్దిరాజు, మరువాడ లాంటి మంచి కథకులు, శివసాగర్, యన్.కె., లోచన్, అశోక్‌లాంటి కొత్త కవులు, రెంజిమ్, చెరబండరాజు, గద్దర్, వంగపండు లాంటి విలక్షణమైన కవులు- వీళ్ళంతా 'సృజన' ద్వారా కూడా పదిమందికీ తెలిశారు. త్రిపురనేని మధుసూదనరావు విమర్శల వేడి నటుంచి వెలుగుని 'సృజన' వెదజల్లింది. వరవరరావు "ప్రజల మనిషి" నవలా పరిశీలన సాహిత్య విమర్శలో జీవితవాస్తవం తాలూకు లోతు పొరల్ని తీసి చూపింది. సాహిత్య విమర్శలో 'సృజన'లో కొన్ని రచనల ప్రమాణాలు అందుకోవడం నామట్టుకు నాకు చాలా కష్టం.

ఇక ఆదిలాబాదు - కరీంనగర్ జిల్లాలు కదలబారి రైతాంగ పోరాటాలు ఉవ్వెత్తుగా లేచాక, ప్రజాపంథాను చూపెట్టే క్రమంలో ప్రజాసాహిత్యాన్ని ముందుకితెచ్చి సృజన ఇదీ సరైనతోవ అనిపించేలా చేసింది. తాను పోరాట విద్యాద్వారం కాగలిగింది. అల్లం వీరయ్య, అల్లం నారాయణల పేర్లు కవిదిగ్గజాలకు సిగ్గు తెప్పించాలి. విప్లవ పదజాలం వాడడానికైతే చాలమంది వున్నారు. ఇది కవి స్వీయానుభూతిసాంద్రత నుంచి వెలువడే సాహిత్యం కాదనడానికి అనుభూతివాదులున్నారు. వినోబానూ నక్సలైట్లనూ అనుసంధానించి, నుతిమెత్తటి కవితలు రాసేందుకు చెట్టుని ఆదర్శం చేసుకున్న వాళ్ళున్నారు. మార్మిక అయోమయతని ఆశ్రయించేందుకు అంధానుకరణ శతాంధాః కూపం ప్రవిశంతి చందంగా రాసేవాళ్ళున్నారు. సిద్ధాంతం మతమే అని

చర్మాన్ని ఒలిచేసుకునే ప్రయోగైకవాదు లున్నారు. ఈ జనం రచయితల పాటల చరణాలముందు మోకరిల్లాల్సిందే వీళ్ళంతా.

విరసం, సృజన పర్యాయ పదాలు కాకపోవచ్చు. 'సృజన' వినా విరసం ఇంతైనా పుష్టి పొందివుండేదీ కాదు, దాని దృష్టి చక్కబడివుండేదీ కాదు. సంస్థ మంచినీ చెడునీ విడమర్చి చూపేందుకు 'సృజన' ప్రారంభించిన చర్చావేదికను కొందరు పరమ పాక్షిక దృష్టితో, మరికొందరు అశాస్త్రీయ అవగాహనతో దుర్వినియోగం చేసుకున్నా, సంస్థకు అంతిమంగా ఈ విమర్శ లాభించింది. దాని ఆత్మ విమర్శకు యీ విమర్శ కొంతైనా పనికివచ్చింది. అంటే, విరసంను సరైన దారిలో పెట్టేందుకు యీ పద్ధతిలో 'సృజన' ఎంతో మేలుచేసింది. బదిపంతులు కాలేదు, 'సుహృద్విజ్ఞాపన' చెయ్యలేదు- సహచర శక్తిగా వెన్నుతట్టి మరింత శక్తినివ్వగల సలహాల నందించింది.

'శుద్ధ' సాహిత్య-సాంస్కృతిక సంస్థ అని గానీ, 'స్వచ్ఛంద' సాహిత్య సంస్థ అనిగానీ పొరబడి, క్రమేపీ ప్రజా విప్లవ రాజకీయ పంథాకి దూరమై జీవధాతువుని కోల్పోకుండా, యీ యుగంలో వ్యవసాయం ప్రధాన వృత్తిగా బడుగు రైతాంగం, రైతు-కూలి జనం అసంఖ్యాకంగా ఇంకా భూస్వామిక దోపిడికి గురౌతూ, మరోవైపున దళారీ బూర్జువావర్గ రాజ్యాధికారం ద్వారా ప్రజల ప్రాణాలనూ దేశానికి పేరుకేవున్న సార్వభౌమాధికారాన్నీ ఉభయ సామ్రాజ్యవాద దేశాలకు- అందునా సోషలిజం పేరుతో సహాయం పేరుతో సామ్రాజ్యవాదాన్ని అమలుపెట్టే రష్యాకు- కైంకర్యం పెడుతూన్న పరిస్థితిలో, మార్క్సిజం సహజంగా మావో ఆలోచనా విధానంగా రూపొందింది. దేశాలు స్వాతంత్ర్యం కోసం, జాతులు విముక్తి కోసం ప్రజలు విప్లవం కోసం పోరాడుతూన్న యీ చారిత్రిక దశలో, సాంస్కృతిక రంగం విప్లవంలో ముఖ్యమైనదేనన్న అవగాహన కలిగేందుకు 'సృజన' తెలుగుదేశంలో చేసిన దోహదం అనన్యం.

అందుకే, ఒక రచయితగా, విరసం సభ్యుడిగా, 'సృజన' నూరో సంచిక వెలువడే సమయాన, నా / మన కృతజ్ఞతను, సగౌరవంగా తెలుపుకుందామని యీ వ్యాసం రాశాను. ఎంత రాసినా 'సృజన' నిర్వర్తించిన పాత్రలోని నిర్మాణపరమైన అంశకు పూర్తి న్యాయం చేకూర్చలేనని నాకు తెలుసు. అయినా యిది నా గుండెల చప్పుడు.

'సృజన' వర్ధిల్లాలి!
విరసం వర్ధిల్లాలి!
విప్లవం వర్ధిల్లాలి!

"సృజన" వేదికగా

# భాషాంతర సాహిత్యాలు

నిఖిల్

ప్రపంచంలోని ఏ సాహిత్యోద్యమానికైనా భాషాంతర సాహిత్యం కొంతమేర దోహదం చేస్తుంది. ప్రధానంగా ఆయా భాషల ఆయా ప్రాంతాల సమస్యల జీవితమే ఆ ఉద్యమాలకు మూల ప్రేరణ. వాటిని మరింత పరిపుష్టం చేయడానికి ఇతర భాషల నుంచి వచ్చే అనువాదాలు తప్పకుండా ఉపయోగపడతాయి.

"సృజన" ప్రధానంగా సాహిత్య మాసపత్రికగా, కొన్నిరకాల పరిమితులకు లోనైనా ప్రజాపోరాటాలకు సంబంధించిన సాహిత్య ఉద్యమాల వివరాలను వీలైనప్పుడల్లా తెలుగు పాఠకులకు అందిస్తూనేవుంది. 'భారతి' లాంటి సాహిత్య మాస పత్రికను మినహాయిస్తే 'సృజన' ఈ విషయంలో ఒక శక్తివంతమైన వేదికగా - వాహికగా తన పాత్రను నిర్వహించింది. 'దిగంబర కవిత్వం' వచ్చిన తర్వాత ప్రపంచంలోని ఏ మూలనైనా ఏ భాషలోనైనా కొత్త ప్రయోగం జరిగినా, సరికొత్త ఉద్యమం ఉబికివచ్చినా ఇంగ్లీషు లేదా హిందీ భాషల ద్వారా అర్థం చేసుకుని మిత్రులకు అందజేయాలనే కొంత ప్రయత్నం చేసినవాణ్ణి. నాలాంటి వాళ్ళను 'సృజన' పత్రిక ఎప్పుడూ ప్రోత్సాహిస్తూనే వచ్చింది. ఒక వేదికగా ఈనాటి వరకు భాషాంతర సాహిత్యాలను అందజేస్తూనేవుంది.

ఈనాడు తెలుగులో విస్తృతంగా ప్రపంచ భాషలన్నింటిలోంచి కథలను తెలుగులోకి అనువదించి ఇస్తున్న ఏకైక పత్రిక "విపుల"- అయితే ఇది కేవలం వ్యాపార పరంగా - పాఠకందార్ల దృష్టితో వస్తున్నది కాబట్టి సాహిత్య విలువలను - కళా ప్రమాణాలను ఈ అనువాదాల ద్వారా ఆశించలేము. ఉద్యమ పరంగా కళావిలువల్ని కాపాడుకుంటూ ప్రజాసాహిత్యోద్యమాలకు 'భారతి', 'సృజన', 'ప్రజాసాహితి', 'అరుణతార' లాంటి పత్రికల ద్వారా ఎంతో మంచి సాహిత్యాన్ని ఇతర భాషల నుంచి అనువదించి అందించవచ్చు.

మన దేశంలో కొన్ని ఇంగ్లీషు పత్రికలను మినహాయిస్తే హిందీలో అనేక పత్రికలు ఇతర భాషల నుంచి వివిధ సాహిత్య ప్రక్రియల అనువాదాలను అందుబాటులోకి తెస్తున్నాయి. "సారికా" లాంటి కథల మాసపత్రిక హిందీలో చెహోవ్, టాల్‌స్టాయ్ లపై ప్రత్యేక సంచికలనే తెచ్చింది. 'ధర్మయుగ్', "దినమాన్" లాంటి వారపత్రికలు భాషాంతర సాహిత్యాల ద్వారా భారతీయ రచయితల దృష్టిని విస్తృతం చేసే ప్రయత్నాలు కొనసాగిస్తూనే వున్నాయి.

ఇతర భాషల్లోంచి తెలుగులోకి ఉత్తమ సాహిత్యాన్ని అందించే ప్రయత్నాలను కొందరు వ్యక్తులు మరికొన్ని సంస్థలు ఉద్యమంగా - వ్యాపారంగా చేపట్టి పేరు-డబ్బు రెండూ చేసుకున్నారు. అయితే తెలుగు లోంచి ఇతరభాషల్లోకి అనువదించే కార్యక్రమాన్ని చాలా అరుదుగా అమల్లో పెట్టడం జరిగింది. కేరళ నుంచి చాలా కాలం వచ్చిన పక్షపత్రిక "యుగ్‌ప్రభాత్" హిందీ ద్వారా ప్రముఖంగా దక్షిణభారతీయ భాషా సాహిత్యాల అనువాదాలను ప్రచురించింది. ఎమర్జెన్సీ కాలంలో ఆ పత్రిక ఆగిపోయింది. గత పదిహేను సంవత్సరాలుగా ఒరిస్సాలో రైల్వే ఉద్యోగం చేసుకుంటున్న దీక్షగా హిందీలోకి తెలుగు సాహిత్యాన్ని అనువదిస్తున్న మిత్రుడు నిర్మలానంద్‌గారు. తెలుగులోకి కూడా ఇతర భాషలనుంచి అనువాదాలు మనకు ఇస్తున్నారు ఆయన.

భాషాంతర సాహిత్యాల కోసం మనం ఈనాటికి ఇంగ్లీషు లేదా హిందీని మీడియమ్‌గా ఉపయోగించక తప్పదు. ఆయా మూల భాషల్లోంచి సరాసరిన అనువాదాలు రావాలంటే ఆ దృష్టి - ఆసక్తివున్న అనువాదకులు కావాలి. దానికి ఎంతో మంది మూర్ఖలం, డబ్బు అవసరం.

అంతమాత్రాన నిరుత్సాహ పడకుండానే 'సృజన' తదితర పత్రికలను మంచి వేదికలుగా తీర్చిదిద్దుకోవచ్చు. ఈ నూరవ సంచిక దాకా 'సాహితీ మిత్రులు' అన్ని సాధక బాధకాలను అధిగమించి అలాంటి భాషాంతర సాహిత్యాలను వీలున్నప్పుడల్లా ప్రచురిస్తూనే వున్నారు. ఈ విషయంలో 'సృజన' పాత్ర తక్కువేమీకాదు.

ప్రజా సాహిత్య ఉద్యమాలు వివిధ దశల్లో విప్లవకరమైన పాత్రను నిర్వహిస్తున్నపుడు, తులనాత్మకంగా తెలుగు భాషలో వస్తున్న వివిధ ప్రక్రియలపై సరియైన అంచనా వేసుకోవాలనుకుంటే భాషాంతర సాహిత్యాలే ఆధారాలవుతాయి. ఒక దశలో తెలుగు పోరాట కవిత్వం (1965 నుంచి 1975) ప్రపంచంలోని ఏ భాషలోని కవిత్వానికి తీసిపోలేదు. ఆనాడు సమఉజ్జీగా నిలుచున్న కవిత్వం సమాంతరంగా అటు స్పానిష్, నీగ్రో, ఇటాలియన్ భాషలలోంచి వచ్చింది. ఆ తరువాత పాలస్తీనియన్, ఇరానియన్ కవిత్వాల సమాంతరంగా మన కవిత్వం నిలుచోగలదా అని మనం పరిశీలించుకోవలసి వుంది. ఆయా దేశాల పోరాటాల క్రమం ఆ సాహిత్యాల సజీవ లక్షణాలను నిర్ణయిస్తున్నప్పుడు సహజంగానే తెలుగు కవిత్వం కూడా ఆ అటుపోటులమధ్యనే వుందని మనం గ్రహించవచ్చు: ఈనాడు విప్లవ కవిత్వం లేదా ప్రజా పాటల పేరిట విపరీతంగా చర్విత చరణంగా కవిత్వం అరిగిపోయిన రికార్డులా వినిపిస్తున్నదంటే

లోపం ఎక్కడుందో మనం తెలుసుకోవచ్చు. నిర్మొగమాటంగా మన స్థాయి గురించి మరింత లోతుల్లోకి వెళ్ళి గ్రహించాలంటే తులనాత్మకమైన అధ్యయనం (Comparative Study) అవసరమవుతుంది.

భాషాంతర సాహిత్య ప్రాముఖ్యతను మనం అంగీకరించినపుడు - ప్రస్తుతం తెలుగులోంచి ఇతర భాషల్లోకి అనువదించే కార్యక్రమం గురించి అత్యధికంగా ఆసక్తి చూపవలసివుంది. ఇతర భారతీయ భాషల్లో మన ప్రజారచయితలు కనపడాలంటే ఇంగ్లీషు లేదా హిందీ అనువాదాలు తప్పవు. 'దిగంబర కవిత్వం' చాలా వరకు ఆ విధంగానే ఇతర భాషల్లోకి వెళ్ళింది. 1970 తర్వాత వచ్చిన విప్లవకవిత - జనం పాటలు ఇతర వచనరచనలు అతి తక్కువగానే అనువదించబడ్డాయి. ఈ అనువాద కార్యక్రమం కింద నేను 1975 చివర "The blood and fire" అనే ఇంగ్లీషు అనువాదాల సంకలనం రూపొందించాను. 1965 నుంచి 75 దాకా ఒక దశాబ్దంలో వచ్చిన పోరాట కవిత్వంలో ప్రతినిధి కవులను ఎన్నుకొని మిత్రుల సహాయంతో ఆ సంకలనాన్ని ప్రచురించాలని ప్రయత్నించాను. అఖిల భారతస్థాయిలో కొందరు మిత్రుల సహకారంవున్నా ప్రచురణ కర్తలు లభించలేదు- ప్రేమకవిత్వం లేదా కథలకైతే సులభంగా పెద్ద పబ్లిషర్స్ ముందుకు వచ్చే సూచనలు కనపడ్డాయి. ఆ సంకలనం అలా కేవలం ప్రయత్నంగానే మిగిలిపోయింది:

వేగుంట మోహనప్రసాద్‌గారు శ్రమించి ఒక మంచి సంకలనాన్ని "This Tense Time" పేరుతో ప్రచురిస్తున్నారు. వారు ఆ సంకలనం విషయంలో కొంత రాజీపద్ధతిలో వెళ్లి చాలామంది మిత్రుల అనువాదాలు - సంస్థల ఆర్థిక సహకారం పొంది మూడు తరాల తెలుగు కవిత్వాన్ని ఇంగ్లీషు ద్వారా అందిస్తున్నారు.

విజయనగరం నుంచి నిష్టల వెంకటరావుగారు 'Verse - usual and unusual' అనే పేరుతో మరో ఇంగ్లీషు సంకలనం తీసుకవచ్చే ప్రయత్నంలో వున్నారు. 'విరసం' ప్రచురణ కింద ఇలాంటి ఇంగ్లీషు అనువాదాల సంకలనం ఒకటి విడిగా తీసుకరావాలనే తీర్మానం ఇటీవల మనముందు కొచ్చింది. కనీసం ఈనాటికైనా ఇతర భాషల్లోకి వెళ్లి విస్తృతంగా మన సమకాలీన ప్రజాసాహిత్య ఉద్యమాల గురించి తెలియజేసే అవసరాన్ని కొందరు గుర్తిస్తున్నారు.

భాషాంతర సాహిత్యం ద్వారా ఈ ఇచ్చిపుచ్చుకునే వరవడిలో నిరంతరం కొత్తగాలి వీచే అవకాశానికి మన సాహిత్యపు కిటికీలను తెరచివుంచక తప్పదు. సాహిత్యాభిమానులు, రచయిత మిత్రులు ఎవరికి తోచినవిధంగా వారు తమ పరిధిలో

నైనా వీలుచేసుకొని ప్రపంచ సాహిత్యంలో ఏ మూల ఏ ఉద్యమం వచ్చినా ఎలాంటి ప్రయోగం జరిగినా మన పాఠకుల దృష్టికి తీసుకవచ్చే పనిచేస్తే మనకే ప్రయోజన కరంగా వుంటుంది.

సమకాలీనంగా అటు అమెరికాలో 'Surfiction' అని కొత్తరకమైన నవలలు వస్తున్నాయని వింటున్నాము, అలాగే ఉత్తర అమెరికాకు వలసవెళ్లి అనేక సమస్యల నెదుర్కొంటున్న వాళ్లు 'Chicaro', 'Gringo' సాహిత్యంగా తిరుగుబాటు సాహిత్యాన్ని రాస్తున్నారు. బ్లాక్ లిటరేచర్ కింద నీగ్రో సోదరుల సాహిత్యం వస్తూనే వుంది. వీటి గురించి మనకు తెలియాలంటే భాషాంతర సాహిత్యం గురించి మన 'పత్రికలు' - 'మిత్రులు' ప్రత్యేకించి శ్రద్ధవహించ వలసి వుంటుంది.

## అభిప్రాయం

కొత్తపల్లి రవిబాబు

సమకాలీన ఆధునిక సాహిత్యానికి వేదిక లేని కొరత తీర్చాలన్న ఉద్దేశంతో పది, పదిహేను మంది కలసి ప్రారంభించిన 'సృజన' నూరవ సంచిక ఇది. తెలుగు సాహితీ పత్రికా రంగంలో ఇప్పటి వరకూ వెలువడి ఆగిపోయిన పత్రికలను తలచుకుంటే, ఇది నిజంగా చరిత్రాత్మకమైన విషయమే.

ప్రారంభించిన నాటి నుంచీ నాలుగు సంవత్సరాలపాటు త్రైమాస పత్రికగా వెలువడి, తర్వాత మాసపత్రికగా మారిన 'సృజన' మొదట్లో ఎటువంటి కమిట్‌మెంటు లేకుండా వుండేది. తర్వాత విప్లవ రచయితల సంఘంవారి అధికార పత్రికగా మారబోయి, ఆ నిర్ణయాన్ని పునరాలోచించుకుని, అనధికార అధికార పత్రికగా నిర్వహింపబడుతోంది.

ప్రజా సాహిత్యాన్ని అందించాలనే ధ్యేయం వున్నా 'సృజన'లో రచనలు ఎక్కువ భాగం మధ్య తరగతి మేధావులకు, విద్యావంతులకు మాత్రమే అర్థమయ్యేవిగా వుంటున్నాయి.

ఈమధ్యకాలంలో 'సృజన' నన్ను బాగా నిరుత్సాహానికి గురిచేసిన విషయం ప్రస్తావిస్తాను. 'విరసం ఎలా వుంది? ఎలా వుండాలి?' అనే చర్చను చాల నిరుత్సాహమాటంగా 'సృజన' నిర్వహించింది. రచయితలు, పాఠకులు, ప్రజాస్వామ్యవాదులు తమ తమ అభిప్రాయాలను అంతకంటే నిరుత్సాహమాటంగా తెలియచేసారు. ఈచర్చలో వెలువడిన అభిప్రాయాలనూ, సూచనలనూ 'సృజన' సమగ్రంగా పరిశీలించి, వాటిలో

తాను ఏకీభవిస్తున్న అంశాలనూ, ఏకీభవించని అంశాలు వుంటే ఎందుకు ఏకీభవించడం లేదో వివరంగా ఒక సంపాదకీయంగానో, సమీక్షా రూపంలోనో తెలియ చేయాల్సింది. అలా కాకుండా ఈ చర్చకు సమాధానంగా 'అరుణతార'లో త్రిపురనేని మధుసూదనరావు వ్యాసంలో కొంత భాగాన్నీ, 'అరుణతార' సంపాదకీయాన్నీ, విరసం కార్యదర్శి పత్రికా ప్రకటనలను ప్రచురించి చేతులు కడిగేసుకొని పాల్గొన్నవారందరినీ నిరాశపరచింది. ఎందుకంటే సమాధానంగా ప్రచురించబడ్డ ఆత్మవిమర్శనాత్మక రచనల్లో నిజమైన ఆత్మవిమర్శ కనబడలేదు. పాఠకులు లేవనెత్తిన సమస్యలకు సమగ్రమైన వివరణ లేదు. మార్క్సిజం - లెనినిజం - మావో ఆలోచనా విధానం అంగీకరించాలనే షరతు విరసంను ఎలా సంకుచిత పరచడంలేదో అర్థమయ్యేట్లు వివరించలేదు. ఈ చర్చకు సమాధానం ఇవ్వడం విషయంలో 'సృజన' అవలంబించిన ఈ పద్ధతివల్ల కూడా 'సృజన'ను విరసం యొక్క అనధికార అధికార పత్రిక అనవచ్చు.

ప్రజాస్వామ్య వాదులందరూ అభిమానించే, ఆదరించే పత్రికగా 'సృజన' నిర్వహింపబడాలని కోరుతూ-

'సృజన' ప్రారంభకులలో ఒకడు-

— కొత్తపల్లి రవిబాబు

## నూటికి పడగ

### శ్రీశ్రీ

"సృజన" నూరో సంచికకు నా సుస్వాగతం.

కల్లోల దశాబ్దానికి మహోజ్జ్వలంగా ప్రాతినిధ్యం వహించిన "సృజన" ఈ గడుస్తున్న శతాబ్దంలోనే కాక రాబోయే శతాబ్దంలో కూడా మరింత దీప్తిమంతంగా ప్రకాశిస్తుందనడానికి సందేహం లేదు.

"విరసం" ఆవిర్భవించినప్పటి నుంచీ "సృజన" విప్లవ సాహిత్యానికి అనధికార వేదికగా నిలిచింది. ఇక ముందు కూడా "విరసం" ఆశయాలకు "సృజన" ఒక ప్రముఖమైన ప్రచార కేంద్రంగా పనిచేస్తుందని నా దృఢ విశ్వాసం.

మద్రాసు
18-2-1980

# చిరుగాలి సితారా సంగీతం

శివసాగర్

అప్పుడు నేను రహస్యజీవితం గడుపుతున్నాను (1971). కరీంనగర్ జిల్లాలో ఒక ప్రాంతంలో........పోలీసులు వెంటాడుతూనే వున్నారు.

సృజన మీదకూడ పోలీసులు నిఘా వేసినట్లు తెలిసింది.

ఆరాత్రి మాపై పోలీసు నిర్బంధాన్ని గుర్తు చేసుకుంటూ

"అలల పైన నిఘా
అలలు కనే కలల పైన నిఘా"-

అని రాసి విప్లవ సాహిత్యోద్యమం, సృజనలను గుర్తు చేసుకొంటూ

"అలలపై అనురాగం చూపించే
చిరుగాలి సితారా సంగీతంపై నిఘా" అని రాసాను.

నా కవిత 'అలలు' ఆరోజు అక్కడే ఒక కాయితం ముక్కపై బరికాను. ఆనాడు దాన్ని ఏ పత్రికకూ పంపాలనుకోలేదు. నాలోని హృదయ ప్రకంపనాన్ని రికార్డు చేసాను.

తర్వాత చాలా కాలానికి ఆ కవిత సృజనలో ప్రచురించ బడింది.

సృజన దేశ రాజకీయాల్లో వచ్చిన అన్ని ఆటుపోట్లకు గురై ధైర్యంగా నిలబడుతూనే వచ్చింది.

నూరో సంచిక వెలువడుతున్న ఈ సమయంలో సృజన అనగానే 'అలలపై అనురాగం చూపించే చిరుగాలి సితారా సంగీతం' అనే కవితా పాదం గుర్తొస్తోంది. ఈ చిరుగాలికి నేడు వీస్తోన్న పల్లెపట్టు పెనుగాలితో చూపున్న చుట్టరికం వుంది.

అలల నెవ్వడడ్డ గలడు ?
కడలి నెవ్వడాప గలడు ?
.... .... .... .... ....
.... .... .... .... ....
అలలు అలలు అలలు
నీలో నాలో అలలు
అలలు కనే
కలలు

25 డిసెంబర్ 1979

## 'సృజన - మంచె'

ఎన్నారెస్

ఎమర్జెన్సీ ముందు మూడు సంవత్సరాలుగా మాత్రమే నాకు సృజన పరిచయం వుంది. ఇంతకంటే వేరే ఏ గ్రంథ అధ్యయనం నాకు లేదు. ఎమర్జెన్సీ ముందు సృజనలో చాలా పదునైన రచనలు వచ్చేవి- ఎమర్జెన్సీ తర్వాత రచనలు కొరవడినట్లే- వచ్చినవి చాలా పేలవంగా కూడా వున్నాయి.

ఎమర్జెన్సీ తర్వాత విరసం ఆత్మవిమర్శ "విరసం ఎలా వుండాలి?" చర్చా వేదిక చాలా ప్రశంసనీయమైంది. ఇంకా కథ, సమీక్షలు కూడా పాఠకులతో చర్చించడంతో కూడా సృజన జనం గొంతు వినిపించింది. అయితే ఈ మధ్య కాలంలో కొన్ని ఊసుపోని విమర్శలు సృజనలో చోటుచేసుకొని చాలా పేజీలు వృథా అయినవి- అంతేకాదు కొన్ని మొహమాటపు రచనలు కూడా వచ్చాయి. సృజన సంపాదకవర్గం గొప్ప రచయిత అవి కాక రచన గొప్పదనాన్ని చూడాలి.

ఎమర్జెన్సీ వెళ్లగానే మొదలయిన తెలంగాణ మాండలికంతో వెలువడిన కథలు భాష గురించి మంచి ఆలోచనను రేకెత్తించినవి. ఊహాప్రపంచంలోని సాహిత్యం వాస్తవానికి చేరుకున్నది. ఎవ్వరికీ తెలియని ఎక్కడా లేని సుందర బృందావన గంధర్వుల కథలు కాక జీవితంతో మన మురికి కథలు రాయొచ్చని తెలిపింది. ఆఫీసుల్లోనివారేకాదు అరకపట్టి దున్నేవాళ్లు కూడా వారి మురికి కథలు చదువుకున్నరు- కూలినాలి జనమంతా తమ పాటలు పాడుకున్నరు.

దోపిడీ మెకాలు సంచరించే ఈ బూర్జువా సమాజంలో తమ నెత్తురు చెమటతో పండించిన పంటను వాటి నుంచి కాపాడుకొనడానికి వొడిసెల రాళ్ళు ప్రజలకు అవసరమయినయి.

ఆ దోపిడీ మృగాల జాడలు, సంకేతాలు అందిస్తూ ఈ సాహిత్య సాంస్కృతిక క్షేత్రంలో 'మంచె'గా 'సృజన' చిరకాలం నిలవాలని ఆకాంక్షతో-

వరంగల్
2.3.1980

## సృజన జీవిత సభ్యులుగా చేరండి- చేర్పించండి

ఇవ్వాటి గురించి ఆలోచిద్దాం-

ఇరవయ్యోకటవ శతాబ్దం గురించి కూడ ఇప్పటి నుంచే ఆలోచిద్దాం.

ఇవ్వాళ సృజనను నిలబెట్టుకుందాం- ఇరవయ్యోకటవ శతాబ్దం సృజనకు ఇప్పుడే ఇంధనం ఏర్పాటు చేద్దాం.

'అరవై ఆరు నుంచి త్రైమాసికగా, ఒక దశాబ్దంగా మాస పత్రికగా ఎమర్జెన్సీ చీకటిరోజుల్లో తప్ప ఎన్నడూ ఆగిపోకుండా వెలువడుతున్న ఒకే ఒక్క- ఆధునిక సాహిత్య వేదిక సృజన.

మీరు సృజనకు చందాదారులుగా చేరారు, చేర్పించారు-

విరాళాలు ఇచ్చారు. మీకు వీలయినంతగా తోడ్పడ్డారు.

ప్రజల ఆదరణవల్లనే సృజన నూరవ సంచికకు చేరుకున్నది.

నూరు పూలు వెయ్యి కాయలుగా సృజన

నూతన సమాజ పరిమళాలు, ఫలాలు పంచడానికి

## సృజన జీవిత సభ్యులుగా చేరండి.

జీవిత సభ్యత్వం 200 రూపాయలు

ఒకేసారి గానీ, నాలుగు సమాన వాయిదాల్లో ఒక సంవత్సరం లోపున గానీ చెల్లించవచ్చును.

శాశ్వతంగా సృజన మాత్రమే కాదు
మీరు సృజన ప్రచురణలపై 25% కమీషన్ కూడా పొందుతారు

సృజన జీవిత సభ్యులుగా ఈ రోజే చేరండి, చేర్పించండి.

ప్రజా జీవిత ప్రతిస్పందన సృజన

పది కాలాలపాటు చేయూత నివ్వండి

# సృజనాత్మక ప్రకటనలకు 'సృజన'

సృజన పుస్తక విక్రేతల, ప్రచురణ కర్తల తదితర ప్రజాహిత రంగాల ప్రకటనలు వేస్తుంది. పదమూడు సంవత్సరాలుగా ఆంధ్రదేశంలోనూ, బయటా విశేష ప్రచారంలో వున్న సృజనలో మీ ప్రచారం కొరకై ప్రకటించండి.

| ప్రకటన రేట్లు | |
|---|---|
| చివరి అట్ట | రు. 300 |
| చివరి అట్ట (రెండు రంగులలో) | 350 |
| రెండవ, మూడవ అట్టలు ఒక్కొక్కటి | 350 |
| లోపలి పేజీ | 100 |
| అర పేజీ | 60 |
| పావు పేజీ | 40 |

ఒక ఏడాదిలో వాడుకునే
12 పేజీలకు 25% తగ్గింపు.

| కొలతలు (సెం.మీ.) | |
|---|---|
| సృజన కొలతలు : | 20×13.4 |
| ప్రకటన కొలతలు : | |
| పూర్తి పేజీ | 16.6×11 |
| అర పేజీ | 8.3×11 |
| పావు పేజీ | 8.3×5.5 |

## *SRJANA FOR CREATIVE ADVERTISEMENTS*

### ADVERTISEMENT TARIFF

| | | | Rs |
|---|---|---|---|
| Last Cover | Rs. 300 — | Last Cover (two colours) | 350 |
| 2nd, 3rd Covers - each | 200 — | Half page | 60 |
| Full page | 100 — | | |
| Quarter page | 40 — | 25% less on contract basis for 12 pages in a year. | |

| SRJANA full area : (cm) | | Printing area : (cm) | |
|---|---|---|---|
| 20×13.4 | — | Full page | 16.6×11 |
| | | Half page | 8.3×11 |
| | | Quarter page | 8·3×5.5 |

**SRJANA**

Telugu Monthly
**HANUMAKONDA**
**506 001**

చదివేది ! చదివించేది !!

చదవాలని అనిపించేది !!!

# జ్యోతి

సచిత్ర మాస పత్రిక

సూర్యారావుపేట, విజయవాడ – 520 002

## సవరణలు

1. 'వ్యాసం' విభాగానికి పరిచయ వాక్యాల్లో నాకుటుంబం నవలా రచయిత్రి టింగ్ లింగ్ గా అచ్చయింది. నాకుటుంబం నవలా రచయిత్రి టావ్ చెంగ్‌గా చదువుకోవాలి.

2. ఇండియా బ్లాక్ మేకర్స్ (Advt. Page No. ii) అడ్రసులో మార్పు–

INDIA BLOCK MAKERS
3-5-43/2, Near Maxmuller Bhavan
Ramkote, Hyderabad 500 001

ఈ సంచికలో మేడేపై లెనిన్ రచన 'సృజన' మే 1972, సంచిక 32 నుంచి పునర్ముద్రితం.

**సృజన పాఠకులకు, పోషకులకు మేడే విప్లవాభినందనలు**

## సృజన డిస్ట్రిబ్యూటర్స్

హనుమకొండ 506 001

**విరసం ప్రచురణలు:**

1. అరసం కాయకల్పచికిత్స – కె. వి. రమణారెడ్డి  రు. 1-25
2. తెలంగాణ పోరాట పాటలు – రెండో సంపుటి  రు. 4-00
3. కథ, నవల – జీవితం – అల్లం రాజయ్య, విశాఖ విరసం  రు. 0-40
4. ప్రజల పాటలు – అనుభవాలు – గద్దర్, రామారావు, వంగపండు  రు. 1-25
5. చరిత్ర, భాష – శాస్త్రీయ దృక్పథం – త్రిపురనేని మధుసూదనరావు, పి.సి. నరసింహారెడ్డి  రు. 0-60
6. పోరాటాల శ్రీరాములు  రు. 0-75
7. పోరాట పాటలు  రు. 2-00

**ఇతర ప్రచురణలు:**

8. మావో రచనలు – మొదటి సంపుటి  రు. 15-00
9. గమ్యం – చెరబండరాజు  రు. 2-00
10. చురకలు – అలిశెట్టి ప్రభాకర్  రు. 1-00
11. తెలంగాణ వీరయోధులు – తిరునగరి సీతారామాంజనేయులు  రు. 0-60
12. ఉక్కుపాదం – మొదటి భాగం – జాక్ లండన్, అను: పార్థసారథి  రు. 3-00
13. చైత్రయాత్ర – పాటలు  రు. 1-00
14. జనం చిన్నాలు – పాటలు  రు. 1-00
15. కవిత్వం – చైతన్యం – త్రిపురనేని మధుసూదనరావు  రు. 3-00
16. ఎర్రరంగస్థలం  రు. 1-50
17. జననం – బి. నరసింగరావు  రు. 2-50
18. స్వేచ్ఛ – వరవరరావు  రు. 2-50
19. విద్యావిధానం ఒకపరిశీలన – వరవరరావు  రు. 0-40
20. Repression in singhbhum (Report)  Rs. 2-00
21. Bhoomaiah Kista Goud memorial Lecture — Sumanta Benarjee  Rs. 2-00
22. విప్లవోద్యమానికి సి.పి.ఐ. విద్రోహం –  రు. 1-00

పై పుస్తకాలు మాత్రమే ప్రస్తుతం మావద్ద అమ్మకానికి వున్నవి.

